# యాదవుల
# జానపద ప్రదర్శన కళలు

ఆచార్య మర్రెబోయిన జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్నం.







డి.లిట్. సిద్ధాంత గ్రంథం

యాదవుల జానపద ప్రదర్శన కళలు

యాదవుల
జానపద ప్రదర్శన కళలు








B. KURMARAO.

# యాదవుల జానపద ప్రదర్శన కళలు

## yadavula janapada pradarshana kalalu

## D.Litt. Thesis

**Published with Financial Assistance from the Central Institute of Indian Languages (Ministry of Human Resourse Development, Department of Higher Education, Govt. of India), Manasagangotri, Mysore- 570 006, vide sanction letter No. F51-11(9)/2009- 10/Tel/Grant. dated 9th March 2010 under the scheme of Grant - in-Aid.**

మైసూరులో ఉన్న భారతీయ భాషల కేంద్ర సంస్థ ( మినిస్ట్రీ ఆఫ్ హ్యూమన్ రిసోర్స్ డెవలప్‌మెంట్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, మానసగంగోత్రి, మైసూరు- 570 006 ) మంజూరు చేసిన ఉత్తర్వు నెం. F51-11(9) / 2009 - 10/Tel/Grant. dated 9th March 2010 ద్వారా పొందిన ఆర్థిక సాయంతో ఈగ్రంథం ముద్రింపబడింది.

**పద్మావతీ ప్రచురణలు**

**విశాఖపట్నం**

తల్లిని వదిలిపెట్టి వేరే ఊరికి వెళ్ళవలసి వచ్చింది. బాగా చదువుకున్న అతను అపురూపంగా ప్రేమించే భార్యను వదలిపెట్టి వెళ్ళడం చాలా కష్టమనిపించినప్పటికీ తప్పని పరిస్థితి అయి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. అలాంటి భర్తతో అంజమ్మ వలవల కన్నీరు కారుస్తూ ఇలా పలుకుతుంది.

"ఆగండి ఓనాథా నాప్రాణనాథా ఓరాజా
మొక్కా దైవంలేదు నాప్రాణానాథా ఓ నాథా
చూడాచుట్టంలేదు ఓప్రాణనాథా నారాజా
ఇటు వైపు చూసినా ఎవరూలేరు ఓనాథా
నాకైనా ఓనాథా అక్కాలు లేరు ఓరాజా
ముగ్గురు అన్నదమ్ములున్నారా ఓ రాజా
పరాయి దేశాన్ని అన్నలున్నారా ఓరాజా
నిన్నైన నేనైన చాలా నమ్మానా ఓరాజా
నన్నైన ద్రోహము నువ్వు చేస్తావా ఓరాజా"

పై మాటల్లో అంజమ్మ తన భర్తను ఎంతగా ప్రేమిస్తుందో అతణ్ణి వదలిపెట్టి ఉండటం ఆమెకు ఎంతకష్టంగా ఉందో జానపదకవి అత్యంత సులభమైన తెలుగు మాటలతో చక్కగా తెలియజేశాడు.

అంజమ్మ ప్రేమను చక్కగా అర్థం చేసుకున్న ఆమె భర్త అంజమ్మతో ఇలా చెప్పాడు.

"నీకేమీ భయమేమి నాకేమి కొదవ ఓ మగువా
ఎల్లి నడుగుల మీద నేనే వస్తాను ఓ మగువా
మాయమ్మ చెల్లమ్మా ఇక్కడున్నాది ఓ మగువా
నన్ను చూసినట్టే నిన్నే చూస్తాదా ఓ మగువా"

ఈ గేయంలో భర్త "ఎల్లినడుగుల మీద నేనే వస్తాను" అని చెప్పడం ఒక మహత్తరమైన ప్రయోగం.వెంటనే తిరిగి వస్తాననడానికి జానపదకవి వెళ్ళిన అడుగుల మీదనే తిరిగి వస్తాననే ప్రయోగాన్ని చేశాడు. ఇలాంటి సహజమైన, అత్యంత సుందరమైన ప్రయోగం శిష్టసాహిత్యంలో కాగడాపెట్టి వెతికినా కనిపించదు. ఇలాంటి వినూత్నమైన ప్రయోగాలను చేసిన జానపదకవి నిజంగా ధన్యుడు.

అంజమ్మ అప్పటికే గర్భవతి. ఆమె భర్త ఆమెను తల్లికి అప్పగించి ఉద్యోగానికి వెళ్ళిపోతాడు. అత్త అంజమ్మను భర్త లేని లోటును తెలియకుండా అపురూపంగా చూసుకోవడం ప్రారంభించింది.

అంజమ్మ అత్తవారింట్లో ఇలా ఉంటే అంజమ్మ పుట్టింటి వారైన పూసల



అప్పన్న ఇంట్లో పరిస్థితులు మారిపోయాయి. తమ్ములతో ఆప్యాయంగా కలసి ఉంటున్న పూసల అప్పన్నను అతని భార్య

"మీ ముద్దు తమ్ముళ్ళే ఇంకా ఎత్తుదువా అప్పన్నా
ఇన్నాళ్ళు ఎవరైనా ఉమ్మడుంటారా అప్పన్నా"

అని తమ్ముళ్ళ భాగం తమ్ముళ్ళకు పంచి ఇమ్మని చెబుతుంది. అప్పన్న భార్య మాట విని తమ్ముళ్ళను పిలిచి భూమి పంచుదామన్నాడు. అప్పన్న రాముడు కాదు గానీ అతని తమ్ములు మాత్రం అన్న మాట జవదాటని రామానుజులే. ఆ ఇద్దరు తమ్ములు ఆ పొలం కావాలి, ఈ పొలం కావాలి అని అన్నను అడగలేదు. నీ ఇష్టం వచ్చినట్లుగా పంచమని అన్నకు చెప్పారు. అప్పన్న అధర్మపరుడై మెరక భూములను తమ్ములకు ఇచ్చి పల్లపు భూములను తాను తీసుకున్నాడు. తమ్ముళ్ళు అన్న చేసిన ఈ అన్యాయాన్ని కిమ్ అని ప్రశ్నించకుండా అన్న ఇచ్చిన మెరక భూములను తీసుకొని అన్నతో ఇలా చెప్పారు.

"విన్నావా అన్నయ్యా వివరంబుగానూ అన్నయ్యా
ఇన్నాళ్ళు మాకు లోటు చేశావా అన్నయ్యా
ఇన్నాళ్ళు బట్టీని అమ్మన్న లోటైన లేదాయె అన్నయ్యా
అమ్మా లేని లోటుల్లు మాకైనా లేవు అన్నయ్యా
బాబు లేని లోటుల్లు మాకైనా లేవు అన్నయ్యా"

అప్పన్న చేసిన అధర్మాన్ని తమ్ముళ్ళు సహించారు గానీ దేవుడు, ప్రకృతి సహించలేదు. తమ్ముళ్ళ భూములు మెరక భూములైనా మంచి పంట పండింది. అప్పన్న భూములు పల్లపు భూములైనా కలుపు మొక్కలతో నిండిపోయి పంట రాలేదు. అప్పన్న స్వార్థంతో తమ్ముళ్ళకు చేసిన అన్యాయం అతనికి శాపంగా మారింది.

మంచి చెడ్డలు బొమ్మా బొరుసుల్లాగ పక్కపక్కనే ఉంటాయి. ఈ దేశంలో విశేషమైన ధార్మిక దృష్టితోపాటు అనేక మూఢాచారాలు, మూఢనమ్మకాలు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా గ్రామాల్లో ఇలాంటి అంధ విశ్వాసాలు మరీ ఎక్కువ. గ్రామ దేవతలకు కోళ్ళు మొదలు దున్నపోతుల వరకు బలి ఇవ్వడం సంప్రదాయమైపోయింది. అక్కడక్కడ నరబలి ఇవ్వడం కూడా జరుగుతూ ఉంది. అలాంటి నరబలి ఇందులో చెప్పబడింది.

అప్పన్న పొలంలో ఒక నుయ్యి ఉంది. తన పొలంలో పంట పండలేదన్న దిగులుతో అప్పన్న పొలంలో నడుస్తూ ఉన్నప్పుడు అతనికి నూతిలో ధనశక్తి కనిపించి ఇలా చెప్పిందట.

"ధనశక్తిని చూశాడే పూసలప్పన్నా అప్పన్నా
నిర్ఘాంతపోయాడా నిర్ఘాంతుడౌనే అప్పన్న

దెయ్యానివా నువ్వు దేవతవా నువ్వూ
వచ్చే తోవలకేమి అడ్డుగున్నావా ఓమగువా
అప్పన్న అప్పన్న పూసలప్పన్నా అప్పన్నా
భూతాన్ని కాదురా పీడాని కాదురా అప్పన్నా
నూతిలో ఉన్నాది పదిగాబుల ధనము అప్పన్నా
దాని మీద ఉండేటి ధనశక్తిని నేను అప్పన్నా
నీ ఇల్లు రావడానికి కోరిక ఉందిరా అప్పన్నా
నీ మేడకి రావడానికి ఆశలున్నాయిరా అప్పన్నా"

కోట కట్టేటప్పుడు, నుయ్యి తవ్వేటప్పుడు, చెరువు తవ్వేటప్పుడు తప్పనిసరిగా బలి ఇవ్వాలనే నమ్మకం గతంలో ప్రబలంగా ఉండేది. ప్రస్తుతం నోరు లేని జీవులైన గొర్రె, మేక, పొట్టేలు లాంటి జంతువులను బలి ఇస్తున్నారు. గతంలో నోరులేని కులాలకు చెందిన మనుషులను బలి ఇచ్చేవారు. దీనికి కారణం కోటలోని, నూతిలోని, చెరువు లోని క్షుద్ర శక్తులు బలి ఇవ్వకపోతే వాటిని కట్టించే యజమానికి హాని కలిగిస్తాయన్న నమ్మకం ఉండడమే. ఇంత ఎందుకు? గృహ నిర్మాణాల్లో వాస్తుదోషం అనే విషయాన్ని వింటూ ఉంటాం. కొన్ని ఇళ్ళలో దుష్టశక్తులు నివాసముంటాయని వాస్తుశాస్త్రమే చెబుతూ ఉంది. ఇలాంటి నమ్మకాలు చదువు సంధ్యలు లేని గ్రామీణులకే గాదు. గొప్పచదువులు చదువుకున్న నవనాగరికులకు కూడా ఉన్నాయి. ఇందులోని వాస్తవ, అవాస్తవాలను నిర్ణయించడం దాదాపు అసాధ్యం.

ప్రస్తుతం మన కథలోకి వస్తే ధనాశ ఎంతటి వారినైనా దుర్మార్గులుగా తయారు చేస్తుంది. "మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమో నమః" అనేది లోకోక్తి. ధనం ముందు రక్తసంబంధం వెలవెలపోతుంది. తన ఇంటికి వస్తానన్న ధనశక్తి మాటలకు అప్పన్న సంతోషించి ఆమెకు ఏమికావాలో చెప్పమన్నాడు. తనకు బలి కావాలని ధనశక్తి చెప్పి ఎవరిని బలి ఇస్తావో చెప్పమని అప్పన్నను అడుగుతుంది. అప్పుడు అప్పన్న ఈ విధంగా చెబుతాడు.

"ఏమంటా అప్పన్న పలుకుతున్నాడే ఆయేళ
ఇన్నావా ధనశక్తి వివరంబుగాను ధనశక్తా
మెట్టా తిరిగొస్తాది మేకల్ల కదుపా ధనశక్తా
మేకపోతుల బలి నీకిచ్చుతాను ధనశక్తా
మేకపోతుల బలికి నేను రానురా అప్పన్నా
కొండ తిరిగొస్తాది గొర్రెల కదుపా ధనశక్తా



గొర్రెపోతుల బలి నీకిచ్చుతాను ధనశక్తా
గొర్రెపోతుల బలికి నేను రాను పోరా అప్పన్నా
దొడ్డిలోని కోడిపుంజులిస్తానే ధనశక్తా
కోడిపుంజుల బలికి నేను రాను పోరా అప్పన్నా
సూరన్న సుబ్బన్న తమ్ములున్నారే ధనశక్తా
అన్నదమ్ముల బలి నేనిచ్చుతానా ధనశక్తా"

అప్పన్న మొదట మేకలను, మేకపోతులను, గొర్రెలను, గొర్రెపోతులను బలి ఇస్తానన్నాడు. ధనశక్తి దానికి అంగీకరించ లేదు. అప్పన్న అప్పుడు తన తమ్ములైన సూరన్న, సుబ్బన్న లను బలి ఇస్తానన్నాడు. ధనశక్తి దానికి అంగీకరించకుండా అప్పన్న భార్యను బలి ఇమ్మన్నది. వెంటనే అప్పన్నకు పట్టరాని కోపం వచ్చి ధనశక్తితో ఇట్లా అన్నాడు.

"ఎంత మాటాడావే పాపిష్టి ధనమా ధనశక్తా
ఇప్పుడాడెడు మాట మళ్ళీ నువ్వంటే ధనశక్తీ
నోటిలో పొడుచుదునే గోతిలో వేసెదనే ధనశక్తీ
నా యొక్క భార్యాని బలి కోరుదువా ధనశక్తా"

తమ్ముళ్ళను బలి ఇవ్వడానికి సిద్ధపడిన అప్పన్న భార్యను కోరగానే ధనశక్తి మీద విరుచుకుపడ్డాడు. స్వార్థం ఎంత బలమైనదో దీనిని బట్టి తెలుస్తుంది. భార్యను బలి ఇవ్వలేనని చెప్పిన అప్పన్న చెల్లెలిని బలి ఇస్తానని చాల తేలికగా చెప్పగలిగినాడు.

"ఉత్తర ఖండాన చెల్లెలున్నాది ధనశక్తీ
ముగ్గురూ తరువాత ముద్దు చెల్లెలే అంజమ్మా
నాముద్దు చెల్లెల్ని బలియిచ్చుతానె ధనశక్తా
నాయొక్క లోగిలికి నువ్వు వచ్చుతేనా ధనశక్తా"

అప్పన్న మాటలను విని చివరకు ధనశక్తి కూడా ఆశ్చర్యపోయి ఇలా పలికింది.

"నీముద్దు చెల్లెల్ని బలి యిచ్చుతావా అప్పన్నా
నీముద్దు చెల్లెల్ని బలి యిచ్చుతావా అప్పన్నా
ఇవ్వడానికి నీకు చేతులేల వచ్చె అప్పన్నా అప్పన్నా
నిండు గర్భావతి నీళ్ళాడే పొద్దె ఆ చెలియ
ఎలయాగ ఇస్తావురా పూసలప్పన్నా అప్పన్నా"

చిన్నప్పటి నుంచి తల్లిదండ్రులు లేని లోటు కనిపించకుండా ఎంతో అల్లారుముద్దుగా పెంచిన చెల్లెలిని బలి ఇస్తానని అప్పన్న చెప్పడం దుష్టశక్తి అయిన ధనశక్తికి కూడా ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఇక్కడ జానపదకవి మానవ మనస్తత్వంలోని బలహీనతను, దుర్మార్గాన్నీ తెలియజేసే సందర్భాన్ని కల్పించాడు. పూసల అప్పన్న ఇంటికి వెళ్ళి భార్యకు ధనశక్తి విషయం చెప్పి బలిగా ధనశక్తి ఆమెనే (అప్పన్న భార్యను) కోరినట్లుగా చెబుతాడు. ఆ మాట విన్న వెంటనే ప్రాణాలు మీద అత్యంత తీపి ఉన్న అప్పన్న భార్య తల్లడిల్లిపోతుంది.

"దబ్బు దబ్బున బుర్ర గుద్దుకుంటాదా ఆయమ్మ
చెళ్ళు చెళ్ళున చెంపలేసుకుంటాదే ఇల్లాలా
ఎంత పని చేశావు పూసల అప్పన్నా అప్పన్నా
పాపిష్టి ధనము నన్నే కోరేనా అప్పన్నా
వన్నెకారి ధనము నన్నే కోరేనా అప్పన్నా
ఎప్పుడైనా ఓసారి తీసుకెళ్ళతావా అప్పన్నా
వన్నికారి ధనానికి బలియిచ్చుతావా అప్పన్నా
నీయొక్క ఇళ్ళల్లో నేనుండలేనా అప్పన్నా
మా అమ్మగారి భవనాల కెళ్ళిపోతానా అప్పన్నా
చాటుగా నువ్వైనా తీసుకెళతావా అప్పన్నా
సమయానికి నన్ను బలియిచ్చుతావు అప్పన్నా
అమ్మగోరి వాడ కెళ్ళిపోతాను అప్పన్నా"

ధనశక్తి బలిగా తన్ను కోరిందని తెలియగానే అప్పన్న భార్య చావు భయంతో తల కొట్టుకుంది. తన భర్త ధనాశతో తనను మోసగించి ధనశక్తికి బలి ఇస్తాడని భయపడి పుట్టింటికి వెళ్ళిపోతానని చెప్పింది. ఆవిధంగా ప్రాణభీతితో ఎంతగానో భయపడిన అప్పన్న భార్య అల్లారు ముద్దుగా పెరిగిన ఆడుబిడ్డను బలి ఇవ్వడానికి ఇలా ప్రోత్సహించింది.

"ఆ మాటలిన్నాదే చిన్నభార్యా అప్పన్నా
నీ ముద్దు చెలెల్నీ ధనం కోరితే అప్పన్నా
ఇంకా చూసుతావా పూసలప్పన్నా అప్పన్నా
ఎల్లెద్దు పుల్లెద్దు బండీ పూయండి అప్పన్న
నీ ముద్దు చెల్లెల్ని తీసుకొని రండి అప్పన్నా
ఆపాదుబావి యొద్ద బలియ్యవేమి అప్పన్నా
వన్నెకారి ధనం తోలుకురండయ్య అప్పన్నా"

వెంటనే అప్పన్న బండి కట్టుకొని అంజమ్మ దగ్గరకు వెళ్ళి తన భార్య చావు బతుకుల్లో ఉందని అంజమ్మను కడసారిగా చూడాలంటుందని, అబద్ధమాడి ఆమెను తీసుకొని ధనశక్తి దగ్గరకి వచ్చి అలసటతో నిద్రపోతున్న ఆమెను కత్తితో నరికివేస్తాడు. ఇక్కడ



జానపదకవి ఒక విచిత్రమైన కల్పనను చేశాడు. అప్పన్న అంజమ్మ తలను నరకగానే ఆమె గర్భంలో ఉన్న పిండం పైకి ఎగిరి పడిందట.

"కడుపులో పిండాం పైకి తూలేనా అంజమ్మా
ఏమంటా పిండంబు మాటలాడేనా ఆ యేళ
మా యొక్క తల్లీని నువ్వు చంపినావా మావయ్యా
ధనాని కాశించి పాపిష్టివాడే మావయ్యా
కడుపులో శిశువే మాటలాడేనా ఆ యేళ
ఆ యొక్క శిశువునే అందుకున్నాడే అప్పన్నా
గగన భూమిలోకి విసిరేసినాడే అప్పన్నా
మీదనే ఉన్నారు విష్ణు బ్రహ్మలే ఆ యేళ
పార్వతీ శంకారులు బాలనంటేనా ఆ యేళ
పైడమ్మ పురమునే పెంచుతున్నారా బాలని"

అంజమ్మ చనిపోయిన తరువాత పేరంటాలు అయ్యి ప్రజల పూజలను అందుకున్నట్లుగా జానపదకవి రాశాడు. కాబట్టే ఆమెను శ్రీకృష్ణుని తల్లి అయిన దేవకితో సమానంగా భావించుకొని పూసల అప్పన్నను కంసునిగా ఊహించుకొని పై కల్పన చేశాడు. అంజమ్మ గర్భంలోని పిండం బయటకువచ్చి ధనానికి ఆశించి మా తల్లిని చంపుతావా పాపిష్టి మామయ్య అని నిందిస్తుంది. అప్పన్న ఆ శిశువును అందుకొని కంసుడు దుర్గను ఆకాశం లోకి ఎగరవేసినట్లుగా పైకి ఎగరవేస్తాడు. పైకి ఎగరవేసిన ఆ బాలను దేవతలు పట్టు కొని రక్షించి పైడమ్మపురంలో పెంచుతారు. ఈవిధంగా జానపదకవి పూసల అప్పన్న కథలో ధనాశకారణంగా మనుష్యులలో కలిగే పేరాశను, దుర్మార్గాన్నీ చాలా చక్కగా వివరించాడు.

తప్పెటగుళ్ళ కళాకారులు పైన చెప్పిన కథాగేయాలనే కాకుండా కుటుంబ నియంత్రణ, నూతన పద్ధతుల్లో వ్యవసాయం చేయటం, వయోజన విద్య మొదలైన ఆధునిక విషయాలకు సంబంధించిన పాటలను కూడా పాడతారు. పల్లి తిరుపతి రావుగారు రాసిన కుటుంబ నియంత్రణ పాటను తప్పెటగుళ్ళవారు ఇలా పాడతారు.

"రామనా సెందనాలో ఎన్నిలా- రాజా నీకొందనాలో ఎన్నిలా ॥రామనా॥
దేశం నలుమూలలా ఎన్నిలో ఎన్నిలా- ఎక్కడ జూసినా ఎన్నిలో ఎన్నిలా
బహు భార్యలావల్ల ఎన్నిలో ఎన్నిలా- చీమల పుట్టాల్లా ఎన్నిలో ఎన్నిలా
సంతాన మధికమాయె ఎన్నిలో ఎన్నిలా- ఈ రీతిగ నేడు ఎన్నిలా, జనం అధిక మౌతున్నారు ఎన్నిలా
ఏ ఊరు జూసినా ఎన్నిలో ఎన్నిలా- ఏ వాడ జూసినా ఎన్నిలో ఎన్నిలా

తిండికి అన్నం లేక ఎన్నిలో ఎన్నిలా- కట్టబట్ట లేక ఎన్నిలో ఎన్నిలా
నిలువ నీడ లేక ఎన్నిలో ఎన్నిలా- బాధలు పడుతున్న ఎన్నిలో ఎన్నిలా
జనులను జూడవయ్యా ఎన్నెల, కడుదీనులను చూడవయ్యా ఎన్నెల
చదువులు చదువుటకు ఎన్నిలో ఎన్నిలా- ఫీజులు కట్ట లేక ఎన్నిలో ఎన్నిలా
చదువులు చదివినోల్లు ఎన్నిలో ఎన్నిలా- ఉద్యోగాలు లేక ఎన్నిలో ఎన్నిలా
రోగాల రోష్టులతో ఎన్నిలో ఎన్నిలా- మందు మాకులు లేక ఎన్నిలో ఎన్నిలా
బాధలు పడుతున్న ఎన్నెలా, ఈ భారీ లోకం చూడు వెన్నెలా
అందుచేత మీరు ఎన్నిలో ఎన్నిలా- బళ్ళాట గాల్లమైనా ఎన్నిలో ఎన్నిలా
మేము చెప్పేమాటలు ఎన్నిలో ఎన్నిలా- శ్రద్ధగా వినుడయ్యా ఎన్నిలో ఎన్నిలా
ఇద్దరు పిల్లలతో ఎన్నిలో ఎన్నిలా- ఇంపుగ సంసారం ఎన్నిలో ఎన్నిలా
చక్కదిద్దుకొండి ఎన్నిలో ఎన్నిలా- చిన్న కుటుంబంతో ఎన్నిలో ఎన్నిలా
చింతలు లేకుండా ఎన్నిలో ఎన్నిలా- హాయిగా ఉండండి ఎన్నిలో ఎన్నిలా"

కుటుంబ నియంత్రణ పాటించిన దంపతులు పిల్లలతో ఎంతోహాయిగా ఉన్నారని ఒక అబ్బాయిని డాక్టరును, ఇంకొక అబ్బాయిని ఇంజనీరును చేసి వారికి చక్కటి భవిష్యత్తు కల్పించారని అందువల్ల పరిమిత సంతానం మనుషులకు, దేశానికీ మంచిదని కింద పాటలో చెప్పబడింది.

"పక్కింటి కృష్ణమూర్తి ఎన్నిలో ఎన్నిలా- ఇద్దరు పిల్లలతో ఎన్నిలో ఎన్నిలా
హాయిగా ఉన్నారు ఎన్నిలో ఎన్నిలా- ఎదురింటి సాంబయ్య ఎన్నిలో ఎన్నిలా
ఒక పిల్లవాడిని ఎన్నిలో ఎన్నిలా- డాక్టరుగా చేశాడు ఎన్నిలో ఎన్నిలా
రెండో పిల్లాడిని ఎన్నిలో ఎన్నిలా- ఇంజనీరుగా జేసి ఎన్నిలో ఎన్నిలా
ఆ విధంగా మీరు ఎన్నిలో ఎన్నిలా- పరిమిత సంతానం ఎన్నిలో ఎన్నిలా "

నూతన పద్ధతుల్లో వ్యవసాయం చేయడం గురించి రచింపబడిన కింది పాటను తప్పెట గుళ్ళ కళాకారులు పాడతారు.

"మేలుకో మేలుకో రైతన్న మేలుకో
వ్యవసాయ పద్ధతులు కొత్త వొచ్చాయి ||మేలుకో||
తాత తండ్రుల నాటి నాగళ్ళు కంటె
కొత్త కొత్తని మంచి మరనాగళ్లొచ్చాయి ||మేలుకో||
పాతకాలము నాటి పనిముట్లు కంటె
మన పనికి సులువైన పనిముట్లొచ్చాయి ||మేలుకో||
అధిక దిగుబడినిచ్చే వంగడాలుండగా



దిగుబడి లేని పాత వంగడా లెందుకు ||మేలుకో||
పైరు పెరిగేందుకు పసందైన ఎరువులుంటే
పంట పోతుందని భయమెందుకు నీకు ||మేలుకో||
చీడతెగులు పట్టిన దోమపోటు వచ్చిన
చిటికెలో పోగొట్టే సిసలైన మందులున్నాయ్ ||మేలుకో||

పై గేయంలో తాత తండ్రులనాటి వ్యవసాయపనిముట్లను వదిలివేసి, ఆధునికంగా తయారైన మరపనిముట్లను ఉపయోగించమని దిగుబడి పెద్దగా లేని పాత వంగడాలను వదలివేసి అధిక దిగుబడిని ఇచ్చే వంగడాలను వేయమని కవి గ్రామీణులైన వ్యవ సాయదారులకు ఉద్బోధిస్తున్నాడు.

ఈ విధంగా తప్పెటగుళ్ళ కళాకారులు సాంప్రదాయకమైన పౌరాణిక, చారిత్రక, సాంఘిక కథాగేయాలతోపాటు, ప్రజలను చైతన్యవంతులను చేసే అనేక పాటలను తమ కళా ప్రదర్శన సందర్భంగా పాడతారు. అందువల్లనే తప్పెటగుళ్ళు కథ నేటికీ బాగా ఆదరింపబడుతూ ఉంది.

## యాదవ కులకథాఖ్యాన కళలు - సాహిత్యాంశాలు :

యాదవుల ఆశ్రిత కులాలైన గొల్లసుద్దులు, కొమ్ములవారు, మందెచ్చులవారు, పొడపోతులవారు, తెరచీరలవారు, బైకానివారు - ఈఆరుగురు గూడా ఇప్పటికీ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు. ఆంధ్రదేశంలోని యాదవులు తమ ఆశ్రిత కులాల వారిని తమ ఆడుబిడ్డగా భావించి తమకున్నంతలో వారికి సంభావన ఇచ్చి గౌరవంగా చూస్తున్నారు. పైన చెప్పిన యాదవకుల ఆశ్రితకులాల వారందరూ కాటమ రాజు కథలను చెబుతారు. ఇప్పుడు ఒక్కొక్క కళలోని సాహిత్యాంశాలను పరిశీలించుదాం.

### గొల్లసుద్దులవారు:

గొల్లసుద్దులవారు కాటమరాజు కథలను మాత్రమే చెబుతారు. కాటమ రాజు కథల్లో గంగ కాటమరాజు తరకవాదం కథ, పోలురాజు కథ, కాటమరాజు ఉత్తరాది ఆవులు మేపు, బొల్లావు జగడం, గంగ కథ, ముమ్మయ్య పోచయ్య కథ, బీరనాయని కథ మొదలైన కథలను చెబుతారు. వీటిలో గంగ కాటమరాజు తరక వాదం కథను పరిశీలించుదాం!.

**గంగ - కాటమరాజు తరకవాదం కథ :**

గొల్లసుద్దులవారు ఎక్కువగా పాడేకథ ఇది. ఈ కథను చెప్పేటప్పుడు గొల్లసుద్దుల

వారు ఒకరు కాటమరాజు వేషాన్ని ఇంకొకరు గంగవేషాన్ని ధరించి ఒకరు తరువాత ఒకరు ఈ కథను పాడతారు. కాటమరాజు కథా చక్రంలోని కథల్లో బాగా ప్రచారంలో ఉన్న వీర గాథల్లో ఇది ఒకటి. రాయలసీమలో జరిగే గంగజాతర్లలో గొల్లసుద్దుల వారు ఈ కథను తప్పనిసరిగా పాడతారు. "ఇద్దరు వ్యక్తులు గంగవేషము, కాటమరాజు వేషము, ధరించి చేతిలో కత్తులు పట్టుకొని సంవాద రూపమున దీనిని పాడునపుడు వినుట జీవితంలోనొక అపూర్వానుభూతి. రాయలసీమలో ముఖ్యముగ కడప, కర్నూలులో నిట్టి అనుభూతులు తరచుగాకలుగుచుండును".[1]

కాటమరాజు గోగణం చాల పెద్దది. "కుదిరితే ఆరామడ చెదిరితే పన్నెండామడ" అది విస్తరించి ఉంటుంది. ఇంతపెద్ద గోగణాన్ని పాలించడం అందరికీ సాధ్యంకాదు. విష్ణుస్వరూపుడైన కాటమరాజుకే అది సాధ్యమైంది. కాటమరాజు శ్రీశైలం దగ్గర ఆవులను మేపుతున్నప్పుడు పెద్ద కరవు వస్తుంది. నీరు, ఆహారం లేక గోవులు తల్లటిస్తూ ఉంటాయి. నెల్లూరు భూములకు వెళితే వారి గోవులు బతికిపోతాయని త్రిమూర్తులు బలిజవేషంలో వచ్చి చెబుతారు. కాటమరాజు ఆలమందను తరలించుకొని దక్షిణాదికి వస్తూ పాలేరును దాటించేటప్పుడు యాదవుల కులదేవత అయిన గంగ అక్కడకు వచ్చి కాటమరాజుతో పూజలు అందుకోవాలని ఆశిస్తూ పాలేరు పొంగి పొర్లేలాగా చేసి గోవులు ఏరు దాటకుండా అడ్డగిస్తుంది. అప్పటి ఆమె వేషాన్ని జానపద కవి ఇలా వర్ణించాడు.

"గంగ తా పయనమై గ్రక్కున వచ్చి - పక్షిణి పుట్టము చిలకల రవికె
వీరసేన కొప్పు వీపున జడలు - ఆడుచు రాగాను అందెల పాదమున
చెంపల వీరగంధము చెవుల బవిరెలును - కమ్మలు కుంటెనలు కంఠమున తీగె
సరస గుత్తిపూసలు గురుగింజదండలు - తీర్చిన భూషణములు తిలకంబు నొసట
హస్తమున కంకణము అమిరిన సొమ్ములు-ఆయుధములు చేతుల అమరంగ బట్టి"

ఈ వేషంతో గంగ వచ్చి గట్టిగా కేకలు వేస్తూ, ఓంకారాలు చేస్తూ, బొబ్బలు పెడుతూ ఆవులను కాసేపు అటూ ఇటూ తరుముతుంది. తర్వాత ఆవులు కట్టు కదలకుండా నిర్బంధం చేస్తుంది. కాటమరాజు ఆమెను ఆమె చేష్టలను చూసి గంతులు వేస్తూ "ఆటవారి పదుచు"లాగా ఆడుతూ ఉన్నావు ఎవరవు నీవు? ఎక్కువ ఆశకు పోయావంటే నీకు 'కించెత్తు భుక్తి' కూడా పెట్టను అని అంటాడు. దానికి గంగ -

"భుక్తి పెట్టక పొయ్యెదనంటివి భూనాథ నిన్ను- కొండలకు వురికింతు గోపాలకుల నెల్ల
దూడల ఆవుల తూలాడ చేతును - చేపట్టి పూజించవోయి చెలగి పాలేట
అర్థించి దక్షిణాదికి నీ యావుల యెంటను - పాయక వచ్చేను పశుపతి రాజ!"



నన్ను పూజించకుంటే గోపాలకులను, గోవులను కొండల వెంట ఉరికేలా చేస్తానని అందువల్ల తనని పూజించమని చెబుతుంది. దానికి కాటమరాజు తన ఆలమందలో ఈశ్వరుని అవతారమైన బసవన్న ఉన్నాడని, అనేకమంది దేవతలు ఆవుల రూపంలో తన మందలో ఉన్నారని, అంతేగాకుండా వీరరస స్వరూపులైన హరిదాసుడు, చెన్నయ్య, పద్మనాయుడు మొదలైనవారు ఉన్నారని ఇలాంటి తమను గంగ ఏమీ చేయలేవని చెబుతాడు. అప్పుడు గంగ తన మహిమను ఇలా చెబుతుంది.

"మూడు లోకములు నేను ముక్కంటి నేను- వనయంత్రములు నేను వాక్కును నేను
జనసంధ్యలును నేను జగములు నేను - తీర్థనిధులు నేను దిశలెల్ల నేను
ఆకాశమందు నేను అమరులు నేను - యిన్ని రూపులు తనవి యీశ్వరుడు యెరుగును
అవుతారాల కన్న యెచ్చు యాదవరాజ! - కోరి పూజలు చాయవోయి కొనసాగనిత్తును"

పరబ్రహ్మ విశ్వరూపాన్ని గంగ రేఖామాత్రంగా వివరించి తానే పరబ్రహ్మనని చెప్పి తనను పూజించమని చెబుతుంది. దానికి కాటమరాజు గంగ స్త్రీ కాబట్టి స్త్రీల చేత పూజలందుకోవాలే గానీ తన చేత పూజలు ఆశించవద్దని తాను గంగకు చేతులెత్తి మొక్కనని చెబుతాడు. అప్పుడు గంగ కాటమరాజుతో అతని తండ్రి పెద్దిరాజు ఆర్లపెంట యుద్ధంలో చనిపోయినప్పుడు యుద్ధరంగంలో అతని శవాన్ని కనుక్కోలేక దుఃఖిస్తూ ఉంటే తాను వచ్చి పెద్దిరాజు శవాన్ని చూపించానని పెద్దిరాజు శవాన్ని చూపిస్తే భుక్తి పెడతానని ఆ రోజు తనకుమాట ఇచ్చాడనీ ఆ మాట ఇప్పుడేమయిందనీ, నీవంత మహిమ గలవాడవైతే తాను కట్టడి జేసిన ఆవులను, ఎద్దులను కదలించమని ఇలా చెబుతుంది.

"పెద్దురాజును జూపమంటివి పెట్టేనంటివి భుక్తి-కల్లలాడితివి యేపాటి గణుతి కెక్కేవు?
నాటి మాటలు నాటికి చెల్లెనో నీ నాలుక పొడుగాయెనో- చెడ్డతనము వచ్చీని
శంకింపకున్నావు
ఆపాటి వాడవయితే యాదవురాజ!- యేది నీ మహిమ యెద్దులను తర్లించు"

పై గేయభాగంలో అబద్ధమాడడాన్ని 'నాలుక పొడుగాయెను' అని చెప్పడం కొత్తప్రయోగం. దానికి కాటమరాజు ఆర్లపెంట యుద్ధంలో తాను ఇచ్చిన మాట మరచిపోలేదనీ అప్పటి నుంచి సంవత్సరంనర్రలోపు శత్రువులందరినీ సంహరించి ఎర్రగడ్డపాడు దగ్గర భూతాల కందరికీ భుక్తి పెడతానని, అప్పుడు గంగకు గూడా భుక్తి పెడతానని చెబుతాడు. అప్పుడు గంగ తన తోటి శక్తి దేవతలను, తన తమ్ముడు పోతురాజును రప్పించి ప్రళయ వర్షం కురిపించి ఆ ప్రాంతమంతటనీ నీటితో నింపించి ఆవులను ఇలా గగ్గోల పరుస్తుంది.

"కొమ్ములు వంచుక ధేన్వలు కొట్టు మిట్లాడెను- మెరుపులు బుట్టెను మేఘములు గ్రమ్మెను
ప్రళయ వాయువులు విసిరి పట్టెను వర్షములు- పారెను నదులెల్ల పశువులకు మోపాయ
పోటెత్తి పాలేరు పొర్లి పారసాగెను - వరదలు ముంచెను వాగులు నిండెను
కసురెత్తి పాలేరు కానుగలు ముంచెను - గుంటి మీద వుదకము కొండల పొడుగున
పొలుపార వెల్కి బుట్టి పొర్లి పారసాగెను - ఆవు లేగను గానక అరవంగ సాగెను
శంభుని మందంత చెల్లాచెదరమాయ - మందలు ముంచెను మద్దులెక్కి పూచెను"

ఇలా గగ్గోలు పరచినప్పటికీ కాటమరాజు శక్తులందరినీ దిక్కరించి జట్టిబోయిన గోపన్న, ముత్యబోయిన పాపన్న, ముంగర రంగయ్య మొదలైన తన గోపాలకు ధైర్యం చెప్పి ఆలమందను పాలేరు దాటిస్తాడు. దానితో గంగ బిత్తరపోయి కాటమ రాజుకు ఇష్టమైన 'మట్టిపెయ్య' అనే దూడను దాచిపెడుతుంది. కాటమరాజు మట్టిపెయ్య కోసం వెతికిస్తాడు. కానీ అది లభించదు. గంగ కాటమరాజు మీద కోపంతో ఉంటుంది. అప్పుడు చనిపోయిన పోలురాజు గంగను ఇలా ప్రార్థిస్తాడు.

"శరణె భయంకరి! శరణె శంకరి!- శరణె పరంజ్యోతి! శరణె భావాని
శరణె గవిరీశ్వరి! శరణె జటాజూటి!- శరణె జొన్నవి గంగ! శరణడ పల్లవపాణీ
శరణె పల్లవ పాణి! శరణె పరంజ్యోతి - ఆవుల మందలు నీవమ్మ! అలుక నీకేటికి?
ప్రాణమే నీ సొమ్ము భక్తి వుంచవమ్మ! - కోపంబు శాయకు గోపాల్కుల మీద
నీ బాలలు యాదవులు మీవారము - యదు వంశమున నీవు అనేక వేల వేండ్లు
కోరిపూజలు గొంటివి గోకులముతోను - కాటమరాజు కొలువడని కపటంబు వుంచకు
బాలలు యెరుగరు నిన్ను పూజలు శాయను - తరమునాటి వేల్పువు దయ వుంచవమ్మా
మందలు కట్టకు నీమనసును వుంచకు - కార్యము ముందల వున్నది గంగరో! యెరుగవా?
తరుణి గంగవు యాదవుల రాజును - తెప్పించేను మీ సేవకుల రక్షించవమ్మ!"

పోలురాజు చేసిన పై గంగ ప్రార్థన యాదవ వంశ ఇలావేల్పుగా గంగకు గల స్థానాన్ని తెలియజేస్తూ ఉంది. ఈ విధంగా గంగను ప్రార్థించి ఆమెను శాంతింపజేసి కాటమ రాజుకు కలలో కన్పించి గంగను పూజించమని ఇలా చెబుతాడు.

"కాంతిగల చంద్రుడా! కాటమరాజు! - పోలురాజు నా పేరు పొందుగా వినుమ
గంగ మన మందలకు కలిగినా యేల్పు- గంగను కొలువక పోరాదు కాదనరాదు
పూదించి దక్షిణాదికి భూనాథ! నువు పోతే - తలచిన కార్యము నెరవేరు
తరము నాటి వేల్పు ఆదిశక్తితో కంటు - ఆవులన్నా ఆది నీకు వద్దు
మన పెద్దలు తొల్లి గంగను కొలిచిరి - పెంపాయను మంద గంగను
కొలువక పోరాదు మందయాన గంగను - కొలువుడీ పూజితమయ్యాని"



పోలురాజు మాటలు విని కాటమరాజు తన గోపాలకులతో కలసి గంగకు పొంగళ్ళు, బోనాలు తయారు చేసి ఆమె దగ్గరకు వచ్చి అర్చించి, పద్మనాయుడుతో కలసి కాటమ రాజు గంగను ఇలా ప్రార్థిస్తాడు.

"హర హర శాంభవి ! ఆదిలక్ష్మి గంగ! - త్రిపుర పురములు నీవు దిగ్గజములు నీవు
పరంజోతివి నీవు పరమేశ్వరివి నీవు - మూడు కన్నులవాని సతివి ముజ్జగములు నీవ
మింట కంటను నీవ మిగుల వేల్పవు నీవ - కల్ప వృక్షము నీవ కామధేవును నీవ
సాగరములు నీవ సంజీవు నీవ - కాశీపురము నీవట ఖడ్గంబు నీవట
పాపసంహారిని పాలేట నుండి - పూజలు మాచాత పుచ్చుకోవలసి
దిట్టముగ మందలో నిష్ఠలు చూపితివి - హరహర శాంభవి! ఆవుల రక్షించు
మట్టె పెయ్యను మాకిచ్చి మన్నించవే గంగ - అర్ధపూజలు యిప్పటికి అమరెను నీకు
యేక పూజలు ముందర యేనుగ మెదడులు- పరిపూర్తిగా గంగ పెట్టింతు నీకు
తిమిరేటి రాజుల శిరస్సుల గొట్టి - దొరకొని నీకు తోరణాలు గట్టిస్తును
గుర్రాల బారుల కొల్లలుగా నరికి - గుట్టలు వేయిస్తును ఓగంగ నీకు
అమితముగ గావింతును ఆరగింపులు నీకు - ఆవుల పోలురాజు పగలు మాకు
అనుకూలమైతేను నరపతి శిరస్సులు గొట్టి - రాసులు పోయిస్తును ఓగంగ నీకు"

కాటమరాజు ఇలా ప్రార్థించి గంగకు చెయ్యెత్తి మొక్కుతాడు. అప్పుడు గంగ

"పగవారు దక్షిణాదిన పట్టజాలక వున్నారు - ఆ భూమిలోకి పోయి అరుదెంచి మీరు
ఆవుల మేపుక పోలురాజు పగలు సాధించి- క్షేమాన రమ్మని సెలవిచ్చెను గంగ"

గంగ దగ్గర శెలవు తీసుకొని కాటమరాజు తన ఆలమందతో నెల్లూరు సీమకు వెళ్ళి పోతాడు దీనితో ఈ కథ ముగుస్తుంది. ఈ కథ యాదవుల ఎంత గొప్పవారైన తమ కులదేవత అయిన గంగను పూజించాలని చెప్పడానికి నిర్దేశింపబడింది. గంగ వైదిక సాహిత్యంలో పరాదేవతగా భావించబడింది. విష్ణువు పాదాలనుంచి పుట్టినదిగా పరమేశ్వరుని జటాజూటంలో నిలిచి పరమేశ్వరునితో సమానంగా, శివుని భార్యగా పూజింపబడింది. గంగ జలాది దేవతగా కూడా భారతీయ సాహిత్యంలో పూజింప బడింది. ఇలాంటి గంగ యాదవుల కులదైవంగా పూజింపబడుతూ ఉంది.

## కొమ్ములవారి కథలు - సాహిత్యాంశాలు :

గొల్లసుద్దులవారి లాగా కొమ్ములవారు కూడా కాటమరాజు కథలను చెబుతారు. వీరు కాటమరాజు కథల్లో భట్టురాబారం, బీర్నీడుయుద్ధం, భక్తిరన్నకథ, కాటమరాజు యుద్ధం మొదలైన కథలను చెబుతారు. వీటిలో భట్టురాయబారం కథను పరిశీలించుదాం!.

**భట్టురాయబారం :** కాటమరాజు నెల్లూరును పాలించిన నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం చేసుకొని తన ఆలమందను కొంతకాలం నెల్లూరు రాజ్యంలో మేపి పుల్లరి చెల్లించకుండా తన ఆలమందను మళ్లించుకొని ఎఱ్రగడ్డపాడుకు వచ్చి విడిది చేసి ఉంటాడు. సిద్ధిరాజు 'రాయశృంగావళి' అనే బ్రాహ్మణుని పుల్లరిని ఇవ్వవలసిందిగా కోరుతూ కాటమరాజు దగ్గరకి రాయబారిగా పంపిస్తాడు. అతడు కాటమరాజు సభకు వచ్చి పుల్లరిని చెల్లింపుమని కాటమరాజును కోరతాడు. అతనికి సమాధానం చెప్పడానికి కాటమరాజు 'కొమార బంగారం' అనే తన భట్టును రప్పిస్తాడు. ఈ ఇరువురు భట్లు తమతమ ఏలికల పక్షాన కాటమరాజు కొలువులో సంభాషించడం ఈ కథాగేయం లోని ఇతివృత్తం. ఇందులో ఒక భట్టు మాట్లాడిన తర్వాత ఇంకొక భట్టు మాట్లాడతాడు. ఇద్దరి భట్టులు తమ మాటల్లో తమ ఏలికను గురించి, అతని బలసంపద గురించి వీరావేశంతో గొప్పలు చెప్పుకుంటారు. ఒకరు చెప్పుకొన్న గొప్ప మరొకరికి కోపాన్ని తెప్పిస్తుంది. ఈ ఇద్దరి భట్టుల సంభాషణలో ఎన్నో సామెతలు, పలుకుబడులు, జాతీయాలు ప్రయోగింపబడ్డాయి. చివరకు రాయశృంగావళి కోపంగా –

"దబ్బర కాదు మాధనమును నిపుడు – గొల్ల వంకర బుద్ధి గొబ్బున మాని
చెల్లించుమీ రాజ! చెడిపోకమీరు"

అని కాటమరాజుతో అంటాడు. ఆ మాటతో కాటమరాజు ఉగ్రుడై అతణ్ణి చంపబోతాడు. పద్మనాయుడు కాటమరాజును శాంతింపజేసి రాయశృంగావళికి బహుమానాలిచ్చి పంపిస్తాడు. యాదవుల భట్టు తమ వీరులందరూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నారనీ, సిద్ధి రాజును దండెత్తి రమ్మనుమని రాయశృంగావళికి చెబుతాడు. రాయశృంగావళి నెల్లూరుకు వెళ్ళిపోతాడు. క్లుప్తంగా భట్టు రాయబారంలోని కథ ఇది.

నెల్లూరు రాజు యాదవుల ఆవులు మేయడానికి కొంత బంజరు భూమిని వదిలారట. కానీ యాదవుల గోవులు పంట పొలాలను, తోటలను మేశాయట. రాచ పరివారం హెచ్చరించినప్పటికీ యాదవులు వినలేదని రాయశృంగావళి తమ రాజ్యంలో యాదవులు చేసిన దుడుకుతనాన్ని ఇలా చెబుతున్నాడు.

"బొడ్డుగల కోడెలన్నీ నాభూనాథునకు యిచ్చేమంటిరి– నీరున పుట్టిన పూరెల్ల వాడితేనేమి
మావాసి తప్పుట మందలావుల చేత – తోటఫలములు అన్ని తొక్కించి మేపితిరి
వనములు నుగ్గాడి వరిచేలు మేపితిరి – కోటలు గాలించి కొల్లజేసితిరి
నిండిన పాకనాడు నిర్మూలములు చేసి – పండిన వరిచేలు పాలు జొచ్చితిరి
కడిచేరి వుణ్ణంగ కానికె కోడెలు – ఆడగ వస్తే మమ్ము అదలించి వైచితిరి"



నెల్లూరు రాజులు గడ్డి భూములను యాదవులకు కౌలుకు ఇచ్చి ఆలమందలను బంధించి తప్పుచేశారని కొమార బంగారం చెబుతాడు.

"తమ్ములు సిద్ధిరాజు ధర్మంబు దప్పె – నందవాడ చెరువుకు మాయావులు నీళ్ళకు రాగాను
మందావు వేయించె మనుమ సిద్ధిరాజు – కవులు యిచ్చి తప్పిన ఖలచిత్తు మోము
కనుగొన దోషంబు కలలోననైన"

అంతేగాకుండా నెల్లూరు రాజులు బోయ నాయకులచేత యాదవుల ఆల మందను చంపించారు. ఆ విషయాన్ని కుమార బంగారం సిద్ధిరాజు భట్టుకు ఇలా చెబుతాడు.

"పొడిచిరి యెడ్లు బోయ నాయకులు – పొద్దుబోయి పాలేలకు పొర్లిపోతాను
యేపెలు అండగొని యెద్దులు వేసిరి – కానుగ లండగొని కవులావుల వేసిరి
పోట్లు దాకిన యెడ్లు పడ పొల్లాడ – గడగిరి కోలలు గజనారసములు
ఘనమైన యెద్దులకు కందనములు నాటి".

ఈ విషయాన్ని యాదవులు సిద్ధిరాజుకు చెప్పగా అతడు దాన్ని తేలికగా తీసుకున్నాడట. ఈ విధంగా యుద్ధానికి దారితీసిన పరిస్థితులు కొన్ని చెప్పబడ్డాయి.

ఈ కథాగేయంలో గొప్ప కవితా చమత్కారాలున్నాయి. కొమార బంగారం యాదవ వీరుల పరాక్రమాన్ని ప్రశంసిస్తూ వారిని పాండవులతో పోల్చి ఇలా చెబుతాడు.

"యవ్వరని చూచితివి యాదవ వరుల?– వివరించి చెప్పేను వినవోయి భట్ట!
ద్వాపర మేలేటి ధర్మసేనుండు – ఆపద బాంధవుడు ఆ పల్లికొండ
పల్లికొండ యాదవుల బ్రహ్మాది ముఖుడు– భీమ బలసేనుండు బిరుదు వీరుండు
సార బలశాలి ఆ చట్టువారి యఱ్ఱయ్య – అమిత పరాక్రముడు అర్జునుండు జనియించె
రేచర్లగోత్రుండు రణశూరుడతడు – పద్మనాయుడు భోగభాగ్యాల పంట
సకల విద్యాకళా సత్కీర్తి ఘనుడు – నకులుండు నాచకూళ్ళ నాయుండు చూడ
సహదేవు డాతడు సాత్విక గుణుడు – భూదాన సేనుండు పుత్తమరాజు
యేవురు పాండవులే యాదవులును – వేడుక యరగడ్డపాడు కురుభూమి
వీరులు తిరుమందులు వినుత సాహసులు"

పల్లికొండ ధర్మరాజులాంటివాడు, చట్టువారి యఱ్ఱయ్య భీముడు. పద్మరాగవుడు రణ శూరుడైన అర్జునుడు. నాచకూళ్ళనాయుడు నకులునిలాగ సకల విద్యాకళా సత్కీర్తి ఘనుడు, పుత్తమరాజు సహదేవునిలాంటి సాత్వికగుణుడు. ఈ విధంగా కాటమరాజు బంధుగణాన్ని పాండవులతో పోల్చి వారి గుణగణాలను చెప్పడం ఔచిత్య వంతంగా ఉంది.

కాటమరాజు సామాన్య మానవుడు కాదనీ, అతడు దశావతారాలను ఎత్తిన విష్ణు స్వరూపుడనీ భట్టు కాటమరాజును ప్రశంశించిన విధం ఇది.

"చతుర్వేదములకై సాగరంబులను - వెదకి సోమకుని జంపి వక రూపమునను
చక్కగా రాక్షసుని చంపి కొమ్మునను - వుర్వి తానిలిపెను వకరూపమునను
కనక కశ్యపునిదే కడుపు వ్రయ్యలుగ - వనర నఖముల జీరె వకరూపమునను
అల వామనుండై అడుగులు గొల్చి - బలి చక్రవర్తిని పరిచె నొక్కటను
వాడక క్షత్రియులు వైనాన నరికి - గండ్ర గొడ్డంటను కార్తవీర్యుణ్ణి
వొండొండె ద్రుంచెను వక రూపమును - జగమేలు ఆ రామచంద్రుడై పుట్టి
వొగి రావణుని జంపె వొక రూపమునను"

అంతేగాకుండా కాటమరాజు వంశం వారిని శ్రీరాముడు అతని తమ్ములతోనూ సిద్ధిరాజును రావణాసురునితోనూ, అతని నెల్లూరును లంకతోను ఉపమించిన విధానమ చక్కగా ఉంది.

"ఆ రీతి మిము జంప అఖిల లోకము లెరుగ- మారాజు జనియించె మరి సాహసమున
సీతాపతియైన శ్రీరామచంద్రుడు - యీతడే ధరమీద యెంచి చూచినను
యితనికి సహోదరుండు యినవంశకుల తిలకు- ఆదిశేషుడె లక్ష్మణుడు అతడు యరనన్న
దశరథరాజేంద్ర తనయుడు భరతుడు- అసమాన ఘనుండు అయితమరాజు
సుమిత్రామహాదేవికి సుతుడు శత్రుఘ్నుండు-రమణతో కరియావుల రాజశేఖరుడు
భరతుండేలిన అయోధ్య పట్టణము దొనకొండ- వరుసతో శృంగార వనము పూదోట
అంబెట్ల పెద్దమల ఆరుట్లకోన - పశువులున్న కోన పరుణసాల
అరుదుగా అలయించు ఆ మాయమృగము- ఘనముగ మీ భూమి పశువుల మేపు
చరకూరి జగడమే సీతామహాదేవి - చరగొంపోయిన రావణుడె మీ సిద్ధిరాజు
కవులెల్ల వెదకంగ కానలో జాడ - చెప్పిన అంపుదురె శిలావంతులు
గడినుండు పాలేరు గంభీర వార్ధి - పుడమి ఆ రావణు పురము మేమి పురము?
భూనాథు క్షేమము పుల్లరిమాట - జానకి ముద్రిక చప్పిన వెల్ల
యిచ్చిన పత్రాలె యిల రాముముద్ర - వచ్చిన కంపటి వాయుసుతుండు
పచ్చ రెక్కల చిలుక .... లంక యిండ్లు- పక్షి నేసిన బాణమే పవనజు వాలు
పదిలమౌ నెల్లూరు పట్టణము లంక - తుద రావణుడు సిద్ధి త్రుంగ యరగడ్డ
ఆ రాత్రి చంపుదుము అందర మిమ్ము - వదరక పలుమారు వసుధేశునెదుట
కదలి రమ్మను భట్ట! మీ కలవారి నెల్ల"

కాటమరాజు శ్రీరామచంద్రుడు. యరనన్న ఆదిశేషువుడైన లక్ష్మణుడు. అయితమరాజు భరతుడు, కరియావులరాజు శత్రుఘ్నుడు, యాదవుల నివాసమైన దొనకొండ అయోధ్యా పట్టణం, గోగణాన్ని చంపించి పాపాన్ని మూట గట్టుకొన్న సిద్ధిరాజు రావణుడు, నెల్లూరు పట్టణం లంక. ఈ విధంగా ఈ కథలో పాత్రలను,



సంఘటనలనూ రామాయణ పాత్రలకు, సంఘటనలకు అన్వయించి చెప్పే వర్ణనా వైచిత్రి ప్రశంసింప దగినది.

ఇలాంటి వర్ణనలతోపాటు సజీవంగా ఉన్న తెలుగు సామెతలను మనోహరంగా ప్రయోగించిన జానపదకవి ప్రజ్ఞ అనితరసాధ్యమైనది. రాయశృంగావళి సిద్ధిరాజు సైన్య బలాన్ని ప్రశంసిస్తూ యాదవుల బలాన్ని కొంచెం చేస్తూ చెప్పిన ఈ కింది గేయభాగంలో సామెతలు, పలుకుబడులు, నుడికారాలు సమయోచితంగా ప్రయోగించబడ్డాయి.

"యేకులతో బాకులు యెంత చేసినను - నాటనోపునా అవి నలియును గాక
పచ్చిపాలను ద్రాగి పశువుల గాచి - మచ్చరింతురు వారు మదమచ్చరమున
పేదవాని కోపము పెదవుల తీట - చేతగానిది యేమి చేయంగ గలడు
పూని దీపము చూచా పూనకము లెల్ల - మలుప వచ్చి అది యందు మలగునా యెట్లు
కోపించు నీ మంద గోపాలులెల్ల - చావక పోదురే సమరంబులోన
కదనంబు కేగిన కాటిగుర్రాలు - చదరక జగడంబు చేయంగ గలవె?
పెరుగు పాలును త్రాగి పెద్ద బాకులను - కావళ్లు మ్రోయంగ కదలేక పెరిగి
బొర్రలు పెంచుక బోగువలెనుండు - నర్ర మానిసులెల్ల ననిసేయ గలరె?
యంత గాత్రంబైన యెద్దుల పౌజు - దంతి ఘటతోడ వృద్ధతి పోరగలదె?
నర్రావుల కదుపు నాణ్యంబె యైన - గుర్రపు పౌజుతో కూడంగ గలవె?
యాదవ సైనికులు యెందరేగాని - నెల్లూరి సాహసులు నెదిరించ గలరె?
పొడవుగాగను చెప్పి పొగడేవు సారె - యేమిటికి పొడవులు యెంచి చూసినను
బూరుగు తానెంత పొడుగు పెరిగినను - చందనముతో నది సరితూగ గలదె?
యలమి జీలుగు చెట్టు అదెంత లావైన - అలమేడకంబాల నాచంగ గలదె?
పాములు బారలు పది నూరులైన - విష్ణు వాహనముతో వివరించగలవె?
యలమి దూదికొండలు యెంత ఘనమైన - అనలంబు వకయంత అణపంగ గలవె?
మదియించి యున్నట్టి మత్తేభములును - పొదలి సింహము కూడి పోరంగ గలవె?
అరుదైన నీమంద ఆవులెంతైన - పరికింప బెబ్బులి పట్టంగ గలవె?
వద్ద నుండేటి వారల బలిమికి - కచ్చి చెప్పుకునేవు ఘనత మీరంగ
వూరక యుండంగ వుబుసు పోదేమొ - వారిని పొగడుదుగాకు వద్దన నేల?"

పై గేయభాగంలో -

1. ఏకులతో బాకులు చేయుట
2. పేదవాని కోపము పెదవుల తీట
3. బూరుగు తానెంత పెరిగినను

చందనముతో నది సరి తూగ గలదె

4. ఎలమి జీలుగు చెట్టు అదెంత లావైన
అలమేడ కంబాల నాచంగ గలదె?

5. పాముల బారలు పది నూరులైన
విష్ణు వాహనముతో వివదించలవె?

6. ఎలిమి దూది కొండలు ఎంత ఘనమైన
అనలంబు వకయంత అణపంగ గలవె?

7. మదియించి యున్నట్టి మత్తేభములును
పొదలి సింహము కూడి పోరంగ గలవె?

8. అరుదైన నీమంద ఆవులెంతైన
పరికింప బెబ్బులిపట్టంగ గలవె?

మొదలైన సామెతలు, నుడికారాలతో నడిచిన ఈ కథాగేయ ఖండిక జానపద సాహిత్యానికి అలంకారప్రాయంగా ఉంది.

తర్వాత కథలో "కాటమరాజు ఛప్పన్న దేశములను జయించిన మహావీరుడని కొమార బంగారం చెప్పుట" అనే శీర్షికతో నడచిన గేయభాగంలో ఉత్తర కాంభోజం, కొంకణం, కళింగం, ద్రావిడం, మాగధం, మాళవం, ఘూర్జరం, నేపాళం, సింధు, కాశ్మీరం, పుళిందం, చాళుక్య చోడ భూములు, అంగవంగ భూములు, పాండ్య సౌవీర దేశాలు, కోసల, కిరాత కుంతలాలు, శూరసేన మొదలైన ప్రాంతాలను కాటమరాజు జయించి నట్లుగా భట్టుధోరణిలో రమణీయంగా వర్ణించబడింది.

ఈ భట్టురాయబారం కథ కేవలం నలభైమూడు పుటల్లో చెప్పబడింది. కానీ కవితా సౌందర్యంలో, కావ్య విశిష్టతలో ఇది జానపద సాహిత్యంలోనే ఉత్తమమైనదిగా పరిగణింపదగినది.

భట్టు అంటే పొగిడేవాడు. భట్టుల సామర్థం భట్టులకే తెలుస్తుంది. లేని దాన్ని భట్టు కల్పించగలడని రాయశృంగావళి, కొమార బంగారాన్ని హేళన చేయడం లోని చమత్కారాన్ని ఈ కింది గేయఖండికలో గమనించవచ్చు.

"అవునోయి యాదవ అవనీశు భట్ట! - కవితకు పోషణము కలదు మీవల్ల
యేనుగు వక కొంత యెదిరి పొడిచినను - యీవలావల దూరి యేగ నేర్పిరివి
కాసొకటీయగ కల్లలు నాటి - యీగి కర్ణుండని యెంచ నేర్పరివి
అప్పులతో ఆట లాడేటి నాడి - అతడు కుబేరు డంచనగ నేర్పరివి
గంధంబు కస్తూరి అందనివాని - చందనంబే యని చెప్ప నేర్పరివి



తంగేడు పూవొకటి తలనిడనివాని - వాసవ భోగని వదర నేర్పరివి
పందె మొక్కటి గాని పట్టనివాని - ఆ సహాయ శూరుడంచనగ నేర్పరివి
యన్నడు సుఖమనుట యెరుగని వాని - దేవతాసఖుడని తెలుప నేర్పరివి
శ్రీలతో చెలిమిని చేయనివాని - అల మన్మధుండని అనగ నేర్పరివి
పలుకు రూపెరుగని పనికిమాలిన వాని - వాల్మీకుడని గొప్ప పలుక నేర్పరివి
బ్రహ్మేయవని వచ్చి పాడని వాని - తుంబురుతో తులదూప నేర్పరివి"

భట్టులనాడిని పట్టగలిగిన ఈ యాదవ జానపదకవి భట్టులను చిత్రించినట్లుగా మరి యే ఇతర కవి చిత్రించలేదు. భట్టు అబద్ధమాడతాడు అనే దానికి బదులుగా "కవితకు పోషణము కలదు మీ వల్ల" అని చమత్కరించడంలోనే కవి గొప్పతనం ఉంది. ఒక కాసు కూడా దానమీయనివాణ్ణి కర్ణుడని వర్ణించడం భట్టుకే తగుతుందట. అప్పులతో పబ్బం గుడపుకొనేవాణ్ణి కుబేరునిగా వర్ణించడం భట్టుకే సాధ్యమవుతుంది. అక్షరజ్ఞానం లేనివాణ్ణి కూడా కవికుల గురువైన కాళిదాసు అని ప్రశంసించడం భట్టు గొప్పతనమట. ఈ విధంగా సుదీర్ఘంగా నడచిన భట్టు గుణవర్ణన మరెక్కడా కన్పించదు.

కాటమరాజు పరాక్రమాన్ని వింటే వివిధ దేశాలు ఏ విధంగా గజగజలాలడెవో కవి రమణీయంగా ఇలా తెలిపాడు.

"డాకతో మారాజు టముకు సేయంగ - దక్షిణ దేశంబు తల్లడంబందె
పాకనాడు చెదరె పలినాడు వణకె - గౌడ దేశంబెల్ల కళవళ మందె
ములికి నాడంతయు వులికిపడె నాడు - కాకినాడంతయు కాకి పాలాయె
కంచి భయంబందె కటకము జడిసె - గుత్తి రాజులకెల్ల గుండె దిగులాయె
చంద్రగిరి రాజులకు చింత ఘనమాయ - ఆదోని రాజులకు మోదంబు దప్పె
ధేనుకొండ రాజు పెద్దరికము లుడిగె"

యుద్ధం చాల ప్రమాదకరమైనదనీ, ఇరుపక్షాల వారినీ అది నాశనం చేస్తుందనీ చెప్పే ఈ కింది వాక్యాలు జానపదకవి కవితా సామర్థ్యానికి నిదర్శనాలు.

"అలనాడు సాముసేయగ యాదవులతో - కొలువ నున్నట్లు కాదు కయ్యంబు
బలిమి పీనుగులై రిపులు సమసినపుడు - కలహ మాడిన యట్లు కాదు కయ్యంబు
అన్నదమ్ముల రాజ్యము అది క్రుంగద్రొక్కి- ఘనత నెక్కినయట్లు కాదు కయ్యంబు
తలపొలములో బెదరి నిలబడ్డ గోవు - కలవిలుచుకున్నట్లు కాదు కయ్యంబు
ఆవుల కాపరివి అటు పాలు నీళ్లు - కలిపి త్రాగినయట్లు కాదు కయ్యంబు
ముర్రుపాలును జున్నుముద్దలు మెసవి - గర్రున త్రేపుట కాదు కయ్యంబు
చేసిన వెన్నల సెగ పొంత కాచి - కాసున కమ్ముట కాదు కయ్యంబు

గోవులావుల పాలకుండల నించి - కావళ్ళు మోయుట కాదు కయ్యంబు
పశువుల తోడ్కొని పోయి భూములను - కసవు మేపినయట్లు కాదు కయ్యంబు
బాస పత్రాలిచ్చి పండిన చేలు - గాసిపుచ్చినయట్లు కాదు కయ్యంబు
అడవుల కొండల ఆవుల మేపి - గడిసేరి యన్నట్లు కాదు కయ్యంబు
సిద్ధిరాజుల భూమి చెలరేగి మేపి - గద్దించి పడునట్లు కాదు కయ్యంబు"

పై గేయంలో సిద్ధిరాజు భట్టు రామశృంగావళి యాదవులు చేసే గోపాలనలోని అనేక పనులను యుద్ధంతో పోలుస్తూ యుద్ధమంటే అంత సులభమైంది కాదని మనోహరంగా చెప్పాడు.

సిద్ధిరాజు భట్టు పదేపదే యాదవులను గొల్ల అని కించ పరుస్తూ ఉంటే యాదవుల భట్టు సహించలేక ఈకింది విధంగా గొల్లల గొప్పతనాన్ని చెప్పాడు.

"మాటమాటకు గొల్ల గొల్లడనియేవు - ముదముగా యీభూమి మోసెను గొల్ల
తరికొండ లాగంగ త్రాడాయె గొల్ల - సాగరము రెక్కల చల్లెను గొల్ల
వేడుక వ్రేపల్లె వెలదుల గూడి - కొల్లలాడిన వాడు గొల్లతడు కాడ?
కన్నులు తెరువని చిన్న బాలుండై - కోపించి శకటంబు కూల్చెను గొల్ల
ముద్దుల బాలుడై మూడవ నెలను - దానవి చనుబాలు త్రాగెను గొల్ల
యాదాది కుర్రడై యిల తృణావర్త - మెడబట్టుకొని వాని మృతిచేసె గొల్ల
తల్లి వెన్నలకునై తను రోలగట్ట - కొమరుడై ముద్దులు కూలంగ యీడ్చె
ముద్దు గోపాలుడు మూరితి గొల్ల - వత్సుని జంపిన వాడును గొల్ల
శబలుడై ఖరదైత్యు చంపెను గొల్ల - యితడు సామాన్యుడే యెంచి చూడంగ
బ్రహ్మదేవుడు గొల్ల పశుపతి గొల్ల - బ్రహ్మను కన్న శ్రీపతియు గొల్ల
పావన రుద్రుడు యేర్పాటైన గొల్ల - దేవేంద్రుడును గొల్ల దివిజులు గొల్ల
భావింప రుద్రుడు పరగంగ గొల్ల - మా కులమున బుట్టె మదనగురుండు
మా కులంబున పుట్టె మరియు సూర్యుండు- మా కులంబున బుట్టె మరియు చంద్రుండు
మా కులంబున బుట్టె మౌని గణంబు- మా కులంబున బుట్టె మరియెక్కువేది?"

పై గేయంలో బ్రహ్మదేవుడు గొల్ల, పశుపతి గొల్ల, విష్ణువు గొల్ల, దేవేంద్రుడు గొల్ల, దేవతలు గొల్ల, సూర్యుడు, చంద్రుడు, మునిగణాలు గొల్ల కులంలో పుట్టారని చెప్పబడింది. ఇక్కడ గొల్ల శబ్దం పరబ్రహ్మ అనే అర్థంలో వాడబడింది. 'గో' అనే మాట భూమికి పర్యాయపదం లేక విశ్వానికి పర్యాయ పదం. అలాంటి విశ్వావా చకమైన గోఃను పాలించే విశ్వనాథుడు గోపాలుడు. అతని వంశం గోపాలవంశం లేక గొల్లవంశం.

పై జానపద కవి వాక్యాలకు భాగవతంలో పోతన రాసిన కింది పద్యం



ఆధారమని చెప్పవచ్చు.

ఆ॥ "గొల్లవారి బ్రతుకు గొఱంతన వచ్చునే
గొల్లరీతి ఁబాలకుప్ప ఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
చేటులేని మందు సిరియు ఁగనిరి"
(ఆంధ్ర మహాభాగవతం, అష్టమ స్కంధము - 207 వ పద్యం)

## పొడపోతులవారి కథలు - సాహిత్యాంశాలు :

పొడపోతులవారు భక్తుదన్న కథ, బొల్లావు కథ, పాపనూక వలపోత కథ, ఆవులమేపు కథ, కాటమరాజుకు పట్నం కట్టిన కథ, పోలురాజు కథ మొదలైన కథలను చెబుతారు. వీటిలో కొన్నింటిని పరిశీలించుదాం.

**భక్తుదన్నకథ** : ఇతని పేరు మామూలుగా భక్తిరన్నడు. తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథల్లో ఇతని పేరు భక్తిరన్నడు అనే ఉంది. కాటమరాజు కథలను చెప్పే గాథాకారులు ఇతణ్ణి బత్తుడు, బత్తుదన్న, బత్తినన్న, బక్తుడు, బక్తుదన్న మొదలైన పేర్లతో పిలుస్తారు. భక్తుదన్న కథను నేను పొడపోతుల కళాకారుడైన గంటా అప్పారావుగారి నుంచి సేకరించాను. అప్పారావుగారు విజయనగరం జిల్లా గజపతినగరం మండలం మరుపల్లి గ్రామ వాస్తవ్యులు. వీరు గంటా సత్యం గారి కుమారులు. వీరి వయస్సు 29 సంవత్సరాలు. వీరు ఆరవ తరగతి వరకు చదువుకున్నారు. ఐనప్పటికీ కాటమ రాజు కథల్లో చాల వాటిని ధారాళంగా పాడగల సమర్థులు. వీరు చెప్పే కథలో టైమ్, టెస్టింగ్ లాంటి ఆంగ్లపదాలు దొర్లాయి. వీరినుంచి నేను బొల్లావు పుట్టుక కథను గూడా సేకరించాను. పొడపోతులవారు చెప్పే భక్తుని కథలో భక్తుడు సిరిదేవి గర్భ వాసాన పుట్టినవాడు కాదు. ఇతడు శ్రీశైలం మల్లికార్జునుని వరంతో ఆయోనిజుడుగా జన్మిస్తాడు. వీరు చెప్పే కథ ఇది.

వలురాజు భార్య అయిన వలమ్రీదేవి వృద్ధురాలై చనిపోవడానికి సిద్ధంగా ఉన్నప్పుడు తన చిన్నకోడలూ, పోలురాజు భార్య అయిన సిరిదేవిని పిలిచి తాను కోటి నోములకు ఒకే ఒక నోము తక్కువగా నోచానని, శ్రీశైలంలో మల్లిఖార్జునుని పూజ ఒక్కటే చేయలేక

పోయానని, తాను చేయలేని పూజను ఎలాగైనా సిరిదేవి చేయాలని, అలా చేస్తే ఆమెకు శివుని వరంవల్ల మూడవకుమారుడు కలుగుతాడని చెబుతుంది. సిరిదేవికి అప్పటికే ఐతమరాజు, ముమ్మయ్య అనే ఇద్దరు కుమారులుంటారు. ఈమె

గొప్ప శివభక్తురాలు, ఈమె

"చల్లాపిడతలో అన్నమొండి సదా కోటిజంగాలకు

సంతర్పణ చేసిన పతివ్రత సిరిదేవి

ములవకాయ గడిలో అన్నమొండి ముక్కోటి దేవుతులికి

సంతర్పణ చేసిన పతివ్రతా శిరోమణి సిరిదేవి"

వలమ్రీదేవి చెప్పినట్లుగానే సిరిదేవి శ్రీశైలానికి వెళ్ళి మల్లికార్జున స్వామి పూజ చేస్తుంది. స్వామి ఆమె పూజకు మెచ్చి మూడు మల్లెపువ్వులు ఆమె కొంగులో వేస్తాడు. వెంటనే ఆమూడు మల్లెపువ్వులు ఒక చిన్నబాలుడుగా మారిపోతాయి. ఆబాలునికి పుట్టు రూపులే గానీ పెట్టురూపులు లేవట. ఆబాలుడు పుట్టుకతోటే

"ఒల్లెల్ల లింగాలె ఒప్పైన జడలూ- తలయల్ల లింగాలూ తమ్మిలకు జోడు

కైపీర్నములు కాయవస్త్రములు- ఏదుమంత శెంకు పందుమంత గంట

గానుగ రోకలంత గజాశూలమున్నూ- మునుకుది పుట్టుమచ్చ మునులెల్ల మెచ్చ

వలపుల పుట్టుమచ్చ వర్దరాజులు మెచ్చ- అరికాలున పుట్టుమచ్చ అన్నివర్ణములు మెచ్చ

ఇటువంటి రూపాలతోని ఘనుడు భక్తుడన్నా జననమైనాడా"

మల్లికార్జున స్వామి వరం వల్ల పుట్టిన ఆబాలుడు పుట్టుకతోటే శివలింగాలతో, కాషాయ వస్త్రాలతో, శెంకు గంటలతో, త్రిశూలంతో జంగమరూపంలో జన్మించాడట.

సిరిదేవి ఆబాలుణ్ణి దనుముకొండకు తెచ్చి అల్లారుముద్దుగా పెంచుకుంటూ ఉంటుంది. ఆవుల దగ్గర ఉన్న పోలురాజుకు ఈసంగతులేవీ తెలియవు. యాదవులకు గురువు పల్లికొండ. అతను దివ్యదృష్టి కలవాడు. దనుముకొండలో సిరిదేవి కుమారుని సంపాదించిన విషయం అతను తెలుసుకొని దనుముకొండకు వస్తాడు. ఆతను రావడాన్ని జానపద కవి

"ఆయావు చాటున ఆలేగ చాటున - ఆదూడ చాటున తిన్నగా బైలుదేరి

దనుముకొండలోనికి ప్రవేసించినాడా "

అని చెప్పాడు. పల్లికొండ మాత్రమే కాదు ఆవులను కాసేవారు ఎవరైనా ఆవుల దగ్గరి నుంచి వేరే ఊరికి బయలు దేరినా, ఊరి నుంచి ఆవుల దగ్గరికి బయలుదేరినా పైవిధం గానే ఈకథాగేయంలో జానపదకవి చెప్పాడు. ఇది ఈకథాగేయంలోని వారానువర్తనం.

పల్లికొండ దనుముకొండకు వచ్చి ఊయల్లో ఉన్న బాలుణ్ణి చూచి ఆబాలు డెవరని అత్త సిరిదేవిని ప్రశ్నిస్తాడు. దానికి సిరిదేవి ఆబాలుడు తన కొడుకేనని చెబుతుంది. దానికి పల్లికొండ పోలురాజు ఆలమందలో ఉంటే ఆమెకు కొడుకు ఎలా పుట్టాడని అడుగుతాడు. దానికి ఆమె ఆఅబ్బాయి ఎలా పుట్టింది పల్లికొండకు తెలుసునని, తెలిసుండి కూడా మళ్ళీ అడగడం బాగా లేదని చెబుతుంది. దానికి పల్లికొండ కూడా అంగీకరించి సిరిదేవి పాతివ్రత్యాన్ని పరీక్షించదలచి (ఇక్కడ " టెస్టింగ్ చేయాల"నే పదాన్ని కథకుడు ఉపయోగించారు.) ఆలమందకు వెళ్ళి పోలురాజుతోటి

"గాలి లేకుండా మేగం ఒడ్డింది - మేగం లేకుంటా వర్షం కురిసింది

విత్తనం లేకుంటా పంట పండిందయ్యో - నీవు లేని పట్నవాసం దనుముకొండలో

మాయత్తా సిరిదేవి కొడుకును కన్నాదో "

అని చెబుతాడు. ఆమాటలు విన్న పోలురాజు కోపంతో

"వాడికి లేని దివానానికి వాడికి తెచ్చిందే సిరిదేవి

మచ్చలేని గోత్రానికి మచ్చ తెచ్చిందే సిరిదేవి

అని కోపంతో పలుకుతాడు. అతని కోపాన్ని జానపద కవి

"నీలార కళ్ళకే నిండే కోపాలు - ఎర్రనీ కళ్ళకు ఎత్తె కోపాలు

అప్పుడొచ్చిన కోపము ఆంతింత కాదా"

అని వర్ణించాడు. ఈకోపవర్ణన కథాగేయాల్లో సాధారణంగా కనిపించే వారాను వర్తనం. పోలురాజు తన చంద్రాయుధాన్ని పాలు పోసి నూరి సిరిదేవిని చంపడానికి దనుము కొండకు వచ్చి ఆమెను చంపడానికి కత్తితో వేస్తాడు. ఐతే అది తప్పిపోతుంది. రెండవ సారి మళ్ళీ వేస్తాడు. కత్తి వంకర పోతుంది. పోలురాజు వంకర తీసి మూడవ సారి మళ్ళీ వేస్తాడు. ఆకత్తి సిరిదేవి మెడలో పూలదండగా మారిపోతుంది. అప్పటి పోలురాజు నిస్సహాయతను జానపదకవి ఇలా వర్ణించాడు.

"నడుము నక్కున విరిగి నలుగండ్లు చెదరి - చిచ్చులు మిడుతలు శోకించునట్లు

బోనులో కుందేలు చిక్కు చందమున- ఒడ్డిరిగి రుచ్చుము గెద్ద పడినట్లు

ఓడివోడుకోని ఒవ్వారికోని - ఈకంటి కన్నీరు ఆకంట పోసి

ఆకంట కన్నీరు ఈకంట పోసి - వలవలా కన్నీరు జలజలా వంపి

వగచీ దుక్కించి ఆరాజు పోలురాజు-ఆలమందలోనికయ్యో ప్రయాణం గట్టినాడా"

మనకు ఎవరిమీదనైనా తీవ్రమైన కోపం వస్తే వారిని చంపే ప్రయత్నం చేస్తాం. ఎన్ని సార్లు కత్తితో నరికినా ఆవ్యక్తి చావకపోతే అయ్యో నాకోపాన్ని తీర్చు కోలేక పోతినే అని ఆవ్యక్తి నిస్సహాయుడై దు:ఖిస్తాడు. ఆపరిస్థితిని జానపదకవి పోలురాజు విషయంలో చాల సహజంగా చెప్పాడు.

పోలురాజు ఆలమంద దగ్గరకు వచ్చి యాదవుల గురువైన పల్లికొండకు విషయమంతా చెబుతాడు. అప్పుడు పల్లికొండ తన అత్త సిరిదేవి మహాపతివ్రత అని ఆమెకు శ్రీశైలం మల్లికార్జునుని వరం వల్ల బాలుడు జన్మించాడని, అందువల్లనే ఆమె

పోలురాజు చేతిలో చనిపోలేదని, ఆమె చనిపోకపోయినా ఆమెను చంపే ప్రయత్నం చేసిన పోలురాజుకు స్త్రీహత్యా దోషం చుట్టుకుందని చెబుతాడు. అప్పుడు పోలురాజు

"ఓరల్లుడా పల్లికొండా ఆలవారి గురువివి
ఉన్నూరి ముచ్చట్లు కొన్నూరు చెప్పిన వాడివి
కొన్నూరు ముచ్చట్లు ఉన్నూరు చెప్పినవాడివి
తినకుండా రుచి సొరకుండా లోతూ
గర్భములోనిది స్త్రీపిండమో పురుషపిండమో
అరికట్టి చెప్పిన ఆలవారి గురువివి
పచ్చ పోసిన దండ పరమాత్ముడు పల్లికొండవి
నల్లపూసలదండ నారాయనుడు పల్లికొండవి
ఎఱ్ఱపూసలదండ ఏలాంతర పల్లికొండవు"

అని పల్లికొండను ప్రశంసిస్తాడు. పల్లికొండను గురించిన ఈవిధమైన ప్రశంస ఈకథలో చాల చోట్ల వస్తుంది. ఇది ఈకథగేయంలోని వారానువర్తనం.

ఆతర్వాత పోలురాజు పల్లికొండను స్త్రీహత్యా దోషం పోయే మార్గం చెప్ప మని అడుగుతాడు. దానికి పల్లికొండ ఆదోషం పుణ్యతీర్థాలు దర్శించినా, దానదర్మాలు చేసినా పోదని, పోలురాజు అపకారం చేసింది సిరిదేవికి కాబట్టి అతను సిరిదేవి వద్దకు వెళ్ళి సిరిదేవి కుమారుడైన భక్తునికి తలవైపుకు నిలబడి సిరిదేవికి మూడు సార్లు దండం పెడితె పోతుందని చెబుతాడు. భార్య సిరిదేవికి దండం పెట్టడానికి పోలురాజు మొదట అంగీకరించడు. ఐతే దండం పెట్టకపోతే పాపం పోదని పల్లికొండ గట్టిగా చెప్పడం చేత ఒప్పుకుంటాడు. ఆతర్వాత పల్లికొండ దనుముకొండకు వెళ్ళి అత్త సిరిదేవితోటి పోలురాజు ఆమెకు దండం పెట్టి పాపం పోగొట్టుకోవడానికి వస్తున్నాడని, అతను ముందు సిరిదేవికి దండం పెడితే ఆమెకు పాపం చుట్టుకుంటుందని, అందు వల్ల పోలురాజు కనపడగానే తన కుమారుడైన బత్తుని పాదాల వైపు నిలబడి మొదట ఆమే పోలురాజుకు మూడు సార్లు దండం పెట్టాలని చెబుతాడు. పల్లికొండ చెప్పినట్లు గానే పోలురాజు సిరిదేవిలు ఇద్దరూ పరస్పరం దండం పెట్టుకుంటారు. వారిద్దరి మధ్య బాలుడైన భక్తుడు ఉండడం చేత వారు పెట్టుకున్న దండాలు ఆబాలునికి తగులుతాయి. అప్పుడు బాలుడు తాను పుట్టిన వెంటనే తల్లిదండ్రులిద్దరి చేత దండం పెట్టిచ్చుకున్న పాపాత్మున్నని, ఆపాపం పోవాలంటే తాను కాశీనామాన్ని జపిస్తూఉండాలని భావించి అప్పటి నుంచి "ఓంకాశి, ఓంకాశీ విశ్వనాథా" అని పలుకుతూ ఉంటాడు.

సిరిదేవి భక్తుణ్ణి అల్లారుముద్దుగా పెంచుతూ ఉంటుంది. ఐతే భక్తుడు మాత్రం



ఎవరితోటి ఏమీ మాట్లాడకుండా ఓంకాశి, ఓంకాశీ విశ్వనాథా అని నిత్యం కాశీ జపం చేస్తూ ఉంటాడు. ఆవిధంగా పన్నెండు సంవత్సరాలు గడుస్తాయి. ఐనప్పటికీ బత్తునిలో ఎలాంటి మార్పు రాలేదు. అప్పుడు సిరిదేవి తన కుమారుడు ఇలాగే కాశీకాశీ అంటూ కాశీకి వెళ్ళిపోతాడేమోనని భయపడి ఎలాగైనా అతని నోటి నుంచి కాశి అనే మాట రాకుండా చేయాలని భావించి, యాదవుల గురువైన పల్లికొండను పిలిపించి ఎలాగైనా బత్తుని నోట కాశి అనే మాట రాకుండా చేయమని చెబుతుంది. పల్లికొండ అలాగే చేస్తానని చెప్పి భక్తుని దగ్గరికి వెళ్ళి ఒకసారి ఆలమందను చూసి వద్దాం రమ్మని పిలుస్తాడు. పల్లికొండ యాదవుల గురువు కాబట్టి అతని మాట కాదనలేక భక్తుడు అతనితో కలిసి దనుముకొండ నుంచి ఆలమందకు బయలుదేరుతాడు.

"చీమలా దూరని చిట్టడివి దాటి -కాకులు దూరని కారడివి దాటి
గెద్దలు దూరని పెద్దడివి దాటి- పసుపు తోటలు దాటి పట్నాలు దాటి
వరుసగా పండేటి వరిపొలము దాటి - ఉలవసేలూ దాటి ఊరల్లా దాటి"

అలా కొంత దూరం వెళ్ళిన తర్వాత ఒకచోట కోనేటి గట్టున వారిద్దరు కూర్చున్నప్పుడు పల్లికొండ ఆకోనేట్లో ఒకే దగ్గర మూడు పులులు, మూడు ఆవులు నీళ్ళు తాగుతు న్నట్లుగా మాయ కల్పించి ఆవింత చూడమని భక్తునికి చెబుతాడు. దానికి భక్తుడు అది పల్లికొండ కల్పించిన మాయేనని చెప్పి ఒకే గోళంలో ఆరు పులులు, ఆరు ఆవులు కలిసి నీళ్ళు తాగుతున్నట్లుగా తాను మాయ కల్పించి ఆవింతను చూడమని పల్లికొండకు చెబుతాడు. దానితో భక్తుడు సామాన్యుడు కాదని అతని నోటనుంచి కాశీ అనే పదాన్ని తాను మానిపించలేనని తెలుసుకొని ఆలమందకు వెళ్ళకుండా వెనక్కి తిరిగి దనుము కొండకు వచ్చి భక్తుణ్ణి మార్చడం తనవల్ల కాదని సిరిదేవితో చెబుతాడు. ఐతే సిరిదేవి అందుకు అంగీకరించకుండా భక్తుడు కాశీ అనే పేరు తలవకుండా ఉండడానికి ఏదైనా ఉపాయం చెప్పమని కోరుతుంది. దానికి పల్లికొండ అందమైన అమ్మాయిని తెచ్చి పెళ్ళి చేస్తే సంసారంలో పడి భక్తుడు కాశీ మాట మానేస్తాడని చెబుతాడు.

పుట్టుకతో జంగమవేషంలో ఉన్న భక్తుడన్నకు ఎవరూ పిల్లనివ్వరని భావించిన సిరిదేవి అతనికి పుట్టుకతో వచ్చిన జంగమ వేషాన్ని తీసివేయించి "బాజాబందులు, బటువుంగరములు, బుజకీర్తులు, కరీటము" మొదలైన వాటితో చక్కని రాజకుమారుని లాగా తయారుచేసి "ముచ్చువారి" తోటి భక్తుని చిత్రపటాన్ని వేయించి ఆచిత్రపటాన్ని ఇద్దరు పురోహితులకు ఇచ్చి భక్తునికి తగిన అమ్మాయిని పెండ్లిసంబంధం మాట్లాడి రమ్మని పంపిస్తుంది.

ఈ కథవల్ల ఒక కొత్త విషయం తెలుస్తూ ఉంది. గతంలో అంటే ఈకథాగేయం

కల్పించబడినప్పుడు "ముచ్చువారు" అనే పేరు గల వారు గొప్ప చిత్రకారులుగా ఉండే వారు. వీరు మనుష్యుల చిత్రపటాలను వేసేవారు. యాదవుల్లో "ముచ్చు" ఇంటి పేరు గల వారు ప్రకాశం జిల్లాలో ఉన్నారు.

సిరిదేవి ముచ్చువారితోటి భక్తుని చిత్రపటం గీయించి పురోహితులకు ఇచ్చి పంపిస్తుంది. వారు ఊర్లు తిరిగుతూ ఒక ఊర్లో నాచకూళ్ళ తమ్మినాయుడు కూతురైన నల్లమేడ అనే పేరు గల అమ్మాయిని మాట్లాడి వస్తారు. సిరిదేవి ముహూర్తం నిర్ణయించి భక్తుని రాజకుమారుని లాగా తయారుచేసి పెళ్ళి అయ్యేవరకు కాశీ మాట అనవద్దని గట్టిగా చెప్పి పల్లకీలో కూర్చోబెట్టి సపరివారంగా, వైభవంగా దనుముకొండ నుంచి పెండ్లికూతురు ఊరికి తరలివెళ్తుంది. అక్కడ ఊరిబైట గుడారాల వేసుకొని విడిది చేస్తారు. భక్తునికి ఈపెళ్ళి ఇష్టముండదు. అందుకని విడిదిలో దిగిన వెంటనే అతడు "ఓం కాశీ విశేశ్వర" అని అనగానే రాజకుమారుని వేషం పోయి అతని పూర్వరూపం వస్తుంది. నల్లమేడ చెలికత్తెలు తమ స్నేహితురాలికి కాబోయే భర్తను చూడాలని విడిది దగ్గరకు వచ్చి పల్లకీలో జంగమవేషంతో ఉన్న భక్తుని చూచి ఆశ్చర్యపోయి ఈవిషయాన్ని నాచకూళ్ళతమ్మినాయునికి చెబుతారు. వెంటనే నాచకూళ్ళతమ్మినాయుడు వచ్చి జంగమయతి వేషంలో ఉన్న భక్తుని చూసి మోసం జరిగిందని భావించి, సిరిదేవి వద్దకు వెళ్ళి చిత్రపటంలో రాజకుమారుని లాంటి వాణ్ణి చూపించి జంగమసాధువును తెచ్చి నాకుమార్తెకు మాయపెళ్ళిచేయడానికి వచ్చావా? ఇంత మోసమా? అని ఆమెను నిందించి తన కుమార్తెను జంగమోనికి ఇవ్వనని, వెనక్కి తిరిగి వెళ్ళిపొమ్మని చెబుతాడు. ఆమాటలు విని సిరిదేవి ఎంతగానో దు ఖిస్తుంది. ఆమె దు ఖాన్ని

"తన ఈకంటి కన్నీరే యాకంట పోసి– యాకంట కన్నీరు ఈకంట బోసె
వలవలా కన్నీరు జలజలా వొంపి – వొడితి దుక్కించింది సిరిదేవిగారు
చిచ్చులు మిడుతలు శోకించునట్లు – బోనులో కుందేలు చిక్కు చందమునా
ఒడ్డిరిగి రుచ్చము గెద్ద పడినట్లు – కుమ్మరాముల యట్ల కుమిలిపోయినయట్లు
బోరునా శోకించె తల్లీ సిరిదేవి "

అని జానపదకవి వర్ణించాడు. ఈదు:ఖ వర్ణన గూడా వారానువర్తనమే. కుమారుని పెళ్ళి ఆగిపోయినందుకు సిరిదేవి దు:ఖించి ఆరోజు రాత్రి అక్కడే ఉండి మరుసటిరోజు తెల్లవారిన తర్వాత తమ ఊరికి వెళ్ళాలని నిశ్చయించుకుంటుంది. తన అంశతో పుట్టిన భక్తుడన్న పెళ్ళిఆపేసినందుకు ఈశ్వరుడు తమ్మినాయుడు మీద కోపించి, భక్తుడన్నను నల్లమేడను మాత్రమే మెలకువగా ఉంచి మిగిలిన వారందరూ నిద్రపోయేలాగా చేసి దేవతలందరి సమక్షంలో నాచకూళ్ళనాయుని ఇంటిలో ఘనంగా పెళ్ళి చేసి వధూవరు



లిద్దరినీ సిరిదేవి విడిది దగ్గర దింపి మాయమవుతాడు.

"కారుకోళ్ళు కూశాయా కదలి తెల్లారె– ఊరు కోళ్ళు కూశాయా ఉగము తెల్లారె
బానుడుదయించె బ్రమ్మనాదమాయే"

తెల్లవారిన తర్వాత తమ్మినాయుడు లేచిచూస్తే తన ఇంట్లో పసుపుకుంకాలు, పందిళ్ళు, అక్షింతలు మొదలైన పెళ్ళి జరిగిన గుర్తులను, తన కూతురు లేకపోవడం గమనించి, సిరిదేవి మోసంతో తన కుమార్తెను ఆమె కుమారునికిచ్చి పెళ్ళి చేసిందని నిశ్చయించుకొని సిరిదేవి వద్దకు వచ్చి ఇలా మోసపు పెళ్ళి చేయడం న్యాయమా? అని ఆమెను నిలదీస్తాడు. ఆమె ఆశ్చర్యపోయి తమ కులదైవమైన గంగతల్లి సాక్షిగా తనకేమీ తెలియదని చెబుతుంది. పెళ్ళిజరిగిపోయింది కాబట్టి తమ్మినాయుడు ఏమీ చేయలేక తన ఇంటికి వెళ్ళిపోతాడు. ఆగిపోయిందనుకున్న తన కుమారుని పెళ్ళి జరిగినందుకు సిరిదేవి చాల సంతోషించి కొడకును కోడలిని తీసుకొని దనుముకొండకు వచ్చి భక్తుని అతని భార్యను వేరే ఇంట్లో ఉంచుతుంది. పెళ్ళి చేసినప్పటికీ భక్తునిలో ఎలాంటి మార్పు రాదు. అతడు భార్యను పలుకరించనైనా పలకరించడు.

భక్తుడన్న పుట్టుక, వివాహానికి సంబందించిన పైకథాభాగమంతా పొడ పోతులవారు కల్పించినదే. ఈభాగం తంగిరాల ప్రచురించిన కాటమరాజుకథల్లో లేదు. జానపదసాహిత్యంలో నాయకులు గానీ, ప్రధానపాత్రలు గానీ మామూలు మనుషులు జన్మించినట్లుగా కాకుండా దేవతల వరప్రభావంతో అయోనిజులుగా జన్మించినట్లుగా చెప్పబడుతూ ఉంటుంది. తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథల్లో భక్తిరన్నడు చాల ప్రాధాన్యత గల పాత్ర. ఇతడు పోలురాజు సిరిదేవులకు ఈశ్వరాంశతో పుట్టిన వాడు. గొప్ప శివభక్తుడు. ఇతడు శ్రీశైల పర్వతంలో తపస్సు చేసుకుంటూ ఆ తర్వాత అక్కడి నుంచి ధనుమకొండకు వచ్చి పల్లికొండ సలహానుసరించి కళ్యాణపట్టణంలో పెరుగుతున్న కాటమరాజును, పాపనూకను ధనుమకొండకు తీసుకొని వస్తాడు. ఇతనికి తల్లిదండ్రులు లేని 'పాపనూక' అంటే చాల అభిమానం. పాపనూకను తన తల్లి సిరిదేవికి అప్పగించి ఆమెను ఆమె స్వంత కూతురైన అగుమంచితో సమానంగా చూడమని చెబుతాడు.

తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథల్లో ఇతనిపేరుతో భక్తిరన్నని కథ అనే కథ ఉంది. ఇది కాటమరాజు కథల్లో చివరికథ. ఈకథలో ఇతడు తరమునాటి పెద్దలకు పిండ ప్రదానం చేయాలనే ఉద్దేశ్యంతో కాశికి వెళతాడు. గయలో వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మొదలైన వల్లవులకూ వారి ప్రధానులైన తిరుమందలకూ పేరుపేరునా ఇతడు పిండాలు వదులుతూ

ఉంటాడు. అంతలో ఆశ్చర్యంగా బాలరాజులైన ముమ్మయ్య, పోచయ్యలు పిండాల కోసం చేతులు చాపుతారు. భక్తిరన్న నిశ్చేష్టుడై ఇదేమిటని అడిగితే యాదవులకు నల్లసిద్ధిరాజుకు పుల్లరి కారణంగా జరిగిన యర్రగడ్డపాటి యుద్ధంలో తాము మరణించిన విషయాన్ని అతనికి చెబుతారు. వెంటనే భక్తిరన్న శివుని ప్రార్థించి మేఘరథాన్ని పొంది దానిమీద ధనుమకొండకు వస్తాడు. ధనుమకొండలో తన తల్లి సిరిదేవి పాపనూకను ఒంటరిగా ఊరిబైట మేడలో పెట్టిందని తెలిసి చాల దుఃఖించి తల్లిని నిష్టూరాలు ఆడతాడు. పాపనూక మేడకు కాశి తీర్థాన్నీ, ప్రసాదాన్ని పంపిస్తాడు. తర్వాత అతడు ఎర్రగడ్డపాడులో చనిపోయిన తన సోదరులను చూడడానికి వెళుతూ పాలేటి నుండి బసవదేవుడు యుద్ధ వార్తలను తెస్తాడనీ, అప్పుడు అంతఃపుర స్త్రీలందరూ అగ్నిప్రవేశం చేయాలని ఆజ్ఞాపిస్తాడు. మార్గమధ్యలో మూసినది దగ్గర బసవదేవుడు యుద్ధంలో తగిలిన గాయాలతో భక్తిరన్నకు ఎదురవుతాడు. భక్తిరన్న ఎర్రగడ్డపాడికి పోయి యుద్ధంలో మరణించిన తన సోదరులను చూసి దుఃఖించి వారికి కైలాసబండ దగ్గర పిండ ప్రదానం చేస్తాడు. ఆ తర్వాత అతడు మంగలిపాడు రానాకు వెళ్ళి అక్కడ పడివున్న బీరినీడును, చిన్నప్పను చూసి యాదవ వీరులతోపాటు ఆగోసంగి వీరులకు కూడా 'వీరకత్తులు' చేయించి జాతర సమయంలో కొలుపులు చేయిస్తానని వారితో చెబుతాడు. ఆ వీరులు తృప్తిగా కన్నుమూసి కైలాసానికి వెళతారు. తాను కాశి నుండి వచ్చే వరకు పీనుగులు చెడిపోకుండా యుద్ధభూమిని రక్షిస్తూ ఉన్న గంగకు బలులు, బోనాలతో ఏటేటా జాతరులు చేయిస్తానని ప్రకటిస్తాడు. అతడు చేసిన కట్టడిననుసరించి ఇప్పటికీ యాదవులు గంగకు తిరునాళ్ళు, జాతరలు చేస్తూ ఈజాతరల సందర్భంగా బీరినీనికి కొలుపులు కొలుస్తారు. ఈవిధంగా భక్తిరన్నడు కాటమరాజు కథల్లో కాటమరాజు తర్వాత అంతటి ప్రాధాన్యమున్న పాత్ర. అందువల్లనే పొడపోతులవారు భక్తిరన్నడు ఈశ్వరుని వరప్రభావంతో అయోనిజుడుగా జన్మించినట్లుగానూ, మహిమలు కలిగినవాడుగానూ కల్పన చేశారు. తంగిరాల వారు ప్రచురించిన గ్రంథంలో ఇతడు శివుని అంశతో జన్మించిన గొప్ప శివభక్తుడు. నల్లమేడను వివాహం చేసుకున్నప్పటికీ శ్రీశైలం ప్రాంతంలో శివుని గురించి తపస్సు చేసినట్లుగా, ఆతర్వాత కాశీకి వెళ్ళినట్లుగా చెప్పబడింది. దీన్ననుసరించి పొడపోతులవారు భక్తుడన్న పుట్టుకతోనే జంగమవేషంతో జన్మించినట్లుగా, పుట్టినప్పటినుంచీ కాశీకాశీ అని కాశీ జపం చేస్తున్నట్లుగాను, నల్లమేడతో ఆగిపోయిన తన భక్తుని పెళ్ళిని సాక్షాత్తుగా శివుడే దేవతలందరి సమక్షంలో చేసినట్లుగా కల్పన చేసి ఆపాత్రకు మరింత ప్రాధాన్యతను సంతరింపజేశారు.



జానపదులకు అద్భుతరసం మీద ఆసక్తి ఎక్కువ. ఆశ్చర్యకరమైన సంఘటనలు ఎంత ఎక్కువగా ఉంటే వారికి అంతగా ఆనందం కలుగుతుంది. అందువల్లనే జానపదకవులు తాము సృష్టించే సాహిత్యంలో అద్భుతసంఘటనలను కల్పిస్తూ ఉంటారు. పొడపోతులవారు కూడా ఈభక్తుడన్న కథలో అలాంటి ఆశ్చర్యకరమైన సంఘటనలను చాల కల్పించారు. భక్తుడన్న పుట్టుకే ఆశ్చర్యమైనది. సిరిదేవి పూజకు మెచ్చిన ఈశ్వరుడు మూడు మల్లెపూవులు ఆమె కొంగులో వేయగానే ఆశ్చర్యంగా ఆమల్లెపూలు బాలుడుగా మారిపోతాయి. అంతేగాకుండా ఆబాలుడు పుట్టుకతోనే శివలింగాలతో, కాషాయ వస్త్రాలతో, శెంకు గంటలతో, త్రిశూలంతో జంగమరూపంలో జన్మించడం ఆశ్చర్యం. ఆగిపోయిన భక్తుడన్న వివాహాన్ని ఈశ్వరుడు దేవతలందరి సమక్షంలో జరిపించడం మరొక అద్భుతసంఘటన. ఇక ముందు చెప్పబోయే కథలో గూడా అనేక ఆశ్చర్యకరమైన సంఘటనలు ఉన్నాయి.

తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథల్లో భక్తిరన్నడు కళ్యాణపట్టణంలో ఉన్న కాటమరాజు పాపనూకలను తీసుకొని రమ్మని చెప్పిన పల్లికొండ మాటననుసరించి అనేక మంది శివభక్తులతో కలిసి జంగమ వేషంతో కళ్యాణపట్టణానికి వెళ్ళి ఆపట్టణరాజైన గంగభూపతిని కలుసుకుంటాడు. అదే సమయంలోనే కాటమరాజు చెల్లెలైన పాపనూక తమ తండ్రి, పినతండ్రులు, వారి భార్యలు, వారి సంతానాన్ని గురించి గంగభూపతి కూతురుతోటి కోలాటమాడుతూ పాట పాడుతుంది. అది విని రన్నడు ఆమె తన పెదతండ్రి కూతురని గ్రహించి, కాటమరాజు పాపనూకల తల్లి ఆయిన పెద్దమ్మ సహగమనం చేసిన అగ్నిగుండం దగ్గర, వారిద్దరిని తన వెంట పంపించుమని చనిపోయిన పెద్దమ్మతో సాక్ష్యమిప్పించి గంగభూపతి అనుమతితో కాటమరాజు పాపనూకలను దొనకొండకు తెచ్చినట్లుగా" కాటమరాజుకు పట్నం గట్టిన కథ" అనే కథలో చెప్పబడింది.

పొడపోతుల వారి కథలో భక్తుడన్న తన వివాహమైన కొంతకాలం తర్వాత కాశీకి వెళ్ళడానికి తల్లిదండ్రుల అనుమతిని పొంది ఆతర్వాత పల్లికొండ దగ్గరికి వెళ్ళి కాశీకి వెళ్ళివస్తానని చెబుతాడు. దానికి పల్లికొండ అతని పెదతండ్రి పెద్దిరాజు సంతానమైన కాటమరాజు, పాపమ్మలు రాయగిరికల్యాణంలో ఉన్నారని

"ఆబాలల తీసుకొచ్చి బాలల్లో కలుపు - బాగారుల తీసుకొచ్చి బాగారుల్లో కలుపు
వంశీకులను తీసుకొచ్చి వంశీకుల్లో కలుపు- గోత్రీకుల్ను తీసుకొచ్చి గోత్రీకుల్లో కలుపు
చెరువు నీరు చెరుకే కలుపు - ఏటి నీరు ఏటికే కలుపు "

అని చెబుతాడు. దానికి భక్తుడన్న అంగీకరించి కాటమరాజు పాపమ్మలను తీసుకొని

రావడానికి వెంటనే పయనమవుతాడు.

"జోలెలో ఈబూది గోరుడనే దీసినాడా - కంచికాలీబూదీ కొమంతరిచ్చినాడు

జిలకరించి మంతరించి గనుడు బత్తుడన్న-నీలమేఘాన్ని రతముగా గాయించినాడు"

భక్తుడు నీలమేఘాన్ని రథంగా చేసుకొని కళ్యాణం పట్టణానికి వెళ్ళడం ఒక అద్భుత సంఘటన. భక్తుడన్న అలా వెళ్ళిపోయి మంచినీళ్ళ చెరువు దగ్గర ఉండి ఆవూరి అమ్మలక్కల మాటలను బట్టి కాటమరాజు పాపమ్మలు కలబోతుల గంగమ్మ అనే ఆమె ఇంట్లో ఉన్నట్లుగా తెలుసుకొని వారింటికి వచ్చి ఆకలి ఆకలని ఆలమటిస్తాడు. ఇంటి యజమానురాలు కలబోతుల గంగమ్మ ఆకలన్న జంగానికి అన్నం పెట్టకపోతే కాశీలో చనిపోయినా మోక్షం రాదని భావించి ఆమె నవకాయకూరలు, పిండివంటలతో భోజనం తయారు చేసి అవన్నీ తీసుకొని వచ్చి భోజనం చేయమని భక్తునికిచెబుతుంది. ఐతే తాను పెళ్ళి కాని కన్య చేతి వంటను మాత్రమే తింటానని భక్తుడు ఆమెతో చెబుతాడు.

"పుణ్యాత్ములొడ్డిస్తే లేవు పుణ్యాలు - కన్యాత్ములొడ్డిస్తే కలవు భాగ్యాలు"

గంగమ్మ అతని వాలకాన్ని చూసి అనుమానించి తనకూతురైన నాంచారమ్మను గానీ పెద్దిరాజు కూతురైన పాపమ్మను గానీ అతనికి బోజనం పెట్టడానికి నియోగించకుండా ఊర్లో ఎవరైనా కన్యలను తీసుకొచ్చి జంగానికి భోజనం పెట్టించాలని నిశ్చయించు కుంటుంది. అమె భావాన్ని గమనించిన భక్తుడన్న తన జోలెలో వీబూది తీసి ఆవూరి మీద చల్లి ఆవూర్లోని స్త్రీలందరి మెడలో మాయమంగళసూత్రాలు ఉండేలాగా చేస్తాడు. ఈవిధంగా భక్తుడు ఆవూర్లోని స్త్రీలందరి మెడలో మంగళసూత్రాలను కల్పించడం ఒక ఆశ్చర్యసంఘటన. పట్నంలో ఎక్కడా పెళ్ళికాని కన్యలు లేకపోవడం చేత గంగమ్మ ఇంటికొచ్చి నాంచారమ్మను పాపమ్మను వడ్లు దంచి వంట చేసి జంగానికి భోజనం పెట్టమని చెబుతుంది. వారిద్దరు మిగిలిన స్నేహితురాళ్ళతో కలిసి కొట్నాల సావిట్లోకి వెళ్తారు. భక్తుడన్న కూడా ఆసావిట్లోకి వెళ్లి కూర్చుంటాడు. వారు వడ్లు త్వరగా దంచితే తాను తన చెల్లెలిని కనుక్కోలేనని భావించిన భక్తుడన్న తన మాయతో వడ్లు దంగకుండా చేస్తాడు. ఇలా వడ్లు దంగకుండా చేయడం కూడా అద్భుత సంఘటనే.

"దంచిన చేతులకి పొక్కులెక్కినాయి - నిల్చున్న కాళ్ళకి రక్తాలు దిగినాయి

కానీ ఒక్క వడ్లగింజైనా నలక్కుండున్నాదా"

అప్పుడు చెలికత్తెలందరూ ఆలసిపోయి అలసట తీరడానికి ఆలవారి పాపమ్మను ఒక పాట పాడమంటారు. అప్పుడు పాపమ్మ వారితో ఇలా చెబుతూవుంది.

"కన్నవారెవరో తెలియదు - కాసినవారెవరో తెలియదు

వంశీకులెవరో తెలియదు - గోత్రీకులెవరో తెలియదు



మామేడ మీద దూలాలు మేనత్తలు నాకు- కర్రలే చుట్టాలే నిప్పులే బంధువులు

ఆకాశమే తండ్రి భూదేవతే తల్లి-నేను ఎవర్ని తలుచుకోని పాటలు పాడుదునని

ఆలవారి పాపమ్మ శోకించుచున్నాదా"

అంతవరకు నాంచారమ్మ, పాపమ్మ తాను ఒకే తల్లి కడుపున పుట్టిన వారమని భావిస్తూ ఉంటుంది. దు:ఖంతో కూడిన పాపమ్మ మాటలు విన్న తర్వాత ఆమె తన తోబుట్టువు కాదని తెలుసుకొని వెంటనే తల్లి దగ్గరకు వెళ్ళి జరిగిన సంగతంతా చెప్పి, పాపమ్మ ఎవరు? తమ ఇంట్లో ఎందుకుంది చెప్పమని తల్లిని అడుగుతుంది. పాపమ్మ పెద్దిరాజు కూతురని, ఆమె దుష్టనక్షత్రంలో జన్మించడంచేత ఆమె తండ్రి చనిపోయాడని, తల్లి కొడుకైన కాటమరాజును కూతురైన పాపమ్మను కొంత ఆస్తిని తనకు అప్పగించి భర్తతో సహగమనం చేసిందని, పాపమ్మ పాట పాడాలంటే ఆమె తల్లి పెద్దమ్మ రాసిన తాళపత్రాలున్నాయని అవి తీసుకొని వెళ్ళి ఆమెకిస్తే ఆమె పాట పాడుతుందని గంగమ్మ చెబుతుంది. ఆతాళపత్రాలు తీసుకొని పాపమ్మ సువ్విపాటను ఇలా పాడుతుంది.

"సువ్విసువ్వన్నాలారా సువ్వన్నలారా - సువ్వాని పాడండోరి శ్రీరామనిధులా

వెండీదీ రోకాలేమీ బంగారూ కుంది - ఏయన్నీ పాడేనమ్మా వెలదీ పాపమ్మా

జామూజామున బేరీ జామూ రణభేరి -జామున రణభేరేమీ దనుముకొండలోనూ

పెదపెద్ద ముత్యాలేమీ పేరోసినట్లు - పెరిగేనమ్మా కన్నావారి పెరుగు కావుళ్ళు

వెన్నెలది ముత్యాలేమీ విరజల్లీనట్లు - వలమీతో నడిచేరు మాకన్నావారు వెలమా కావుళ్ల

వస్తేని శ్రీరంగాపురం ఏలేటి వలరాజు - వలరాజూ మాతాత అయ్యమ్మ వల్లమ్మా రానూ

వలరాజూ కుమార్లేమీ వార్తామన్నీలు - అల్లయివోజ్య పట్నమున మాఅయ్యలైదుగురు

దయితోని పాడుదును మాతండ్రి బలగమును-సిరియెండి కడియాలా సింహాద్రిరాజా

ప్రేమతో సింహాద్రేమీ పినతండ్రీ నాకు - మా మతీగాలా సీతమ్మాకి బావకూతురును

మాపిన్నీ గల పినతండ్రేమీ ఎరనూకారాజూ - మావేడుకతో వెరనూకమ్మా దేవి పినతల్లీ

దచ్చినాది బూముల్లా ఆవులను మేపి - ఆవుల పోలురాజూకు అన్నకూతురును

మామరివొక్క పాడుదును మామామ లందరినీ - దామాసిరిమంచాలేమీ దబ్బాపానుపులు

దామాసానీవారు మాతల్లి కన్నవారు - మామేనత్త కొమరమ్మాకి మేనగోడలిని

ముత్యాలపాలోసి మాయన్నా ముమ్మయ్యా రానూ - పగడాల పాలోసి మాయన్నా
బత్తూడన్న రానూ

తన ఒల్లెల్ల లింగామూలు ఒప్పైన జడలు - వరసాకు నల్లమేడ వదినమ్మా నాకు

శిరస్సల్లా లింగామూలూ శివబక్తూరాలు - వరసాకు నల్లమేడ వదినమ్మా నాకు

ఊల్లోనూ బిచ్చాలు గుళ్ళోనూ నిద్ర - మావాళ్ళ గురువు బత్తూడన్నా నను చూడా రానూ

కలబోతుల గంగమ్మల కొట్నాల సావిల్ల - ఆలవారి పాపయ్యమ్మ పాట పాడిందీ ”

ఈ పాట ఇంకా చాల ఉంది. ఈవిధంగా తమ చరిత్రను సువ్విపాటగా పాడినీ అమ్మాయి తన చెల్లెలు పాపమ్మని భావించి భక్తుడన్న ఆమెను పట్టుకొని చెల్లెలా చెల్లెలా అని దు:ఖించడం ప్రారంభిస్తాడు. ఆతర్వాత కలబోతుల గంగమ్మతో కాటమ రాజు పాపమ్మ తన పెదతండ్రి పెద్దమ్మలైన పెద్దిరాజు పెద్దమ్మల సంతానమని, వారిని తనకు అప్పగిస్తే వారిని తీసుకొని దనుముకొండ వెళ్ళిపోతానని చెబుతాడు. దానికి గంగమ్మ తాను చెప్పిన సత్యం చేసినట్లైతే వాళ్ళిద్దరిని ఇస్తానని చెబుతుంది. దానికి భక్తుడన్న అంగీకరిస్తాడు. ఇక్కడ భక్తుడన్న చేసిన సత్యాలు ఆశ్చర్యకరంగా ఉన్నాయి.

గంగమ్మ తమ ఊర్లో తూర్పున ఒక గంగరావిచెట్టు, పడమర ఒక గంగరావి చెట్టు ఉన్నాయని తూర్పున ఉన్న చెట్టును పడమరకు, పడమర ఉన్న చెట్టుకు తూర్పుకు నడిపించాలని చెబుతుంది. భక్తుడన్న రెండింటి దగ్గరికి వెళ్ళి వాటి మీద వీబూది చల్లి మల్లికార్జునస్వామిని తలుచుకునేటప్పటికి తూర్పున ఉన్న గంగరావిచెట్టు పడమరకు, పడమర ఉన్న చెట్టు తూర్పుకు నడుస్తాయి. ఆతర్వాత గంగమ్మ ఇంకా సత్యాలు చూపించమని పరీక్షలు పెడుతుంది. అవి. తూర్పున ఉన్న రాతి బసవన్నను పడమరకు, పడమర ఉన్న రాతి బసవన్నను తూర్పుకు నడిపిస్తూ అవి రెండూ దారి మధ్యలో కలుసుకొని పోట్లాడుకోవాలి. ఊరి మధ్యలో ఉన్న ఎండిపోయిన చెరువులో నీళ్ళు రప్పించి దాని మధ్యలో ఒక కలువ పువ్వును పూయించాలి. పెద్దమ్మ ఏఅగ్ని గుండంలో పడి చనిపోయిందో ఆఅగ్ని గుండంలో ఆమె తన చేతిని ఊపి తన పిల్లలను భక్తుడన్నకు ఇమ్మని చెప్పాలి. ఇవన్నీ భక్తుడన్న చేసి చూపిస్తాడు. అప్పుడు కలబోతుల గంగమ్మ కాటమరాజును పాపమ్మను తీసుకొని వెళ్ళమని భక్తుడన్నకు చెబుతుంది. ఇవన్నీ అద్భుతకల్పనలు.

తర్వాత భక్తుడన్న తన పెదతండ్రి ఆవులను ఇమ్మని గంగమ్మను అడుగుతాడు. గంగమ్మ కుంటి, గుడ్డి, గొడ్డుటావులు కొన్నింటిని చూపించి ఇవే పెద్దిరాజు ఆవులని చెబుతుంది."శంకు శబ్దము గానీ సెంబుడు జేసినాడు - గంట శబ్దమునేమీ ఘనడూ సేసినాడా” అప్పుడు భక్తుడన్న తన శంఖాన్ని వాయించి, గంట శబ్దం చేయగానే గంగమ్మ కట్టివేసిన పెద్దిరాజు ఆవులన్నీ గొలుసులు తెంపుకొని వస్తాయి. వాటిని చూపించి ఇవన్నీ ఎవరివని బక్తుడన్న గంగమ్మను అడుగుతాడు. అవన్నీ తమవని ఆమె చెబుతుంది. అప్పుడు భక్తుడన్న ఆమె భర్త గంగరాజు పేరుతో ఒక ఆవులదొడ్డి, తన పెదనాన్న పెద్దిరాజు పేరుతో ఒక ఆవులదొడ్డి కట్టించి గంగరాజు పేరుతో ఉన్న దొడ్లో నీలాలబొగ్గులు పెద్దిరాజు పేరుతో ఉన్న దొడ్లో పచ్చగడ్డి వేయించి ఆవులను



వదలివేస్తే బొగ్గులు తినడానికి వచ్చే ఆవులన్నీ గంగరాజువి, పచ్చగడ్డి తినడానికి వచ్చే ఆవులన్నీ పెద్దిరాజువి అవుతాయి అని చెబుతాడు. దానికి గంగమ్మ పచ్చగడ్డి తమ దొడ్లో, బొగ్గులు పెద్దిరాజు దొడ్లో వేయిస్తానని చెబుతుంది. దానికి భక్తుడన్న అంగీకరించి పెద్దమ్మ సహగమనం చేసిన గుండంలోని బొగ్గులు తెచ్చి తమ దొడ్లో వేయిస్తాడు. గంగమ్మ మంచి పచ్చగడ్డి తెచ్చి తమ దొడ్లో వేయిస్తుంది. అప్పుడు ఆవులను వదలి వేయగానే భక్తుడన్న శంకుశబ్దం, గంటశబ్దం చేయగానే మంచిమంచి పాడిఆవులన్నీ పెద్దిరాజు దొడ్లోకి, కుంటి గుడ్డి, గొడ్డు ఆవులన్నీ గంగరాజు దొడ్లోకి వెళ్తాయి. ఒక్క పొదదూడ మాత్రం ఏదొడ్లోకి వెళ్ళకుండా మధ్యలో ఉండిపోతుంది. దానికి కారణమే మిటని భక్తుడన్న గంగమ్మను అడుగుతాడు. దానికి గంగమ్మ ఆదూడ పెద్దిరాజు ఆవుకు పుట్టి తమ ఆవు పాలు తాగిందని అందువల్ల అది ఎటూ వెళ్ళకుండా మధ్యలో ఉండి పోయిందని చెబుతుంది. అప్పుడు భక్తుడన్న ఆదూడ గంగమ్మ ఆవు పాలు తాగింది కాబఇక్కడ పొడపోతులవారు ఆశ్చర్యకరమైన ఒక కల్పన చేశారు. భక్తుడన్న అన్నెయ్య బున్నెయ్య చిట్టెయ్య బుట్టెయ్య పొడపోతుల జయమల్లు అనే ఐదుగురు పొడశిభక్తులను బొమ్మలుగా చేసి తన జోలెలో వేసుకొని అవసరమైనప్పుడు వారిని మనుషులుగా చేసి, ఆఅవసరం తీరిన వెంటనే వారిని మళ్ళీ బొమ్మలుగా చేసి తన జోలెలో వేసుకునే వాడట. ఈఐదుగురు ఇప్పటి పొడపోతుల వారి మూలపురుషులట. భక్తుడన్న జోలెలో ఉన్న వారి బొమ్మలను తీసి మనుషులుగా చేసి ఆపొడదూడను వారికి ఇచ్చి

“కలియుగములోనా మాకతలు చెప్పండి
మహిమీద మాబిరుదులు ఎచ్చుగా పొగడండి
మాగోత్రములు చనిపోయిన పెద్దల్ని పొగడండి
మాయొక్క యాదవ చరిత్ర తెరతీసి పాడండి
పాడి పొగిడినందుకు పొడపాటుకులనే పేరు వహించండి”

అని ఐదుగురుతోటి చెబుతాడు. అప్పుడు వారు తాము ఐదుగురు ఒక్క పొడదూడతో బతకలేమని, తమకు ఏదైనా జీవిక ఏర్పాటు చేయాలని చెబుతారు. అప్పుడు కాటమరాజు పల్లికొండ భక్తుడన్న ఈముగ్గురు ఆనాడు పదమూడువందల శతాబ్దం ఔజయనామ సంత్సరంలో కూర్చొని రాగిశాసనం రాసి ఇచ్చారుట. ఆశాసనం ప్రకారం “యాదవులు “పెళ్ళికిటంకం” అంటే యాదవుల ఇళ్ళలో పెళ్ళి జరిగితే పొడపోతులవారికి రూపాయ ఇవ్వాలి. “కదుపునదూడ” అంటే గొర్రెలుంటే ఒక గొర్రెనివ్వాలి, “మందనియావు” అంటె ఆవులుంటే ఒక ఆవునివ్వాలి. ఆవులు గొర్రెలు లేకుండా వ్యవసాయం చేసుకునే యాదవరాజులు ఐదు కుంచాల ధాన్యమివ్వాలి. ఉద్యోగం చేసుకునే యాదవులు

పాడపాటుకులకు భోజనం పెట్టి తాంబూలం ఖర్చు ఇవ్వాలి. ఇలా ఇవ్వనివారు కాశీలో బ్రాహ్మణుని చంపినంత పాపాన్ని పొందుతారనే నియమాన్ని ఏర్పాటు చేశారట." ఆనాడు వారు చేసిన ఏర్పాటును బట్టి ఈనాటికి గూడాను పాడ పాటుకులు లేక పొడపోతుల వారు యాదవరాజుల కథలను చెబుతూ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు.

ఆతర్వాత భక్తుడన్న గంగమ్మతో పెద్దిరాజు సంపాదించిన ధనం, పాతసామాను ఏమైనా ఉంటే ఇమ్మని గంగమ్మను అడిగితీసుకుంటాడు. ఈవిధంగా భక్తుడన్న కాటమ రాజును, పాపమ్మను, ఆవులను, ధనాన్ని, సామానును తీసుకొని దనుముకొండకు బయలుదేరి వస్తుంటాడు. అంతవరకూ తనదీ అనుకున్న ఆవులు, ధనం తనది కాకుండా పోతున్నందుకు, అలా కాకుండా చేసిన భక్తుని మీద కడుపుమంటతో గంగమ్మ తన ఊర్లో ఉన్న మగవారినందరిని రెచ్చగొట్టి భక్తుడన్నను చంపి బాలలను, ఆవులను తనకిచ్చి ధనాన్ని వారిని పంచుకోమని చెబుతుంది. ధనం మీద ఆశతో ఊర్లోని మగవారందరూ కర్రలు, బాణాలు, గొడ్డళ్ళు పట్టుకొని భక్తుడన్న వెంట పడతారు.

"పొడూపొడూ యని కొట్టూకొట్టూయని – పొడూపొడూ యని కొట్టూకొట్టూయని
జనాలు బత్తుడన్న మీదకు ఉరుకుతున్నారు – యతీశ్వరుడు బత్తుడన్న కనుల జూసినాడు
జోలెలో ఈబూది గోరుడ దీసినాడు – కంచకాలీబూది కౌమంతరించినాడు
జలకారించి మంతరించి ఘనుడు బత్తుడన్న – వచ్చిన దండపైనా వేగము జల్లినాడా"

అలా వీబూది చల్లగానే ఎక్కడి వాళ్ళు అక్కడే రాళ్ళుగా మారిపోతారు. తర్వాత బత్తుడన్న దనుముకొండకు వస్తూవుంటే దారిలో ఒక వైశ్యుడు వ్యాపారం నిమిత్తం రాయగిరికళ్యానికి పోతూ ఎదురవుతాడు. భక్తుడన్న అతనికి మంత్రించిన వీబూది ఇచ్చి దారిలో ఎదురైన రాళ్ళ మీద చల్లమని చెబుతాడు. అలాగే అతను చల్లగానే భక్తుడన్న చేత రాళ్ళుగా మారిపోయిన వారందరూ తిరిగి మనుషులుగా మారి "కొత్త వర్షానికి లేచిన పుట్టగొడుగుల్లాగా లేచారట". ఈవిధంగా భక్తుడన్న వారిని రాళ్ళుగా మార్చడం, తిరిగి వారిని మనుషులుగా మార్చడం ఆశ్చర్యకరమైన సంఘటనే.

భక్తుడన్న బాలలను భాగ్యాన్ని తీసుకొని దనుముకొండకు వెళ్తాడు. వీరు వస్తున్న సంగతి ముందుగానే తెలుసుకున్న భక్తుడన్న తల్లి సిరిదేవి కాటమరాజు దనుముకొండలో ప్రవేశిస్తే తన కుమారుడైన ఐతమరాజును కాదని అతడు రాజు అవుతాడని భావించి, కాటమరాజును ఊర్లోకి రాకుండా చేయడానికి ఊరును తగల బెట్టిస్తుంది. ఈవిషయం గ్రహించిన కాటమరాజు తాను ఆలమంద దగ్గరే ఉండిపోతానని ఊర్లోకి రానని భక్తుడన్నకు చెప్పి ఆలమంద దగ్గర ఉండిపోతాడు. తర్వాత భక్తుడన్న పాపమ్మను తీసుకొని



తల్లి సిరిదేవికి అప్పగించి ఆమెను మంచిగా చూడమని తాను కాశీకి వెళ్ళిపోతాడు. ఇది పొడపోతుల కళాకారుడైన గంట అప్పారావు గారు చెప్పిన భక్తుడన్న కథ. ఈకథలో అనేక అద్భుత, అమానుషమైన సంఘటనలు చోటు చేసుకున్నాయి.

**పాపనూక వలపోత కథ :**

తంగిరాల సుబ్బారావు గారు తాము ప్రచురించిన కాటమరాజు కథలు గ్రంథంలో పాపనూక వలపోత కథ లభించలేదని రాశారు. పొడపోతుల వారు పాపనూక వలపోత కథను పాడతారు. వలపోత అంటే దు:ఖించడం అని అర్థం. తంగిరాల వారి గ్రంథంలో పాపనూక కథ అనే కథ ఒకటి ఉంది. ఇందులో కాటమ రాజు చెల్లెలైన పాపనూక దుష్టనక్షత్రంలో జన్మించిన కారణం చేత ఆమెకు పెళ్ళి చేయకుండా ఊరి బైట ఒక మేడలో ఒంటరిగా ఉంచినకథ చెప్పబడింది. కాటమ రాజు కథల్లో అత్యంత కరుణసర భరితమైన కథ ఇది. ఆకథ ఇది.

పాపనూక యుక్తవయస్సురాలు అయినప్పుడు పల్లికొండ ఆమెకు వివాహం చేయసంకల్పించి పాపనూక మేనత్త కుమారుడైన నాచకూళ్ళ నాయునికిచ్చి పెళ్ళి చేయమని సిరిదేవిని, అయితమరాజును కోరతాడు. వారు పురోహితుని పిలిచి పాపనూక జాతకాన్ని చెప్పమంటారు. పురోహితులు ఆమె జాతక చక్రాన్ని పరిశీలించి పాపనూక ఫాల్గున మాసం బహుళ పక్షం నాల్గు ఘడియల జమిలి నక్షత్రంలో బుధవారం నాడు పట్టపగలు భూమిని తన్నుకుంటూ పుట్టిందనీ, ధనధాన్యాల గండాన, తల్లిదండ్రుల గండాన, గోత్ర గండాన పాపనూక జన్మించిందనీ అందువల్ల ఆమెకు వివాహం చేస్తే –

"యిచ్చిన వారిండ్లు యిల మీద క్రుంగును– పుచ్చుకున్న వారిండ్లు భూమ్మీద వెలుసును
........................................ – ఇల్లటముగా వుంచి యింటనే పెండ్లి
చెల్లెలు పాపకు పెండ్లి చేయుడి మీరు – ఇల్లటము వుంచితేను యిచ్చిన వారికి
పుచ్చుకున్న వారికి చల్లగా వుండును"

అని పురోహితులు చెబుతారు. పాపనూకను నాచకూళ్ళ నాయనకిచ్చి పెళ్ళి చేసి ఇల్లరికం ఉంచుకోవాలని అయితమ రాజు, సిరిదేవి భావించి నాయని తల్లి అయిన కొమరమ్మను అడుగుతారు. తన కొడుకును ఇల్లరికం పంపించడానికి కొమరమ్మ అంగీకరించదు. దీనితో వివాహం ఆగిపోతుంది. అవివాహితగా పాపనూక ఇంట్లో ఉండడం దోషమనీ, అలా ఉంటే యాదవవంశం నాశనమవుతుందనీ, ఆమెను ఒంటరిగా ఊరి బైట ఒక మేడలో ఉంచాలని పురోహితులు చెబుతారు. అలా చేయడానికి సిరిదేవి చాల తొందర పడుతుంది. ఐతమరాజు ముందు వెనుక ఆలోచించి తన తల్లిని వారించి, పాపనూకను మేడలో పెట్టే విషయాన్ని ఆలమంద దగ్గర ఉన్న కాటమ

రాజుకు కమ్మ రాసి తెలియజేస్తాడు.

ఐతమరాజు రాసిన కమ్మను చదువుకొని పెళ్ళి చేసుకొని భర్తతో హాయిగా కాపురం చేసుకోవలసిన తన చెల్లెలు ఒంటరిగా మేడలో అజ్ఞాతవాసం చేయవలసి వచ్చినందుకు కాటమరాజు ఎంతగానో దు:ఖిస్తూ అందుకు కారకురాలైన పినతల్లి సిరిదేవిని మేనత్త కొమరమ్మను నిందిస్తూ తన మిత్రుడైన పద్మరాఘవునితో చెప్పుకొని ఇలా దు:ఖిస్తాడు.

"ప్రేమతో దెచ్చి మమ్ము భత్తుడు పేరాపన జేసె - దయలేక చెల్లెలిని తల్లి సిరిదేవి
తాల్మితో మేడ బెట్టుమని చెప్పె తల్లి సిరిదేవి - ఎలమంచి చెల్లెలు ఎతకుడుచు నాయుడా
ఘనముగా బుట్టి మేము గారమున బెరిగి - కనక మేడ నుండ కట్టడి కాబోలు
భోగాన బెరిగిన చెల్లెలు పొడుగు మేడ మీద-అజ్ఞాతవాసము నుండ వ్రాసె కాబోలు
తనతోడ బుట్టినందుకు ధనము కొండలోన- కనకమేడ నుండ కట్టడి కాబోలు
కొండ మీద వుండిన కోకిల చందాన - వుండజేసెను కొమరగిరి వో పద్మనాయుడా!
వరసతో ధనకొండ వల్లవుల జూచి - ఎరుగక సిరిదేవి యింత జేసెను నాయుడా
ఏరాలి బిడ్డలము గాన ఏరు బందము జేసె - పడవేసె మంటలో పాపవు తల్లి
కడవారుగారు కల్యాణము వియ్యకపోను - తన కలిమి పొయ్యానని తలచి మేడ బెట్టి
చనవు లేక చెల్లెలు సమిసెను నాయుడా! - ఇసకలో కురిసిన ముసురు వాన వలెను
వాసి గల చెల్లెలిని వగ్గాన దోసిరి - మేనత్త కొమరగిరి మెడబలి చూచుక
ఇల్లటము వుంచితే ఏమాయె తనకు - కొల్లారు విద్దెలన్ని కొల్ల బొయ్యానో
చెల్లెలిని మేడబెట్ట చేటెరుగరైరి - కలకాలము పాప కన్నీరు బెట్టితేను
సిరి తొలగును గాదె చిన్ని నామరిది! - సదా శివుడింత జేసెను నాయుడా
వొక్కతే చెల్లెలు వో పద్మనాయుడా! - పెక్కు రేగులలోన వక్క జిల్లేడు
విరిగిన చందమాయె నా చెల్లెలి బ్రతుకు - అప్పల చెల్లెండ్ల అందరి నెడబాపి
వొప్పుగా మేడ మీద వుంచెను సిరిదేవి - మునుకొని దుఃఖాన మునుగుచు నుంటేను
తన సరివారెల్ల ధనము కొండలోన - నవ్వుచు వుండేటి నాతుల జూచి
శివశివ యని పాప శివుని దూరేని"

విధంగా కాటమరాజు తన చెల్లెలికి పట్టబోయే దుస్తితిని గురించి మిత్రుడైన పద్మ రాఘవునికి చెప్పి ఆ తర్వాత చెప్పలేక జలజల కన్నీరు కారుతూ ఉండగా మనసు వశం తప్పి స్పృహ తప్పిపోతాడు.

"అని యిట్లు శోకించి ఆ రాజఘనుడు - నాయిని ముందర నటు అధైర్యపడెను
జలజల కన్నీరు జారంగ సాగె - దేహంబు బడలెను తేజంబు దప్పె
ముచ్చుమునిగి రాజు మూర్ఛ తాబోయె - కురులు తూలాడంగ నేలపై వరిగె
పొర్లిపొర్లి యేడ్చుచు వోచెల్లెలా! యనుచు-తల్లి దండ్రి వుంటేను తనకేల యీ దుఃఖము
వుండలేదు దుఃఖము వో పద్మనాయుడా! - చేకొని శివుడంత బ్రహ్మ .............
సకల విధముల మాకు సర్వేశ్వరుండు - మామీద దయలేక మమ్మింత జేసె
ఇకనేమి అనవచ్చు " నని విధిని మీద దూరె - ఆకాశవాణి వోయమ్మ భూదేవి
కర్మల కన్నుల కానరా మీరు - అని పలువరించుచు హో చెల్లెలా! యనుచు
వరిగెను ధరమీద వల్లవుల రాజు"

అరివీర భయంకరుడు, అవతారపురుషుడైన కాటమరాజు తన చెల్లెలకు జరిగిన అన్యాయానికి ఏమీ చేయలేక ధైర్యాన్ని కోల్పోయి అతిదీనంగా దుఃఖుస్తూ ఉంటే త్రిమూర్తులు వచ్చి చెల్లెలుమీద ఆశ వదులుకోమని చెప్పారట.

"వేయి శిరసులు రెండు వేల జిహ్వాలుగల - ఆదిశేషుని మీద అటు పవళించి యున్న
వచ్చెను శ్రీహరియు వాసుదేవుండు - చతుర్ముఖములు గల శంకుచక్రాల స్వామి
ఇల వినోదంబున నిలిచి తా జూచి - నాగకంకణుండు వచ్చె నంది వాహనుడు
బాగుగా నచటకు ప్రమథులతోను - అంతలో బ్రహ్మ తాహంసవాహన మెక్కి
తేజంబున వచ్చెను దివినుండి యపుడు - "వినవోయి కాటమరాజు! వితరణకార
వీరుడవు శూరుడవు వినవోయి రాజ! - వగవద్దువో రాజ చెల్లెలికి వాంఛలు విడువు"

ఈవిధంగా చెప్పి త్రిమూర్తులు వెళ్ళిపోతారు. ఆతర్వాత కాటమ రాజు చెల్లెలి విషయంలో తాను ఏమీ చేయలేనని నిశ్చయించుకొని ఐతమరాజు కమ్మకు తిరుగు కమ్మ ఇలా రాసి పంపిస్తాడు.

"గట్టిగా ఈ మాట గైకొని వినుడ - పట్టభద్రుడు అయితన్న పల్లికొండ గాక
అయ్యలమారు కొమరక్క వున్నాది - దయగల సిరిదేవి తల్లి తానెరుగు
చెల్లెలిమాట నన్నుడుగ చెల్లునా మీకు?- తలపోసి నన్నుడుగ ధర్మమా మీకు?
ఎక్కువ మీకన్న ఎరుగుదునా తాను? - తమను తీర్చినట్టి తల్లివి నీవు
పుణ్య పాపంబులు భువిలోన గలవు - కడవారము కాము కలిసిన వారము
ఏమి కార్యమైన ఎరుగరా మీరు? - సమముగా నందరిని సాకేటి భారము
తల్లి నీకే తెలుసు ఆ ధర్మా ధర్మంబు - చెల్లెలిని మనువిచ్చినా మీరే మన్నించినా మీరే
మేడబెట్టినా మీరే మేలు గ్రహించినా మీరే - కల్లలాడిన మీరె కడమేడ బెట్టిన మీరె
అలుగుల పాకనాట ఆవుల మేపి నాడు - కరుణించినా మేలె ఖండించినా మేలె
కాయా కొడవలి మీచేతి కప్పగించినాను-కరుణించి మీరందరు ఆకాయ కాచినా మేలె
తతికొని ఆకాయ తరిగినా మేలె - కీర్తులు అపకీర్తులు అమ్మకయితన్నకు

ఆ మీద పనులన్ని హరిగురువు ఎరుగు - తానేమి చెప్పుదు తమరు వుండంగ
మాట వాసి కొమరక్క మా అయ్యల మారు - కాటమరాజు ఈ పట్ల కడ జేసెననుచు
నిండు ఏగురు నా మీద నిష్టూరమేల? - గండపు పాప నగర వుండరాదనుచు
అందరు మీరు అనగాను అపుడు - అలసూర్యుండు చంద్రుండు అవనియు మిన్ను
కలంతకాలము కలియుగములోన - చల్లగా మీరుంటిరైన చాలునే తల్లి
ఎనయంగ వో తల్లి వివరమింతేను"

కాటమరాజు తన చెల్లెలు పాపనూక విషయాన్ని గురించి పాల ముంచినా, నీట ముంచినా వారిదే భారమనీ, ఆ పాపపుణ్యాలు కూడా వారివేననీ పాపనూక భవిష్యత్తును తన దాయాదుల చేతిలో పెడతాడు. వేల గోగణానికి అధిపతి, వీరాధివీరుడు అయిన కాటమరాజు తన చెల్లెలకు జరగబోతున్న అన్యాయాన్ని "కిం" అని ప్రశ్నించకుండా దుర్మార్గులైన దాయాదుల నిర్ణయానికి వదలివేయడం ఆశ్చర్యాన్ని ఆలోచననూ కల్గిస్తుంది. పాపనూక విషయంలో పాపనూక పినతల్లి సిరిదేవి, మేనత్త కొమరక్క అంత పాపానికి వడిగట్టడానికి కారణం బహుశా ఆమె తల్లిదండ్రులైన పెద్దమ్మ, పెద్దిరాజు తమ బంధు గణాన్ని వదలి దనుమకొండ నుంచి సంతానం కోసం కల్యాణ నగరానికి వెళ్ళడం కావచ్చు. అన్నదమ్ములతో, సోదరితో ఉమ్మడిగా ఉంటూ, ప్రేమా భిమానాలను పంచుకుంటూ పెద్దిరాజు నీడలో పక్షుల్లాగ జీవిస్తున్న పెద్దిరాజు తమ్ములు, అన్న సింహాద్రి రాజు, సోదరి కొమరక్క మొదలైన వారంతా ఏడ్చి మొత్తుకొని ఎంత చెప్పినా వినకుండా భార్య పెద్దమ్మ మాటవిని తమనందరినీ వదలివేసి గోగణంలో పాలుపంచుకొని సంతానం కోసం దూరంగా ఎక్కడో ఉన్న కల్యాణపట్టణానికి వెళ్ళడమే దీనికంతటికీ మూలకారణంగా భావించవచ్చు. పెద్దిరాజు భార్యతో కలసి వెళ్ళేటప్పుడు కొమరమ్మ తన వదిన పెద్దమ్మను తమ నుంచి తన అన్నను దూరంగా తీసుకొని వెళుతున్నందుకు ఆమెను అనేక రకాలుగా నిందిస్తుంది. దీనికంతటికీ కారణం ఆమేనని కొమరమ్మ నమ్మకం. అలాంటి పెద్దమ్మ మీద ఉన్న కోపాన్ని ఆమె కూతురు, అమాయకురాలు అయిన పాపనూక మీద చూపించి ఆమెను మేడలో పెట్టినట్లుగా మనం భావించవచ్చు.

కాటమరాజు నుంచి తిరుగు కమ్మ వచ్చిన తరువాత బంధువులందరూ ఆమెను మేడలో పెట్టాలని నిర్ణయిస్తారు. తనను మేడలో పెట్టబోతున్నారని తెలసిన తరువాత పాపనూక దానికి కారణమైన పినతల్లి సిరిదేవిని నిష్ఠూరాలాడుతూ, తనకు ఏమాత్రం సాయం చేయని తన అన్న కాటమరాజును రోషిగా చేసి ఇలా చెబుతుంది.

"పూర్తిగా కాటమరాజుతోడ పుట్టిన నందులకు - వగవ కారణమేమి వోయమ్మ సిరిదేవి



పగవారమైతిమి నీకు బంధువులము కాము - తల్లి వెనక తల్లివని చాలా నమ్మితి నమ్మా
చెల్లబో ఈ రీతి చేసేది యెరుగ! - అక్కన్న మీది దయ అమ్మ నామీద
వక్క నాడైనను వుంచక పోతివి - ఆడ ఎవరున్నారు? అడవి పుట్టుక నాది!
చెడ్డవారము గాగ ఇంత జేస్తివే తల్లి - పంతమాడి తెచ్చిన మాయన్న భక్తుడు లేడు
పగవారి బిడ్డ మంటూ పాపము గట్టుకొంటివి-ఇంతకు నోచుకుంటిమి వోయమ్మ సిరిదేవి
కద్దటే యింత పాపము కాంత సిరిదేవి - బుద్ధులు జెప్పను పోషించను నీవు
వలపక్షపు తల్లివైతివి వోయమ్మ నీవు!"

ఈ కథ పాపనూకను ఏకాంతంగా మేడలో ఉంచి అందరూ వెళ్ళి పోవడంతో ముగుస్తుంది. మేడలో ప్రవేశించడానికి ముందు పాపనూక తనకు అన్యాయం చేసిన తన బంధువులందరూ నశించాలని ఇలా శపిస్తుంది.

"వుత్తర కాశిలో మాయన్న వుడిగెనని విందునా?- మాయన్న భత్తు చేతి కప్పెర
వప్పులై వరిగెనని విందునా - వోయత్త కొమరక్క మాయన్న భత్తుడు
వుండేటి వియాతి మండువాలన్ని - పాడు బడ్డాయని యెన్నడు విందునే
వోయత్త కొమరక్క వనరంగ నేను - కవకొని మాయన్న వుండే మహలు
ఎన్నడు కాలెనని విందునే అత్త కొమరక్క - సారంగ మఠమంత సద్దణిగెనని
విందునటే నాతల్లి సిరిదేవి - సిరిదేవి నీ నగరు చిచ్చు తగులుక మండంగ
జూతునా మహి మీద నేను- కొమరమ్మ కొలువు కూటాలు అగ్గలు తగిలి మండి
అగుమంచి వుండేటి ఆటకూటాలు-సిరిగిరమ్మ వుండే చిత్రకూటాలుచిచ్చుల దగిలి
కులకోటి బంధువులు కూరిమి చుట్టాలు- యెన్నగ బంధువులు యేకమైవారు
కంచెంత ధనము కొండ కాలిపోగా - జూతునా వోకన్నులార
వుత్తమైన ధనముకొండ - రుత్తలయిపోగాను కన్నుల జూతునా
గుండపు ధనముకొండ గుంపులు కూడగాను - యెన్నడు జూతునే యరణప్ప నేను"

పాపనూక బందువులందరూ రాజరికానికి చెందినవారు కాబట్టి వారికి ఒక్కొక్కరికి ప్రత్యేకంగా వారివారి అంత:పురాలున్నాయి. కళ్యాణపట్టణంలో ఆపట్టణం రాజైన గంగరాజు దగ్గర హాయిగా ఉన్న తనను తీసుకొని వచ్చి దొనకొండలో సిరిదేవికి అప్పగించి తన దారిన కాశీకి వెళ్ళిపోయినవాడు, తద్వారా తాను ఒంటరిగా మేడ పాలు కావడానికి మొదటి కారకుడు భక్తుడు. అందుకనే పాపనూక తన కోపాన్ని మొదట భక్తుని మీద చూపిస్తూ వుంది. పాపనూకను మేడలో పెట్టిన సమయంలో అతడు కాశీలో ఉన్నాడు. పాపనూక కాశీలో ఉన్న బత్తుడు కృషించిపోవాలని నిందించింది. భక్తుడు గొప్ప శివభక్తుడు. శైవసన్యాసి. జంగమవేషంలో శివుని లాగా చేతిలో కపాలాన్ని

ధరించి ఉంటాడు. అతని లోగిలి శివభక్తులతో మఠం లాగా ఉంటుంది. అందువల్ల అతని చేతిలో ఉండే ఆకపాలం ముక్కలైపోవాలని, అతని నివాసమైన సారంగి మఠం మనుషులు లేకుండా పాడుబడి పోవాలని, తన బతుకు ఆవిధంగా బండలు కావడానికి కారకులైన సిరిదేవి కొమరమ్మల మేడలు కాలి బూడిద కావాలని, సిరిదేవి కూతురైన అగుమంచి మేడ, కోడలైన సిరిగిరమ్మ మేడ తగులబడిపోవాలని, దనుముకొండ పూర్తిగా నాశనమై పోవాలని శపిస్తుంది.

బాధాతప్త హృదయంతో ఆమె శపించినట్లుగానే ఆమె బంధువుల్లోని పురుషు లందరూ ఎర్రగడ్డపాడు యుద్ధంలో చనిపోతారు. కాశీలో ఉన్న భక్తిరన్నడు యుద్ధంలో యాదవవీరులందరూ చనిపోయారని తెలుసుకొని ఆఘమేఘాల మీద దొనకొండకు వస్తాడు. ఇక్కడినుంచి పొడపోతులవారు చెప్పే పాపనూక వలపోత కథ మొదలవుతుంది.

ఈపాపనూక వలపోత కథ ఎనిమిది వందల పాదాల్లో ఉంది. ఇది చిన్నకథా గేయమంత పరిమాణంలో ఉంది. దీన్ని పొడపోతులవారు ఒక గంట కాలంలో పాడు తారు. భక్తిరన్నడు కాశీ నుంచి సూర్యోదయం సమయంలో తమ పట్నానికి చేరు కుంటాడు. ఇంచుమించుగా పురుషులందరూ యుద్ధానికి వెళ్ళడం చేత పట్నంలో స్త్రీలు మాత్రమే ఉంటారు. అతను కాశీకి వెళ్ళి చాల కాలం కావడం చేత రన్నడు రాగానే స్త్రీలందరూ అతని చుట్టూ మూగుతారు. ఈస్త్రీలకు యాదవులు యుద్ధంలో చనిపో యారన్న విషయం తెలియదు. వారందరూ యుద్ధవార్తల కోసం అతురతతో ఎదురు చూస్తున్నప్పుడు భక్తిరన్నడు వస్తాడు. అతనికి అందరూ కనిపిస్తారు కానీ పాపనూక కనిపించదు. తల్లిదండ్రులు లేని పాపనూక అంటే అతనికి చాల ఇష్టం. అతను కాశీకి పోతూ పాపనూకను తల్లికి అప్పగించి ఆమెను ఆమె స్వంత కూతురైన అగుమంచితో సమానంగా చూడమని చెబుతాడు. అందుకని కాశీ నుంచి రాగానే పాపనూక ఏదని ఎంతో ఆత్రంగా తల్లి సిరిదేవిని అడుగుతాడు.

"కొండంత బలగంబు కన్నవారిని జూస్తి- వంచినాతని బట్టి వదినల జూస్తి
అప్పలు చెల్లెల్లు ఆందరనీ జూస్తి - తీరైన చెల్లెలు మన దివానములో లేదు
పందుముల ఎరినప్పను బాగుగా జూస్తి - ఎందును కనబడదు ఏదమ్మ పాప
అంతా నాకు మొక్కె అప్పలను జూస్తి - ఇంతి ఏదమ్మా పాప
చేరి నాకు మొక్కె చెల్లెళ్ళను జూస్తి - గర్భపు చెల్లెలు కానరాదమ్మ
మర్లవారిని జూస్తి మగువలను జూస్తి - నేతివారిని జూస్తి నాతులను జూస్తి
వత్తైన చెల్లెలు పరికింప నాతోను- ముచ్చటాయెను పాప ముచ్చటాయెనమ్మా
చెల్లెలును దలుతు నేనెపుడు - పసినికాళ్ళ పాప మనబలగమున లేదు



దవ్వున కాశిలోను దలుతు నిత్యంబును - ఎప్పుడు మనసు బాయదు చెల్లెలు నాకు
తల్లీ దండ్రీ లేని చెల్లెలి మీద - మనసులో బక్తి యున్నాది నాకు
వల్లబుల బత్తుడు వాంచతో అడగంగ- తల వాలవేసెను తల్లి సిరిదేవి "

భక్తిరన్నని మాటలకు సిరిదేవి మొఖం వెలవెలబోయి ఏమీ చెప్పలేక పోతుంది. ఆమె స్థితిని గమనించిన పల్లికొండ భార్య అయిన పందుముల ఎరినప్ప భక్తుణ్ణి కొంచెం దూరంగా తీసుకొనివెళ్ళి జోతిష్యుల మాటననుసరించి పాపనూకను ఊరిబైట మేడలో పెట్టామని చెబుతుంది. ఆమె మాటలు విని భక్తిరన్నడు గోడుగోడున దుఃఖించడం ప్రారంభిస్తాడు. అప్పటి అతని పరిస్థితిని జానపదకవి ఇలా వర్ణించాడు.

"అప్ప చెప్పగ గురువు ఆందోళనొంది - గోడుగోడున బక్తుడన్న శోకింపసాగె
వాలకన్నుల నీరు గురువుకు వదలైపారె-పులితోలు చెర్మము మీద జొటజొటామని
వాన కురిసిన లాగు
వద్దనున్న శెంకు గంట వానుకొని మోగె- బుజము నున్న కక్షపాల బూమి మీద వరిగె
యేసిన గజాశూలము గజకగజ వణికె- శివలింగాలు గురువుకు చిక్కులు పడెను
తాల్లపు రుద్రాక్షలు తల్లటింపసాగె- పరచిన పులితోలు చెర్మము మీద
కారిన కన్నీరు పాములై వరసె- అరచేతిని కప్పిరి అవనిపై వొరిగె
శోకించె గురువు తమ చెల్లెలును తలచె-తాటికొమ్మ మంట దరికొనిసాగినట్లు
నమ్మించి తెస్తిని నాతోటి పాపను- అమ్మ నిన్ను పగవారికి అప్పగిస్తిని
ఓయమ్మ పాలు ఇరగని కాటమరాజును- ఆవులపాలు జేస్తిని
కడమేడ పెట్టి కాశీయాత్రపోతిని-బలగమున కలిపితే పాపకు బ్రతుకు తెరువనుచు
బ్రతికిస్తినే తల్లి గతి నేల గలిపితిని- పులును గొట్టి బోనులో వేసినట్లు"

కళ్యాణపట్టణంలో సుఖంగా ఉంటున్న పెద్దిరాజు సంతానమైన కాటమరాజు పాప నూకలను భక్తిరన్నడు తీసుకొని వచ్చి దాయాదుల దగ్గర వదలిపెట్టాడు. దాయాదులు కాటమరాజును ఆవులకు రాజుగా చేసి అడవుల్లో ఆలమంద దగ్గర ఉంచారు. పాపనూక దుష్టనక్షత్రంలో జన్మించిందని చెప్పి ఆమెకు పెళ్ళి చేయకుండా ఒంటరిగా ఊరి బైట మేడలో ఉంచారు. తల్లిదండ్రులు లేని కాటమరాజు పాపనూకల బతుకు ఈవిధంగా బండలు కావడానికి తానే కారణమని భక్తిరన్నడు బాధపడుతున్నాడు.

పాపనూకను మేడలో పెట్టడానికి ప్రధాన కారణం సిరిదేవేనని రన్నడు గ్రహించి తన తల్లి అయిన సిరిదేవిని దగ్గరకు పిలిచి ఆమెను ఇలా అడుగుతాడు.

"ఏదమ్మ సిరిదేవి ఎక్కడున్నాది చెల్లెలు- మేడ పెట్టుట నీకు మేలాయెనటమ్మ
మేడ పెట్టితివి కటకటా సిరిదేవి కఠినాత్మురాల- మేడ పెట్టినావు పాప ఏమనేను నిన్ను

ఆడిబిడ్డ ఉసురు అది నీకు మేలా -ఏడు తరాల వరకు తల్లి ఆడిబిడ్డ ఉసురు
ఆడిబిడ్డ వుసురు అంబులై తగులు- ఏమి జేస్తివే తల్లి ఎరవ జూపిస్తివే
భావ బిడ్డలనుచు బత్తించవైతివి - బావ బిడ్డలను కత్తుల బోనులో కట్టివేసితివి
ఆపాప నీకెంత పగదాయెనటమ్మ- అడలంగ చెల్లెలును అంతరువుల మేడ కట్టించితీవు
కోడళ్ళు నీవు కొదవ లేకుండా - మేరువ బోలినట్లు మేడలోపలాను "

భక్తిరన్నడు తల్లి అని పక్షపాతం వహించకుండా ఆమె చేసిన తప్పును, అన్యాయాన్ని నలుగురిలో కడిగివేసినట్లుగా అడిగాడు. తల్లిని ఆవిధంగా నిందించి పాపనూకను చూసేవరకు తాను అన్నం ముట్టనని భీష్మించుకుంటాడు. అప్పుడు ఎరినప్ప మొదలైన స్త్రీలందరూ మేడలో ఉన్న పాపనూకను తీసుకొని వస్తామని ఆతనికి చెప్పి పాపనూక స్నేహితురాండ్రను తీసుకొని ఏడు అంతస్తుల మేడలో ఒంటరిగా చిలుకలు పావురాలు మొదలైన పక్షులు మాత్రమే తోడుగా దుర్భర శోకంతో జీవిస్తున్న పాపనూక దగ్గరికి వస్తారు. వారు మేడకు నిచ్చెనలు వేసి ఒక్కొక్క మేడ ఎక్కుతూ ఆరవ అంతస్తులో ఉన్నప్పుడు అక్కడి పక్షులు రొద చేస్తూ తల్లడిల్లుతాయి. ఆరొదలోని అర్థాన్ని తెలుసు కున్న పల్లికొండ భార్య అయిన పందుముల ఎరినప్ప నడుము విరిగిపోయినట్లుగా కూల బడిపోయి తీవ్రమైన విచారంలో మునిగిపోతుంది. ఆమె పక్కనే ఉన్న వెలమ పద్మ రాఘవుని భార్య అయిన పైడి ఎల్లప్ప అనే ఆమె ఎరినప్ప విచారానికి కారణం చెప్పమని అడుగుతుంది.దానికి ఎరినప్ప ఇలా చెబుతుంది.

"చెల్లులా ఇకనేమి చెప్పుదును నేను - కామురము దనుముకొండ కడముట్టలేము
మీబావ పల్లికొండ పాలేటి వద్దను -పట్టాబి అయితమారాజుకి పైనిండ అలుగులు
బల్లెములు బల్యాలు నాటె - నవరత్నాలు పతకము నడుముకు వరిగె
నీపెనిమిటి పద్మరాగవునకు - రొమ్ముపోట్లు తగిలి రోషంబుతోను
గాజువిల్లు విరిగి కత్తులు నాటి రనములో వరిగె - అని చెప్పె పాపంబు పక్షి
ఎర్రయ్య ఉత్తమారాజులు యాదవులెల్ల - బొల్యావుకు పోట్లు తగిలెనని
వల్లబులు తిరుమందుల వారెల్ల వరిగెనని చెప్పెనే - పాపంబు పక్షి
బిరుదుమన్నీలు వీరన్న చెల్లె గాబోలు- కంటసిరి బాలులు కోట్లుగా చెల్లిరి
పోట్లు పడిపడి వచ్చు బసవన్న - ఎలమంచి పట్నములోకి"

యుద్ధంలో పల్లికొండ, ఐతమరాజు మొదలైన యాదవవీరులతో పాటు పద్మరాఘవుడు కూడా చనిపోయాడని, మరి కొంచెం సేపట్లో తాము ఇప్పుడు ఉన్న పాపనూకమేడ కూడా కాలిపోయి పాపనూకతోపాటు స్త్రీలందరూ కూడా చనిపోతారని పక్షులు మాట్లాడుకున్నాయని ఎవరికీ వినిపించని విధంగా రహస్యంగా ఎల్లప్పకు మాత్రమే



వినిపించేటట్లుగా ఎరినప్ప చెబుతుంది. ఆతర్వాత వారందరూ కలిసి పాపనూక ఉంటున్న ఏడవ అంతస్తుకు చేరుకుంటారు. వారిని చూసి పాపనూక ఆశ్చర్యపోయి ఆరు నెలల తర్వాత తాను మనుషులను చూస్తున్నందుకు, అందులోను తన వారిని చూస్తున్నందుకు ఆమె ఎంతగానో సంతోషించి తన అక్కలందరికీ తానే కాళ్ళు కడిగి తాను కట్టుకున్న పట్టుచీర కొంగుతో పాదాలు తుడిచి జంపఖానాలు పరిచి వారిని కూర్చోబెడుతుంది. ఎరినప్ప మొదలైన స్త్రీలు పాపనూకను ఎంతో ప్రేమతో తమ ఒడిలో కూర్చోబెట్టుకొని తాము తెచ్చిన మంచిగంధం కస్తూరి మొదలైన వాటిని ఆమెకు పూసే ప్రయత్నం చేస్తారు. వాటిని తిరస్కరిస్తూ పాపనూక ఇలా పలుకుతుంది.

"అంటకే ఎరినప్ప అన్నికారిని నేను- కటకటా నాకేల గందవిడియములు
పున్యము గల స్త్రీలకు గాక ఈపూలపుష్పములు- అంటకే ఎరినప్ప అన్నెకారిని నేను
సంతోసముగా ఉన్నవారికి సకలబోగములు- చింతయున్న వారికి శ్రీగందమేల
బోటికి ఎందుకీ బ్రతుకు - మీరు వచ్చుట నాకు మిగుల బోగంబు
అప్ప మీరు వచ్చినది నాకు ఆచ్చర్యము -ఏమి అపాయము వచ్చెనో అంతరువుల
మేడ కొచ్చితిరి
ఒంటిస్తంబపు మేడలో ఒంటిదాననుంచితిరి- నేటికి ఆరు మాసములాయె
నేడు మీరు వస్తిరి ఆనాడు నామీద దయలేదా మీకు- తల్లి సిరిదేవి చూడకుండా వస్తిరా
పందుముల ఎరినప్ప చెప్పవే నీవు - పాప మాటలకు ఎరినప్ప ఏమి చెప్పెనంటె"

జానపదసాహిత్యంలో పాపిష్టివారిని అన్నెకారి అని సంబోధిస్తూ ఉంటారు. పాపనూక పాపిష్టిది కాకపోయినా నష్టజాతకురాలని ఆమె తమతో కలిసి ఉంటే తమకు అపకారం జరుగుతుందన్న మూఢనమ్మకంతో ఆమె దాయాదులైన స్త్రీపురుషులందరూ యవ్వనంలో ఉన్న అమ్మాయి ఓంటరిగా ఎలా జీవిస్తుందన్న కనికరమూ జాలి దయా లేకుండా ఆమెను ఒంటరిగా మేడలో ఉంచారు. ఒంటరిగా ఉండడం చేత ఆరునెళ్ళగా పలుకరించే దిక్కులేక దుర్భరమైన శోకంతో ఓదార్చేవారు లేక తనకు తానుగా ఓదార్చుకుంటూ క్షణమొక యుగంగా ఆమె కాలం వెల్లబుచ్చుతూ ఉంది. ఆరు నెళ్ళు ఆమెకు ఆరు యుగాలు కాదు అరవై యుగాలుగా గడిచాయి. అందువల్లనే ఆరునెళ్ళ తర్వాత మనుషులు కనపడగానే ఆమె వారిని ఎంతో ఆప్యాయంగా పలుకరించి అతిధి మర్యాదలు చేసింది. వచ్చినవారు తన మీద ప్రేమతో వచ్చివుండరని తన అవసరం ఉండబట్టే వచ్చివుంటారని కూడా ఆమె గ్రహించింది. వచ్చినవారు వారి అవసరానికి తన మీద ఎక్కడలేని ప్రేమ చూపిస్తూ తన శరీరానికి మైపూతలు పూస్తుంటే వాటిని తిరస్కరిస్తూ అలాంటి మైపూతలు, భోగాలు సంతోషంగా ఉన్నవారికి, పుణ్యం చేసుకున్నవారికే

గానీ తన లాంటి పాపిష్టివారికి అవసరం లేదనీ, వారు రావడమే తనకు గొప్ప భోగమని పలికి వారు తన అంతరువుల మేడకు రావడానికి వారికి వచ్చిన ఆపద ఏమిటో చెప్పమని పలుకుతుంది. ఆమె మాటలకు ఎరినప్ప ఇలా చెబుతుంది.

"వల్లబుల వారి చెల్లెలా – నేను వచ్చిన పని చిన్నబుచ్చుకుమీ
కాశియాత్ర పోయిన కరకంటమూర్తి – దినకరుడు ఉదయించిన వేలకు
మన దివానమునకు వచ్చినాడు – గయాయాత్ర నుండి వచ్చినాడు మీయన్న బత్తుడన్న
అమ్మా పాప ఏదని అడిగినాడు నన్ను –కన్యను కడ మేడ ఉంచితిమని చెప్పినాము
అన్నకు ఈమాట అన్నియును చెప్పితిమి – కాశీ తీర్తంబు గయావిబూది
నీకు ముందు ఇచ్చి పరులకు వెనుక ఇస్తునని –గర్భపు చెల్లెలిని కదిలి రమ్మన్నాడు
నిన్ను మేడ దింపమని నను పంపినాడు– అన్నా చెల్లెలు మీద ఆసలుంటాయి "

"కాశీనుండి మీయన్న భక్తుడు వచ్చాడు, నిన్ను చూడాలంటున్నాడు, నీకు కాశీతీర్థం, గయావిబూది ఇవ్వాలంటున్నాడు, ముందు నీకు ఇచ్చిన తర్వాతనే వాటిని మిగిలిన వారికి ఇవ్వాలంటున్నాడు అందుకని నిన్ను మేడలో నుంచి తీసుకొని పోవడానికి మేము వచ్చాము" అని ఎరినప్ప చెప్పగానే పాపనూకకు చాల కోపం వచ్చింది. అసలు తన బాధలన్నింటికీ మూలకారణం కళ్యాణపట్టణంలో నుంచి భక్తుడు తనను తీసుకొని వచ్చి దాయాదుల్లో పడవేసి తన దారిన తాను కాశీ వెళ్ళిపోవడమే. అందువల్ల భక్తుని పేరు ఎరినప్ప చెప్పగానే ఆమెకు ఎక్కడ లేని కోపం వచ్చింది. ఆమె కోపాన్ని జానపద కవి ఇలా వర్ణించాడు.

"అన్నా అనగా చెల్లెలుకు కోపము కొట్టుమిట్టాయె– కోపమే సోకము గోరసోకము
అగ్గిలోపల నెయ్యి జల్లినట్టయ్యె – ఎండి మొగలిమాను ఎరగట్టినట్లు
కుమ్మరి ఆము లెస్సగా కూలినట్లు – ఏరున్ను గెడ్డన్ను ఎగపొంగినట్లు"

కోపంతో ఆమెకు భరింపలేనంత దుఖం వచ్చింది. ఆమె కోపాన్ని కోపంతో పాటు వచ్చిన ఆమె దుఖాన్ని జానపదకవి చిన్నచిన్న మాటలతో చాల చక్కగా పైగేయంలో వర్ణించాడు. ఆతర్వాత పాపనూక తన కోపాన్ని దు:ఖాన్ని అణచివేసుకొని ప్రశాంతంగా తన కోపాన్ని బాధను ఇలా వ్యక్తం చేస్తుంది.

"గర్భపు చెల్లెలు కన్నీరు తుడుచుకొని – అన్నలనకె ఎరినప్ప ఆరదు మంట
నన్ను కిన్నడ జేసిన అన్నలింకెవరు తమ్ములింకెవరు–నమ్మించి తెచ్చిన నాకేటి అన్నలు
అన్నలు నాకెవరు ఆసపడనేటికి – కన్నవారికి నేను కడు ద్రోహినైతి
చిలుకలు నాతోడు జింకలు నాతోడు – పావురములు నాతోడు బత్తుడన్న ఎవరు
జీవిలేని ప్రతిమను నేను ఆయితిని – వేటగాని పక్షి వెగసిన రీతి



గూట వేసిన పున్యగురువు వారెవరు నాకు – తమ్ములకు చెల్లెలు అగుమంచి గాక
నన్ను సొద జేసిన నాకేటి అన్నలు – పున్యము గల వారికి అన్నలు గానీ
అన్నికారిని నేను అన్నలింకెవరు – అగుపడ్డ పులికి ఆవు వెగసిన రీతి
పరవాని బాలలకు బత్తుడన్న ఎవరు – చెర ఉంచిన చెల్లెలుకు అన్నలింకెవరు
బత్తుడన్నకు నామీద బక్తి యున్నాదో లేదో– ఆకాసమే తండ్రి బూకాంతయే తల్లి
ఎక్కడ కన్నవారు ఎరినప్ప నీవు – కడమేడ పుట్నిల్లు స్తంబమె అన్నలు
కడమేడ పుట్నిల్లు స్తంబమె నాతోడు – కర్రలే చుట్టాలు నిప్పులే బందువులు
మేడమీద దూలాలు మేనత్తలు నాకు – నేనెట్లు వస్తునే అప్ప ఎరినప్ప
అన్నదమ్ములు లేక ఆత్మబందువులు లేక – బావమరుదులు లేక బందువులు లేక
శివుడు నాబతుకు ఒంటి జేసెనోయమ్మ –కటకటాయనుచు కన్నీరు కార్చె

జానపదకవి పాపనూక బాధను, దు:ఖాన్ని చాల హృద్యంగా సులభమైన చిన్న మాటలతో రమణీయంగా పై గేయ భాగంలో వర్ణించాడు. ఆమె దు:ఖాన్ని బాధను అర్థం చేసుకున్న ఎరినప్ప ఆమె కన్నీరు తుడిచి ఓదారుస్తుంది.

"ఏడ్వకు చెల్లెలా అని ఎరినప్ప చెప్పెను – పట్టుచీర కొంగుతో ఎరినప్ప పాప కన్నీరు తుడిచెను
ఎంత ఏడ్చుతావు ఎర్రినాపాప – ఎంత దుక్కిస్తివో ఎర్రినాపాప
గురువేమి చేశాడు కొదువేమి తల్లి – బత్తుడన్నకు నీమీద బక్తి యున్నాది గానీ
పగ లేదు చెల్లెలా బక్తి యున్నది గానీ – బత్తుడన్నను నీవు సాదింపగరాదు
బలగము ఒక ఎత్తు అన్నకు నీవు ఒక ఎత్తు – నీమీద గల ప్రేమ నామీద లేదు"

ఎరినప్ప పాపనూక మీద భక్తునికి ఉన్న ప్రేమాభిమానాలను చాల చక్కగా తెలియ జేసింది. నిజానికి భక్తుడు కాశీకి వెళ్ళకుండా వుంటే పాపనూకకు ఈకష్టాలుండేవి కావు. ఎరినప్ప చెపినట్లు భక్తునికి మిగిలిన యాదవులందరూ ఒక ఎత్తు, పాపనూక ఒక ఎత్తు. అతనికి తన స్వంత చెల్లెలైన అగుమంచి మీద కంటె పాపనూక మీదనే ఎక్కువ ప్రేమాభిమానాలున్నాయి. పాపనూకను మేడలో పెట్టాలన్న యాదవుల మూడ నమ్మకాన్ని భక్తుడు తప్పనిసరిగా అంగీకరించేవాడు కాదు. అతణ్ణి కాదని, అతని ఇష్టానికి భిన్నంగా యాదవులెవరూ ఏపనీ చేయరు. మిగిలిన వారు ఎలా ఉన్నా భక్తునికి మాత్రం పాపనూక మీద గొప్ప ప్రేమ ఉంది. కాబట్టి అంత ప్రేమ ఉన్న భక్తుడు కోరినట్లుగా మేడదిగి రావాలని ఎరినప్ప చెప్పగానే పాపనూక కూడా కొంత ఉపశమనం చెంది తన పుట్టుక నేపథ్యాన్ని గురించి ఆమె తల్లిదండ్రులైన పెద్దిరాజు పెద్దమ్మలు సంతానం కోసం బంధుబలగాన్ని వదలి తమ వంతు ఆవులను పంచుకొని

ఎక్కడో దూరంగా ఉన్న కళ్యాణపట్టణానికి వెళ్ళారని, చివరకు దురదృష్టవంతురాలైన తనను కన్నారనీ తన పుట్టుక కారణంగా తన తండ్రి అయిన పెద్దిరాజు యుద్ధంలో మరణించాడనీ, తన తల్లి పెద్దమ్మ భర్త ఎడబాటును సహింపలేక తనను తన అన్న కాటమరాజును కళ్యాణపట్టణంలో కలబోతుల గంగమ్మకు అప్పగించి భర్తతో సహగమనం చేసిందని, కళ్యాణపట్టణంలో గంగమ్మ ఇంట్లో పెరుగుతున్న తమను భక్తిరన్నడు తీసుకొని వస్తే దాయాదులు తనను ఒంటరిగా మేడలో ఉంచారని ఎరినప్పతో చెబుతుంది. ఇంతలోనే భక్తిరన్నడు పాపనూక మేడదిగి రాదని తన దివ్యదృష్టితో గ్రహించి దనుముకొండతో పాటు పాపనూక మేడ గూడా అగ్నిపాలు కావాలని శపించి యుద్ధంలో చనిపోయిన తన బంధవులను చూడడానికి ఎరగడ్డపాటికి వెళ్ళిపోతాడు. అతడు శపించినట్లుగా దనుముకొండతో పాటు పాపనూక మేడ గూడా మంటలపాలు అవుతుంది. ఆమంటల్లో యాదవస్త్రీలందరితోపాటు పాపనూక గూడా చనిపోతుంది. ఈవిధంగా పాపనూక వృత్తాంతం విషాదాంతంగా ముగుస్తుంది. కాటమరాజు కథల్లో పాపనూక కథ గొప్ప కరుణరసభరితమైనది.

## తెరచీరలవారు - సాహిత్యాంశాలు :

తెరచీరల కళాకారుడైన కొల్లి రమణ గారు కాటమ రాజు కథల్లో ప్రధాన కథను పాడి వినిపించారు. ప్రధానకథ అంటే కాటమరాజు తాత అయిన వలురాజుకు పెద్దిరాజు పుట్టడం, పెద్దిరాజుకు కాటమరాజు పుట్టడం, కాటమ రాజుకు నెల్లూరు సిద్ధిరాజుకు పుల్లరి విషయమై యుద్ధం జరగడం మొదలైన కథాభాగ మంతా ఉంటుంది. కొల్లి రమణగారు వలురాజుకథతో కాటమరాజు కథను ఇలా ప్రారంభించారు.

"పుట్టుక ఎలమంచిలి పూరము దనుకొండ- ఏలిక ఎలమంచిలి ఏకదనుము కొండ
ఏలే గొల్లరాజు ఆవుల వలరాజు-ఆవుల వలరాజు బార్య ఆవుల వలవాదేవి
అప్పుడు వారికైదావులుండేవి "

వలురాజు తనకున్న ఐదు ఆవులను దివానుగిరి పర్వతానికి తోలుకొని వెళ్ళి మేపుకొని వచ్చి, ఐదు ఆవుల పాలు తెచ్చి వలవాదేవికి ఇచ్చేవాడు. కొంతకాలం తర్వాత ఐదు ఆవుల్లో పెదగంగమైలావు అనే ఆవు రాత్రిపూట వెళ్ళి శివన్నారాయుడికి (శివునికి) పాలివ్వడం మరిగింది. పొద్దున పూట అది పాలు ఇవ్వడం లేదు. పాలు తక్కువ కావడం గమనించిన వలవాదేవి వలురాజును ఇలా ప్రశ్నిస్తుంది.

"ఒరే నెయ్యంటి దనుముకొండ నాయినో- ఒరే నేల గలిపావురా దేవో



ఒరే బాగాపు దనుముకొండరా దేవో - ఒరె బొగ్గులపాలు జేశావురా నాయినో
ఒరే మచ్చ లేని జాతికి మచ్చ దెచ్చినావు - వాడుక లేని జాతికి వాడుక దెచ్చినావు"

ఈకథాగేయంలో ఏచిన్న తేడా వచ్చినా పై విధంగా ఒక పాత్రను మరొక పాత్ర అడుగుతుంది. ముందుముందు పైన చెప్పిన ఈపాదాలు చాల సార్లు పునరావృత మవుతాయి. ఇది ఈకథాగేయంలోని వారాను వర్తనం.

వలురాజు పెదగంగమైలావు పాలివ్వడం లేదని వలవాదేవికి చెబుతాడు. అప్పుడు వలవాదేవి మనకు "ఏటికి యాదవులున్నారు, కోటికి వల్లవులవారున్నారు". వారిలో పన్నెండు మందిని "కవుదొడ్డి" దగ్గర కాపలా పెట్టమని చెబుతుంది. వలురాజు భార్య చెప్పినట్లుగానే 12 మంది యాదవులను పిలిచి పెదగంగమైలావు పాలు ఏమవుతున్నాయో కనిపెట్టి చెప్పాలని, అలా చెప్పకపోతే వారి తలకాయలు తీసి కోటగుమ్మానికి కడతానని చెబుతాడు.

ఈకథాగేయంలో వలురాజు తనకున్న ఐదు ఆవులను తానే కాసేవాడని మొదట చెప్పబడింది. ఇక్కడ వలవాదేవి మనకు పనివాళ్ళైన యాదవులు కోటిమంది ఉన్నారు. వాళ్ళలో 12 మందిని ఆవులదొడ్డి దగ్గర కాపలా పెట్టమని చెబుతూవుంది. ఇందులో ఏది వాస్తవం? సాధారణంగా కథను చెప్పేవారు అతిశయోక్తులు చెబుతూ ఉంటారు. అందులోనూ జానపద సాహిత్యంలో అతిశయోక్తులు, అభూతకల్పనలు మరింత ఎక్కువగా చోటు చేసుకుంటాయి. అందువల్ల ఇందులో మొదట చెప్పినదే అంటే వలురాజుకు ఐదు ఆవులు మాత్రమె కలిగినవాడుగా ఉండడం వాస్తవం. తర్వాత చెప్పినది కల్పన. వలురాజు ఒకరిని గానీ ఇద్దరిని గానీ పెదగంగమైలావు దగ్గర కాపలా పెట్టి ఉంటాడు.

12మంది యాదవులు వలురాజుకు భయపడి చాల జాగ్రత్తగా కాపలా ఉంటారు. వారు కొంచెం ఆదమరచి ఉన్నప్పుడు ఆవు దొడ్డిలో నుంచి దూకి శివుడున్న చోటుకు వెళ్తూ ఉంటుంది. ఇంతలోనే కాపలావాళ్ళు మేల్కొని ఆవు దెక్కజాడను పట్టి దాని వెనకానే వెళ్తారు. ఆవు ఒక దగ్గర శివునికి పాలిస్తూ కనిపిస్తుంది. పాలదొంగ దొరికాడని భావించి 12మంది అతణ్ణి కొట్టడానికి ప్రయత్నిస్తారు. శివన్నారాయుడు ఆక్కడే ఉన్న పుట్టలోకి వెళ్ళిపోతాడు. కాపలావాళ్ళు అతణ్ణి పట్టుకోవడానికి పుట్ట తవ్వుతూ ఉంటారు. తీసినమట్టి తిరపతికొండ లాగా పెరిగిపోతూ ఉంటుంది. ఇలా లాభం లేదని శివుడు 12మంది పనివాళ్ళను, ఆవును శిలలుగా చేస్తాడు.

మరుసటిరోజు తెల్లవారిన తర్వాత వలురాజు ఆవులదొడ్డి దగ్గరికి వచ్చి చూస్తే ఆవు, కాపలావాళ్ళు కనపడరు. అతను కంగారు పడి ఇంటికి వచ్చి భార్యతో నువు

చెప్పినట్లుగానే 12మందిని కాపలా పెట్టాను, వాళ్ళు ఏమయ్యారో తెలియడం లేదు. ఆ12 మంది భార్యలు వచ్చి తమ భర్తలు ఏరంటే ఏమి సమాధానం చెప్పాలి. ఇదంతా నీసలహా వల్లనే జరిగింది కాబట్టి నువ్వే వెళ్ళి వెదికి వాళ్ళు ఏమయ్యారు తెలుసుకొని రావాలని లేకపోతే ఆమె తల తీసి కోటగుమ్మానికి కడతానని చెబుతాడు. వలవాదేవి ఆవులదొడ్డి దగ్గరికి వచ్చి ఆవు డెక్క జాడలు, పనివాళ్ళ అడుగుజాడలను బట్టి వెదుకుతూ పుట్ట దగ్గరికి వెళ్ళి అక్కడ శిలాప్రతిమలుగా ఉన్న 12 మంది పనివాళ్ళను ఆవును చూసి, ఏమునీశ్వరుడో శపించి వారిని శిలలుగా చేశాడని భావించి వారిని తిరిగి మనుషులుగా చేయడానికి తపస్సు ప్రారంభిస్తుంది. ఆతపస్సు ఇలా చేసింది.

"ఆకుమీద ఆకేసింది - ఆకుమీద మూడు వడ్లగింజలు
మూడు వడ్లగింజల మీద మూడారక గింజలు-మూడారక గింజల మీద మూడు కదుర్లు
మూడు కదుర్ల మీద మూడు సూదులు-మూడు సూదుల మీద మూడు నిమ్మపళ్ళు
మూడు నిమ్మపండ్ల మీద సిరసు కిందికి -సిరిపాదం మీదికి పెట్టి తపసు పట్టింది"

కథాగేయాలన్నింటిలోనూ స్త్రీలు చేసే తపస్సు దాదాపుగా పైవిధంగానే చెప్పబడుతుంది. ఇలా చెప్పబడడాన్నే వారాను వర్తనం అంటారు.

వలవాదేవి తపస్సుకు ముల్లోకాలు అల్లకల్లోలమై పోతుంటాయి. ఆమె తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకోమంటాడు. ఆమె శిలాప్రతిమలుగా మారిపోయిన 12 మంది యాదవులను, ఆవును తిరిగి మామూలుగా చేయడానికి తపస్సు చేసింది. అలా "సచ్చినోళ్ళు బతికితే ఇంకా ముందుకు పపంచకం పుట్టనైయుంది, పెద్దనైయుంది, ఇంక ఆళ్ళు గూడా సచ్చినోళ్ళు బతుకుతారు గదాని" పార్వతి వలవాదేవి మనస్సును మార్చివేస్తుంది. అప్పుడు వలవాదేవి " ఒస్వామీ నాకు ఇన్నూరు మున్నూరు ఆవులు గావాల, ఆవుల్లో నాకు బొల్లావు గావాల. నాకు బొల్లావు లోను ఒక బసాదేవుడు గావాల, నాయింట నువు పాలు తాగావు కాబట్టి నాయింట నువు పుట్టాలయ్యా" అని కోరుకుంటుంది. శివుడు ఆమె కోరికలన్నీ తీరుస్తానని ఇంక ఇంటికి వెళ్ళిపొమ్మని చెప్పి వెళ్ళేటప్పుడు వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళాలని పుట్టలో నుంచి ఆమె కోరుకున్నన్ని ఆవులు పుట్టి ఆమె వెంట వస్తాయని చెబుతాడు. శివుడు చెప్పినట్లుగా ఆమె ఇంటికి పోతూ ఉంటే పుట్టలోనుంచి ఆవులు పుట్టి వస్తుంటాయి.

"ఎరజీమలకైనా ఎడతెరపుంటుంది గానీ పుట్టలోనుంచొచ్చే ఆవులకు ఎడతెరపి లేదు,
జడివాన సినుకునైనా లెక్కెట్టచ్చు గానీ పుట్టలోనుంచొచ్చే ఆలమందకు లెక్కగుర్తు లేదు.
పిక్కలే సన్నాలు పిగిలిబట్టావులు - ఆడుగులు సన్నాలు ఆలబట్టావులు
కొమ్ములు సన్నాలు గొబ్రాజు ఆవులు - చెదిరితే ఆలమంద చిలకలాంటి ఆవులు
ఏడుగొడపుటావులు ఎములోకవర్ణము -డెబ్బైయ్యేడు వర్ణాలు రయి దప్పుతున్నాయి "

ఇలా వస్తుంటే ఉండబట్టలేక వలవాదేవి వెనక్కి తిరిగి చూస్తుంది. వెంటనే పుట్టలో నుంచి వచ్చే ఆవులు ఆగిపోతాయి. వలవాదేవి అంతవరకు వచ్చిన ఇన్నూరుమున్నూరు ఆవులను తోలుకొని ఇంటికి వచ్చి వాటిని కాయమని భర్తకు అప్పజెప్పుతుంది. వలరాజు వాటిని కాస్తుంటాడు. అప్పుడు వలవాదేవికి సంతానం కావాలన్న కోరిక పుడుతుంది.

అంతవరకు వలరాజు వలవాదేవి దంపతులకు ఐదు ఆవులు మాత్రమే ఉండేవి కాబట్టి, అంటే వారు బీదవారుగా ఉన్నారు కాబట్టి ఆమెకు సంతానం మీద పెద్దగా కోరిక కలగలేదు. ఇప్పుడు ఆవులు ఎక్కువగా ఉన్నాయి కాబట్టి ఆమెకు సంతానం మీద కోరిక తీవ్రమై భర్తతో

"సంతానం లేని బతుకు నేను బతకలేను- సంతానం లేనిల్లు చావిడి కూటాము
పురుషుడు లేనిల్లు పుల్లనాకోన- ఆడది లేనిల్లు అడవిలో కొంప
దీపం లేనిల్లు దిక్కు మాలిన కొంప- కుక్క లేనిల్లు గుడ్డిల్లు స్వామీ"

అని భర్తతో మొర పెట్టుకుంది. దానికి వలురాజు దేవుడు తమకు సంతానం ఇవ్వలేదు, ఇప్పుడు తాము వృద్ధాప్యంలోకి అడుగు పెట్టాం కాబట్టి ఇక తమకు సంతానం కలిగే అవకాశం కూడా లేదని చెబుతాడు. అప్పుడు వలవాదేవి భర్త అనుమతితో జాలరి వాళ్ళ అమ్మాయిని తెచ్చుకొని పెంచుకుంటూ ఉంటుంది. ఆఅమ్మాయి పెరిగి పెద్దదైన తర్వాత ఆమెను పందుముల పాపినాయుడు అనే అతనికిచ్చి పెళ్ళి చేస్తారు. ఈ దంపతులకు గూడా సంతానం కలగలేదు. సంతానం కోసం వలవాదేవి ఆమె కూతురు కాశీకి పయనమవుతారు. అది మంచి వేసవి కాలం. వేసవి కాలాన్ని జానపదకవి ఇలా వర్ణించాడు.

"మండగా ఏసంగి మంటలు కక్కుతుంది-రేలకొండి ఏసంగి రేయించి కాగుతుంది
గంటలో నీళ్ళన్నీ గంటిసేలవుతున్నాయి-పచ్చని కూరల్లా నిచ్చుకర్పూరమవుతుంది
తోకసుక్క ఏసంగి తోరించి కాస్తుంది"

దారిలో వారికి ఒక కోనేరు కనిపిస్తుంది. దాహం తీర్చుకోవడానికి కోనేటి దగ్గరికి వెళ్తే వారికి కోనేట్లో ఒక తామరాకులో ఒక బాలుడు కనిపిస్తాడు. తల్లీకూతుళ్ళు కాశీకి వెళ్ళడం మానివేసి ఆబాలుని తీసుకొని ఇంటికి తిరిగి వస్తారు. బాలుని వలవా దేవి కూతురు పెంచుకుంటూ ఉంటుంది. ఐతే ఆచిరకాలంలోనే బాలుని పెంచుకుంటున్న పందుముల పాపినాయుడు, అతని భార్య చనిపోతారు. ఆబాలుని పెంచుకోవడం వల్లనే తన కూతురు అల్లుడు చనిపోయారేమో అని వలవాదేవి అనుమానించి కొంత మంది బ్రాహ్మణులను పిలిచి తన సందేహాన్ని చెప్పి ఆబాలుని గురించి అడుగుతుంది.

దానికి వారు ఆబాలుడు గొప్ప మాహాత్మ్యం కలవాడని, అతనికి భవిష్యజ్ఞానం ఉందని, అతను ఉండే ఇల్లు గొప్పగా వృద్ధి పొందుతుందని చెప్పి అతనికి పల్లికొండ దేవుడని నామకరణం చేస్తారు. పల్లికొండ పెరిగి పెద్దవాడవుతూ ఊర్లో వాళ్ళకు పుట్టబోయే సంతానం గురించి తన మామ్మ అయిన వలవాదేవికి చెబుతూ ఉంటాడు. అతడు చెప్పినట్లు గానే జరుగుతూ ఉంటుంది. దీనితో ఆమెకు సంతానం మీద ఆశ చిగురించి తన ఇంటిపేరు నిలబెడట్టడానికి ఒక కుమారుడు కలిగే మార్గం చెప్పమని, లేకపోతే పల్లికొండ ఎక్కడ దొరికాడో అక్కడనే అతణ్ణి వదలిపెట్టి వస్తానని చెబుతుంది. పెద్దింటమ్మకు గుడి కట్టి నూటొక్క జ్యోతులు వెలిగిస్తే ఆమెకు సంతానం కలగవచ్చని పల్లికొండ చెబుతాడు. అతను చెప్పినట్లుగానే వలవాదేవి పెద్దింటమ్మకు గుడి కట్టి నూటొక్క జ్యోతులు వెలిగించగానే ఒక జ్యోతిలో నుంచి ఒక బాలుడు పుడతాడు. పెద్దింటమ్మ దయవల్ల ఆబాలుడు పుట్టినందువల్ల అతనికి పెద్దిరాజు అని పల్లికొండ పేరు పెడతాడు.

కొంతకాలం పోయిన తర్వాత వలవాదేవి “ఒంటగ్గిపుల్లనీ ఒంటి కొడుకును నమ్ముడుందా” అని ప్రశ్నించి మరొక కొడుకునివ్వమని పల్లికొండను కోరుతుంది. శివునికి గుడి కట్టి నూటొక్క జ్యోతులు వెలిగించమని పల్లికొండ చెబుతాడు. వలవాదేవి అతడు చెప్పినట్లు చేయగానే ఒక జ్యోతిలో నుంచి బాలుడు పుడతాడు. శివుని దయవల్ల పుట్టిన ఆబాలునికి సింహాద్రిరాజని పల్లికొండ పేరు పెడతాడు. ఆతర్వాత వలవాదేవి పల్లికొండను మళ్ళీమళ్ళీ కోరి ఎరబెజవాడమ్మ వల్ల ఎరనూకరాజును, నలబెజవాడమ్మ వల్ల నలనూకరాజును, పోలేరమ్మ వల్ల పోలురాజును, కొమరమ్మ వల్ల కూతురు కొమరమ్మను పొందుతుంది. వీరందరూ పెరిగిపెద్దవాళ్ళై పెళ్ళిళ్ళు చేసుకుంటారు. ఆతర్వాత కొంత కాలానికి వలురాజు, వలవాదేవి చనిపోతారు.

తెరచీరల కళాకరుడైన కొల్లి రమణ గారు పాడిన పైకథలోని వలురాజు కథకు, ఆచార్య తంగిరాల సుబ్బారావు గారి సంపాదకత్వంలో ప్రచురింపబడిన కాటమరాజు కథలు గ్రంధం మొదటి భాగంలోని వలురాజు కథకు చాల తేడా ఉంది. కొల్లి రమణగారు పాడిన కథను ఎవరు చెప్పారో తెలియదు. సుబ్బారావు గారి గ్రంధంలోని వలురాజుకథను రాసినవారు వదరుప మద్దులేటికవి అని కథ చివర చెప్పబడింది. ఈకథలో వలురాజు ఎలమంచి పట్టణపాలకుడు. ఇతని తండ్రి కవులావుల గంగరాజు. తల్లి గంగమ్మ. ఈదంపతులకు కలిగిన నలుగురు కుమారుల్లో ఇతడు పెద్దవాడు. హరిపాలుడు, నందగోపాలుడు, గోవర్ధనుడు ఇతని తమ్ములు. ఖండమొండెములకోటను పాలిస్తున్న కలభూతగంగురాజుకు ఇతనికి అవినీతిపరులైన



ఐదుగురు బ్రాహ్మణుల కారణంగా యుద్ధం జరుగుతుంది. ఈయుద్ధంలో అతని ముగ్గురు తమ్ములు చనిపోతారు. చివరగా వలురాజు యుద్ధానికి వెళ్తూ తన మంత్రి అయిన పల్లికొండ సలహానను సరించి తన కుమారుల్లో పెద్దవాడైన సింహాద్రిరాజును కాకుండా రెండవకుమారుడైన పెద్దిరాజును ఎలమంచి పాలకునిగా నియమించి గంగరాజు మీదకు యుద్ధానికి వెళ్ళి గంగరాజును చంపి యుద్ధంలో తగిలిన గాయాలవల్ల మరణిస్తాడు. వలురాజు చనిపోవడానికి ముందు పల్లికొండ తన జన్మ వృత్తాంతాన్ని వలురాజుకు ఇలా చెబుతాడు.

“నా పూర్వ జన్మంబు నా పూర్వ ఫలము– భూపాల! వినుపింతు వొసగి యాలించు
శ్రీవిష్ణువైకుంఠ సింహాసనమున– సేవ్యుడై యున్నట్టి సమయంబునందు
చెప్ప చూపగరాని సేవకులు కలిగి– శ్రియః పతినిత్యంబు నమిత సద్భక్తి
బృందారకవరదు పూజ లొనర్చి– అందరిలో భక్తి అధికమై యుంటి
సకల జీవుల రక్ష సద్భక్తి మోక్ష - దొకనాడు నునుబిల్చి ఒక వార్త తెలిపె
విను ముఖ్యడగు శిష్య! వినుము నా యాజ్ఞ– అనఘ వర్తనులు సదాచారపరులు
ఇలయందు యాదవ వీర పుంగవులు– ఎలమంచి పంపాద్రి నేలుచున్నారు
వారిని తోడుక వైకుంఠమునకు– చేర వేగమె రమ్మి సెలవు పోపొమ్మి
అలనాడు మేము మధురాపురమునను– నలర జన్మించియు నందుని ఇంట
పెరిగి వెన్నలు పాలు పెరుగులు మ్రింగి– అరయ పట్టపు దైత్యులందరి గూల్చి
మామ కంసుని జంపి మరి పగను దీర్చి– గోములు జూపించి గొల్లవాడలను
నామంబు దెల్పించి నందుండు తండ్రి– మామలు బావలు మనతట్టు వారు
తమ్ములు తనయులు దాయాది వరుస– కమ్ముచు పెనగుచు కడసారి వరకు
కద్దు లేదనటంతో కయ్యమనిపించి– తద్దయు వైకుంఠ దరి చేర్చు నటుల
ధైర్యముగ నామారు తర్లి యాదవులు– కార్యముల్లలిగించి కలుపుక రమ్మి
సజ్జనుల్ యాదవుల్ సాహసోత్తములు– ముజ్జగంబుల యందు ముఖ్యమగువారు
వారికి మంత్రివై వారితోపాటు– దారి మోసిన వేళ తలుగక నాజి
ఎదురించి పోరాడి యేక చూపట్టి– మదినుంచి వారింటి మగువ పెండ్లాడి
తగలి వెంబడిమూడు తరముల నుండి– తగ తోడితెమ్ము సత్వరగ మాచెంత
వారి వెంబడి మంత్రివై యుండి నీవు”

యాదవులందరూ విష్ణుభక్తులు. అలాంటి మహాభక్తులను మూడు తరాలు మాత్రమే భూమి మీద రాజులుగా ఉంచి ఆ తర్వాత వారికి వైకుంఠ ప్రాప్తిని కలుగజేయాలని శ్రీమన్నారాయుడు భావించాడట. అందుకోసం తన భక్తుడైన పల్లికొండను కమలంలో

చిన్నబాలుడుగా పుట్టించినట్లుగా, వేటకు వచ్చిన వలురాజు అతణ్ణి చూసి ఎత్తుకొని తన మనుమనిలాగా పెంచుకుంటాడని, మూడు తరాల పాటు వారికి మంత్రిగా ఉండి ఆతర్వాత వారినందరినీ యుద్ధంలో చనిపోయేటట్లుగా చేసి వైకుంఠానికి తీసుకొని రమ్మని విష్ణువు తనకు చెప్పి పంపించాడని పల్లికొండ వలురాజుకు చెబుతాడు. మహాభారత యుద్ధం లాగానే కాటమరాజుకథల్లో యాదవుల యుద్ధాలు గూడా శ్రీహరి సంకల్పంచినవని ఇందులో చెప్పబడింది. వలురాజు కథలోని పల్లికొండ పుట్టుక కథనుసరించి కొల్లిరమణగారు పాడిన కథలో పల్లికొండ పుట్టుక కథ చెప్పబడింది.

తంగిరాల సుబ్బారావు గారు ప్రచురించిన పోలురాజు కథలో "చంద్రగుప్తుని చాటువ" అనే ఉపకథ ఉంది. ఇది పోలురాజు పూర్వజన్మవృత్తాంతం. ఇందులో చంద్రగుప్తుడు చంద్రగిరి పట్టణాన్ని పాలించే ప్రభువు. అతని కూతురు మల్లికాదేవి. చంద్రగుప్తుని ఐదు ఆవుల్లో ఒకటైన పెదగంగమైలావు ఈశ్వరునికి పాలు ఇస్తూ ఉండడం, చంద్రగుప్తుడు యాదవులను దానికి కాపలా ఉంచడం, యాదవులు ఆవును వెంబడించి దాని పాలు తాగుతున్న శివుని దేవుడని గ్రహించక గొడ్డలితో కొట్టడం, శివుని తాకిన ఇనుపగొడ్డలి బంగారుగొడ్డలిగా మారిపోవడం, యాదవులు వచ్చి ఈవిషయాన్ని చంద్రగుప్తునికి చెప్పడం, చంద్రగుప్తుడు యాదవులు చెప్పిన వర్ణనను బట్టి అతడు ఈశ్వరుడని గ్రహించి అతణ్ణి దర్శించడానికి పుట్టదగ్గరికి వెళ్ళి పుట్టను తవ్వించే ప్రయత్నం చేయడం, కొంతలోతు తవ్విన తర్వాత ఒక పెద్ద బండరాయి పడడం, దాన్ని పగలగొట్టడానికి దాని మీద దెబ్బ వేయగానే దాన్ని తాకిన పారలు, పలుగులు మొదలైన పరికరాలు బంగారంగా మారిపోయి ధగధగామెరుస్తూ వుంటే వాటిని చూచి చంద్రగుప్తుడు, అతని పనివారు మూర్ఛపోవడం, కొందరు యాదవులు వచ్చి మల్లికాదేవికి ఈవిషయం చెప్పడం, ఆమె పుట్ట దగ్గరికి వచ్చి ఈశ్వరుని ప్రార్థించడం, శివుడు ఆమెకు ప్రత్యక్షమై వరం కోరుకోమనడం, మల్లికాదేవి

"విను ధేనువై పూజ వెస యొనర్చుటను -ఆవులరాజయి అది పుట్టవలెను
ఆవుల రాజుకు నతివగా జేయు- భూతేశ నీవును పుత్రుడవైపుట్టి
ఖ్యాతి గల్లగ మాకు ప్రీతి వరమిమ్ము-తల్లిని నీకును తనయుడవీవు
ముందర నీనందిమూర్తి మామంద-అందమౌ బసవన్నయై పుట్టవలెను
మాయింట ఈశ్వరుడు మందబసవన్న -సాయమై యుందును సామీ యెప్పుడును
అల్ల చతుర్ముఖుడవని జనించి -చల్లని పుల్లెద్దుగా సమకూర్చు దేవ
ఆదివిష్ణువు మందనావయి పుట్టి-యాదవులకు గల్ల అర్థము జయము
అష్టదిక్పాలకుల్ యాదవులుగాను -ఇష్టత మాకిమ్ము విశ్వనాధుండ"



అని కోరుకోవడం జరుగుతుంది. పెదగంగమైలావు ఈశ్వరునికి పాలు ఇచ్చినందువల్ల అది మరుజన్మలో రాజుగా పుడుతుందని ఈశ్వరుడు మల్లికాదేవికి చెప్పగానే మల్లికాదేవి ఆఆవు రాజుగా పుట్టాలని, అతనికి భార్యగా తాను పుట్టాలని, వారిద్దరికి ఈశ్వరుడు కుమారుడుగా, ఈశ్వరుని వాహనమైన నంది వారి మందలో అందమైన బసవన్నగా, బ్రహ్మ పుల్లెద్దుగా, విష్ణువు బొల్లావుగా, అష్టదిక్పాలకులు యాదవులుగా పుట్టాలని కోరుకుంటుంది. ఈశ్వరుడు ఆమె కోరిన కోరికలన్నీ నెరవేరతాయని చెబుతాడు. మరుజన్మలో ఆవు పోలురాజుగా, మల్లికాదేవి అతని భార్య సిరిదేవిగా, ఈశ్వరుడు వారికుమారుడైన భక్తిరన్నడుగా జన్మిస్తారు. పోలురాజు కథలోని ఈచంద్ర గుప్తుని చాటువకథనే కొద్ది మార్పులతో కొల్లి రమణ గారు చెప్పిన వలురాజు కథలో వలురాజు పరంగా చెప్పబడింది.

తంగిరాల వారి గ్రంథంలోని వలురాజు కథలో రాజుగా చెప్పబడిన వలురాజు కొల్లి రమణ గారు చెప్పిన కథలో కేవలం ఐదు ఆవులు కలిగిన సామాన్యవ్యక్తిగా చెప్ప బడ్డాడు. ఐతే అతని భార్య వలవాదేవి తపస్సు ఫలితంగా వారికి ఈశ్వరుడు ఇన్నూరు మున్నూరు ఆవులను పుట్టలోనుంచి ప్రసాదించినట్లుగా అద్భుతసంఘటన చెప్పబడింది. జానపదులకు అద్భుతరసం మీద ఆసక్తి ఎక్కువ. ఆఆసక్తిని గమనించి జానపదకవులు తాము కల్పించే సాహిత్యంలో అద్భుతసంఘటనలను కల్పిస్తూ ఉంటారు. తంగిరాల వారి గ్రంథంలో వలురాజుకు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎరనూకరాజు, నలనూక రాజు, పోలురాజు, కొమరమ్మ అనే ఆరుగురు సంతానం మామూలుగా అందరిలాగానే అతని భార్య వల్లమ్మ గర్భాన కలిగినట్లుగా చెప్పబడింది. రమణగారు చెప్పిన కథలో వీరందరూ వలవాదేవి అనేక దేవతలకు పూజలు చేసి వెలిగించిన జ్యోతుల్లో పుట్టినట్లుగా అద్భుతసంఘటనగా చెప్పబడింది.

కొల్లి రమణ గారు చెప్పిన తర్వాత కథ ప్రకారం వలరాజు కుమారులైన సింహాద్రిరాజు పెద్దిరాజు మొదలైన ఐదుగురు అన్నదమ్ములు కలిసి ఆవులను కాసుకుంటూ ఎలమంచిలిలో జీవిస్తూ ఉంటారు. ఐతే ఐదుగురు అన్నదమ్ముల్లో ఎవరకీ సంతానం కలగదు. ఊర్లోవాళ్ళు వీరిని గొడ్డురాజులని పిలుస్తుంటే ఈఐదుగురు కోపించి భార్యలకు చెప్పకుండా ఆవులను తోలుకొని వేరే ఊర్లకు వెళ్ళిపోయి అక్కడే ఉంటారు. వారిభార్యలు ఎప్పటికైనా తమ భర్తలు తమ దగ్గరికి వస్తారనే ఆశతో ఎలమంచిలిలో ఉంటారు. పల్లికొండ ఆవులమంద దగ్గరినుంచి ఎలమంచిలికి వచ్చి పోలురాజు భార్య అయిన సిరిదేవితో ఆమెకు సంతానం కలిగే మార్గం చెబుతాడు. ఎలమంచిలికి ఆమడదూరంలో పర్వతాలస్వామి ఉన్నాడని ఎవరకీ తెలియకుండా రహస్యంగా

సిరిదేవి అతణ్ణి సేవిస్తే అతను కరుణించి ఆమెకు సంతానం కలిగిస్తాడని చెబుతాడు. పల్లికొండ చెప్పినట్లుగా సిరిదేవి రహస్యంగా పర్వతాల స్వామిని సేవిస్తుంది. ఆస్వామి కరుణించి ఆమెకు ఒక వీబూదిపండు ఇస్తాడు. సిరిదేవి ఆపండును తినడానికి విరవగానే పండులో బాలుడు పుడతాడు. విషయం తెలియని సిరిదేవి తోడుకోడళ్ళు సిరిదేవితో

"నెయ్యంటి దనుంకొండ నేల గలిపావు-పండంటి దనుంకొండ పాడు జేశావు
రంకు లేని జాతికి రంకు దెచ్చావు-వాడుక లేని జాతికి వాడుక దెచ్చావు"

అని ఆమెను ఇంట్లో నుంచి బైటికి తోసేస్తారు. ఈవిషయం ఆలమంద దగ్గర ఉన్న పోలురాజు తెలుసుకొని సిరిదేవిని చంపడానికి వస్తాడు. సిరిదేవిని చంపడానికి అతను ఎత్తిన కత్తి ఎత్తినట్లుగానే పైనే ఉండిపోతుంది. అప్పుడు పల్లికొండ వచ్చి పోలురాజుకు పర్వతాలస్వామి ఇచ్చిన వీబూదిపండులో నుంచి బాలుడు పుట్టిన విషయం చెబుతాడు. ఆబాలుడే కాశీబత్తుడు. ఆతర్వాత పెద్దిరాజుకు తప్ప మిగిలిన అన్నదమ్ము లందరికీ సంతానం కలుగుతుంది.

ఇంతవరకు చెప్పిన ఈకథాభాగమంతా తంగిరాల వారు ప్రచురించిన గ్రంథంలో లేదు. ఇదంతా తెరచీరల వారు కల్పించినదే. సంతానం కోసం పెద్దిరాజు అతని భార్య పెద్దమాదేవి తపించిపోతూ ఉంటారు. అప్పుడు కళ్యాణపట్టణంలో ఉన్న గంటసోమన్న పెద్దమాదేవికి కలలో కనిపించి ఇలా చెబుతాడు.

"నువ్వేటి కెన్నాళ్ళున్నా నాతల్లో నాయమ్మా
నువ్ కోటికి కొన్నాళ్ళున్నా నాతల్లో నాయమ్మా
నీకు సంతానం లేదే నాతల్లో నాయమ్మా
నువ్ అరవైయ్యారు మజిలీలు ఏసుకోని నాతల్లో నాయమ్మా
నువ్ ఆవుల పంచుకోని నాతల్లో నాయమ్మా
నువ్ అంశం బంచుకోని నాతల్లో నాయమ్మా
నాకల్లేలమొత్తేని నాతల్లో నాయమ్మా
నీకన్నకొడుకు కాటమరాజును నాతల్లో నాయమ్మా
పాపనూకనిత్తానే నాతల్లో నాయమ్మా"

అని చెబుతాడు. పెద్దమాదేవి తన కల విషయం తన భర్త పెద్దిరాజుకు చెబుతుంది. పెద్దిరాజు ఆస్వామి తనకు గూడా కలలో కనిపించి చెబితే అప్పుడు కళ్యాణపట్టణం వెళ్దామని చెబుతాడు. సోమన్నస్వామి పెద్దిరాజుకు గూడా కలలో కనిపించి చెబుతాడు. అప్పుడు పెద్దిరాజు తన భాగం ఆవులను పంచుకోని సంతానం కోసం కళ్యాణపట్టణం



వెళ్ళాలన్న తన నిర్ణయాన్ని అన్నదమ్ములకు చెబుతాడు. అందరికంటె చిన్నవాడైన పోలురాజు సంతానం పేరుతో తమ అన్నను తమ నుంచి విడదీస్తున్న కళ్యాణం సోమన్న స్వామిని ఇలా నిందిస్తాడు.

"అన్నికారి కల్లేలం దేవుడా ఓయ్ దేవుడా- నువ్వారిపోన్రా దేవుడా ఓయ్ దేవుడా
తోవల్లేని మాయన్నకు దేవుడా- తోవలు చూపించినావురా దేవుడా ఓయ్ దేవుడా
కుసిద్దం కల్లేళం దేవుడా నువు కుములుపోను-అన్నికారి కల్లేలం దేవుడా నువ్వారిపోను
తోవల్లేని మావదినకు ఓయ్ దేవుడా-నువు సంతానముందని ఎర్రిమాటలు చెప్పావు
మాకొంపలు ఇడ దీశావురా దేవుడా-మాయన్నదమ్ముల ఇడదీశావురా దేవుడా
నువ్ కూలిపోన్రా దేవుడా ఓయ్ దేవుడా "

ఆతర్వాత తమను వదలి వెళ్ళాలనుకున్న తన అన్నతో పోలురాజు దు:ఖిస్తూ ఇలా అంటాడు.

"అన్నా
మమ్మల్ని విడిచిపెట్టి అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
నువ్ ఏల ఎల్తావురా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
నువ్ లేకపోతేని అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
దిక్కుపాలై పోతాము అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
ఓరన్నా అన్నా పెద్దిరాజా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
మాతల్లిని మేమెరుగమురా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
మాతండ్రిని మేమెరుగమురా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
నువ్వే తండ్రానుకున్నామురా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా
మావదిన్నే తల్లనుకున్నామురా అన్నయ్యా ఓయ్ అన్నయ్యా"

ఇలా దు:ఖించి తమను వదలిపెట్టి వెళ్ళవద్దని అంతగా కుమారుడు కావాల నుకుంటే తన పెద్దకుమారుడైన కాశీబత్తుణ్ణి దత్తత ఇస్తానని చెబుతాడు. పెద్దిరాజు పెద్దిరాజు దానికి అంగీకరించి కాశీబత్తుని దత్తత తీసుకొని అతను, అతని భార్య పెద్దమాదేవి అల్లారుముద్దుగా పెంచుకుంటూ ఉంటారు. ఒకరోజు ఆవులమంద దగ్గరనుంచి పెద్ది రాజు తన సోదరులతో కలిసి పాలు తీసుకొని ఇంటికి వస్తున్నప్పుడు వారి భార్యలు పిల్లలను చక్కగా అలంకరించి తండ్రులకు ఎదురుగా పంపిస్తారు. ఆపిల్లల్లో కాశీబత్తుడు ముందు పరుగెత్తుకొస్తూ ఉంటాడు. అతడు తన కోసమే వస్తున్నాడని భావించిన పెద్దిరాజు కాశీబత్తుణ్ణి ఉద్దేశించి

"ఓయ్ కన్నకొడుకా
ఒరె మన్నెం నుంచి దెచ్చాను ఓయ్ కన్నకొడుకా

ఒరె టెంకాయ కొబ్బరులు దెచ్చాను ఓయ్ కన్నకొడుకా
తేనెయరటి పళ్ళు దెచ్చాను ఓయ్ కన్నకొడుకా
ఓయ్ రావయ్యా కన్నకొడుకా రా"

అని అలవిమాలిన ప్రేమతో అతణ్ణి ఎత్తుకోబోతాడు. ఐతే కాశీబత్తుడు అతని చేతుల్లోకి పోకుండా అతణ్ణి దాటి తన కన్నతండ్రి అయిన పోలురాజు దగ్గరికి వెళ్ళి అతని చంక ఎక్కుతాడు. దానితో పెద్దిరాజు మనసు విరిగిపోయి కడుపున పుట్టిన కొడుకే కొడుకు గానీ దత్తుకొడుకు కొడుకు కాదని నిర్ణయించుకొని కళ్యాణం పట్టణానికి వెళ్ళనిశ్చయించుకుంటాడు.

తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథలులోని పెద్దిరాజు కథలో కుమారులే కావాలనుకుంటే అన్నదమ్ముల కుమారుల్లో ఎవరినైనా దత్తత తీసుకోమని అన్నదమ్ములు, పల్లికొండ మొదలైన వారు పెద్దిరాజుకు చెబుతారు. వారితో పెద్దిరాజు ఇలా చెబుతాడు.

"అన్నదమ్ములార అతివేగ వినుడ - అల్లుడ పల్లికొండ అన్న సింహాద్రి
పిన్న పెద్దలార ప్రియము వినుడ - మనసు వచ్చిన వేళ పెద్దయ్య అందురు
మనసు రానివేళ మహాకోపమున - పెద్దిరాజు అని పేరున బిలుతురు
వకరి కుమార్లు మాకు వద్దు పొమ్మనెను-కననివి కడుపులు కావు కట్టనివి చీరెలు
కావు పెట్టనివి సొమ్ములు కావు పెద్దప్ప వినుము- ఒడ్లవారి బిడ్డలు వద్దు పోవమ్మ"

పెద్దిరాజుకథలో పెద్దిరాజు దత్తత తీసుకోమన్న బంధువుల మాటలను విన కుండా సంతానం కోసం కళ్యాణపట్టణానికి వెళ్తాడు. ఇలా బంధువుల మాటలను తోసిరాజని వెళ్ళడం సమంజసంగా లేదని తెరచీరల వారు భావించి తమ కథలో పెద్దిరాజు తన తమ్ముడైన పోలురాజు మాట విని అతని కుమారుని దత్తత తీసుకొని, ఆతర్వాత దత్తుకొడుకు దత్తుకొడుకే గానీ స్వంతకొడుకు కాదనే విషయం అనుభవ పూర్వకంగా తెలుసుకొని ఆతర్వాత కళ్యాణపట్టణానికి వెళ్ళినట్లుగా మార్చి చెప్పారు. "పెంచుకున్న వాడు (దత్తుడు) కొడుకా? ఉంచుకున్నవాడు మగడా?" అనే సామెత ఆందువల్లనే పుట్టింది. తెరచీరలవారు చేసిన ఈమార్పు సమంజసంగా ఉంది.

తంగిరాల ప్రచురించిన కాటమరాజు కథలులోని పెద్దిరాజుకథలో కళ్యాణం వెళ్తున్న తన అన్న పెద్దిరాజు మీద పడి సోదరి కొమరమ్మ చాల దు:ఖించినట్లుగా ఇలా చెప్పబడింది.

"అన్న మీదను బడి అలమరుగుచూను - అలసట పెట్టి మము అన్నదమ్ములను
కల్యాణము పోగానె కలిగేర సుతులు - తమ్ములందరు నీకు తగ సుతుల మారు



అయ్యమారు సింహాద్రి అన్న వున్నాడు - భూమి ఎల్లను విడిచి పుత్రుల కొరకు
తమ్ముల విడిచిపోను ధర్మంబు గాదు - తామరకొల్లు వంటి బంధువుల బాసి
భామ మాటలు విని పోను బాగటే అన్న - కూడిన కాపురాలు కూడకుండాను
ఎడబాసి కల్యాణము ఏల పోయెదవు - కట్టిన యిల్లను కడచేసి నీవు
పట్టపగలోయన్న పార బుచ్చి పోయేవ - వృక్షము మారని వుంటి మిన్నాళ్ళు
పక్షులకు ఏదారి వృక్షంబు లేక - పాలునీళ్ళ వంటి బంధువుల బాసి
బలిమి విడనాడిపోను బాగటె వోయన్నా"

పై మాటలు తన అన్నమీద కొమరక్కకు ఉన్న ప్రేమాభిమానాలను, ఆత్మీయతను తెలియజేస్తున్నాయి.

"అలసట పెట్టి మము అన్నదమ్ములను - కల్యాణము పోగానె కలిగేరు సుతులు"
అనే వాక్యాలు ప్రాచీన కాలంలోనే సమిష్టి కుటుంబంలో ఉన్న ఆప్యాయత, అభిమానం, ప్రేమ మొదలైన భావాలను చక్కగా స్పష్టం చేస్తున్నాయి.

"తమ్ములందరు నీకు తగ సుతులు మారు - అయ్యమారు సింహాద్రి అన్న వున్నాడు"

ఇది ఒకనాటి భారతీయ సమైక్య కుటుంబ భావన. నేడు ఇలాంటి భావన కనుమరుగైపోతుంది.

"వృక్షము మారని వుంటి మిన్నాళ్ళు - పక్షులకు ఏదారి వృక్షంబు లేక"
ఉమ్మడి వ్యవస్థకు ఎంతో చక్కని ఉపమానమిది. పెద్దిరాజు ఉమ్మడి కుటుంబంలో వృక్షం లాంటివాడు. అతన్ని ఆశ్రయించి అందరూ ఉన్నారు. అతను వెళ్ళిపోతే చెట్టు లేని పక్షులమవుతామని ఆమె చెబుతుంది.

సంతానం పేరుతో తమ నందరినీ విడిచి వెళ్ళేలాగా చేసిన తన అన్న భార్య పెద్దమ్మను కొమరమ్మ ఇలా నిందిస్తుంది.

"కాపరాలు చెరిచితివి గార గలిపితివి - దాపురమైతివి మా యింటి దయ్యమై నీవు
భూమీశు నెడబాపితిని భూతమై నీవు - యమురాలవై పెద్దన్నను ఎడబాసినావు
దయ్యపు పుట్టుక తరుణిరో నీది - రేయును పగలును రేపిల్లు పెట్టి
పాయదెరువులు చేసి పోచున్నావు - కంటికి నిద్రలేక కాంతరో నీవు
వేగమె రాజును వెళ్ళదీసితివి - కాపురాలు చెరిచేది కానలే మైతిమి
రాగతనమున నీవు రాజు నెడబాపితివి - ఆడగూతురువు గావు అసురవు గాని
కాపురాలను నేల కలిపితివి వదినె - అగ్గి కరిగించుకొని అతివ నీ విభుని
పరభూములు చూపితివి భామరో నీవు - అన్నదమ్ముల ఎడబాపితివి అతివరో నీవు
తల్లుల బిడ్డల ఎడబాపి తల్లి పొయ్యేవ- కుడిచి కూర్చుండియు కూడు కాలదన్నుక

పాడు బుద్ధులు బోను బాగటే నీకు - చెవిబెట్టి నేనెంత చెప్పినా వినవు
పోయిన తావున నీకు పొందు - వలదనంగను పోవవద్దు వోసఖియ
వలదనంగను పోవవద్దు వోసఖియ - తలపోత లాయెను తరుణిరో నీకు
చూడవు తలయెత్తి సుదతి నావంక - తోడికోడండ్లు చేసిన దోషంబు లేమి
చలపట్టి చెప్పిన చెముడ నీకేమి - పొలతిరో ఇందుకు పోలర వీరు
పాపపు దైవము చలపట్టెనేమొ"

తమ అన్నను తమ నుంచి వేరు చేస్తున్న వదినెను ఆమెది దయ్యపు పట్లుక అని, కాపురాలు చెరిచేదనీ, యమురాలు అనీ, రాక్షసి అనీ తిట్టి తన కోపాన్ని కొమరమ్మ తీర్చుకుంటుంది. నిజానికి పెద్దమ్మ ఉత్తమురాలే. తన కడుపున కాయకాయాలనే సంకల్పంతోనే ఆమె పెద్దిరాజును కాళ్యాణపట్టణానికి బయలుదేర దీసింది.

సాధారణంగా అన్న మీద తమ్మునికి ఉండే ప్రేమ కంటె చెల్లెలికి అన్న మీద ఉండే ప్రేమ ఎక్కువ. అందువల్లనే కొమరమ్మ తన అన్న పెద్దిరాజు తమను వదలిపెట్టి వెళ్ళిపోతున్నందుకు అంతగా దు:ఖించింది. అన్నను అలా వెళ్ళేలాగా చేసిన వదినను తిట్టి తన అక్కసు తీర్చుకుంది. కొల్లిరమణ గారు చెప్పిన కథలో కంటె తంగిరాల వారు ప్రచురించిన పెద్దిరాజుకథలోని ఈఘట్టం అన్నాచెల్లెళ్ళ అనురాగానికి దృష్టాంతంగా, గొప్పసాహిత్యాంశాలతో మనోహరంగా ఉంది. రమణగారు చెప్పినది మౌఖికప్రసారం లో ఉన్నది కావడం చేత అంత గొప్పగా లేకుండా మామూలుగా ఉంది.

కొల్లి రమణగారు చెప్పిన కథలో పల్లికొండదేవుడు పెద్దిరాజుకు అతని నలుగురు సోదరులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క వాటా, సోదరి కొమరమ్మకు సగం వాటా ప్రకారం ఆవులను పంచే ప్రయత్నం చేస్తాడు. అయితే ఆవులు పంచినవి పంచినట్లుగా ఉండకుండా కలిసిపోతూ వుంటాయి. అప్పుడు పల్లికొండ చేసిన ఆవుల పంపకం అద్భుతమైన పద్ధతిలో సాగింది. "ఐదుగురన్నదమ్ములు ఐదుచార్లు అచ్చింతలు దీసి ఒక కొత్తపెట్టెలో వేయించి ఆపెట్టెను నడియాలమందలో పెట్టి ఏడు గోళాలు ఆవుపాలు పితికి ఆలమంద మయాన (మధ్యన) పెట్టి అప్పుడు బసాదేవుడు ఫుల్లుగా పాలు పుచ్చుకొని, ఆతర్వాత పల్లికొండదేవుడు ఆయచ్చింతల్దీసి సగం రేతిరి ఆలమంద మీద పారజల్లేశాడు. ఒవల పేరిటావులు ఆళ్ళకెళ్ళిపోయాయి. సెరికిన సెర్రావులు సింహాద్రి రాజు వాటా, నరికిన నర్రావులు నలనూకరాజు వాటా, ఎడ్సిన ఎర్రావులు ఎరనూకరాజు వాటా, ఎర్రబొల్లావులు పోర్లాజు వాటా, ఈనాపనంకలు, మాసముచ్చులు, గొడ్డుటావులు, ఎద్దొంక జూడని యాపారగనులు, పొద్దొంక జూడని బాగాపుగనులు, కటిసన్నాసులు, సరిగొడ్డుటావులు పెద్దిరాజు వాటాకొచ్చాయి". తన వాటాకొచ్చిన ఆవులను చూసి



పెద్దిరాజు తన తమ్ములతో ఉసూరుమని ఇలా చెబుతున్నాడు.

"పాల్తోని మొగం గడిగాను తమ్ములారా ఓయ్ తమ్ములారా
నేత్తోని బోంచేశాను తమ్ములారా ఓయ్ తమ్ములారా
పాలు తాగడానికి తమ్ములారా ఓయ్ తమ్ములారా
పాడావు లేదురా తమ్ములారా ఓయ్ తమ్ములారా
పాల్లేనోళ్ళకు తమ్ములారా ఓయ్ తమ్ములారా
పాడియావుల దోలాను తమ్ములారా ఓయ్ తమ్ములారా
బట్టల్లేనోళ్ళకి బట్ట దానం జేశాను తమ్ములారా ఓయ్ తమ్ములారా
వస్త్రం లేని వారికి వస్త్రదానం జేశాను తమ్ములారా ఓయ్ తమ్ములారా"

పెద్దిరాజు ఆలమంద పంచడానికి కారకుడయ్యాడు కాబట్టి అతని వాటాకు పనికి రాని ఆవులు వచ్చాయని చెప్పవచ్చు.

తంగిరాల వారి గ్రంథంలో ఉమ్మడి కుటుంబంలో ఉన్న పెద్దిరాజు అతని సోదరులు విడిపోవడానికి ఎంత కష్టపడ్డారో ఒకచోట బ్రతికిన ఆలమంద కూడా విడిపోవడానికి అంత కష్టపడినట్లుగా చెప్పబడింది.

"పొటపొట కన్నీరు భుమిమీద వ్రాల - చుట్టు మెట్టాడుచు సురభులన్నియును
కొట్టు మిట్టాడుచు గుంపులు గూడి - తమ తమ క్రేపుల దరియంగ బిలుచుచు
భ్రమ విడిచి ఆవులు పంపులేర్పడెను"

కొల్లి రమణ గారు చెప్పిన కథలో పెద్దిరాజు భార్యతో ఆవులతో కలిసి కళ్యాణ పట్టణం వెళ్తున్నప్పుడు దారిలో వారికి కాటేసు, కోటేసు అనే ఇద్దరు తండ్రీకొడుకులు చని పోయిన అద్భుతేతివృత్త సంఘటన జరిగిన ప్రదేశం దగ్గరికి వస్తారు. వారి కథను గురించి అక్కడున్న కుర్రవాళ్ళు పెద్దిరాజు దంపతులకు వివరిస్తారు. అయితే ఈకథ వల్ల ప్రధాన కథ అయిన పెద్దిరాజుకథకు ఎలాంటి ప్రయోజనం లేదు.

పెద్దిరాజు పెద్దమాదేవి ఇద్దరూ కళ్యాణ పట్టణంలో ఉన్న గంటసోమన్న స్వామిని దర్శిస్తారు. అప్పుడు పెద్దమాదేవి ఆస్వామితో

"ఓయ్ కల్లేలం దేవుడా
ఓరి అన్నికారి కల్లేలం దేవుడా ఓయ్ నాయనా
నువ్వారి పోన్రా దేవాడా ఓయ్ దేవుడా
కుసిద్దం దేవుడా ఒయ్ దేవుడా
నువ్వారి పోన్రా దేవాడా ఓయ్ దేవుడా
ఒరే కన్నకొడుకుట్టాలని దేవుడా ఓయ్ నాయనా.

ఒరే కడాదూరం జేశావురా దేవుడా ఓయ్ దేవుడా
ఒరే కంచంత బలగాన్నిరా దేవుడా ఓయ్ నాయనా
ఒరే కన్నవాళ్ళను తెగనాడాన్రా దేవుడా ఓయ్ దేవుడా”

అని దు:ఖిస్తూ ప్రార్ధిస్తుంది. సాధారణంగా గ్రామీణులు ఉన్నవూరును వదలిపెట్టి వేరే ఊరికి వెళ్ళరు. “ఉన్నవూరు కన్నతల్లి ఒకటే” నని సామెత. కొంతమంది అలా స్వంత వూరు వదలిపెట్టి వేరే ఊరికి వెళ్ళడం అవమానకరంగా గూడా భావిస్తారు. అలాంటి దశలో పెద్దిరాజు అతని భార్య పెద్దమాదేవి బంధువులందరూ తమను విడిచి వెళ్ళవద్దని మొత్తుకొని చెప్పినప్పటికీ వినకుండా సంతానం మీద కోరికతో తమ భాగం ఆవులను పంచుకొని, వాటిని తోలుకొని దొనకొండ నుంచి చాలా దూరాన ఉన్న కళ్యాణపట్నానికి అనేక మజిలీలు వేసుకుంటూ శ్రమదమాదులకు ఓర్చి వచ్చేటప్పటికి చచ్చినంత పని అవుతుంది.ఆస్థితిలో ఆశ్రమకంతటికీ కారణమైన వారి మీద కోపం వచ్చి తమ అక్కసును, తమ దు:ఖాన్ని వెళ్ళగక్కడం మానవసహజం. ఈకారణం చేతనే పెద్ద మాదేవి కళ్యాణం సోమన్నను నిష్ఠూరంగా నిందిస్తూ పైమాటలను పలికింది.

ఆమె దు:ఖాన్ని జానపదకవి ఇలా వర్ణించాడు.

“ఒరే కుడికంటి కన్నీర్రా దేవో నాయనా - ఒరే కుంబవర్షాలవుతున్నాయిరా నాయనా
ఒరే ఎడమకంటి కన్నీర్రా నాయనా- ఒరే ఏరులై పారుతున్నాయిరా నాయినా

అని వర్ణించారు. కథాగేయాల్లో దు:ఖాన్ని పైన చెప్పిన విధంగానే వర్ణిస్తూ ఉంటారు. ఇలా వర్ణించం వారానువర్తనం.

పెద్దమాదేవి అలా దు:ఖించి తిండీతిప్పల్లేకుండా పడిపోయి ఉన్నప్పుడు గంట సోమన్న ఆమెకు కలలో కనిపించి ఎదురుగా ఉండే గజనిమ్మచెట్టు పూర్తిగా ఎండి పోయి కూలిపోయే దశలో ఉందని, దాన్ని తిరిగి బతికించి కాయలు కాసేలాగా చేస్తే, దానికి ఎన్ని కాయలు కాస్తే ఆమెకు అంత మంది సంతానం కలుగుతుందని చెబుతాడు. పెద్దిరాజు కావడి గట్టి నీళ్ళు మోసి తెస్తుంటే పెద్దమాదేవి వాటిని ఆచెట్టుకు పోయడం ప్రారంభిస్తుంది. నీళ్ళు పోస్తుంటే ఆచెట్టు భూమిలోకి కూరుకొని పోవడం మొదలు పెట్టిందట. ఐనా ఆదంపతులు నిరుత్సాహపడకుండా నీళ్ళు పోస్తూనే ఉన్నారు. ఆచెట్టు పూర్తిగా భూమిలోకి వెళ్ళిపోయిన తర్వాత ఇంకా నీళ్ళు పోస్తూ ఉంటే ఆచెట్టు స్థానంలో చిన్న మొక్క మొలిచి అది పెరిగి పెద్ద చెట్టు అవుతుంది. అలా సంవత్సరం ఏడు నెలలు గజనిమ్మచెట్టుకు నీళ్ళు పోస్తారు. ఆచెట్టు నిండా పూత, పిందె కాస్తుంది. దాన్ని చూసి పెద్దిరాజు పెద్దమాదేవి తమకు చాల సంతానం కలగనుందని సంతోష సముద్రంలో మునిగితేలుతూ ఉంటారు. అది చూచి కళ్యాణందేవుడు ఇంతమంది



పిల్లలు వీరికి పుడితే ముందుముందు వారు ఇంకా ఎక్కువ మంది అవుతారని భావించి ఒకరాత్రి ఒక పిందె మాత్రమే ఉంచి మిగిలిన పూతపిందెను రాలిపోయేలాగా చేస్తాడు. మిగిలిన ఒక్క పిందెను ఆదంపతులు జాగ్రత్తగా కాపాడు కుంటూ వస్తారు. అది పెరిగి కాయ అయి పండు అవుతుంది. అప్పుడు సోమన్న మళ్ళీ పెద్దమాదేవికి కలలో కనిపించి పుట్టుబుదవారం కట్టడమాస నాడు తలారా స్నానం జేసి ఆమె దోసిలి చాపితే పండు దోసిట్లో పడుతుంది. అలా పడితే నీకు కొడుకు పుట్టినట్లే అని చెబుతాడు. ఆమె స్వామి చెప్పినట్లుగానే దోసిలి పడితే పండు దోసిట్లో .పడి చితికిపోయి అందులో నుంచి బాలుడు పుడతాడు. ఆబాలుడే కాటమరాజు.

పెద్దమాదేవి కొంతకాలం పోయిన తర్వాత కూతురు పాపనూకను ఇవ్వమని సోమన్నస్వామిని వేడుకుంటుంది. దానికి స్వామి “అది నావల్ల కాదు, ఇక్కడికి ఐదు కోసుల దూరంలో “వడ్డింపుకోట” ఉంది. ఆకోటలో “గండాబేరుండరాజు”న్నాడు. ఆరాజు దగ్గర గండబేరుండపచ్చులున్నాయి. ఆపచ్చుల పిల్లలను తెచ్చి దారబందం మీద పెట్టి అడ్డంగా పీక నరికితే ఆరక్తంలోని నీకు పాపనూక పుడుతుందని” చెబుతాడు. పెద్దిరాజు గండబేరుండరాజును చంపి అతని తలను రథంపైన కట్టుకొని, ఆపక్షులను పట్టుకొని తీసుకొని వచ్చి తనఇంటి ద్వారబంధం మీద పెట్టి వాటి తలలు నరకగానే ఆపక్షుల రక్తంలో నుంచి చిన్నపాప పుడుతుంది. ఆపాపే పాపనూక.

ఈవిధంగా తెరచీరల వారి కథలో కాటరాజు పాపనూకల పుట్టుక అద్భుతరస ప్రధానంగా చెప్పబడింది.

తంగిరాల ప్రచురించిన పెద్దిరాజు కథలో కళ్యాణ నగరానికి వెళుతున్న పెద్దిరాజు మార్గమధ్యంలో కాటకోటేశ్వరస్వామిని పూజించి తమకు సంతానాన్ని ప్రసాదిస్తే స్వామి పేరు పెట్టుకుంటామని ఆ దంపతులు మొక్కుకుంటారు.

“కాటకోటేశ్వరుడు అప్పుడు తామెచ్చి - కాయను పండును దోసిట రాల్చెను
కాయపండేమి యని కలలోన అడిగితే - కాయే కాటమరాజు పండే పాపనూక అని
శలవిచ్చెనప్పుడు శంకరుడు దయతో - ఇచ్చితినని వరము ఇచ్చె శంకరుడు
అచ్చుగా వరములు ఆ రాజు గాంచి - గుడార్ల కేతెంచె కులదీపకుండు
జంగమార్చిన చేసె సద్భక్తితోను - జంగాల కన్నంబు లింగాలకు వస్త్రంబు
గోవుదానములిచ్చె కొదువ లేకుండ - తాను శివపూజ చేసి భూపతి మ్రొక్కె
దేవపూజ చేసి దేమునికి మ్రొక్కె”

కాటమరాజు కథల్లోని యాదవులు ఎక్కువ భాగం శైవులుగా కనిపిస్తారు. పై మాటలు పెద్దిరాజు శివభక్తి తత్పరతను తెలియజేస్తున్నాయి.

కాటకోటీశ్వరుని దయవల్ల పెద్దమ్మ గర్భవతి అవుతుంది. మొదటిసారి గర్భం ధరించినప్పుడు ఆమెలో కలిగిన శారీరక, మానసిక మార్పులను జానపదకవి సహజ సుందరంగా ఇలా వర్ణించాడు.

"కాంతకు తొలి చూలు గర్భంబు నిలిచె - తొమ్మిది గడియలకు తొల్చూరు చూలు
నెమ్మది గర్భంబు నెల..ల నెటువలెను - వళ్లు పలుచనాయె వాకర్లు తరచు
తెల్లనాయెను మొకము దేహంబు చిక్కె - వదనంబు వాడెను వాచవులు కోరె
చేడె చిక్కిన మొదలు నీటివుమ్ములు తరచు - కోరె వేడుక పులుసు కోరెను రుచులు
మందమాయను కడుపు మనురుచి కోరె - పాయరువై పట్టుపైట నిల్వనందున
పై చెమటలు పుట్టె ప్రబలె గర్భంబు - రొమ్ము సరుదాయెను రోజు అధికంబు
సఖియ కుచములు పొదిలె చనుమొనలు నలుపు- ఇంతి గర్భము పెరిగె వికసించె నాభి
కాళ్లు విలవిలదీసె కాంత నడిచినను - నీరజాక్షికి మత్తునిద్ర తరుచాయె
కదిలించ లేకుండ కాళ్లు వుర్లు జూపె - కోమలికుక్షిలో కొడుకు మెదిలాడె
వెడదయైన కడుపు వింతయై తోచె"

ఆ తర్వాత పెద్దమ్మకు కుమారుడు జన్మిస్తాడు. కాటకోటేశ్వరస్వామి పేరుతో ఆ బాలునికి కాటమరాజు అని పేరు పెట్టి జాతకం రాయిస్తారు. అతని జాతకాన్ని

"జాతకము వ్రాసిరి జనులెల్ల వినగ - కోటానుకోటుల కూల్చనున్నాడు
తాత తండ్రులనాటి తారమైన పగలు - భూతలంబున నితడు పొరిమార్చగలడు"

అని రాస్తారు. కాటమరాజు కథలు వీరరస ప్రధానమైనవి. ఈ వీరానికి తగినట్లుగా కాటమరాజు జాతకం రాయబడింది.

ఆ తర్వాత పెద్దమ్మ పాపసంహారి నోము నోచి పరమేశ్వరిని తన గర్భంలో కుమార్తెగా పుట్టమని ప్రార్థిస్తుంది. అప్పుడు పరమేశ్వరి నవ్వి

"నీ గర్భమందున నేను జన్మిస్తే - నీ వంశము పెద్దిరాజు నిర్మూల మగును"

అని ఆమె గర్భంలో తాను జన్మిస్తే ఆమె వంశం, ఆమె భర్త పెద్దిరాజు నాశనమవు తారని చెబుతుంది. దానికి పెద్దమ్మ అయినా ఫర్వాలేదు ఆడపడుచుగా పుట్టమని ప్రార్థిస్తుంది. తర్వాత పెద్దమ్మకు పాపనూక అనే కూతురు జన్మిస్తుంది. కూతురు పుడితే పెద్దిరాజుతో బాటు వారి వంశం నాశనమవుతుందని పార్వతి చెప్పినప్పటికీ పెద్దమ్మ తనకు కూతురు కావాలని కోరుకోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈవిధంగా కాటమరాజు పాపనూకల జన్మవృత్తాంతం అద్భుతరస ప్రధానంగా తంగిరాలవారు ప్రచురించిన పుస్తకంలో చెప్పబడింది. దాన్ని చూసి మరింత అద్భుతరసభరితంగా తెరచీరలవారు తమ కథలో కాటమరాజు పాపనూకల పుట్టుకను గురించి చెప్పారు.



తంగిరాలవారు ప్రచురించిన పెద్దిరాజుకథలో కళ్యాణపట్టణంలో ఉన్న సోమేశ్వరస్వామి కలలో కనిపించి తనను దర్శిస్తే సంతానమిస్తానని చెప్పడం వల్ల పెద్దిరాజు దంపతులు కళ్యాణపట్టణానికి బయలుదేరి మార్గమధ్యలో కనిపించిన కాటకోటేశ్వరస్వామిని పూజించి కాటమరాజును, పెద్దమ్మ పాపసంహారి నోము నోచి పాప నూకను పొందినట్లుగా చెప్పబడింది. అంటే పెద్దిరాజుకు సంతానం కలిగిన విషయంలో సోమేశ్వరస్వామి పాత్ర ఏమీ లేనట్లుగా చెప్పబడింది. మరి ఆస్వామి కలలో కనబడి తనను దర్శిస్తే సంతానమిస్తానని ఎందుకు చెప్పినట్లు? అందువల్ల ఇది కొంత అనౌచిత్యమైన విషయం. ఈకారణంగానే తెరచీరలవారు తమ కథలో పెద్దిరాజు దంపతులు తమకు కలలో కనిపించి చెప్పిన కళ్యాణం సోమేశ్వరస్వామిని దర్శించి ఆస్వామి దయవల్లనే కాటమరాజును పొందినట్లుగా మార్చి చెప్పారు.

తంగిరాలవారి గ్రంథంలో పెద్దిరాజుకు కాటమరాజు పాపనూక పుట్టిన తర్వాత తిరిగి తమ ఊరైన పంపాద్రికి వెళ్ళాలనుకుంటున్నప్పుడు కళ్యాణపట్టణ పాలకుడైన గంగరాజు వచ్చి

"వల్లవులరాజా మీరు వచ్చిన నాటి నుండి-కళ్యాణం దేవగిరిపట్నం ఆద్యంతాన జనులు
కన్నులారా నిద్రబోయిరి ఘనుడ పెద్దిరాజ- ఆమాటకు పెద్దిరాజు ఆశ్చర్యమంది
ఎటువలె నిద్రబోయిరి ఎరిగింపుమన్న - మారాచగంగన్న మరి వేగ పలికె
గండబేరుండాలు సారాభిసార - సారాభిసారాలు శార్దూలపక్షులు
మాయరాత్రుళ్ళలో మరి కేసరులు వచ్చి - కళ్యాణందేవ పట్నాల యందున్న
ఏనుగుల మాష్టీల ఏత్తుకొని పోవు - పిల్లమేతల కెత్తుకొని పోవుచునుండె
మీరు వచ్చిన నాటినుండియు పక్షులు - పట్నానికి రాలేదు పట్టభద్రుండ "

అని చెబుతాడు. పెద్దిరాజుకున్న డెబ్బైయ్యేడు బిరుదులను చూచి గండబేరుండ పక్షులు భయపడి అతను కళ్యాణపట్టణానికి వచ్చినప్పటి నుంచి ఆపట్నానికి రాలేదట. అందు వల్లనే గంగరాజు పెద్దిరాజును అక్కడే ఉండి కళ్యాణపట్టణాన్ని పాలిస్తూ ప్రజలకు గండబేరుండ పక్షుల బెడదను పోగొట్టవలసిందిగా ప్రార్థిస్తాడు. అంతకు ముందు తమ ఊరికి వెళ్ళాలనుకున్న పెద్దిరాజు అతని కోరికను మన్నించి కళ్యాణపట్టణంలోనే ఉండిపోతాడు. ఇక్కడ పెద్దిరాజు గండబేరుండపక్షులను అదుపులో పెట్టిన వృత్తాంతాన్ని కొంత మార్చి అంటే గండబేరుండ పక్షుల పిల్లలను తెచ్చి ద్వారబంధం మీద పెట్టి వాటి తలలను తెగనరికితే వాటి రక్తం నుంచి పాపనూక పుట్టినట్లుగా ఒక అద్భుత సంఘటనగా మార్చి తెరచీరలవారు పాపనూక పుట్టుక విషయాన్ని చెప్పారు.

తెరచీరలవారి కథలో పెద్దిరాజు గండాబేరుండరాజును చంపి అతని తలను

తెచ్చినప్పుడు పెద్దమాదేవి సంతోషించి ఎర్రకూడు, నల్లకూడు, తెల్లకూడుతో అతనికి హారతి ఇస్తూవుంటుంది. అప్పుడు రథానికి పైన కట్టిన గండబేరుండరాజు శిరస్సు పకాలున నవ్వింది‌దట. అప్పుడు పెద్దమాదేవి కోపంతో పెద్దిరాజుతో ఇలా అంటుంది.

"ఒయ్ పెద్దిరాజా
నీకున్న పౌరుషాలు పెద్దిరాజు ఓయ్ పెద్దిరాజు
నాకుంటేని నారాజు ఒయ్ నారాజు
నీకున్న మీసాలు నారాజు ఓయ్ నారాజు
ఒరే నాకు ఉంటేను నారాజు ఓయ్ నారాజు
ఒరే చచ్చిన శిరసును కాలికి గడుదును
ఒరే కాలికన్న గడుదును నారాజు ఈడ్సుకొనన్నా వద్దును
నువు కిందనున్నావు నారాజు ఓయ్ నారాజు
సచ్చినోడు మీదనున్నాడు నారాజు ఓయ్ నారాజు"

చనిపోయిన శత్రువు శిరస్సును కాలికైనా కట్టుకోవాలి లేదా రతానికి కట్టుకొని ఈడ్సుకోనైనా రావాలి. అంతేగానీ ఇలా రతం మీద గడితే ఈనివ్వాలి నీకిచ్చేదా? శత్రువు శిరస్సు కిచ్చేదా? అని ప్రశ్నించి నివ్వాళి పళ్ళాన్ని పారేసి నీముఖం నేను సూడ్ను, ఇక్కడికి ఆమడ దూరంలో మూడు శిరసులు, అడ్డు ఆరు మూరలు, నిలువు తొమ్మిది మూరలు కూకుంటే గున్నసింత, లెగిత్తె తాడిపొడవున్న వాలికేతువరాజున్నాడు. వాడి మీదకు యుద్ధానికెళ్ళి వాణ్ణి సంహరించి వస్తేనే మళ్ళీ నీకు నివ్వాళిస్తాను. అంతవరకు నీముఖం చూడ్నయ్యా" అని చెబుతుంది.

పెద్దిరాజు కళ్యాణం రాజైన గంగరాజు కోరికను మన్నించి కళ్యాణంలో ఉండిపోయి అతనితో కలిసి దండయాత్రకు వెళ్ళి కనకదుందుములకోటను, ఏడు కుంభినులను, సన్యాసులకోటను జయించి వాలికేతువరాజు మీదకు యుద్ధానికి వెళ్ళి అతని చేతిలో చనిపోయినట్లుగా తంగిరాలవారు ప్రచురించిన పెద్దిరాజుకథలో చెప్ప బడింది. తెరచీరలవారి కథలో పెద్దమాదేవి పెద్దిరాజుకు హారతి ఇస్తుంటే గండ బేరుండరాజు శిరస్సు నవ్వడం, దానికి పెద్దమాదేవి కోపగించి భర్త మీద కోపపడి అతని ముఖం చూడనని చెప్పడం, వాలికేతువరాజును జుయించి వస్తేనే నీముఖం చూస్తానని ఆమె చెప్పడం మొదలైన వృత్తాంతమంతా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇలా ఆశ్చర్యాన్ని కలిగించడానికే తెరచీరలవారు ఈమార్పు చేశారు.

తెరచీరలవారి కథలో పెద్దిరాజు వాలికేతువరాజు మీదకు యుద్ధానికి వెళ్ళి అతణ్ణి యుద్ధానికి పిలిచి అతని చేతులో చనిపోతాడు. గంగతల్లి పెద్దిరాజు చనిపోయిన



విషయాన్ని పెద్దమాదేవికి తెలియజేయమని తన తమ్ముడు పోతురాజును పంపిస్తుంది. అప్పటికి ఒకటిన్నర సంవత్సరం బాలుడైన కాటమరాజుకు తన తండ్రి మరణవార్త తెలిసి తల్లి దగ్గరకు వెళ్ళి వాలికేతుని చంపి తండ్రి పగ సాధిస్తానని తనను దీవించి పంపమని తల్లిని కోరతాడు. అప్పుడు పెద్దమాదేవి అతనితో ఇలా పలుకుతుంది.

"పగవాని కత్తి కిందకి కొడుకా ఓయ్ కొడుకా
నువు సాలలేవురా కొడుకా ఓయ్ కొడుకా
సిన్నల్నాటి పగలు కొడుకా పెద్దల్నాడు తీర్చచ్చు
పెద్దల్నాటి పగలు సిన్నల్నాడు తీర్చచ్చు
దయ్యాలు చూసి కొడుకో ఓయ్ కన్నకొడుకా
నువు జడుసు కుంటావురా కొడుకా ఓయ్ కొడుకా
నువు బూతాలు జూసి కన్న కొడుకా
నీగుండె బగులుతాది కన్నకొడుకా
ఇయాలనాటి పగలు రేపు తీర్చచ్చు కొడుకా
నువు యుద్ధానికి ఎల్లకురా కన్నకొడుకా
నీగురించెరా కన్నకొడకా ఓయ్ కొడకా
కంచంత బలగాన్ని కన్నవాళ్ళనొగ్గేసి
ఒరే ఇంతదూరమొచ్చాము కన్నకొడుకా
నిను పగవాడి చేతులకు ఓయ్ కన్నకొడుకా
నేనివ్వలేనురా కన్నకొడుకా ఓయ్ కన్నకొడుకా "

పెద్దమాదేవికి వాలికేతువ రాజు బలం తెలుసు, అదీగాకుండా కాటమరాజు కేవలం అప్పటికి సంవత్సరంన్నర వయస్సున్న చిన్న బాలుడు. అప్పటికి ఇంకా పూర్తిగా నడక గూడా వచ్చి ఉండదు. అలాంటివాణ్ణి పెద్దిరాజులాంటి బలపరాక్రమవంతుణ్ణి చంపిన వాలకేతువుని మీదకు యుద్ధానికి ఎలాగ పంపిస్తుంది. అందువల్లనే ఆమె అతణ్ణి యుద్ధానికి వెళ్ళవద్దని కాటమరాజుకు చెబుతుంది. అంతగా ఐతే కాటమరాజు పెద్దవాడైన తర్వాత పగ తీర్చవచ్చునని చెప్పింది. దానికి కాటమరాజు

"నేను సిన్నోణ్ణి కాదమ్మో నేను శ్రీబాలకృష్ణున్నే నాయమ్మో
నువు సల్లని దీవింపు దీవించు నాతల్లి"

అని కాటమరాజు తల్లిని పట్టు బడతాడు. తల్లి చేసేది లేక

"ఒరే సూరుసెంద్రుల బోలి లాబాన్నెళ్ళి సాబాన్నిరారో" అని దీవిస్తుంది.

అంటే సూర్యచంద్రుల లాగా లాభంగా వెళ్ళి క్షేమంగా రమ్మని తల్లి కాటమ రాజును

దీవిస్తుంది. అప్పుడు కాటమరాజు సూర్యచంద్రుల లాగా లాభంగా వెళ్ళి క్షేమంగా రమ్మని చెప్పడం అనేది ఎంగిలి దీవన అని అలాంటి దీవన తనకు సమ్మతం కాదని తల్లికి చెబుతాడు. అప్పుడు పెద్దమాదేవి అది ఎంగిలి దీవన ఎలాగయ్యిందో చెప్పమని కాటమరాజును కోరుతుంది. నాగరాజు గుడ్లను పగలగొట్టిన ఇద్దరు బాలురు నాగ రాజుకు భయపడి సూర్యచంద్రుల చాటున దాక్కుంటారు. తనకు అపకారం చేసిన వారికి ఆశ్రయం ఇచ్చినందుకుగాను నాగరాజు సూర్యచంద్రులను కాటేస్తాడు. అదే సూర్యగ్రహణం, చంద్రగ్రహణం. కాటమరాజు ఈకథను తల్లికి చెప్పి సూర్యచంద్రు లిద్దరూ నాగరాజు చేత కాటువేయబడ్డారు కాబట్టి వాళ్ళతో పోల్చి తనకు దీవన ఇవ్వవద్దని చెబుతాడు. ఆతర్వాత కాటమరాజు యుద్ధరంగానికి వెళ్ళి గంగమ్మ దేవత సాయంతో తన తండ్రి శవాన్ని చూసి, ఆతర్వాత వాలికేతువరాజు మీదకు యుద్ధానికి వెళ్ళి గంగ సాయంతో ఆతణ్ణి సంహరిస్తాడు.

ఈకథ తంగిరాలవారు ప్రచురించిన పెద్దిరాజుకథలో వేరుగా రమణీయంగా గొప్ప సాహిత్యాంశాలతో ఉంది. తండ్రి చనిపోయేనాటికి కాటమరాజు ఏడేండ్ల బాలుడు. తండ్రి మరణవార్త విని కాటమరాజు తల్లి దగ్గరకు వచ్చి తండ్రిని చూడడానికి యుద్ధ రంగానికి వెళతానంటాడు. పెద్దమ్మ యుద్ధభూమిలో భూతాలు ఉంటాయని, చిన్నపిల్లలు వెళ్ళకూడదని చెబుతుంది. అప్పుడు కాటమరాజు తనను బాలకృష్ణునితో పోల్చుకొని పలికిన పలుకులు కాటమరాజు పరాక్రమాన్ని, మనోధైర్యాన్నే కాకుండా అతన్ని అవతారపురుషునిగా చెబుతున్నాయి.

"రాక్షసి భూతాలు నాకు ఎదురటే తల్లి - బాలుడనని నీవు భ్రమత పడియేవు
బాలుడు గాడా తొల్లి బాలక్రిష్ణమ్మ? - పూతన చనుద్రావి పాలియించలేద
మూడవ నెలలోనె ముద్దుకృష్ణుండు - బండి విరగదన్నె బాలుడు గాడ?
ఏడాది బాలుడై ఎగసి తృణావర్తుని - మెడపట్టి కూల్చెను మేదినరుదెంచ
చిన్ని బాలుడు గాదె సిరి యాళుడు తొల్లి-కంచివాడలు ఏడు కదలించె ఎరుగవా?
పణతి నీ నోముఫలమును గూర్చ - కొమరుడ నైతిని కువలాయతాక్షి
ఎదురెవరె నాకత్తికి మదిరాక్షి తల్లి - కన్న మోహమున నీవు కానకున్నావు
తొల్లి లంకాపురి పట్నములోను - రాక్షసుల సంహరించిన రాజును నేను
రామలక్ష్మణ కుమారులు బాలలు గారు? - చిన్నది కాదటే తల్లి సింహపు కొదమ
భద్ర గజములు మీద పడదుముకుట ఎరుగవా?"

కథానాయకుడైన కాటమరాజు ప్రశస్తిని పెంచేటట్లుగా జానపదకవి బాల కృష్ణుని లీలను చక్కగా ఉపయోగించుకున్నాడు.



ఆ తర్వాత కాటమరాజు తనతండ్రిని చంపిన వాలికేతువరాజు మీద పగ సాధించడానికి యుద్ధానికి వెళుతూ తనను దీవించమని తల్లిని వేడుకుంటాడు. తల్లి పౌరాణిక పాత్రలైన ధర్మరాజు, హరిశ్చంద్రుడు మొదలైన వారితో పోలిక చెప్పి యుద్ధంలో జయాన్ని పొంది తలపువ్వు వాడకుండా తనను కలుసుకోవడానికి రమ్మని దీవిస్తుంది. అప్పుడు కాటమరాజు ఆమె చెప్పిన పురాణ పాత్రల్లోని లోపాలను తెలియజెప్పి ఆ పాత్రల దీవెనను తాను అంగీకరించనని చెబుతాడు.

కాటమరాజు తల్లి ఇలా చెబుతుంది.

"ఏమని దీవింతు ఏడేండ్ల కొడుక - సత్యమునకు దొడ్డవాడు ధర్మరాజును బోలి
హరివంశపురాజు మీ అయ్యను కలుసుక -తలపువ్వు వాడక మీ తల్లిని కలియ రావన్న!
అప్పుడు కాటమరాజు ధర్మరాజు దీవెనను తాను అంగీకరించని ఇలా చెబుతాడు.

"వాని దీవెన నేను వల్లనే వో కన్నతల్లి - ధర్మరాజనగా దొడ్డవాడే కాని
గురువును జంపిన కులద్రోహి వాడు"

ఆ తర్వాత హరిశ్చంద్రుడు, పరుశురాముడు, రామలక్ష్మణులు, హనుమంతుడు, పాండవులు, సూర్యచంద్రులు మొదలైనవారి దీవెనను తాను అంగీకరించనని తల్లికి కాటమరాజు ఇలా చెబుతాడు.

"హరిశ్చంద్ర మహారాజు దొడ్డవాడే కాని - ఆలిబిడ్డల ఇల్లడచేసి అన్యాయము చేసినాడమ్మ
కులహీనుని గొలిచి తాను కులభ్రష్టుడాయెనమ్మ-తనతండ్రి జమదగ్నికి సమ్మతిగాను
తల్లిరేణుకను తెగటార్చి నట్టి - ఆత్మద్రోహమును అణచంగలేక
హస్తములు ఖండించుకొన్నాడు అమ్మరోనాడు - రామలక్షణులు రమణి పెద్దమ్మ
సీతను గోల్పోయి క్షితియెల్ల ఎరుగ - వారిబోలు దీవెనలు వల్లను తల్లి
హనుమంతుడు వినుము ఆ లంకలోన-కలనిలో ఇంద్రజిత్తుకు కట్టుబడినాడు
వ్రేపల్లె లోపల రేయి పగలనక-స్త్రీలలో క్రీడించి చెలగుచు నుండు
రోటమ గట్టెను తాను యశోద - అంతమున ఎరుకచే వ్రేటు పడ్డాడు
కౌరవులకు పాండవులకు కలహంబు పుట్టె-జూదమాడి పాండవులు వోడిరి భూమి
ద్రుపద పుత్రిని తమ వెంటబెట్టుకొని - వనవాసమేగిరి పణతి పెద్దమ్మ
సూర్యచంద్రాదులు దొడ్డవారే కాని - వారికి దీక్షమున్నారే వోకన్నతల్లి
ఏడాది కొకనాడు రాహువునకు కాటిచ్చినారు - గురువుచేత శాపము గొబ్బున అందిరి"

ఈ విధంగా పౌరాణిక పాత్రల దీవెనను అంగీకరింపక తన తాత ఆవుల వలురాజు పరోపకారం కోసం యుద్ధానికి వెళ్ళి చనిపోయిన వీరుడని అలాంటి తాత దీవెన తనకు అమరుతుందని కాటమరాజు తల్లికి ఇలా చెబుతాడు.

"తాత వలురాజు ధర్మకార్యమునకు బోయి - ఎదురున పోటులు ఎక్కువగ నాటి
యిల మీద చెల్లిన వీరుడు తాత - అట్టి దీవెన నాకు అమరును తల్లి"

ఆ తర్వాత కాటమరాజు తల్లివద్ద శెలవు తీసుకొని యుద్ధరంగానికి వెళ్ళి గంగ సాయంతో తన తండ్రి శవాన్ని గుర్తించి, ఆ శవం మీద పడి ఇలా దుఃఖిస్తాడు.

"తండ్రి చెక్కిళ్లు నొక్కి తల్లడమంది - ఉడుగని దుఃఖాన వలపొయ్య సాగె
తన మోము రాజు తండ్రిపై జేర్చుక - దండ్రి దాయాదులు లేరు వో తండ్రి నాకు
పొగులుచు దుఃఖాన వలపొయ్య సాగె - ఏ భూమిని పుట్టి ఏ భూమిని పెరిగితివో
పరభూమిని చెల్ల ప్రాప్తంబు వుండెనా - దానము చేసేటి తండ్రి ! నీ హస్తములు
వున్నతముగా నేటితో వుడిగెనా తండ్రి -తుమ్మెద రెక్కల వంటి తూలాడు కురులు
గవగంపు తలనెరులు తండ్రి! గాలికి పొర్లేన - నిమ్మపండు వంటి నీ చక్కని దేహంబు
కత్తులు నాటెనా ఘనుడ వో తండ్రి! - వస్తాది! నీవు తొడిగి వజ్రాంగిజోడు
తుపాకి ఏట్లకు తుందునక లాయెనా! - పగవాడిని కాను నీ పట్టినే తండ్రి!
నాతోను పల్కవే తండ్రి పెద్దయ్య! - ఇన్నాళ్లు వో తండ్రి వేగమే నన్ను
బాలుడని ఎత్తుక పై చెమట తుడుతువు - నాటి దయ వో తండ్రి! నేడెందు బోయె
నీ చిత్తంబు ఎటు బోయె చెప్పవే తండ్రి! - ఎంత పల్కరించినా ఏమనవు నీవు
అరుంధతి మీతల్లి ఆవుల వల్లమ్మ - నోమరాని నోములు నోచె మీతల్లి
కత్తులపాలు జేసెనా వో కన్నతండ్రి! - ఆదరువు లివ్వరే అయ్యరో! తమకు
నట్టేట పుట్టి ముంచినావా నా తండ్రి - ఎవరితో భాషింతు ఎట్లు బ్రతుకుదును
పాపపు దైవము పగవారినే కూడె - ఏ కాంగినైతినే తండ్రి! ఎనక ఎవ్వరు లేరు
పరోప కార్యమునకు ప్రాణముకు వుర్రు పెట్టుకొంటివి"

ఈ దుఃఖ వర్ణన ఇంకా ఉంది. కాటమరాజు పెద్దిరాజుకు లేకలేక కలిగిన కుమారుడు. అందువల్ల పెద్దిరాజు కాటమరాజును తన ఒడిలో పెట్టుకొని అల్లారు ముద్దుగా పెంచాడు. తండ్రి చనిపోయిన నాటికి కాటమరాజు ఏడేండ్ల బాలుడు. తండ్రి ప్రేమను ఈ ఏడేళ్ళ కాలంలోను పూర్తిగా చవిచూసినవాడు కాటమ రాజు. రాజదుస్తులతో, చక్రవర్తి ఠీవితో ఉండే తన తండ్రి యుద్ధ భూమిలో శరీరమంతా గాయాలతో మట్టి కొట్టుకొని ఉన్న అతని శవాన్ని చూసి కాటమరాజు భరించలేకపోయాడు. తండ్రి శవం మీదపడి కుమారుని వచ్చాను చూడమని బోరున విలపిస్తున్నాడు. ఈ గేయభాగాన్ని చదివితే సహృదయులైనవారు తప్పనిసరిగా కన్నీటి పర్యంతమవుతారు. తండ్రి మరణానికి దు:ఖించే కరుణరస పూరితమైన ఇలాంటి సుందరమైన రచన శిష్టసాహిత్యంలో కాగడావేసి వెదకినా కనిపించదు.



ఆ తర్వాత కాటమరాజు వాలికేతువ రాజుమీద దండెత్తి అతనితో భయంకరమైన యుద్ధంచేసి గంగ సాయంతో అతని తల నరికివేసి తండ్రిపగ తీరుస్తాడు.

తెరచీరలవారి కథ మౌఖిక ప్రసారంలో ఉండడం చేత ఇందులో కథను చెప్పడమే ప్రధానంగా ఉంది. అందువల్ల ఇందులో సాహిత్యాంశాలు అంత గొప్పగా లేవు. తంగిరాలవారు ప్రచురించిన పెద్దిరాజుకథ లిఖితరూపంలో ఉండడం చేత దాన్ని రాసిన వ్యక్తి మంచి ప్రతిభావంతుడై కవి కావడం చేత ఇందులో సాహిత్యాంశాలు పుష్కళంగా ఉండి శిష్టసాహిత్యానికి ఏమాత్రం తీసిపోని విధంగా ఉంది.

తెరచీరల కళాకారుడైన కొల్లి రమణగారు కాటమరాజు కథను పూర్తిగా అంటే కాటమరాజు నెల్లూరు పాలకుడైన సిద్ధిరాజుతో యుద్ధం చేయడం వరకు పాడారు. గ్రంధవిస్తరణ భీతి చేత దాన్ని చర్చించడం లేదు.

## మందెచ్చులవారి కథలు - సాహిత్యాంశాలు :

మందెచ్చులవారు గంగరాజుకథ, వలురాజు కథ, ఆవులమేపు, కాటమరాజు యుద్ధం, కరియావుల రాజు కథ, చంద్రగుప్త మారాజు కథ మొదలైన కాటమరాజు కథలను చెబుతారు. వీటిలో గంగరాజు కథను పరిశీలించుదాం. ఈకథను రంగు రాజపాపయ్య గారు మందెచ్చులవారు - జీవనవిధానం అనే సిద్ధాంతవ్యాసంలో ఇచ్చారు.

**గంగరాజుకథ :** ఇతణ్ణి కవులావుల గంగరాజు అంటారు. ఇతడు కాటమరాజు తాత అయిన వలురాజుకు తండ్రి. తంగిరాల సుబ్బారావు గారు గంగరాజు కథను ప్రస్తావించలేదు. కాటమరాజు కథలు ఆవుల వలురాజు కథతో ప్రారంభమవుతాయని వారు చెప్పారు. గంగరాజు వలురాజు తండ్రి అని వలురాజు కథలో చెప్పబడింది. వలురాజు తండ్రి అయిన గంగురాజు కథను మందెచ్చులవారు ఇలా చెబుతారు. మందెచ్చుల వారు తెలంగాణా ప్రాంతంవారు కాబట్టి వారి కథ తెలంగాణా మాండలికంలో సాగుతుంది.

గంగరాజు ఉత్తరాదిన ద్వారకాపురి పట్టణాన్ని పాలిస్తుంటాడు. ఇతడు యయాద్రి కుమారుడు. ఇతనికి "దనలచ్చిమి, దాన్యలచ్చిమి, సంపూర్ణలచ్చిమి, అనలచ్చిమి, అమృతలచ్చిమి" అనే ఐదుగురు భార్యలున్నారు. ఐతే ఎవరికీ సంతానం కలగలేదు. సంతానం కోసం ఐదుగురు భార్యలు "తిరిగి తిరులోకము, నడిసి నరలోకము, కాసికైలాసము, ఓనంది, మానంది, ధర్మపురి మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించారు. అంతేగాకుండా

"అచ్చేటి పచ్చులకు ఎందుగలారవోసిండ్లు- పారేటి పచ్చులకు పంచదార వోసిండ్లు
బాయిలు దవ్విచ్చి బాయిలకింద పంట పండిచ్చి- లోకానికన్నం బెట్టిండ్లు".

ఇలా గంగరాజు భార్యలు సంతానం కోసం అనేక పుణ్యకార్యాలు చేశారు. అయినప్పటికీ వారికి సంతానం కలగలేదు.

జానపద సాహిత్యంలో నాయకుడు గానీ లేక ప్రధానపాత్ర గానీ అంత సులభంగా పుట్టరు. తల్లిదండ్రులు అనేక పుణ్యక్షేత్రాలను దర్శించి, అనేక పుణ్యకార్యాలు చేసిన తర్వాత వరప్రభావంతో పుట్టినట్లుగా చెప్పబడుతుంది. ఉదాహరణకు బాల నాగమ్మ కథలో బాలనాగమ్మ తల్లి అయిన భూలక్ష్మీదేవి సంతానం కోసం అనేక ప్రయత్నాలు చేసి చివరికి అడవికి వెళ్ళి జటంగమహామునిని దయవల్ల పొందిన మామిడి పళ్ళు భుజించడం చేత బాలనాగమ్మను ఆమె ఆరుగురు అక్కలను పొందుతుంది. ఇదే విధంగా దాదాపుగా అన్నికథాగేయాల్లోనూ చెప్పబడుతూ ఉంటుంది.

మానవులు సంతానం కోసం ప్రయత్నించారని చెప్పే విషయంలో శిష్ట సాహిత్యానికి, జానపదసాహిత్యానికి తేడా కనిపిస్తుంది. శిష్టసాహిత్యంలో సంతానం కోసం పురుషులు అనేక రకాల ప్రయత్నాలు చేసినట్లుగా చెప్పబడుతుంది. ఉదాహరణకు రామాయణంలో దశరథుడు పుత్రకామేష్ఠియాగం చేసి, భారతంలో ద్రుపదుడు యాగం చేసి సంతానాన్ని పొందుతారు. జానపద సాహిత్యంలో స్త్రీలు సంతానం కోసం అనేక ప్రయత్నాలు చేసినట్లుగా చెప్పబడుతుంది. లోకంలో సంతానం కోసం పురుషుల కంటే స్త్రీలే ఎక్కువ తపించడం మనం గమనించవచ్చు. సంతానం లేని స్త్రీని సమాజం గొడ్రాలు అని చులకనగా చూస్తుంది. ముత్తైదువలు చేసే నోములు, వ్రతాలు మొదలైన వాటికి సంతానం లేని స్త్రీని పిలవకుండా ఆమెను చిన్నబుచ్చడం చేస్తారు. పురుషులకు సంతానం మీద కోరిక ఉన్నా స్త్రీలు తపించినంతగా వారు తపించరు. అంతేగాకుండా సంతానం లేని పురుషుని చులకనగా చూడడం కూడా ఉండదు. అందువల్ల సంతానం కోసం స్త్రీలే ఎక్కువగా తపిస్తారు. జానపదకవులు లోకాన్ని బాగా గమనించినవారు కావడం చేత తాము సృష్టించే సాహిత్యంలో సంతానం కోసం స్త్రీలే ఎక్కువ తపించినట్లుగా, ప్రయత్నించినట్లుగా చిత్రించారు. అందువల్లనే ఈగంగ రాజు కథలో కూడా మందెచ్చులవారు గంగరాజు భార్యలు సంతానం కోసం అనేక రకాల ప్రయత్నాలు చేసినట్లుగా చెప్పారు.

సంతానం లేనప్పుడు తమకున్న మేడలు మిద్దెలు సుఖాన్నివ్వవని, అవన్నీ పశువుల కొట్టాల లాంటివని గంగరాజు భార్యలు భావించారు.

"కొడుకుల్లేని మేడ కోడెల కొట్టాల - బాలల్లేని మేడలు బర్ల కొట్టాలు
సిరిబాలల్లేని మేడలు సీకటి సెరువడి - బాలల్లేని మేడలు మాలాంచగుళ్ళు"

అని గంగరాజు భార్యలు భావించి, సంతానం లేని కాపురం గూడా తమకు అవసరం



లేదని వారు నిశ్చయించుకొని తమ పుట్టింటికి వెళ్ళిపోతామని గంగరాజుతో చెబుతారు. ఆమాటలతో గంగరాజు కోపించి సంతానం లేకుండా చివరకు భార్యలు కూడా లేకుండా జీవించడం వ్యర్థమనుకొని, చంద్రగిరిపట్నంలోని శంకరుని గుడిని ఆవులతో తొక్కించి నేలమట్టం చేస్తే శంకరుడు కోపించి తనను వెంటనే నాశనం చేస్తాడని భావించి, తన గోవులను తోలుకొని చంద్రగిరి పట్నానికి పోతుంటాడు. అప్పుడు శంకరుడు బ్రాహ్మణుని వేషంలో గంగరాజు దగ్గరికి వచ్చి శంకరుడు గుడిలో లేదని "గంగలో తానమాడిరాను పోయిండు" అని చెప్పి నామాట వింటే నీకు సంతానం కలుగుతుందను చెబుతాడు. గంగరాజు చెప్పమంటాడు. ఇలంబిపురి పట్నాన్ని రాచ బ్రాహ్మడైన ఇలంబిమహారాజు పాలిస్తున్నాడని, అతని కుమార్తెలైన చంద్రకాంత, సూర్య కాంత అనే ఇద్దరు అక్కచెల్లెళ్ళను పెళ్ళి చేసుకుంటే సూర్యకాంత వల్ల సంతానం కలుగుతుందని చెబుతాడు. అప్పుడు గంగరాజు "కరివేపరుచ్చాలు, వొద్దిరుచ్చాలు, మద్దిరుచ్చాలు, అజనిమ్మ, గజనిమ్మ, అచ్చమల్లె, నిచ్చమల్లె రుచ్చాలు, బొద్దుమల్లెలు, గంగరేగులు" దాటుకుంటూ ఇలంబిపురి పట్నానికి వెళ్తాడు.

కథాగేయాల్లో పట్టణాల పేర్లు, వాటిని పాలించే పాలకుల పేర్లు ఒకే విధంగా చెప్పబడుతూ ఉంటాయి. గంగరాజు కథలో చెప్పినట్లుగా ఇలంబిపురిపట్నమని, దాన్ని పాలించేవాడు ఇలంబిమహారాజు అని లేక చంద్రగిరిపట్నం దాన్ని పాలించే వాడు చంద్రగిరి మహారాజు అని ఇలా చెప్పబడుతూ ఉంటుంది. అంతేగాకుండా రాజు కూతుళ్ళ పేర్లు గూడా ఈకథలో చెప్పినట్లుగా సూర్యకాంత, చంద్రకాంత అని చెప్ప బడుతూ ఉంటుంది. అలాగే ఎవరైనా ప్రయాణమైపోతూ ఉంటే ఈకథలో చెప్పినట్లుగా "కరివేపరుచ్చాలు, వొద్దిరుచ్చాలు, మద్దిరుచ్చాలు" మొదలైన అనేక చెట్లు చేమలు దాటుకుంటూ వెళ్ళినట్లుగా చెప్పబడుతూ ఉంటుంది.

ఆతర్వాత గంగరాజు ఆవులను మేపుతూ ఒక చెట్టు మీద కూర్చొని "సారంగి పాటలు" పాడుకుంటూ ఉంటాడు. శంకరుడు రాజు కుమార్తెలైన చంద్రకాంత, సూర్యకాంతలను పూలకోసం అక్కడికి రప్పిస్తాడు. గంగరాజు పాట విని పాట ఇంత మధురంగా ఉంటే పాటపాడేవాడు ఇంకా ఎంత అందంగా ఉంటాడోనని వారు భావించి గంగరాజును వెదుక్కుంటూ వచ్చి అతని అందాన్ని, అతని కిరీటం యొక్క అందాన్ని చూసి మూర్ఛపోతారు. మూర్ఛ నుంచి లేచిన తర్వాత తమను పెళ్ళి చేసుకోమని వారిద్దరు గంగరాజును కోరతారు. అప్పుడు గంగరాజు

"మీకులము సూసినా ఓబామలారా - మీరొగ బామ్మన్లు మీరు ఉన్నరమ్మ
మేమొగ గొల్లోల్లం మేము ఉన్నమేమి - మాకన్నా ఎక్కువ మీరు ఉన్నరమ్మా"

అని చెబుతాడు. దానికి అక్కచెల్లెళ్ళిద్దరూ

పసులన్నీ ఏరైనా పాలన్నీ ఒకటే - జలజాతులు ఏరైనా జలమన్నీ ఒకటే
అడివికట్టె ఏరైనా అగ్గంతా ఒకటే - ఏనాటికైనా అటువంటి
ఆడికులం మొగకులం రెండే కులాలు - నీఐదుగురు బార్యలు ఉన్నరు
వాళ్ళ బోజనం ముందు మాబోజనం ఎనుక- వాళ్ళ సీరె ముందు మాసీరె ఎనక"

అని చెబుతారు. సాహిత్యానికి ఆనందంతో పాటు ఉపదేశం కూడా ఉండాలని మనవారు భావించారు. ఇందులో సూర్యకాంత, చంద్రకాంత చెప్పిన మాటలు మనుషుల్లో స్త్రీపురుషులనేవి రెండే కులాలని ఇంకా వేరే ఏకులాలు లేవని జానపదకవి చాల చక్కగా చెప్పాడు. అందుకు దృష్టాంతగా ఆవులు గేదెలు మొదలైన విధంగా పశువులు వేరుగా ఉన్నప్పటికి అవి ఇచ్చే పాలన్నీ తెల్లగా ఉంటాయనీ, నీరు అనేక విధాలుగా లభిస్తున్నప్పటికీ ఆనీళ్ళన్నీ ఒకటేనని, అడవుల్లో దొరికే చెట్ల కర్రలు వేరుగా ఉన్నప్ప టికీ వాటి వల్ల వచ్చే అగ్గి ఒకటేనని చెప్పిన విధానం ప్రత్యేకంగా, సహజసుందరంగా ఉంది. ఇంత సహజసుందరంగా చెప్పడం జానపదకవికే సాధ్యం.

చంద్రకాంత, సూర్యకాంత తమను పెళ్ళి చేసుకోమని పట్టుపట్టడంచేత గంగరాజు అంగీకరించి వారి తండ్రిని ఒప్పించి పల్లకీ పంపిస్తే తాను వచ్చి వారిని పెళ్ళి చేసుకుంటానని చెబుతాడు. అక్కచెల్లెళ్ళిద్దరూ తండ్రి వద్దకు వెళ్ళి అతణ్ణి ఒప్పిస్తారు. ఇలంబిమహారాజు తనకూతుళ్ళిద్దరినీ గంగరాజుకిచ్చి దేవతల సమక్షంలో అత్యంత వైభవంగా పెళ్ళి చేస్తాడు.

జానపదసాహిత్యంలో హేతువుకు పెద్దగా చోటు ఉండదు. జానపదకవులు అభూత కల్పనలను అమానుషమైన సంఘటనలను కల్పిస్తూ ఉంటారు. ఈకథా గేయంలో గంగరాజు ద్వారకాపురి పట్టణానికి రాజుగా చెప్పబడ్డాడు. అంతేగాకుండా ఇతను ఆవులను కాస్తున్నట్లుగా కూడా చెప్పబడింది. నిజానికి రాజు అయినవాడు ఆవులను కాయడు. రాజుకు చాల ఆవులుంటాయి. రాజు వాటిని గోపాలకులచేత కాయిస్తాడు. ఆనాడు ఎన్ని ఎక్కువ ఆవులుంటే అంత ధనవంతుని కింద లెక్క. ఈకథ లో గంగరాజు నిజంగా రాజేనా? లేక ఎక్కువ ఆవులున్న ధనవంతుడా అనేది స్పష్టంగా చెప్పడానికి లేదు. ఒకవేళ గంగరాజు రాజు అనుకున్నా అతని పెళ్ళికి దేవతలు వచ్చా రని చెప్పడం అభూతకల్పన. దేవతలు ఊరికే రావడం కాదు, గంగరాజు పెళ్ళికి "ఇష్టదేవుడు మంగలోడయిండట - బ్రహ్మదేవుడచ్చి బామ్మడయిండట" అంతేగాకుండా "లచ్చిమీదేవి, బాగిర్తి, ముప్పయిమూడు కోట్ల దేవతలు, శనేశ్వర్లు, మునేశ్వర్లు" మొదలైనవారు ఎందరో వచ్చారట. ఇలాంటి అమానుష కల్పనలు జానపదసాహిత్యంలో



సాధారణంగా చోటు చేసుకుంటూ ఉంటాయి.

వివాహమైన తర్వాత ఇలంబిరాజు అతని భార్య తమ కూతుళ్ళిద్దరినీ గంగ రాజు వెంట పంపిస్తూ తమ బిడ్డల ఎడబాటు సహించలేక ఎంతగానో దు:ఖిస్తారు. మొదట వారు గంగరాజుతో

"అయ్యా అల్లుడా గంగురాజా -మీయొక్క పట్నం మాబిడ్డల తీసుకుపోతవయ్యా
నాయొక్క రాసబాపన్ల బిడ్డలు నీకు బారియలయిండ్లు-నాబిడ్డల కొట్టకు తిట్టకు
బాయికాడికి వోతే బార్యోలె బావించుకో-సేను కాడికి వోతే సెల్లోలె బావించుకో"

అని చెప్పి ఆతర్వాత బిడ్డల ఎడబాటు వల్ల వచ్చే దు:ఖాన్ని భరించలేక ఆదంపతు లిద్దరూ తమ కూతుళ్ళ పాదాల మీద పడి బోరున విలపిస్తూ చెప్పిన తీరు అపూర్వమైన కరుణరస ఘట్టం.

"బిడ్డల పాదాల మీద పడ్డారో - ఆదినాయనుడా నారాయనా
నాబిడ్డా సూర్యకాంతా సూర్యకాంతా - నాబిడ్డ సెంద్రకాంతా సెంద్రకాంతా
ఆదినారాయనుండా నారాయనా - నీతీరు లోకమంత బిడ్డలారా
నడుసుకుంటే లోకమంతా బిడ్డలారా - నిమ్మలమనుకున్న బిడ్డలారా
మీకన్నా పెద్దోల్లు కొడుకుల్లేక పోయిరి - మీకన్నా సిన్నోల్లు తమ్ముల్లేకపోయిరి
మీరే కొడుకులనుకున్న బిడ్డలారా - మీరే బిడ్డలనుకున్న బిడ్డలారా
ఇంతదాకా మిమ్ముల పెంచి పెద్ద చేసుకున్న - సాది సంతరించుకున్న
బిడ్డలారా మీరు ద్వారకాపురి పట్నం ఎలిపోతారా -ఆదినారాయనుడా నారాయనా
నాసావు బిడ్డలారా బిడ్డలారా - మీరన్నా సూడవోరు బిడ్డలారా
మీతల్లి ఆవుసు కూడునో - నాకే ఆవుసు కూడునో
దారకాపురి పట్నం బిడ్డలారా - దగ్గర లేకపోయె బిడ్డలారా
ముప్పయ్యామడ ఉన్నదేమి - మీరెప్పుడత్తరో బిడ్డలారా
బిడ్డకాళ్ళ మీద పడ్డారో - బారియ బర్తలైనా ఓనాయనా
కలకల కన్నీరు దీత్తరేమీ"

కని అల్లారు ముద్దుగా పదిహేడు, పద్దెనిమిది సంవత్సరాలు పెంచుకున్న తమ కూతుళ్ళకు పెళ్ళిచేసి మొదటిసారి అత్తవారింటికి పంపించేటప్పుడు తల్లిదండ్రులు పడే దు:ఖం వర్ణనాతీతం. అభిజ్ఞానశాకుంతలంలోని నాలుగవ అంకంలో కణ్వమహర్షి తన పెంపుడు కూతురైన శకుంతలను అత్తవారింటికి పంపించేటప్పుడు ఎంతగానో బాధపడుతూ విరాగినైన తాను, పెంచిన అమ్మాయి ఎడబాటును సహించలేక ఇంతగా దు:ఖానికి లోనవుతూ ఉంటే, కని పెంచి పెద్ద చేసిన సాధారణ మానవులు తమ

కూతుళ్ళను అత్తవారింటికి పంపించేటప్పుడు ఇంక ఎంతగా బాధ పడతారో కదా అని చెబుతాడు. ఈఅంకంలోని నాలుగు శ్లోకాల్లో మహాకవి కాళిదాసు శకుంతల కణ్వుని ఆశ్రమం నుంచి అత్తవారింటికి వెళ్ళేటప్పటి దు:ఖవాతావరణాన్ని రమణీయంగా వర్ణించాడు. అభిజ్ఞానశాకుంతలంలో ఇంత కరుణరసభరితమైన ఈఘట్టం ఉండడం వల్లనే ఆ నాటకంలోని నాలుగవ అంకానికి గొప్ప ప్రసిద్ధి, విశిష్టత వచ్చింది. అందువల్లనే "కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతల, తత్రచతుర్థాంకో తత్ర శ్లోకచతుష్టయం" అనే ప్రసిద్ధి వచ్చింది.

గతంలో ఇప్పటిలాగా రవాణా సౌకర్యాలుండేవి కావు. అత్తవారింటి నుంచి ఆడబిడ్డలు ఎప్పుడు బడితే అప్పుడు పుట్టింటికి రావడానికి వీలయ్యేది కాదు. ఆమె క్షేమసమాచారాలు కూడా పెద్దగా తెలిసేవి కావు. అత్తవారింట్లో తమ కూతురు సుఖంగా ఉందో లేక కష్టపడుతూ ఉందో తెలిసేది కాదు. తాము వెళ్ళి చూడడానికి దగ్గర కాదు. ఆందువల్ల తల్లిదండ్రులు మొదటిసారి కూతురును వదలి ఉండలేక అంతగా బాధపడేవారు.

గంగరాజుకథలో ఇలంబిరాజు, అతని భార్య తమ కూతుళ్ళ ఎడబాటు సహింపలేక మరింత ఎక్కువగా దు:ఖిస్తున్నట్లుగా జానపదకవి చెప్పాడు. దానికి కారణం ఈదంపతులకు ఇద్దరు కూతుళ్ళు తప్ప మరి పిల్లలు లేరు. ఇద్దరు కూతుళ్ళను కొడుకులైన వారే కూతుళ్ళైనా వాళ్ళే అన్నట్లుగా ఎంతో అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేశారు. అందువల్లనే

"మీకన్నా పెద్దోల్లు కొడుకుల్లేక పోయిరి - మీకన్నా సిన్నోల్లు తమ్ముల్లేకపోయిరి
మీరే కొడుకులనుకున్న బిడ్డలారా - మీరే బిడ్డలనుకున్న బిడ్డలారా"

అని ఆదంపతులు చెప్పారు. అంతేగాకుండా ఆదంపతులు వృద్ధులయ్యారు. భార్యాభర్తల్లో ఎవరు ముందు చనిపోతారో, ఎవరు వెనుక చనిపోతారో తాము చనిపోతే తమను చూడడానికి తమ కుమార్తెలు వస్తారో రారో తెలియదు. ఎందుకంటే గంగరాజు పాలించే ద్వారకాపురిపట్నం అక్కడికి ముప్పై ఆమడల దూరాన ఉంది. అందువల్లనే వారు

"నాసావు బిడ్డలారా బిడ్డలారా - మీరన్నా సూడవోరు బిడ్డలారా
మీతల్లి ఆవుసు కూడునో - నాకే ఆవుసు కూడునో
దారకాపురి పట్నం బిడ్డలారా - దగ్గర లేకపోయె బిడ్డలారా
ముప్పయ్యామడ ఉన్నదేమి - మీరెప్పుడత్తరో బిడ్డలారా"

అని దు:ఖించారు. ఆతర్వాత ఇలాంబిరాజు భార్య ఇలంబిదేవి దు:ఖిస్తూ ఇంకా ఇలా చెబుతూవుంది.



"ఏపండుక్కు అత్తరు ఏపబ్బానికత్తరమ్మా -యాడాదికి బిడ్డలారా అరవై పండుగలు
అరవై పండుగలల్ల బిడ్డలను నేనెట్ల సూత్తనా - కనుక్కున్న కన్నతల్లి అవ్వా
బిడ్డల మీద పడి వలపోత్త ఉన్నాదో"

కూతుళ్ళ మీద తండ్రి కంటె తల్లికి మమకారం ఎక్కువ. ఎందుకంటె చిన్నప్పటి నుంచి ఆడపిల్లలు తల్లి కొంగు పట్టుకొని తిరుగుతూ, తల్లి దగ్గర ఆడుకుంటూ, తల్లి చెప్పే ముచ్చట్లు వింటూ, తల్లి దగ్గర గారాబం చేస్తూ తల్లికి ఎంతో ప్రేమాస్పదులౌతారు. అందువల్ల తన కూతుళ్ళను ఎప్పుడు చూస్తానా అని ఆమె ఎదురు చూస్తూ ఉంటుంది. అందువల్లనే సంవత్సరంలో ఉండే అరవై పండుగల్లో ఏపండుగకు వస్తారా అని ఆతల్లి తన కూతుళ్ళను అడుగుతూ కన్న బిడ్డ మీదపడి దు:ఖిస్తూ ఉంది.

తల్లిదండ్రుల దు:ఖానికి చలించిపోయిన చంద్రకాంత, సూర్యకాంత తమ తల్లిదండ్రులతో ఇలా చెబుతున్నారు.

"కలకల కలకల కన్నీరు దియ్యంగనే-పెద్దబిడ్డ చెంద్రకాంత చిన్నబిడ్డ సూర్యకాంతకు
కడుపులున్న దు:ఖం కండ్లల్ల కచ్చి - వావ్వా ఇలంబిదేవి నాయనా ఇలంబిరాజా
మిమ్ముల సంబురంగా సాగదోలుమంటే - మామీద బడి మీరేడ్త ఉన్నారా
సాది సంతరించి పెంచి పెద్ద సేసిన మిమ్ముల - మేమిడిసి పోతమే నాయినా
అత్తగారి పట్నం మమ్మల సాగదోలంగ - మీసావు కోరుకుంటిరాయ్యా
సావన్న ముచ్చట మీనోటికెట్ల అచ్చెనే- నాయన మీదవడి కలకల కన్నీరు దీసింద్రు"

కూతుర్లు ఇద్దరు ఇలా పలకడంతో ఇలంబిరాజు అతని భార్య తమ దు:ఖం నుంచి బైట పడి అల్లునితో పాటు కూతుళ్ళిద్దరిని పంపిస్తారు. ఈవిదంగా జానపద కవి ఈఘట్టాన్ని గొప్ప కరుణరస భరితంగా చెప్పాడు. ఈఘట్టాన్ని మందెచ్చుల వారు అత్యంత కరుణరస భరితంగా చెప్పి ప్రేక్షకుల చేత కంటతడి పెట్టిస్తారు.

తర్వాత గంగరాజు దారిలో తన ఐదుగురు భార్యలకు తాను చంద్రకాంతను సూర్యకాంతను వివాహం చేసుకున్న సంగతి తెలిసి ఉంటుందని, తమను చూడగానే ఐదుగురు చీపుర్లు పట్టుకొని కొట్టడానికి సిద్ధంగా ఉంటారని అందువల్ల వారిని చూడగానే వారి కాళ్ళమీద పడిపోయి క్షమించమని వేడుకుంటే వారు దయదలిచి మిమ్ములను కోటలోపలికి తీసుకొనిపోతారని తన కొత్తభార్యలిద్దరికి చెబుతాడు. దానికి అక్కచెల్లెళ్ళిద్దరూ అంగీకరిస్తారు. గంగరాజు ఐదుగురు భార్యలు దూరం నుంచే పల్లకీలో వస్తున్న తమ భర్తను అతని కొత్తభార్యలను చూసి

"ఏరాజ్యం బోయిండో ఏదేశం బోయిండో - ఇద్దర్ని పట్టుకొని అచ్చిండే అవ్వా
అచ్చిన నాసవితికెట్ల బుద్ధి లేదు - ఆగాడ్డికొడుక్కెట్ల బుద్ధి లేదే"

అని ఐదుగురు ఐదు చీపుర్లు పట్టుకోని సిద్ధంగా ఉంటారు. వాళ్ళను చూడగానే గంగ రాజు ఆవుల మంద దగ్గరికి వెళ్ళిపోతాడు. అప్పుడు చంద్రకాంత సూర్యకాంత ఇద్దరూ

"ఐదుగురి కాళ్ళ మీద పడ్డారా - రాండాయ్మ అక్కలారా అక్కలారా
మీఎంగిలి అన్నానికి మేం ఆశపడి వచ్చినం - మీబుక్క ముందు మాబుక్క ఎనుక
మీసొమ్ములు ముందు మాసొమ్ములు ఎనక -మీబట్టలు ముందు మాబట్టలు ఎనక
మాదే తప్పుంది అక్కలారా - మమ్ముల గొట్టకుండ్రి అక్కలారో
మీగంగరాజును మెచ్చి లగ్గం సేసుకున్నమమ్మా"

అని ఇద్దరు అక్కచెల్లెండ్రు ఐదుగురి కాళ్ళ మీద పడగానే

"వీళ్ళు మనకాళ్ళ మీద వడ్డరు - వీళ్ళను కొట్టేది లేదు తిట్టేది లేదు
మన లోగిళ్ళకు తీసుకు పోదాం"

అని ఆఐదుగురు వీరిద్దరనీ క్షమించి ఇంట్లోకి తీసుకొని వెళ్ళిపోతారు.

ఇక్కడ జానపదకవి జానపదుల మనస్తత్వాన్ని చక్కగా వ్యక్తీకరించాడు. పూర్వం మన సమాజంలో బహుభార్యత్వం ఉండేది. ఐనప్పటికీ సాధారణంగా స్త్రీలు తమ భర్త మరొకరిని పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించేవారు కారు. ఐతే తమకు తెలియకుండా భర్త పెళ్ళి చేసుకొని వస్తే మొదట చూసిన వెంటనే ఆవేశంతో భర్తను, అతను పెళ్ళి చేసుకొని తెచ్చిన కొత్త భార్యను కొట్టడం తిట్టడం చేస్తారు. కానీ ఆతర్వాత చేసేది ఏమీ లేక సర్దుకుపోతారు. గంగరాజు భార్యలు ఐదుగురు తమ భర్త మరొక ఇద్దరిని వివాహం చేసుకొని వచ్చాడని తెలుసుకొని మొదట కోపం పట్టలేక అతణ్ణి, అతని కొత్తభార్యలను చీపురుకట్టలతో కొట్టాలనుకున్నారు. ఆడవారి ఆయుధాలు చీపుర్లు, చేటలు, అట్లకాడలు లాంటి గృహపరికరాలె కదా. ఐతే స్త్రీలకు జాలి చాల ఎక్కువ. భర్త ఎంత తప్పు చేసినా దాసుని తప్పు దండంతో సరి అన్నట్లుగా అతడు కాళ్ళబేరానికి రాగానే కనికరించి అతని తప్పును క్షమించి వదలివేస్తారు. ఈవిషయం తెలిసినవాడు కనుకనే గంగరాజు తన పాతభార్యలను చూడగానే తాను వారికి చిక్క కుండా ఆవుల దగ్గరికి వెళ్ళిపోతూ, కాగల కార్యాన్ని తన కొత్తభార్యలకు అప్పగించి వారిని పాత భార్యలకు దాసోహం కావలసిందిగా చెప్పి వెళ్ళిపోయాడు. ఎప్పుడైతే కొత్తభార్యలు పాతవారికి దాసోహం అన్నారో పాతవారు కొత్తవారిని క్షమించి తమలో కలిపేసుకున్నారు.

కథగేయాల్లో నాయకుడు గానీ లేక ప్రధానపాత్ర గానీ మామూలుగా పుట్టరు. వారు అసాధారణమైన వ్యక్తులు కాబట్టి వారి జన్మ గూడా అసాధారణంగానే ఉంటుంది. ఇలాంటివారు దేవుని వరప్రసాదం వల్ల గానీ లేక మహిమగల ఒక పండు తినడం వల్ల గానీ పుడతారు. గంగరాజు కథలో గూడా గంగరాజు కుమారుడైన



వలురాజు ఒక మామిడి చెట్టుకు శంకరుని మహిమ చేత కాసిన ఒంటి మామిడి పండు తినడం వల్ల పుట్టినట్లుగా ఇందులో చెప్పబడింది. ఆవృత్తాంతం ఇది.

ఒకరోజు గంగరాజు ఏడుగురు భార్యలు తమ తాతలనాటి బావి దగ్గరికి పూలు, పండ్లు కోసుకోవడానికి వెళతారు. అక్కడ ఈశ్వరుని మహిమ చేత ఒక మామిడిచెట్టుకు ఒకటే మామిడి పండు ధగధగా మెరుస్తూ కనిపిస్తుంది. వారు చెట్టు ఎక్కి ఆపండును కోయలేకపోతారు. అందరూ తమ పైటకొంగులు చాపి తమకొంగులో పండు పడాలని దేవుణ్ణి ప్రార్థిస్తారు. ఇక్కడ మందెచ్చుల ప్రధానకథకుడు ఇలా చక్కగా ఒక గేయాన్ని పాడతాడు.

"కొమ్మన పలమున్నదే ఉయ్యాలో ఉయ్యాలో-కోరుతె మనకచ్చునా ఉయ్యాలో ఉయ్యాలో
కొమ్మను పట్టి దులిపితే ఉయ్యాలో ఉయ్యాలో-కొంగుల పడిపోతదా ఉయ్యాలో ఉయ్యాలో
సెట్టున పండున్నదే ఉయ్యాలో ఉయ్యాలో-శమపడితే మనకచ్చునా ఉయ్యాలో ఉయ్యాలో
సెట్టు ఎక్కి దులిపితే ఉయ్యాలో ఉయ్యాలో-సేతుల పడిపోవునా ఉయ్యాలో ఉయ్యాలో
బాయిల సేపున్నదే ఉయ్యాలో ఉయ్యాలో-బమపడితే మనకచ్చునా ఉయ్యాలో ఉయ్యాలో
గాలమేసి లాగితే ఉయ్యాలో ఉయ్యాలో-గడ్డమీద పడుతున్నదే ఉయ్యాలో ఉయ్యాలో"

ఐతే పైగేయం కథకు సంబందించినది కాదు. ఇది ప్రేక్షకులకు సంబంధించింది. మానవప్రయత్నం లేకుండా కేవలం దేవుని మీద భారం వేసి దేవుడాదేవుడా అనుకుంటూ ఉంటే కార్యం నెరవేరదని చెబుతూ మందెచ్చులవారు పైగేయాన్ని పాడుతారు.

ఆతర్వాత ప్రధానకథకుడు మళ్ళీ కథలోకి వస్తాడు. ఆపండు ఈశ్వరుని మహిమచేత అందరి కంటె చిన్నదైన సూర్యకాంత కొంగులో పడుతుంది. మిగిలిన ఆరుగురికి ఆమె మీద ఈర్ష్య అసూయ ద్వేషం కలుగుతాయి. సూర్యకాంత విశాలమైన మనస్సుతో ఆపండును ఏడు ముక్కలుగా కోసి తాను ఒక ముక్క ఉంచుకొని మిగిలిన ఆరు ముక్కలను తన సవతులకు ఇస్తుంది. ఐతే వారు ఆముక్కలను తీసుకోకుండా పారేసి వెళ్ళిపోతారు. సూర్యకాంత కిందపడిన ముక్కలను తీసుకొని వాటికి అంటిన మట్టిని తుడిచి తింటుంది.

మానవ మనస్తత్వం చాల విచిత్రమైంది. కొంతమంది వ్యక్తులు కలిసిమెలసి జీవిస్తూ ఒక వస్తువు కోసం అందరూ ఆశతో ప్రయత్నించినప్పుడు ఆవస్తువు ఎవరికీ దొరకకపోతే అందరూ నిరాశపడి ఆతర్వాత దాని గురించి మరచిపోతారు. కానీ వారిలో ఎవరికైనా ఒకరికి ఆవస్తువు దొరికితే మిగిలిన వారందరూ అసూయాగ్రస్తులై ఆవస్తువును పొందిన వ్యక్తి మీద అనవసరమైన ఈర్ష్యను పెంచుకునే అవకాశముంది. అందులోనూ ఆవస్తువును పొందినవారు అందరికంటె చిన్నవారైతే అసూయ మరింత

ఎక్కువగా ఉండే అవకాశముంది. మనకథలో కూడా ఈశ్వరుని దయవల్ల మామిడిపండును పొందిన సూర్యకాంత సవతులందరికంటె చిన్నది. దానితో ఆమె కంటె పెద్దవారైన ఆరుగురు సవతులు అసూయతో అప్పటినుంచి ఆమెతో మాట్లాడడం మానివేస్తారు.

ఈలోగా సూర్యకాంత మామిడిపండు మాహాత్మ్యం చేత గర్భం దరిస్తుంది. గర్భచిహ్నాలను జానపద కవి ఇలా చెప్పాడు.

"ఆతల్లి సూర్యకాంత గర్భం లోపల -పుత్రనే సంతానమైనా నేడు నిల్త ఉన్నదయ్యా
వొల్లమోరి తీగ గూడ తీగ గూడ వారతాదా-వొల్లంతా బరువాయె ఓకరింపులు పుట్టవట్టె
అరికాళ్ళ ఉబ్బులైనా ఎక్కినాయి-కంటెబొక్క లెల్లినాయా కండ్లు లోపల వద్దాయా"

సూర్యకాంత గర్భం ధరించగానే ఆమె శరీరం తీగ లాగా సన్నగా అయింది. ఆమె ఒళ్ళు ఆమెకు బరువైంది. వాంతులు వస్తున్నాయి. అరికాళ్ళు ఉబ్బాయి. ఆమె చిక్కిపోవడం చేత ఆమె శరీరంలో ఎముకలు కనిపిస్తున్నాయి. కళ్ళు లోపలికి వెళ్ళి పోయాయి. ఈవర్ణన ఎంతో సహజసుందరంగా ఉంది.

మొదటసారి గర్భం ధరించిన వారికి కాన్పు గురించిన ఆందోళన సహజంగా ఉంటుంది. ఇంట్లోని వారు ఆమెకు ఆందోళన లేకుండా మంచిమాటలు చెప్పి అను నయిస్తూ ఉండాలి.కానీ సూర్యకాంతకు అలాంటి మాటలు చెప్పేవాళ్ళే కరువయ్యారు. ఆమె ఆరుగురు అక్కలు ఆమెతో మాట్లాడడం మానివేశారు. దానితో ఆమెకు ఎమి చేయాలో పాలుపోక ఇలా దు:ఖిస్తూ ఉంది.

"నేను ఏమి పాపమైనా నేను సేసినాను - నువ్వెట్లా నాతోని ఓ దేవుడా
అయ్యో నాతోని మాటలెల్లా ఆడాలె- తల్లిగారి ఇల్లునైనా ఓదేవా
మూడు వందలముప్పయ్యి ఓదేవా- ఆమడ ఉన్నదయ్యా ఓరామా
అయ్య నాయినా ఇలంబిమారాజా- ఓయి నాతల్లి ఇలంబి దేవతా
తల్లిదండ్రులారా మీరు మమ్ముల - గన్నరు గానీ మారాత గనలేరు
మేము కోరి పెండ్లి ఆడినాము- మేము బొసి లగ్గమాడినాము
పాపకారి అక్కలేమో నామీద పగ దల్చిండ్రు-నాగతి గూడా ఎట్ల ఆయితాదా"

అని దూరంగా ఉన్న తన తల్లిదండ్రులను, తన రాతఫలాన్ని తలుచుకుంటూ దు:ఖిస్తూ ఉంది. బిడ్డలను కంటారు గానీ వారి రాతను కనలేరు అనేది సామెత. జానపద కవి సమయోచితంగా ఈసామెతను ప్రయోగించాడు.

కథాగేయాల్లో సన్మార్గులైన స్త్రీలను ఆమె అత్త ఆడపడుచులు గానీ, సవతులు గానీ అసూయతో అనేక కష్టాలకు గురి చేసినట్లుగా చెప్పబడుతుంది. సాధారణంగా ఇలా కష్టాలు పడేవారు అందరికంటే చిన్నవారుగా ఉంటారు. ఇలాంటి వారు ఎలాంటి



ప్రతిఘటన లేకుండా కష్టాలను భరిస్తూ తమ ఇష్టదైవాలను తలుచుకొని ఆకష్టాల నుంచి బైట పడుతూ ఉంటారు. గంగరాజు కథలో గంగరాజు చిన్నభార్య అయిన సూర్యకాంత తనకంటె పెద్దవారైన ఆరుగురు సవతుల వల్ల అనేక కష్టాలు పడినట్లుగా శంకరుని మాహాత్మ్యం వల్ల ఆకష్టాల నుంచి బైటపడినట్లుగా ఇలా చెప్పబడింది.

సూర్యకాంతకు కొడుకు పుడితే గంగరాజు ఆమె ప్రేమలో పడిపోయి తమను పట్టించుకోకపోవడమే గాకుండా తమచేత ఆమెకు ఊడిగం చేయిస్తాడని మిగిలిన ఆరుగురు ఇలా ఆలోచన చేస్తున్నారు.

"ఏనాటికైనా సూర్యకాంత కొడుకును కంటే-రాజుగంగరాజు మనమాట ఇనడు
మనసేతికూడు రామన్న రామ- కూడన్నా దినడే రామన్నరామా
మనల్ని దాసోల్ల సేసుకుంటడే సెల్లో-మనల్ని దాసుల్ల సేసుకోని సూర్యకాంతకు
బట్టలుతకమంటడు రామన్నరామా-సూర్యకాంతకు తానం బోయమంటడు
మనల బజాట్ల కొడతాడే రామన్నరామా-దానికి కొడుకో బిడ్డే పుడితే దాని బమల
పడిపోతడు"

చివరకు ఎలాగైనా సూర్యకాంతను ఆమె కడుపులోని పిండాన్ని చంపాలని ఆరుగురు భార్యలు నిశ్చయించుకొని సూర్యకాంతకు మాయమాటలు చెప్పి విషం కలిపిన పాలను ఆమెతో తాగిస్తారు. అప్పుడు సూర్యకాంత

"గిర్రగిర్ర దిరిగింది గాదో - బండమీద వడ్డాది సూర్యకాంతో
శోకమంత వెట్టింది సూర్యకాంతో- ఆదినారాయనుడా నారాయానా
నాతల్లి ఇలంబి ఇలంబి దేవీ - నేను తల్లి లేని పిల్లనైనా అయిపోతానా
నేను తండ్రి లేని పిల్లనైనా అయిపోతానా-అయ్యో కలకల కన్నీరు దియ్యవట్టెనా
కన్నీరు వెట్టినాది సూర్యకాంత - ఆదినారాయనుడా నారాయనా
నాపెండ్లిమీద మన్నువొయ్య ఓనాయనా-ఎండికొండ ఏలే జంగమయ్యా
అయ్యో జంగమయ్య జంగమయ్య-ఎక్కడున్నావు గాదు జంగమయ్య
ఆదినారాయనుడా నారాయనా- అయ్యో కలకల కన్నీరు సూర్యకాంత"

సూర్యకాంత ఇలా ఈశ్వరుని ప్రార్థించేటప్పటికి ఆమె తాగిన విషం విరిగిపోయి మామూలుగా ఆయిపోతుంది. ఇలా లాభం లేదని ఆమె కడుపు పోగొట్టడానికి ఆరుగురు మరొక ఉపాయం పన్ని సూర్యకాంత దగ్గరికి వెళ్ళి కాన్పు సులభంగా కావాలంటే ఏడు విసుర్రాళ్ళు వీపుకు కట్టుకోని ఏడంతస్తుల మేడ ఎక్కి దిగాలని చెబుతారు. చెప్పడమే గాకుండా ఆమె వీపుకు ఏడు ఇసుర్రాళ్ళు కట్టి ఏడంతస్తుల మేడను ఎక్కి దిగమంటారు.

"అటువంటి సూర్యకాంత బలిమిటికి లేత్తె-పక్కబొక్కలు అన్ని పల్లపల్ల అనావట్టె

ఒకటి గాదు రెండు గాదు ఏడు రాళ్ళాయె-అవ్వ సత్తినంటదేమొ అయ్య సత్తినంటదేమొ
నాసాలు మీద మన్నువొయ్య మన్నువొయ్య-నాదేం కానుపాయె నాదేం రాతాయె
బలిమిటికి లేత్తే దిగబారా సెమట పుట్టింది-ఒక మెట్టు మీదనైనా అడుగును వెట్టినాదా
మీదికి పోవట్టె సూర్యకాంత-కాళ్ళు ఎనక గుంజినాయి
సూర్యకాంత మొగ్గినాదా-గిరగిర తిరిగి కింద వడ్డాది
ఇగ నేను బతకనంటుండే అమ్మ- కలకల కంటినీరు దియ్యవట్టె
ఎండికొండ పైడికొండ రాజ్యమేలే శంకరుడో-నువు ఎక్కడ ఉన్నావు బగమంతా"

సూర్యకాంత విసుర్రాళ్ళను కట్టుకొని తన బలమంతా ఉపయోగించి లేచి నిలబడే ప్రయత్నం చేసింది. గర్భవతి కావడం చేత ఆమె శరీరం సున్నితంగా తయారై విసుర్రాళ్ళ బరువును తట్టుకోలేక ఆమె ఎముకలు పలపలమని శబ్దం చేశాయి. వెంటనే తన తల్లిదండ్రులను తలుచుకుంది. అంతేగాకుండా తనదేం కానుపని, తనదేం రాతని తన దురదృష్టాన్ని తిట్టుకుంది. అలాగే కష్టపడి మెల్లగా లేచి మొదటి మెట్టు ఎక్కింది. వీపున కట్టిన విసుర్రాళ్ళ బరువు తట్టుకోలేక కింద పడిపోయి ఈశ్వరుని వేడుకు నేటప్పటికి ఏడు విసుర్రాళ్ళ బరువు ఏడు పిడకల బరువుగా మారుతుంది. అప్పుడు సూర్యకాంత సులభంగా ఏడంతస్తులమేడ ఎక్కి దిగుతుంది. దీనితో ఆరుగురు అక్కలు

"దీని సావు పాడుగాను దీనికి సావు లేదు
ఆకడుపులున్న పోరడు ఎంత రంకుల పోరడో"

అని ఆశ్చర్యపోయి సూర్యకాంతకు కాన్పు చేసే మంత్రసానికి గుమ్మడికాయంత బంగారం లంచంగా ఇస్తామని ఆశ చూపించి పుట్టిన బాలుని ఆడవిలోని తాతలనాటి బావిలో పడవేయిస్తారు. ఈవిషయం ఈశ్వరుడు గ్రహించి

"గోరుసిక్కుడు కాయోలె గొల్లకులం గొడుగెత్తాలనుకున్నా
పందిరి వారిన తీగోలె పడిగెత్తాలనుకున్నా"

అని గంగరాజు వంశం వర్ధిల్లాలని భావించి తన మెడలో ఉన్న నాగన్నను పంపించి బావిలో పడిన బాలుని కాపాడి నాగకన్య రూపంలో నాగలోకంలో పెంచే ఏర్పాటు చేస్తాడు.

ఇక్కడ ఆరుగురు భార్యలు సూర్యకాంతకు పొత్రం (రాయి) పుట్టిందని గంగ రాజును నమ్మిస్తారు. అంతేగాకుండా పొత్రాన్ని కన్న ఆడది ఇంట్లో ఉండగూడదని గంగరాజును ఒప్పించి సూర్యకాంతను కటికవారి చేత అడవిలో నరికించేటట్లు చేస్తారు. శంకరుని మాహాత్మ్యంచేత ఆమె చనిపోకుండా అడవిలో ఉంటుంది.

నాగలోకంలో నాగకన్య బాలునికి "వలసేతి కడియాల వలరాజు" అని పేరు పెట్టి ఆతనికి అన్నిరకాల విద్యలు నేర్పించి, అతని తల్లిదండ్రుల వృత్తాంతమంతా చెప్పి



పొరబాటున గూడా అతని పెద్దమ్మల కంట పడవద్దని చెబుతుంది. బాలుడు పది సంవత్సరాల ప్రాయంలో ఉన్నప్పుడు నాగకన్య అనుమతితో అడవిలోకి వెళ్ళి తనను పారేసిన బావి దగ్గర కూర్చొని ఉంటాడు. ఆదే సమయంలోనే అతని పెద్దమ్మలు అక్కడికి వచ్చి బాలుని చూసి అతనిలో గంగరాజు పోలికలను గమనించి అతడు తప్పనిసరిగా సూర్యకాంత కొడుకు అయి ఉంటాడని భావించి అతని ఊరు, పేరు, తల్లిదండ్రుల గురించి ప్రశ్నిస్తారు. వలరాజు గూడా వారు తన పెద్దమ్మలని గుర్తించి తన గురించి ఏమీ చెప్పకుండా బావిలో దూకి నాగలోకానికి వెళ్ళిపోతాడు. మంత్రసాని బావిలో వేసిన బాలుని ఏదో శక్తి కాపాడి పెంచిందని ఆరుగురు భావించి ఆబావిని పూడ్చివేస్తే బాలుడు చనిపోతాడని తలచి గంగరాజుకు చెప్పి బావిని పూడ్చివేయిస్తారు.

కథాగేయాల్లో నాయకుడు గానీ ప్రధానపాత్ర గానీ కొన్ని కారణాల వల్ల తన సుందరరూపాన్ని వదలివేసి కొంతకాలం పాటు వికృతరూపంలో ప్రచ్ఛన్నంగా ఉండడం, సమయం వచ్చినప్పుడు వికృత రూపాన్ని వదలివేసి తన నిజరూపాన్ని ధరించి తన వారిని కలుసుకోవడం జరుగుతూ ఉంటుంది. గంగరాజు కథలో వలురాజు తనను పెంచిన నాగకన్య మాహాత్మ్యం చేత కొంతకాలం అందమైన తన నిజరూపాన్ని వదలి వేసి వికృతరూపంలో ఉండి ఆతరువాత నాగకన్య దయవల్ల మళ్ళీ తన నిజరూపాన్ని పొంది తన తనవారిని కలుసుకున్నట్లుగా ఇలా చెప్పబడింది.

బావిని పూడ్చివేయడంవల్ల నాగకన్య వలరాజును అతని తల్లిదండ్రులను కలుసుకోమని చెప్పి పంపిస్తూ అతను మామూలు రూపంలో ఉంటే అతనికి అతని పెద్దమ్మల వల్ల ప్రమాదం రావచ్చని ఊహించి వలరాజుకు కురూపాన్ని ఇచ్చి భూమి మీదకు పంపిస్తుంది. వలరాజు కురూపంతో కుమ్మరి ఎంకయ్య ఇంట్లో ఉంటాడు. వలరాజు వచ్చినప్పటి నుంచి ఎంకయ్యకు బాగా కలిసివచ్చి ధనవంతుడవుతాడు. గంగరాజు "ఏడువారాల సట్టిబోనాలు" (యాదవులు ఏడు రోజులపాటు చేసే బోనాల పండుగ) చేయాలని నిర్ణయించుకొని కుండల కోసం కుమ్మరి ఎంకయ్య ఇంటికి బోయిలను పంపిస్తాడు. ఎంకయ్యకు కుండలు చేయడం రాదు. కుండలు పంపించక పోతే గంగరాజు చంపుతాడని ఎంకయ్య దు:ఖిస్తూ ఉంటాడు. వలరాజు తనకు కుండలు చేయడం వచ్చునని ఎంకయ్యకు చెప్పి, అనేక రకాల బొమ్మలు వేసిన కుండలను తయారుచేసి ఆకుండల మీద తన తల్లి సూర్యకాంత అని, తండ్రి గంగరాజు అని రాసి ఎంకయ్యతో గంగరాజుకు పంపిస్తాడు. గంగరాజు ఆరాత చూసి మండిపడి అది రాసిన వాణ్ణి తీసుకరమ్మని భటులను పంపిస్తాడు. పల్లకీ పంపితే వస్తానని వలరాజు చెబుతాడు. గంగరాజు పల్లకి పంపిస్తాడు. వలరాజు తనకు నిజరూపం ప్రసాదించమని

నాగకన్యను ప్రార్థిస్తాడు. అతనికి నిజరూపం వస్తుంది. వలురాజు పల్లకి ఎక్కి గంగ రాజు దగ్గరికి వెళ్ళి నీకొడుకును అని చెబుతాడు. గంగరాజు అతని మాట నమ్మకుండా తనతో యుద్ధం చేయమంటాడు. యుద్ధంలో ఇద్దరూ సమవుజ్జీలుగా ఉంటారు. గంగ రాజు ఆలోచించి అతని చరిత్ర పూర్తిగా చెప్పమని వలరాజును అడుగుతాడు. వలరాజు తన తల్లి సూర్యకాంతకు తన పెద్దమ్మలు చేసిన అన్యాయం, నాగకన్య తనను పెంచిన విషయం మొదలైన తన వృత్తాంతమంతా పూర్తిగా చెబుతాడు. గంగరాజు మంత్ర సానిని పిలిపించి ఆమె ద్వారా వాస్తవాన్ని తెలుసుకొని కుమారుని కౌగలించుకొని, మంత్రసానికి గుండు గీయించి గాడిద మీద ఊరేగిస్తాడు.

కారణాంతరాలచేత శిశువుగా ఉన్నప్పుడే తల్లీకొడుకులు వేరైపోవడం, శిశువు పెరిగి పెద్దవాడైన తర్వాత తల్లీకొడుకులు కలుసుకున్నప్పుడు వారు తల్లీకొడుకులన్న సంగతి వారిద్దరికి తెలియడానికి తల్లి చనుబాలు వెళ్ళి కొడుకు మీద పడినట్లుగా, అప్పుడు వారిద్దరూ కలుసుకున్నట్లుగా జానపదసాహిత్యంలో చెప్పబడుతూ ఉంటుంది. గంగరాజు కథలో గూడా సూర్యకాంత, వలురాజులు తల్లీకొడుకులన్న సంగతి ఇలాంటి సంఘటన జరిగిన తర్వాతనే కలుసుకున్నట్లుగా జానపదకవి ఇలా చెప్పాడు.

గంగరాజు వలురాజులిద్దరూ అడవిలోకి వెళ్ళి సూర్యకాంత కోసం వెదుకుతారు. ఒకచోట మాసిపోయి చినిగిపోయివున్న బట్టలతో ఉన్న సూర్యకాంతను చూసి వల రాజు తాను ఆమె కుమారుణ్ణని చెబుతాడు. ఆమె అతని మాటలు నమ్మదు. అప్పుడు వలరాజు తనను పెంచిన నాగకన్యను తలుచుకోగానే ఆమె మాహాత్మ్యం వల్ల సూర్య కాంతకు స్తనాల్లో బాలింతరాలు లాగా పాలు రావడం, ఆపాలు వెళ్ళి వలురాజు మీద పడడం జరుగుతుంది.. అలా పడగానే సూర్యకాంత వలురాజు తన కుమారుడే నమ్మి అతణ్ణి కౌగలించుకుంటుంది.

"నాగకన్య ఎప్పుడు దీవనార్తి వెట్టిందో-అప్పుడు ఆతల్లి పచ్చి బాలింత అయింది.
పాలు పిలగాని మీద వడవట్టె - కలకల కన్నీరు దీసినాది సూర్యకాంత
కలకల కన్నీరు దీసినాడు - గంగరాజు మాత్రమైన
బార్యాబర్తలు కొడుకును దీసికోని - ఒగల మీద ఒగలు వడి
కలకల కన్నీరు దీసినారు "

తన ఆరుగురు అక్కలను క్షమించమని సూర్యకాంత గంగరాజును కోరుతుంది. ఆమె కోరిక మేరకు గంగరాజు వారిని క్షమిస్తాడు. గంగరాజు వలరాజుకు పెళ్ళి చేసి పట్టాభిషేకం చేస్తాడు.

ఈగంగరాజు కథ మౌఖిక ప్రసారంలో మందెచ్చులవారు పాడినది.



సాధారణంగా మౌఖిక ప్రసారంలో ఉండే కథాగేయాల్లో కథాఖ్యానం ప్రధానంగా ఉండి సాహిత్యాంశాలు అప్రధానంగా ఉంటాయి. కానీ ఈగంగరాజు కథలో సాహిత్యాంశాలతో పాటు జానపదసాహిత్యంలోని కథాగేయాల్లో కనిపించే అన్ని లక్షణాలు ఉండి మంచి కథాగేయంగా పరిగణింపబడుతూ ఉంది.

## బైకానివారి కథలు - సాహిత్యాంశాలు :

బైకాని కళాకారుడైన తండు భిక్షుం గారు పోలురాజు కథను, కృష్ణభాగవతాన్ని పాడి వినిపించారు. భిక్షుం గారి దగ్గర ఈరెండు కథాగేయాలకు సంబంధించిన తాళపత్రగ్రంధాలున్నాయి. వీరు ఈగ్రంధాల్లోని కథనే చెబుతూ ఉంటారు. ఈరెండు కథలను కనకబండి ఘట్టయ్య అనే యాదవకవి రచించాడు. భిక్షుంగారు ప్రధానంగా ఘట్టయ్య రాసిన కథనే చెబుతున్నారు. ఐనప్పటికి వీరు అక్కడక్కడ కథను కొంత మార్చి చెప్పారు. మొదట వారు చెప్పిన పోలురాజు కథను పరిశీలించుదాం.

**పోలురాజు కథ :** చోడానిరాజు శ్రీరంగపట్టణాన్ని పాలించేరాజు. అతడు రెండు ఏర్లకు అడ్డుకట్ట వేసి ఒక చెరువు కట్టిస్తుంటాడు. దానికి కావేరి చెరువు అని పేరు. ఆచెరువుకు ఏడు గండ్లు పడ్డాయి. పనివాళ్ళు లెక్కకు మిక్కిలిగా ఉండి పగలంతా కష్ట పడి వాటిని పూడుస్తున్నారు. శాపం కారణంగా రాత్రికల్లా మళ్ళీ గండ్లు పడుతున్నాయి. అప్పుడు చోడానిరాజుకు అతని మంత్రులైన సుమంతుడు, బుద్ధిమంతుడు అనేవారు ఎవరైనా గొప్ప భక్తుడు వచ్చి చెరువుకు మట్టిమోసి వెట్టి చేస్తే గండ్లు పూడిపోయి మళ్ళీ పడకుండా ఉంటాయని చెబుతారు. అలాంటి వ్యక్తి ఎవరున్నారని చోడానిరాజు మంత్రులను అడిగితే యాదవరాజైన పోలురాజు అలాంటి భక్తుడని వారు చెబుతారు. అప్పుడు చోడానిరాజు కొన్నివేల సైన్యాన్ని తన మంత్రులకు ఇచ్చి చిలకలమర్రి తాండాన ఉన్న పోలురాజును తీసుకొనిరమ్మని పంపిస్తాడు. ఇద్దరు మంత్రులు పోలురాజు దగ్గరికి వెళ్ళి

"యాదవరాజేంద్రా యదుకులాసాంద్రా -వహిదా వైరులా చేత్ర వలురాజాపుత్రా
అర్థిజనమిత్రా అర్థిజనాశూద్రా - ఇది విను పోలురాజా ఇనువంశతేజా
యాదవరాజేంద్రా యదుకులాసాంద్రా - కావేటి చెర్వు వెట్టికి గ్రక్కునా నిన్ను
చోడానిరాజు తెమ్మానే సోజ్జవేజ్జామూనా"

ఓమహాత్మ యాదవరాజా మాచోడానిరాజు కావేరి చెరువుకు వెట్టి చేయడానికి (మట్టిమోసి గండ్లు పూడ్చడానికి) వెంటనే నిన్ను పట్టుకురమ్మని పంపించాడు అని చెబుతారు. అప్పుడు పోలురాజు

"ఆమాటకు పోలురాజు అల్లునా నవ్వి -యాదవులే మునులు మునులె దేవతూలూ
యయాతి వంశంబు వెలిసినంతట - యదు వృష్టి భోజాంతకూలు
కులభార్యలు నూరుగురు కొమార్లు - ఒకరి వెట్టికి మేము పోయేటి వారమే కాము
అశంకంకోటి గోవులయ్యో ఆతాండవమున "

అనంతమైన గోగణానికి అదిపతులమైన మేము ఒకరి వెట్టికి వచ్చేవారం కాము. మీచోడానిరాజుకు మాగురించి తెలియక మిమ్మల్ని పంపించిఉంటాడు. మేము రాము మీరు వెళ్ళండి అని పోలురాజు ఆఇద్దరు మంత్రులకు చెబుతాడు. అయినా వారు వినకుండా తప్పనిసరిగా రావలసిందేనని పట్టు బడతారు. అప్పుడు పోలురాజు

"అప్పుడు పోలురాజు ఆల్లునా నవ్వి - ఏడు పిడికిల్ల ఇసుకా తీసుకా వచ్చి
పటపటమంత్రంబు బాగుగా చదివి - వచ్చినా సైన్యం పైనా వనరంగా జల్లె
మనుషుల రూపకార్థంబులయ్యో మరివేగామాయే - జాతిరూపకార్థలై చయ్యనా వారు
చెప్పుకొమ్మని యాదవరాజు సెలవిచ్చె వారికి"

పోలురాజు ఏడు పిడికిల్ల ఇసుక తీసుకొనివచ్చి మంత్రం పఠించి ఆఇసుకను చోడాని రాజు సైన్యం పైన చల్లేటప్పటికి మొత్తం సైనికుల ఆకారాలన్నీ మారిపోయాయట. వెళ్లి మీరాజుకు చెప్పుకోపోండి అని పోలురాజు వారిని పంపిస్తాడు. వారు వచ్చి చోడాని రాజుకు జరిగిన సంగతంతా చెబుతారు. అప్పుడు చోడానిరాజు కోపంతో ఆపోలురాజును తెచ్చి ఎర్రచీమను నలిపినట్లు నలపకపోతే తన పేరు చోడానిరాజే కాదని పలికి

"ఇంతభాగ్యంబు ఇంతా సంపదా ఇంత బలిమి వీనికి ఏదేవుడూ ఇచ్చె
ఏదేవుణ్ణి పూజించు యాదవారాజు వాని పూర్వాజన్మము వాని కథ ఏమి "

అని అనంతమైన గోగణం, ఇంత వైభవం, ఇన్ని మాయలు, ఇంత మంత్రశక్తి అతనికి ఏవిధంగా వచ్చింది. ఆతని పూర్వజన్మ వృత్తాంతం ఏమిటి? అని చోడానిరాజు మంత్రులను అడుగుతాడు. అప్పుడు మంత్రులు పోలురాజు పూర్వజన్మవృత్తాంతాన్ని చెబుతారు

చోడానిరాజు గొప్ప పరాక్రమవంతుడు. పెద్దరాజ్యానికి రాజు. అంతేగాకుండా శివుని కొలిచి గొప్పమంత్రశక్తిని పొందినవాడు. అలాంటి తన మాటను లెక్కచేయక పోవడమే గాకుండా తన సైన్యం మొత్తం రూపురేఖలు మార్చివేసినందుకు పోలురాజు మీద చోడానిరాజుకు చాల కోపం వచ్చింది. అందువల్లనే పట్టలేని కోపంతో వాణ్ణి ఎర్రచీమను నలిపినట్లు నలిపివేస్తానని మొదట పలికి, అంతలోనే ఆలోచించి శత్రువు శక్తిసామర్థ్యాలు తెలుసుకోకుండా ముందుకు వెళ్ళడం మంచిది కాదని భావించి పోలు రాజుకు ఇంత మంత్రశక్తి, ఇంతగోగణం, ఇంత సంపద ఎలా కలిగింది చెప్పవలసిందిగా



తన మంత్రులను అడుగుతాడు.

ప్రస్తుత జన్మలో ఎవరైనా ధనధాన్యాలతో,సిరిసంపదలతో, రాజ్యవైభవంతో వెలిగిపోతూ ఉంటే అదంతా పూర్వజన్మలో అతను చేసుకున్న పుణ్యఫలమని మనవారు చెబుతూ ఉంటారు. అందుకనే పోలురాజు అనంతమైన గోగణంతో సేవకులు కొలుస్తూ వుండగా మహారాజ వైభవంతో వెలిగిపోవడానికి, గొప్ప మంత్రశక్తి సంపన్నుడు కావడానికి కారణం ఏమిటి ? అతను ఏదేవుణ్ణి పూజిస్తాడో చెప్పమని చోడానిరాజు తన మంత్రులను అడిగాడు. మంత్రులు పోలురాజు పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరిస్తారు.

తంగిరాల సుబ్బారావు గారు ప్రచురించిన కాటమరాజు కథలు మొదటి భాగం గ్రంథంలో పోలురాజుకథ ఉంది. ఇది కనకబండి ఘట్టయ్య రచించినదే. కాటమరాజు కథలన్నింటిలో పోలురాజుకథ పెద్దది. దీనికి శివపురాణం అనే పేరు కూడా ఉంది. ఈకథకు గొప్ప ప్రచారం ప్రసిద్ధి ఉన్నాయి. పోలురాజు ఆవుల వలు రాజుకు చిన్న కుమారుడు. ఇతడు ఈశ్వరాంశతో పుట్టిన వాడు, గొప్ప శివభక్తుడు, ఇతని భార్య సిరిదేవి. ఇతనికి భక్తిరన్న, ఐతమరాజు, ముమ్మయ్య అనే ముగ్గురు కుమారులు, అగుమంచి అనే కుమార్తె ఉన్నారు. పెద్దిరాజు కళ్యాణ నగరానికి వెళ్తూ పోలు రాజుకు ఆవులపట్టం కడతాడు. అందువల్లనే ఇతణ్ణి ఆవుల పోలురాజు అని పిలుస్తారు.

తంగిరాలవారి గ్రంథంలోని పోలురాజు కథ ప్రకారం పోలురాజు శ్రీరంగ పట్టణానికి దైవదర్శనానికి వెళ్ళినప్పుడు ఆపట్టణాన్ని పాలిస్తున్న చోడానిరాజు తన మంత్రులతో

"లంకలో రావణుడు శంకయు లేక - వీకతో సురలచే వెట్టి గైకొనిన
సోరిదిని ప్రజలెల్ల శోదించి తెచ్చి - శ్రీరంగమున వెట్టి చేయించినాను
ఎదురు మీరినరాజు లెవ్వరూ లేరు - చెదురుగెక్కడనున్న చెప్పంగ వలయు"

అని కావేరిపనికి అందరు రాజులచేత వెట్టిపని చేయించానని, మీఎరుకలో ఇంకా ఎవరైనా మన చుట్టుపక్కల ప్రాంతాల్లో వెట్టి చేయకుండా మిగిలిపోయినవారు ఉంటే చెప్పమని అడుగుతాడు. మంత్రులు కొత్తగా పోలురాజు వచ్చాడని అతను వెట్టి చేయలేదని చెబుతారు. అప్పుడు చోడాని పోలురాజును వెట్టిపనికి తీసుకొని రమ్మని మంత్రులను పంపిస్తాడు. బైకానివారి కథలో చోడాని కట్టిస్తున్న కావేరి చెరువుకు శాపం కారణంగా గండ్లు పడ్డాయని, ఆగండ్లు పూడ్చడానికి మహాభక్తుడైన వ్యక్తి మట్టి పోస్తే అవి పూడిపోతాయని చెప్పబడింది. తంగిరాల వారి గ్రంథంలో శాపవృత్తాంతం లేదు. అద్భుతరస పోషణ కోసం బైకాని వారు శాపవృత్తాంతాన్ని కల్పించి ఉంటారు. తంగి రాల వారి గ్రంథంలో తనను వెట్టికి పిలిచిన చోడానిరాజు మంత్రులను పోలురాజు తన

కొలువు నుంచి బైటికి నెట్టిస్తాడు. బైకానివారి కథలో పోలురాజు తన మంత్ర ప్రభావంతో [illegible]ని మత్రులను, సైన్యాన్ని పూర్తిగా వారి రూపురేఖలు మార్చివేసినట్లు అద్భుత సంఘటగా చెప్పారు. ఇక్కడ తప్ప ఇంక మరెక్కడా భిక్షుం గారు చెప్పిన కథకు తంగిరాల వారు ప్రచురించిన కథకు తేడా లేదు.

ఇక్కడ నుంచి బైకానివారి కథ, తంగిరాలవారు ప్రచురించిన కథ ఒకే విధంగా ఉంది. చోడానిరాజుకు అతని మంత్రులు పోలురాజు పూర్వజన్మవృత్తాంతాన్ని ఇలా చెప్పడం మొదలు పెట్టారు. చంద్రగుప్తపట్టణాన్ని చంద్రగుప్తమహారాజు పాలిస్తూ ఉంటాడు. అతని కూతురు మల్లికాదేవి. రాజు ప్రతిరోజు ఐదు గంగమైలావుల పాలను ప్రత్యేకంగా తెప్పించి వాటితో శివపూజ చేస్తూ ఉంటాడు. వాటిలో పెదగంగమైలావు పాలను ఇవ్వకుండా ఉంటుంది. చంద్రగుప్తుని ఆణతితో గోపాలకులైన యాదవులు ఆవు ఎందుకు పాలు ఇవ్వడం లేదో తెలుసుకోవడానికి దానికి రాత్రి కాపలా కాస్తారు. ఆవు అర్ధరాత్రి అయిన తర్వాత ఆవుల దొడ్డి నుంచి దూకి శివుడున్న ప్రదేశానికి వెళ్ళి అతనికి పాలు ఇస్తూ ఉంటుంది. యాదవులు దాని వెంట వెళ్ళి పాలు తాగుతున్న వ్యక్తి ఎవరో దొంగవాడనుకొని గొడ్డలితో కొడతారు. శివుడు వెంటనే పక్కనే ఉన్న పుట్టలోకి వెళ్ళిపోతాడు. శివుని తాకిన ఇనుప గొడ్డలి బంగారు గొడ్డలిగా మారిపోతుంది. యాదవులు చంద్రగుప్తరాజు దగ్గరకు వచ్చి విషయమంతా చెబుతారు. ఆదొంగ ఎలా ఉన్నాడో చెప్పమని రాజు యాదవులను అడుగుతాడు. వారు తాము చూచిన దొంగ రూపురేఖలను వివరిస్తారు.

"చంద్రగుప్తుడు విని సంతోషమంది- అందరు జూస్తిరా ఆదొంగవాని
చూస్తిమయ్యా చేత శూలమున్నాది- చూస్తిమి నుదుటను నేత్రమున్నాది
తాలరా ఎరుగవు తాజూచినాను-మాలజడల చందమామ యున్నాది
ఇతనేమి ఎరుగును నేజూచినాను-కుతిక నలుపుగుండె గురుతు నామాట
తలగర ఎరుగవు తాజూచినాను - తలలోను తరుణియు దాగి యున్నాది
అన్ని మాటలు కల్ల అయ్య నేజూచినాను-చిన్నది ఒక లేడి చెంగటున్నాది
ముందర ఒక చిన్న నంది యున్నాది- వాడేమి ఎరుగును వాలుగా జూస్తి
పొడుగా[illegible] పాములు పొర్లాడుచుండె- ఒల్లెల్ల వీబూతి ఓరి నేజూస్తి
మగవాని రూపంబు మగువరూపంబ-చేతులు నాలుగు చెప్ప మరిచితిని
చేత మనిషి పుర్రె చెప్పరోరి- సంకన ఒక జింక పిల్ల యున్నాది"

ఈవిధంగా యాదవులందరు తాము చూచిన శివుని గురించి నేను ముందు చెప్పాలంటే నేను ముందు చెప్పాలని పోటీపడి ఎవరు చూచిన రూపును వారు వివరించారు. వారు



చెప్పిన దాన్ని బట్టి అతడు తప్పనిసరిగా శివుడు ఆయి ఉంటాడని భావించి శివుని దర్శించిన యాదవులను

"గోపాలకులకు మొక్కి కొనియాడసాగె - అల్ల శ్రీకృష్ణునకు తల్లిల్లు మీది
ఆదియందు యాదవులు అమరులె మీరు - నిదానముగా శివుడు మీకు పొడగట్టె
కన్నుల చల్లగాను కట్నంబులిచ్చి- మిమ్ముల కన్నుల జూస్తిని మిగుల పుణ్యము గలిగె"

యాదవులు శ్రీకృష్ణుని వంశం వారు కావడంవల్ల, అమాయకులు కావడం వల్ల శివుడు వారికి దర్శనమిచ్చాడని చంద్రగుప్తుడు కొనియాడి వారికి కట్నకానుక లిచ్చి శివుడు వారికి కనిపించిన చోటికి వారితో వచ్చి, శివుడు దూరిన పుట్టను తన మనుషులతో తవ్విస్తాడు. ఎంత లోతు తవ్విన శంకరుడు కనిపించక పోవడంతో చంద్ర గుప్తుడు బాధపడి ఒకసారి చిన్న శిల రూపంలో నైనా దర్శనమిమ్మని ఈశ్వరుని ప్రార్థిస్తాడు. అప్పుడు ఈశ్వరుడు వారు తవ్వుతున్న గోతిలో పెద్దబండరాయిగా కనిపిస్తాడు. బండ రాయిని చూచి రాజు సంతోషపడి తప్పనిసరిగా రాయి కింద శివుడుంటాడని భావించి దాన్ని పగులగొట్టుమని పనివాళ్ళకు చెబుతాడు. వారు ఉలులు, గడ్డపారలు మొదలైన వాటితో ఆబండరాయిని పగులగొట్టే ప్రయత్నం చేస్తారు. దాని మీద దెబ్బ పడగానే పెద్ద మంట మండినట్లయి దాన్ని తాకిన గునపాలు ఉలులు మొదలైక పరికరాలన్నీ బంగారుగా మారిపోతాయి. అది చూచి చంద్రగుప్తుడు ఆతని పనిమనుషులు మూర్చ పోతారు. యాదవులు వెళ్ళి చంద్రగుప్తుని కుమార్తె అయిన మల్లికాదేవికి ఆవిషయం చెబుతారు. ఆమె వచ్చి ఈశ్వరుని మాహాత్మ్యాన్ని పొగడి, అక్కడ ఈశ్వరునికి గుడి కట్టించి ఉత్సవం జరిపిస్తానని, తనకు దర్శనమిమ్మని ప్రార్థిస్తుంది.

"అమితముగా నేనరుగ హర నీవె కాని - పుట్టవు పెరుగవు పుట్టలోపలను
కట్టింతు దేవళము కనపడు స్వామీ- సతతము బోగము సాగింతు మీకు"

ఆమె ప్రార్థన మన్నించి పుట్టలో నుంచి శివుడు వచ్చి ఆమెను వరం కోరుకోమంటాడు. అప్పుడు ఆమె శివుని వాహనమైన నంది తన మందలో బసవన్నగా, విష్ణువు బొల్లావు గానూ, అష్టదిక్పాలకులు యాదవులుగానూ, దేవకన్యలు గోపికలుగా జన్మించాలని ఇలా కోరుతుంది.

"ముందర నీనంది మూర్తి నామందలో- అందమౌ బసవన్నవై జన్మించా వలెను
సాయమై ఉండవలె స్వామి నామందా -ఆదివిష్ణు మామందలో ఆవువై పుట్టి
యాదవులకు ముందు యుద్ధంబు గెలువ-అష్టాదిక్పాలకులు గొల్లలూగాను
ఆసురకన్నికలే గోపికలు గానూ"

అంతేగాకుండా మరుసటి జన్మలో గోముకార్జుడు అనే పేరు గల యాదవుడు తన

తండ్రి అయిన తరిముత్తరాజుగా, శివునికి పాలు ఇచ్చిన పెదగంగ మైలావు పోలు రాజుగా, తాను సిరిదేవిగా, శివుడు తమకుమారుడైన భక్తుడుగా పుట్టాలని కోరుతుంది. శివుడు ఆమె కోరినట్లుగానే జరుగుతుందని వరం ఇస్తాడు. ఈవిధంగా పూర్వజన్మలో ఈశ్వరునికి పాలు ఇచ్చిన పుణ్యఫలం చేత పెదగంగమైలావు ఈజన్మలో పోలురాజుగా జన్మించాడని మంత్రులు చోడానిరాజుకు చెప్పి, పోలురాజు అతనితో సమానమైనవాడే గానీ తక్కువవాడు కాదని అందువల్ల అతనితో యుద్ధం పెట్టుకోవద్దని కూడా మంత్రులు ఇలా చెబుతారు.

"భూవిభుడైనాడు పురహరుని కృపను-అతను నీయంత అదికుడే కాని
మహి మీద కొంచెపు మానవుడు గాదు-పోలురాజుకు నీకు పోరు వద్దయ్యా
పోలురాజు జన్మంబు పుట్టుకా ఈలాగూ"

అని చోడాని మంత్రులు పోలురాజు పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరిస్తారు. వారి మాటలి విని చోడానిరాజు కోపంతో

"వాని దేవపూజ ఎంత వాడనగా ఎంత - వాడి గోవులమంద ఎంత వాడనగా ఎంత
గోవులా నేలపై కూల్తునూ నేను - నాజపాతపములు నాఉగ్రాతపము
చెప్పంగా వినవా నాశివపూజా దృడము"

అని ఇసుక తెప్పించి పోలురాజు ఆలమందలోని ఆవుల, ఎద్దుల, దూడల రూపాలు రాసి అనేక మంది దేవతలను ప్రార్థించి మంత్రం చదివి భుమి మీద రాసిన మంద మీద ఇసుక చల్లుతాడు. అప్పుడు పోలురాజు ఆలమంద అతలాకుతలమై పోయిందట.

"చిన్నచిన్నకోడెలు చిక్కనా రాల - మురికోడెలెత్తుబడి వసుదపై వరిగె
అంబోయని అర్చె ఆంబోతూలెల్ల - ఆయ్య శంబుని మందకయ్యా చేటు పుట్టే
శాపంబు తగిలెను శలపెయ్యలకును- పాపంబు చుట్టెను పాడి యావులకు
మంద మురిజిడ్డాయె మంత్రాల చేత - క్రందక దూడల కదుపుబ్బిపోయె
పొదులలో దూడలు పొర్లాడ సాగె- మెదలక కౌలాలు మేతలు ఉడిగె
నిట్టు ఉపసించె నీరు పూరికిని- కుట్టు నొప్పులతోను గునిశాడసాగె
అంభో యటంచు అరచె యాబోతులెల్ల"

ఈవిధంగా ఆవులమంద అంతా బాధపడుతూ ఉంటే గోపాలకులు వచ్చి జరిగిన విషయమంతా పోలురాజుకు చెబుతారు. పోలురాజు మందకు ఇలా జరగడానికి కారణమేమిటని పల్లికొండను అడుగుతాడు. పల్లికొండ ఇదంతా చోడాని మంత్ర ప్రభావమని చెబుతాడు. అప్పుడు పోలురాజు తాను స్నానం చేసి

"రఘుపతి జెప్పిన రాజు తాలేచి- పగలు స్నానము చేసి పగదీర్చు కొఱకు



నీర్కావి ధోవతి నీరు కారిగను- పోరుకు ముక్కంటిని పూజింప సాగె
ఎర్రని గంధము, ఎర్రని పువులు- ఎర్రనక్షింతలు, ఎర్రని నీళ్ళు
కపట ఉచ్చాటనకై సమకూర్చి- జపమొనరించియు శంభుని గూర్చి
వారి యేనుగులను వ్రాసెను నేల- వారి అశ్వములను వారి రౌతులను
కుటిలంబుతో వారు కుంభిణి దరుగ- పటు కమండల జలం పైన ప్రోక్షించె
కబంధములు వగుల గజములు కడపు- ఉబికియు గజములు ఉర్విని వ్రాలె
వరిగెను అశ్వాలు వరిగె లొటిపిటలు- భేరీల వలె కడుపు బెరిగె రౌతులకు
కరిగజశాలలు కార్చిచ్చు పడిన- వెరపున స్తంభాలు విరిగె ఫెళ్ళునను
ఉయ్యాల శాలలు ఊరికె విరిగె - మాయచే రాజుండు మండపం కూలె
ఆటు పోట్లతో వరిగి రద్భుతంబుగను"

ఈ విధంగా ఇరుపక్షాలు క్షుద్రవిద్యలతో ఒకరికొకరు నాశనం చేసుకున్నారు. అప్పుడు చోడాణి తామిద్దరు (చోడాణి, పోలురాజు) సమానమైన శివభక్తులు, మహి మాన్వితులు అనే విషయాన్ని గుర్తించి తాను పోలురాజు గోవులకు ఇచ్చిన శాపాన్ని తొలగిస్తే, పోలురాజు తన గజ అశ్వ బలాలకు ఇచ్చిన శాపాన్ని తొలగిస్తాడని గ్రహిస్తాడు. వెంటనే అతడు తాను పోలురాజు ఆవులకు ఇచ్చిన శాపాన్ని తొలగిస్తాడు. పోలురాజు కూడా చోడాని సైన్యానికి ఇచ్చిన శాపాన్ని తొలగిస్తాడు. ఈవిదంగా చోడానిరాజు , పోలురాజు పరస్పరం మంత్రప్రయోగం చేసి శత్రుపక్షం వారికి ఆపద కలిగించే ప్రయత్నం చేయడం, తిరిగి వారిద్దరూ తాము చేసిన మత్రప్రయోగాన్ని ఉపసంహరించడాన్ని జానపదులు చిల్లంగి, చేతబడి, బాణామతి అనే పేర్లతో వేరువేరు ప్రాంతాల్లో పిలుస్తున్నారు. ఇలాంటి వాటివల్ల శత్రువులతోపాటు వారి సంపద కూడా నశిస్తుందని జానపదుల విశ్వాసం.

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" విద్వాంసుడు మాత్రమే విద్వాం సుని యొక్క పరిశ్రమను గుర్తించగలడు అన్నట్లుగా ఎదుటివారిలో ఉన్న గొప్పతనాన్ని గుర్తించి దాన్ని గౌరవించడానికి గొప్ప సహృదయత్వం కావాలి. ఆసహృదయత్వం పుష్కళంగా ఉన్నవాడు శ్రీరంగపట్నం పాలకుడైన చోడానిరాజు. తాను శత్రువుగా భావించి చేసిన అపకారానికి తన శత్రువు గూడా అలాంటి అపకారాన్ని తనకు చేస్తే దాంతో మరింత కోపాన్ని పెంచుకొని మరింత రెచ్చిపోవడం సాధారణమైన వ్యక్తి చేసే పని. కానీ తాను చేసిన పనికి ప్రతిగా తన శత్రువు అదే పని తనకు చేసినప్పుడు తాను చేసిన పనిలోని అనౌచిత్యాన్ని గ్రహించి వెంటనే దాన్ని తొలగించి, తద్వారా శత్రువు గూడా అదేవిధంగా స్పందించేలాగా చేయడం గొప్ప విషయం. పోలురాజు ఆలమందకు

తాను చేసిన అపకారాన్ని తాను తొలగించిన వెంటనే పోలురాజు కూడా తన సైన్యానికి చేసిన అపకారాన్ని తొలగించగానే చోడానిరాజు పోలురాజు చాల గొప్పవాడని, అతనితో స్నేహం చేయడం చాల మంచిదని గ్రహిస్తాడు. వెంటనే ఆతను మంత్రి సలహాను సరించి పోలురాజుకు ఒక లేఖ రాస్తాడు.

"రాజాదిరాజు మార్తాండ తేజుడు-భుజబల భీముండు పోలురాజునకును
పన్నుగా చోడాని పంపిన మనవి- మన్నించు వందనము మహనీయమూర్తి
తమరు నేనొక్కటి దైవంబు ఒకటి-తమ బక్తికి మెచ్చితి తమ్ముడవీవు
అరమర లేకను అంపితి లేఖ- గుళ్ళ శిఖరములు గోపురంబులును
పాలసున్నము జేయ పంపితి లేఖ-దవ్వున గనవచ్చు దర్మము మీది
దేవలం పుణ్యము తెరగొప్ప మాది- కనవచ్చు పుణ్యము కడముట్ట మీది
కనరాని పుణ్యము కడమెల్ల మాది-అవునని గోరితి ఆలస్యమనక
ఆవుల పాలంపు ఆరమర లేక"

గుడి శిఖరానికి పాలతో కలిపిన సున్నం పూయడం ఆనాటి పద్ధతి. శ్రీరంగని గుడి గోపురానికి శిఖరానికి పాలతో కలిపిన సున్నం పూయాలి కాబట్టి పాలూ పంపించమని కోరుతూ చోడానిరాజు పోలురాజు లేఖ పంపించాడు. నిజానికి చోడాని రాజు దగ్గర ఆవులు, ఆవుపాలు లేక కాదు, ఆమిషతో పోలురాజుతో స్నేహం చేయాలనేది చోడాని కోరిక. అయితే పోలురాజు చోడాని అంతకుముందుగానే తనను వెట్టికి రమ్మని ఆజ్ఞాపించిన విషయాన్ని గుర్తుకు తెచ్చుకొని

"ఈపొద్దు మనలను వెట్టికి పిలిచి-ఈపొద్దు పాలడుగ ఇటు వచ్చినారు
చంక దుడ్డును బెట్టి శరణార్థియనుచు - జంకు లేక దిగెడి చందమీమాట
బెదరించి పాలడుగ పెట్టంపె రాజు-ఇది యెక్కడి మాట ఇవ్వను పాలు"

అని చెబుతాడు. ఐతే చోడాని హృదయం గ్రహించిన పోలురాజు మంత్రి అయిన పల్లికొండ పోలురాజుతో

"కోటి అర్థము బెట్టి గుళ్ళు కట్టించి - పాటింప పుణ్యము పంచి పెట్టుదురు
చేయని పుణ్యము సిద్ధించు మనకు - చేయగవలె పొందు జనపతి మనము
కనరాని పుణ్యము కలుగును మనకు - ఎన్ని గావలసిన ఇవ్వుము పాలు"

అని చెబుతాడు. పల్లికొండ మాటను గౌరవించి చోడాని శ్రీరంగం నుంచి ఆలమంద వరకు గచ్చుతో కట్టిన కాలువ ఏర్పాటు చేస్తే ఆకాలువ వెంట పాలు పంపిస్తానని పోలురాజుకు లేఖ పంపిస్తాడు. దానికి సమ్మతించి చోడానిరాజు ఆలమంద వద్దకు కాలువ ఏర్పాటు చేస్తాడు. అప్పుడు యాదవులు ఆవులను పిలిచి పాలు పిండి కాలువ



ద్వారా శ్రీరంగపట్నానికి పంపిస్తారు. ఈసందర్భంలో ఆవుల పేర్లను జానపద కవి చాల గొప్పగా చెప్పాడు.

"సురబి దేవతా రమ్ము సురదేన్వ రమ్ము-గరుడుని తల్లి రా గంగ రావమ్మ
పాలవెల్లి రమ్మా పాంచాలి రా- శ్రీలచ్చిమి రా సిరిముద్దుబాల రమ్మా
గంగా బవానీ రా కావేరీ రా- పార్వతీదేవి రా బద్రకాళీ రా
కలికి చిలుకరావే కామేశ్వరీ రావే -తొలకరి మెరుపు రా దురిత సంహారి రా
పెయ్యల తల్లి రా పెరుమాళ్ళు రా - అమరావతీ రావే అంజనీదేవి రా
పంచరత్నమ రావే పరోపకారీ రావే - శ్రీరంగకన్యా రా చిట్టిముత్యమా రా
చిలుకలకొలికి రా చిగురుబోడి రా- యలమంచి గంగ రా యశోదా రా
పాలబిందెల తల్లి రా బాగీరదీ రావే"

ఈపట్టిక ఇంకా చాల ఉంది. ఇన్ని రకాల పేర్లను ఆవులకు పెట్టిన యాదవకవి నిజంగా ధన్యుడు. పోలురాజు ఆలమంద చాల పెద్దది. కొన్నివేల ఆవులు అతనికున్నాయి. ఇన్ని ఆవుల పాలను పిండి వాటిని కాలువలో పోసి శ్రీరంగపట్నం పంపించిన విధానాన్ని జానపదకవి ఇలా చెప్పాడు.

"హస్తమెత్తి మొక్కి ఆవుల పిలిచి - ఇచ్చగా లేగల విడిచి పితుకగా
దూడలు ఒక చన్ను తొణికి కుడువగను -కడమ చన్నులపాలు కాల్వలై పార
పితికి పోసిన పాలు పెద్ద యేరగును - ఉదకముతో కలిసి ఉబ్బి పారగను
కాలువలో పాలు గంగతో కలిసి - వాగువంకలు నిండె వచ్చె పాలేరు
పాలతెప్ప నురుగు వచ్చి వెన్నలును - కావేటి కెగతట్టె కరకంటు దయను"

చోడానిరాజు కోరినట్లుగా కాలువ ద్వారా పాలు పంపిన తర్వాత చోడాని, పోలురాజు మంచి మిత్రులుగా ఉంటారు.

ఐతే ఇలాంటి మిత్రుల మధ్య గూడా విధి వశాత్తు భేదాభిప్రాయాలు ఏర్పడి యుద్ధానికి దారి తీస్తుంది. చోడానిరాజు చెరుకూరిలో ఉన్న శివభక్తులైన జంగాలను కావేరికట్టకు మట్టి మోసే వెట్టిపనికి రమ్మని ఆజ్ఞాపిస్తాడు. ఈజంగాలు ఐదుగురు అన్నదమ్ములు.వీరు ఎప్పుడూ కాయకష్టం చేసినవారు కాదు. అందువల్ల వీరు వెట్టిపని చేయలేక తమ కష్టాన్ని తమ తల్లితో ఇలా చెప్పుకుంటారు.

"నీకడుపున బుట్టి నేటి వరకును తల్లి - ఈలాంటి ఆపద నెరుగము తల్లి
ఏగురం చెరుకూరు ఏలితిమిటను - భోగులం వెట్టికి పోలేము తల్లి
మట్టితట్టలు మోయ ఎరుగము తల్లి - చిగురుటాకుల వంటి చేతులు గలిగి
తగ గడ్డపారలు తవ్వంగ లేము - ఓయమ్మ ఈప్రాణమొల్లము మేము

విషము తాగి పొలయుదము మేము"

తల్లి పోలురాజును శరణువేడమని చెబుతుంది. జంగాలు రాత్రికి రాత్రే వెళ్ళి పోలురాజును శరణువేడుతారు. పోలురాజు గొప్ప శివభక్తుడు. శివభక్తులను శివునితో సమానంగా భావిస్తాడు. అందువల్ల పోలురాజు జంగాలతో

"జంగము నాపాలి సర్వేశ్వరుండు – జంగము నాపాలి సత్యంబటంచు
వడియలు నాపాలి పటులింగములు – శంకరునాన శంకేమి లేదు"

అని వారికి అభయమిచ్చి, వారికి తినడానికి ఉండడానికి కావలసిన సౌకర్యాలన్నీ కల్పిస్తాడు. త్రికాలజ్ఞుడు, పోలురాజు మంత్రి అయిన పల్లికొండ జంగాలను విడిచి పెట్టకపోతే కీడు కలుగుతుందని ఇలా చెబుతాడు.

"రాజ ఓ మామ రక్షక వినుము – మనకు చోడానికి మంచితనంబు
వెనుక పగ గొనుట వెర్రితనంబు – పొందు చేసిన తావు పోరేల మామ
శీలవంతులు వారి సీమవారే గద – ఏలయ్య జంగాలు ఏలయ్య పోరు
వారికిగాను ఈవాదేల మనకు – వారి నుండి మనకు వచ్చేది లేదు
పర జగడంబేల పగ గొనుటేల – వరుగుట నిజమౌను ఓమామ వినుము"

శీలవంతులనే ఇంటి పేరు గల జంగాలను విడిచిపెట్టకుంటే చోడానిరాజుతో యుద్ధం తప్పదని, యుద్ధమే జరిగితే బలవంతుడైన చోడానిని ఎదిరించి జయించడం సాధ్యం కాదని, జంగాలు చోడాని దేశానికి చెందినవారే కాని మనవారు కాదని, అలాంటి పరుల కోసం ప్రాణాలకు తెగించడం మంచిది కాదని, అందువల్ల జంగాలను చోడానికి అప్పగించమని పల్లికొండ పోలురాజుకు చెబుతాడు. అప్పుడు పోలురాజు తనకు అపకారం చేసిన ఎరుకల వానిని రక్షించిన కపోత వృత్తాంతాన్ని ఇలా వివరిస్తాడు.

దీనికే కపోత చాటువ అని పేరు. ఒక ఎరుకలవ్యక్తి పక్షులను వేటాడడానికి అడవికి వెళ్ళి ఉదయం నుంచి సాయంకాలం వరకు ప్రయత్నించినా ఒక పక్షి గూడా దొరకక దిగులుగా వెనకకు తిరిగి వచ్చేటప్పుడు ఒక చోట చెట్టు మీద గూట్లో ఆడపావురం గుడ్ల మీద పొదిగి ఉండడం గమనించి కింద వల పన్ని మెల్లగా చెట్టు ఎక్కి కొమ్మను ఊపగానే పావురం గూడు చెదరి గుడ్లు నేలపాలై పగిలిపోతాయి. పావురం వలలో చిక్కుకుంటుంది. ఎరుకలవ్యక్తి పావురాన్ని పట్టుకొని తనబుట్టలో వేస్తాడు. అదే సమయంలోనే గాలివానతో గొప్ప వర్షం కురవడం మొదలు పెడుతుంది. ఎరుకలవ్యక్తి చలికి తట్టుకోలేక వణుకుతూ ఉంటాడు. ఆసమయంలోనే మగపక్షి గూడు దగ్గరకు వచ్చి గూడు చెదరిపోయి ఉండడం, తన భార్య కనపడకపోవడం గమనించి ఆమె ఏమైపోయిందోనని విలపిస్తూ ఉంటుంది. దాని విలాపం విన్న ఆడపక్షి తాను వేటగాని బుట్టలో ఉన్న విషయం చెప్పి మనకోసం వచ్చిన వేటగాడు



చలికి వణుకుతూ చావుబతుకుల మధ్య ఉన్నాడని నిప్పు వెలిగించి అతనికి చలికాపి కాపాడుమని ప్రార్థిస్తుంది. దానికి మగపావురం

"నీకు శత్రువు గదా నీచకుడెరుకు – పడతి నిన్నబట్టిన పగవాడు వీని
నేడు గాతున నేను ఇంత చుట్టమును – పాపకర్ముని గాయ పనిలేదు మనకు"

అని చెబుతాడు. దానికి ఆడపావురం

"పరఉపకారమునకు పట్టి వర్షించు– పరఉపకారమునకు పశువు కష్టించు
పరఉపకారమునకు పండు దాన్యములు–పరఉపకారమునకు పండు వృక్షములు
పరఉపకారమునకు పగవారినైన–దరిచేర్చి కీర్తిని దగిలిరి విభులు
అట్టి శత్రువు వీనికాపద ఏల "

అని ఏలాగైనా అతణ్ణి కాపాడుమని కోరుతుంది. అప్పుడు మగపక్షి ఎక్కడికో వెళ్ళి నిప్పును తెచ్చి తన గూడును తెచ్చి నిప్పు రాజేసి మంట వేస్తుంది. వేటగాడు చలికాపు కొని ఆకలిగా ఉందని తినడానికి ఏమైన పెట్టమని కోరుతాడు. దానికి మగపావురం

"అన్నమమృతమిడ నర్వులము గాము – విను వింధ్యభూముల వెస గడ్డిగింజ
తిని బ్రతుకుదు మిక తెలుపుదు వినుము–నిను తృప్తి చేయగా నేరను వేర
నాతను వారగించుమని దబ్బున పడెను –రెపరెప కొట్టుక రెక్కలు కమిలె"

వేటగాని ఆకలి తీర్చడానికి వేరే మార్గం లేక తన శరీరాన్ని తినమనిచెప్పి మగపావురం మంటలో పడిపోతుంది. దాన్ని చూచి వేటగాని బుట్టలో ఉన్న ఆడపక్షి

"అన్న నావిభునితో నగ్ని చొరవలెను-గ్రన్నన విడిపించు కదు పుణ్యమగును
తానును విభుడైన తమ కొరత దీరు – వదలించు చిక్కము"

అని వేటగాణ్ణి కోరుతుంది. మగపక్షి త్యాగానికి విస్తుపోయిన వేటగాడు ఆడపక్షి మాటలు విని దాన్ని బుట్టలోనుంచి బైటకు తీసి చల్లగా బతకమని వదలివేస్తాడు. ఆడపక్షి వెంటనే తన భర్త కాలిపోతున్న మంటలో దూకి చనిపోతుంది. పావురాల త్యాగాన్ని చూచిన ఎరుకలవ్యక్తి తాను మనిషి అయి ఉండి క్రూరంగా అనేక పక్షులను చంపిన తన గతాన్ని తలచుకొని పశ్చాత్తాపంతో పక్షులు పడిన ఆమంటలోనే పడి చనిపోతాడు. వైకుంఠం నుంచి విష్ణుదూతలు వచ్చి ఆముగ్గురిని తీసుకొనిపోతారు.

పోలురాజు పైవృత్తాంతాన్ని పల్లికొండకు చెప్పి "వాదుకు వెరచి వారి బట్టివ్వ – ఇయ్యను జంగాల ఇత్తు ప్రాణాల" అని తన స్థిరనిర్ణయాన్ని చెబుతాడు. తర్వాత పోలురాజు జంగాలు అక్కడ ఉంటే వారికి చోడాని వల్ల ముప్పు కలుగుతుందని గ్రహించి పల్లికొండ సలహాతో వారికి కొంత సైన్యాన్ని తోడుగా ఇచ్చి శ్రీశైలానికి పంపిస్తాడు.

తన ఆజ్ఞను దిక్కరించి జంగాలకు ఆశ్రయాన్ని ఇచ్చిన పోలురాజు మీద చోడానికి కోపం వస్తుంది. ఐనప్పటికీ అతనితో ఉన్న మిత్రత్వం కారణంగా పోలురాజును మన్నిస్తాడు. కానీ నెల్లూరు రాజైన ముక్కంటి చోడానిరాజుకు పోలురాజు మీద లేని

పోనివి చెప్పి వారిద్దరి మధ్య విరోదాన్ని పెంచుతాడు. చివరకు ముక్కంటికి, పోలు రాజుకు ఘోరయుద్ధం జరుగుతుంది. పోలురాజు యుద్ధంలో ముక్కంటిని నరికి సంహరిస్తాడు. యుద్ధంలో తగిలిన గాయాలతో పోలురాజు కూడా కింద పడిపోతాడు. శ్రీశైల మల్లికార్జునుడు పోలురాజుకు ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకోమంటాడు. అప్పుడు పోలురాజు తన కోసం ఏమీ కోరకుండా తాను శ్రీశైలానికి పంపించిన జంగాల క్షేమసమాచారాన్ని తెలుపవలసిందిగా ఇలా కోరతాడు.

"ఆలుబిడ్డల వొల్ల అర్థంబు వొల్ల - వొల్లను సంసార మెల్ల భాగ్యంబు
అన్నదమ్ముల వొల్ల ఆవుల వొల్ల - అన్నిటి మీదాశ యింతైన లేదు
యేనూరు కుటుంబాల ఏవురు పతులు- చోడాని బాధల కిట జొచ్చెమరుగు
పర్వత మంపితి భక్తులందఱిని- సర్వధా వారల సైన్యము తోడ
శ్రీశైలమయ్యలు చేరిరో లేదో- ఎవరిచే వినుటని ఎదుఋజూచెదను
ఎవరెఱిగింతురొ యెటు తోచకుండె - భక్తుల మీద నా భక్తి యున్నాది
భక్తులను వినక ప్రాణాలు విడువ- శీలమంతుల వార్త చేరిన దనుక
నిలిపితి ప్రాణాలు నీ పాదమాన"

వెంటనే మల్లికార్జునస్వామి జంగాలను అతని ముందు నిలుపుతాడు. వారిని చూచి పోలురాజు తాను వారిని కాపాడగలిగానన్న సంతృప్తితో ప్రశాంతంగా చనిపోతాడు. మల్లికార్గునుడు అతనికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఈవిధంగా శివభక్తుల సేవలో కాలం గడిపి చివరకు శివభక్తుల రక్షణలోనే ప్రాణాలు విడిచిన పోలురాజుకథకు "శివపురాణం" అనేది నామాంతరమైంది.

**కృష్ణభాగవతం :** ఈకథను కనకబండి ఘట్టయ్య రాశాడు. దీనికి కంసుని కథ అనే పేరు గూడా ఉంది. ఇది కృష్ణావతారానికి సంబధించినది. ఈకథ తంగిరాల వారు ప్రచురించిన కాటమరాజు కథల్లో ఉంది. దీన్ని రాసింది గూడా కనకబండి ఘట్టయ్యే. బైకానివారు చెప్పేకథ, తంగిరాలవారు ప్రచురించిన కథ దాదాపు ఒకే విధంగా ఉంది. రాక్షసుల దుష్టపాలనను సహించలేక భూదేవి విష్ణువు దగ్గరికి వచ్చి తన బాధను చెప్పుకొని దు:ఖించడం, విష్ణువు కృష్ణావతారమెత్తి రాక్షసుల సంహరించి భూ భారాన్ని తగ్గిస్తానని చెప్పడంతో ఈకథ మొదలవుతుంది.

బైకానివారి కథ ప్రకారం కంసుడు దేవకిని వసుదేవునికిచ్చి పెళ్ళి చేసిన తర్వాత వారిద్దరనీ రథం మీద కూర్చోబెట్టుకొని తాను సారధి అయి నడుపుతూ ఉన్నప్పుడు విష్ణుమాయ వల్ల ఆకాశవాణి ఇలా పలుకుతుంది

"ఓరోరి కంసుండ ఓరి రాచ్చసూడా-ఓరీ దుర్మార్గుడ ఉండనేరవు నీవు
చెల్లెలికి పెళ్ళి నీవు చేయూచున్నా చెల్లుదువు ముందర చేటెరుగుకొనుమా
సఖియకు ఎనమండుగురు సంతానాపలము-పరగ ఏడ్గురు నీకు పగవారు గారు



ఆర్గురు నీచాత హతము గాగలరు- మిగిలిన ఇద్దరు బతకనున్నారు
కాంతకు ఎనిమిదో గర్భంబు నందు - అత్తమామను జంపు అదికుండు పుట్టు
నిన్ను సంహ్వారించు నిజము నామాట"

ఆకాశవాణి పలుకులు విని కంసుడు భయపడి దేవకిని రథం మీద నుంచి కిందికి లాగి కత్తితో ఆమె తలను నరకడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడు దేవకి అన్నకు మొక్కి

"రావే అన్నయ్యా మొగరాజువు నీవు - డాయ చెల్లెలిని గానీ పగదాననూ గానే
తోడాబుట్టిన నన్ను దోసమే నీకు - నన్నూ నరక నీకు న్యాయమూ గాదు
ఆడపడుచు మీద అన్నా ఆయుదమూ చాప- సాటిరాజును గాను సైదోడునే నీకు
చెల్లెలికి పెళ్ళిండ్లు సేసి అన్నాలూ - చాల సొమ్ములు పెట్టి సంతోషపరచి
అత్తవారిండ్లకు అంపంగా జూతూరు - ఇంతా దయ లేదు నీకు ఏమి జేసీతి"

అని పలకగానే కంసుడు కోపం పట్టలేక ఆమెను కాలితో తన్నడం మొదలు పెట్టాడట. దేవకి యాతన వసుదేవుడు చూచి కంసుని రెండు చేతులు పట్టుకొని

"ఇచ్చి పెండ్లి జేసితివి ఇంత లోపాలానూ-చేతి కంకణము చేతా ఉన్నాదీ
బక్తి లేదా నుదుటి బాసికము జూడు - కట్టిన కంకణము బాసికమూతోనూ
కొట్టిచంపుదురా పెళ్ళికూతురులా ఇట్లు -ఆకాశవాణి పలుకులు అవి కల్లా నిజము
ఆకాశవాణి పలుకు నీకు అది నిజంబైతే- పుట్టినా బిడ్డల పూనీ నీకిత్తు
నీవు సంపుకో సాదుకో నేను సత్యంబూ దప్పా"

వసుదేవుని మాటలు విని కంసుడు దేవకిని చంపకుండా వదలివేసి వారిద్దరిని కారాగారంలో ఉంచి రాక్షసులను కాపలా ఉంచుతాడు.

దేవకికి పుట్టిన మొదటి ఏడుగురి వల్ల తనకు అపాయం లేదు కాబట్టి వారిని చంపకుండా కంసుడు దేవకీ వసుదేవులకు ఇచ్చివేస్తాడు. కారాగారంలో వారికి సరైన పోషణ చేయలేక దేవకి ఆఆరుగురు కుమారులను కంసునికి అప్పగిస్తుంది. కంసుడు గూడా వారిని పుత్రవాత్సల్యంతో పెంచుతూ ఉంటాడు. తన అన్న తన కుమారుల మీద చూపిస్తున్న ప్రేమకు మురిసిపోయిన దేవకి తనకు పుట్టిన ఆరుగురు కుమారులు చాలని ఇంక మరి సంతానం అక్కర లేదని అన్నయ్యకు తనకూ పగ రాగూడదని అనుకుంటుంది. ఆమాటలు నారదుడు ఆలకించాడట. ఆతను ఎలాంటి వాడంటే

"కలహము లేకుంటే బోజనము కలగదనేవాడు
నారదుని నోటింత నువుగింజ నానదనేవాడు
కొండెములు పుట్టించకుంటే కొలువు తగ్గదనేవాడు
సాడీలు జెప్పకున్నా కడుపుబ్బా తీరదనేవాడు"

అలాంటి నారదుడు కంసుని దగ్గరకు వచ్చి అతను ఉగ్రసేనునికి పుట్టినవాడు కాదని, ఉగ్రసేనుని భార్య అయిన కువళయదలనేత్రికి పాండిత్యశౌరి అనే రాక్షసునికి పుట్టినవాడని, దేవకి ఆరుగురు కుమారులు గూడా కంసునికి శత్రువులేనని అందువల్ల వారిని చంపమని చెబుతాడు. నారదుని మాటలు విని కంసుడు దేవకి కుమారులను నరికి చంపుతాడు. తమను చంపబోతున్న కంసునితో ఆరుగురు బాలలు దీనంగా ఇలా వేడుకుంటారు.

"మామయ్యమామయ్యో మము జంపాకయ్యో-చెల్లెలి కుమార్లము చెల్లంబో మామా
తండ్రిని ఎరుగమయ్యో తల్లినీ ఎరుగము-తల్లివైనా నీవే తండ్రివైనా నీవే
ఇంతయింత బాలల ఈడేర్చినావు - అన్నవస్త్రములిచ్చి ఆదరించినావు
ఉగ్గు బోసేనాడు ఉగ్గు బోసి సాకితివి-పాలు బోసేనాడు పాలు బోసి సాకితివి
బువ్వ దినేనాడు బువ్వ బెట్టి సాకితివి - నీపట్నవాసానికి పాలివారము గాము
నువ్వేలేటి రాజ్యము మేము ఏలమే మామా-నువ్వు ఎక్కేటి దేశాల మేము ఎక్కమే మామా
నువ్వు ఎక్కే సింహాసనము మేము ఎక్కమే మామా-నీకింద సాటివారు సేవకులు ఎందరో
నీకు కసువూడ్చేవారు దడిగట్టే వారు-వారిలో సాటిగ మమ్ము వరినించు మామా
వెక్కసమైతే మమ్ములా ఎక్కడానన్నా-ఎక్కడనైనా మమ్మలా ఎల్లదోలే మామా"

ఇక్కడ జానపదకవి బాలుర దీనాలాపనను ఎంతో కరుణరస భరితంగా అత్యంత సులభమైన మాటలతో చాల చక్కగా చెప్పాడు. బాలురు ఎంత దీనంగా వేడు కున్నారో అంత క్రూరంగా కంసుడు దొరికిన వారిని దొరికినట్లుగా కత్తితో నరికి చంపి వారి అవయవాలను నరబలి కోబలి అంటూ కేకలు వేసి పిచ్చెత్తిన వాడిలాగా వెదజల్లాడట.

కుమారుల మరణవార్త దేవకి తెలుసుకొని

"ఆమాటవిని దేవకి అవనిపై ఒరిగె - గుప్పుగుప్పున రొమ్ము గుద్దుకునే తల్లి
దబ్బుదబ్బున తల్లి తల మోదూకోనే - కని గొడ్డురాలై నేను కడతేరనైతి
అన్నలా జంపంగా తమ్ముాలేమంటిరో- మిమ్ముాల జంపంగా మమ్మూలేమంటీరో
మదురాపురి పట్నము కల్లి మరి ఆస్తాలు జాపి- నీమదురాపురి పట్నం యముని పాలౌరా
నీమదురాపురి ప్రజలపాలౌను-నీవూ అనుబవించకుంటా నేననుబవించకుంటా
ప్రజల పాలౌనురా అన్నయ్యా - బాలుర ఉసురు నీకు ఎన్నడూ బాగుగా గలుగు
ఆరుగురు ఉసురు చేత నీకు అంత్యాకాలామొచ్చు-బాలుర ఉసురుచేత నీవు
ఒరుగుదువు గదరో "

జానపదకవి దేవకి దు:ఖాన్ని ఎంతో కరుణరస భరితంగా అత్యంత సహజ సుందరంగా వర్ణించి చెప్పాడు.

దేవకి ఏడవసారి గర్భాన్ని ధరిస్తుంది. యోగమాయ ఆమె కడుపులో ఉన్న



పిండాన్ని తీసుకొనివెళ్ళి రేపల్లెలో ఉన్న రోహిణి గర్భంలో ప్రవేశపెడుతుంది. దేవకి ఏడవ గర్భం తొలగిపోయిందని దేవకికి కాపలా ఉన్న కంసుని మనషులు కంసునికి చెబుతారు. అతడు చాల సంతోషపడి ఇలా అంటాడు.

"కంసబూపాలుడు విని కవకవ నవ్వి -కిందాయె మీదాయె తనకు సంతోషమాయే
అయ్యా కసికందు పాయెనా నాకర్మంబే పాసే-ఎప్పుడూ పుట్టునో ఎనిమిదోవాడు
ఎప్పుడు పుట్టునో నాకు ఎన్నడు దొరుకునో-అప్పుడే చంపుదునని పళ్ళు తాగొరికే"

ఏడవ వాణ్ణి తాను చంపనవసరం లేకుండా వాడే చనిపోయాడని కంసుడు చాల సంతోషించి ఎనిమిదవవాడు ఎప్పుడు పుడతాడా ఎప్పుడు చంపుతానా పళ్ళు పటపట కొరికాడట.

వసుదేవుడు బాలకృష్ణుని తీసుకొని రేపల్లెకు వెళ్ళి యశోద పక్కన ఉన్న యోగమాయను చూశాడట. అప్పుడు యోగమాయ

"పన్నెండు అస్తముల్ పొరజాపుకోని - విలువైన జడలన్ని వీరబోసుకోని
పైనిండా పాములు పారుచుండంగా - శెంకు ఒక చేత సెక్రమొకచేత
దూతల మర్దించా దుడ్డు ఒకాచేత - పరువైన దానిమ్మ పండూ ఒకచేత
వీరదాడు ఒక చేత విల్లు ఒక చేత - దట్టి ఒక చేతా డమురుమొక చేత
అన్నన్ని సొమ్ములు అలంకారించి - జగ్గూ ఒక చేత జంర్ఖూరి ఒక చేత
తట్టి ఒక చేత తలవారి ఒక చేత - దూతల మర్దింపా దుడ్డు ఒక చేత "

పన్నెండు చేతుల్లో పన్నెండు ఆయుధాలు పట్టుకొని ఉన్నదట. ఈవర్ణన తంగిరాలవారు ప్రచురించిన కంసునికథలో లేదు. బైకానివారు యోగమాతను అద్భుతంగా వర్ణించడానికి ఈవిధంగా చెప్పారు.

వసుదేవుడు కృష్ణుని దేవకి పక్కలో పడుకోబెట్టి యోగమాతను ఎత్తుకుంటాడు. అప్పుడు ఆమె నవ్వి అంతలోనే ఏడ్చిందట. దానికి కారణమేమని కృష్ణుడు అడుగుతాడు.

అందుకు యోగమాత ఇలా చెప్పింది.

"అన్నా నీప్రాణముకు నన్ను అడ్డమెయ్యాగానూ-నవ్వితిని నేను నలినాయాతాక్ష
తర్వాత కంసుండు చంపడా నన్ను - కంసుడు ఆరుగురిని ఒక్క గడియలో చంపె
మనకు అన్నయిన ఆబలబద్రుండు - కానకుండా రోహిణీ గర్భమునా దాగె
నీయంత వాడవు నిజరూపు దాచి- బయపడి వచ్చి రేపల్లె దాగితివి
ఆడపడుచును వాని ఆయుదము చాత - కడబడలేని కంసునికి వెరతు"

దానికి కృష్ణుడు కంసుడు ఆమెను చంపలేడని, కంసుడు యోగమాయను చంపడానికి ఆమెను పైకి విసరగానే ఆమె పైన అలాగే ఉండి కంసుని చంపేవాడు పుట్టి పెరుగు తున్నాడని చెప్పమని కృష్ణుడు ఆమెకు చెప్పి ఆతర్వాత ఆమె గంగాదేవిగా వెలసి యాదవుల కులదైవమై పూజలందుకుంటుందని, చాల కాలం యోగమాయ తాను

"నీళ్ళు పాలు కలిసినట్లు నువ్వు నేను చెల్లెలా
కలసి ఉందాము మనము కలకాలమెల్లా"

చాల కాలం అన్నాచెల్లెళ్ళుగా కలిసి ఉంటామని చెబుతాడు. ఆతర్వాత కృష్ణుడు యోగమాయతో కృష్ణావతారంలో తాను భూమికి భారంగా ఉన్న కంసుడు మొదలైన రాక్షసులను చంపుతానని, కురుక్షేత్రయుద్ధంలో పాండవులకు సాయం చేసి 18 అక్షౌహినుల సైన్యాన్ని చంపించి భూభారాన్ని తగ్గిస్తానని, ఆతర్వాత దుర్వాసుని శాపం వల్ల యాదవులు తమలో తాము కొట్టుకొని చనిపోతారని, తాను రామావతారంలో వాలిని చెట్టు చాటు నుంచి కొట్టిన పాపం తీర్చడానికి కృష్ణావతారంలో వాలి ఎరుకలవాడుగా జన్మిస్తాడని, అతని చేత బాణం దెబ్బతిని తాను చనిపోతానని, పాండవులు వచ్చి తనకు దహనసంస్కారం చేస్తారని, తన శరీరంలో కొంత భాగం కాలకుండా మిగిలిపోతుందనీ, ఆభాగం జగన్నాధావతారం అవుతుందని చెబుతాడు. బాలకృష్ణుడు యోగమాయతో చెప్పిన ఈ వృత్తాంతం తంగిరాలవారు ప్రచురించిన కంసుని కథలో చాల క్లుప్తంగా ఉంది. బైకానివారి కథలో కొంత వివరంగా ఉంది. ఈకథ పేరు కృష్ణభాగవతం, భాగవతంలో కృష్ణావతార కథంతా చెప్పబడాలి కాబట్టి బైకానివారు కృష్ణుని కథను కొంత వివరంగా చెప్పారు.

తనకూతురును చంపడానికి వచ్చిన అన్న కంసునికి దేవకి చేతులెత్తి మొక్కుతూ

"అప్పుడు దేవకమ్మ అస్తములు ముకులించి-నాఆరుగురు కుమార్ల అన్నా చంపితివి
కన్నాను నేను చిన్న కదురు వలె బాల - గండాలు లేవు అన్నయ్య నీచేతిలోకి లేదు
ఆడపడుచు ఇంకెమీ చేసేనూ నిన్ను-నెత్తురు ముద్దను నేపెంచుకుందు"

అని బతిమాలుతుంది. దానికి కంసుడు

"ఆడిది ఐతేను అత్తకు గండము - మొగవాడు ఐతేను మామకు గండము
బిడ్డపానము నీకింత ప్రీతాయే గానీ - దొడ్డగా నాప్రాణదోషంబు ఆనవా"

అని పలికి కంసుడు దేవకి దగ్గర ఉన్న పసిపాపను లాక్కొని ఆమె కుడికాలు పట్టుకొని నేలకేసి కొట్టబోతాడు. అప్పుడు ఆమె ఎడమకాలితో కంసుని తన్ని ఆకాశంలోకి ఎగిరి

"కంసుడు జూడంగ కలకల నవ్వి- చాతను శూలంబు సెంకు చక్రము గదయు
కరముల బట్టుకొని గట్టిగా ఆర్చి- మామ బెదరక నామాట ఇనురా
కంసుడ మాయన్న సెలవు ఏమాత్రామైనా- ఇపుడ నీశిరస్సు ఖండించివైతు
తలయూడా దన్నుదును తమ అన్నతోడు-ఎనక నిను చంపువాడు వేరె యున్నాడు
అసురవైరి ఒకచోట ఆడుచున్నాడు- చక్కని రాక్షసుల చీరనున్నాడు"

అని చెప్పి ఆదిశక్తి అదృశ్యమై పోతుంది. ప్రాణభయంతో దిగులుగా ఉన్న కంసునితో బూతకి కృష్ణుని తాను చంపి వస్తానని చెబుతుంది. అప్పుడు కంసుడు ఆమె రూపురేఖలను గురించి ఇలా చెబుతాడు.



"అందరి యెదుట అనరాదు గానీ - దొరవుల వంటి కాళ్ళు గాబుతొట్టి వలె నోరు
పరికింప వెస గడిబద్దల వలె పండ్లు - తూములే ముక్కులు తుమ్ములే పిడుగులు
ముక్కులో వెంట్రుకలు ముండ్లను బోలు -వెక్కసమైన నడుము వేలాడు కుచములు
కురుచని పాదాలు గుదిగాళ్ళు నీకు - యమురాల నీరూపు ఏమి యెన్నూదూను"

ఇలాంటి రూపుతో ఉన్న నిన్ను చూడగానే పిల్లలు పారిపోతారని చెప్పగానే బూతకి నవ్వి అందమైన గొల్లభామగా వేషం మార్చుకుని కృష్ణుని చంపడానికి వెళ్తుంది. కృష్ణుడు ఆమెను చంపుతాడు. ఆతర్వాత కంసుడు కృష్ణుని చంపడానికి శకటాసురుని, తృణావర్తుని పంపిస్తాడు. కృష్ణుడు వారిని గూడా చంపివేస్తాడు. ఆతర్వాత కృష్ణుడు కంసుని చంపడం మొదలైన కథ అంతా తంగిరాల వారు ప్రచురించిన కథను అనుసరించి ఉంది. ఇదంతా భాగవతానికి చాల దగ్గరగా ఉంది.

ఈవిధంగా బైకాని వారికథలు చక్కని సాహిత్యాంశాలతో శోభిస్తూ ఉన్నాయి.

ఈప్రకరణంలో చెప్పిన యాదవజానపదకళల్లోని సాహిత్యాంశాలను పరిశీలిస్తే యాదవజానపదకళాకారులు శిష్టసాహిత్యానికి సమాంతరంగా, పోటీగా, దానికి ఏమాత్రం తీసిపోకుండా ఉండే గొప్ప కథాగేయాలను కల్పించుకున్నారని స్పష్టమౌతుంది. ఈకళాకారులు చదువులేనివారైనప్పటికీ ఈకథలను మౌఖికప్రసారంలో తరతరాలుగా పాడుతూ కథను ఆసక్తికరంగా సహజసుందరమైన సులభశైలిలో చక్కని వర్ణనలతో రసం చిప్పిలే విధంగా చెప్పగల గొప్ప సామర్థ్యం ఉన్నవారని స్పష్టమవుతుంది. ఇంత గొప్ప సాహిత్యాంశాలతో జానపదసాహిత్యానికి తలమానికంగా వెలిగిపోతున్న పదకొండు జానపదకళలను, తరతరాలుగా పోషిస్తూ వాటిని ఆధునిక యుగంలో గూడా కాపాడుతూ వస్తూవున్న యాదవులు నిజంగా చాల గొప్పవారు. తమ కళల పట్ల, కళాకారుల పట్ల, తమ సంస్కృతి పట్ల వీరికి ఉన్న ఆసక్తి, ఆదరాభిమానాలు సాటిలేనివి. వీరిని ఆదర్శంగా తీసుకొని మిగిలిన కులాలవారు గూడా తమ కళలపట్ల శ్రద్ధాసక్తులు కనపరిస్తే మన జానపదకళలు అంతరించకుండా కలకాలం జీవిస్తాయి.

తమ జానపద కళల పట్ల యాదవులు చూపించే ఆసక్తి, అభిమానం తమ కులచైతన్యం పట్ల గూడా చూపిస్తే వీరు ఎంతో బాగుపడతారు. యాదవులు పురాణాల్లో చెప్పబడిన తమ జాతి గత వైభవాన్ని, రాజులై రాజ్యాలను పాలించిన తమ జాతి శక్తి సామర్థ్యాలను, నిరక్షరాశ్యులుగా తాము సృష్టించుకొని తరతరాలుగా కాపాడుకుంటూ వస్తున్న తమ జాతి సాహిత్యసంపదను గుర్తుకు తెచ్చుకొని, ఇప్పటి తమ దయనీయ స్థితిని తలచుకొని, ఆదయనీయ స్థితినుంచి బైటపడడానికి జాతి యావత్తు చైతన్యవంతమై తిరిగి తమ పూర్వ స్థితిని పొందడానికి కృషి చేయాలని, చేస్తారని ఆశించుదాం.

## యాదవ జానపద కళాకారులు - జీవన విధానం :

ఈఅధ్యాయంలో నేను పరిశోదనకు తీసుకున్న పదకొండు జానపద కళా కారుల జీవన విధానాన్ని గురించి వివరిస్తాను.

## గొరవయ్యలు - జీవన విధానం :

గొరవయ్యలు కురువ కులానికి చెందినవారు. గొర్రెలను, మేకలను కాయడం, గొర్రెల ఉన్నితో కంబళ్ళు నేయడం కురువ కులస్థుల ముఖ్యవృత్తి. గొరవయ్యలు కురువ కులస్థులు కావడం వల్ల తమ కులవృత్తి అయిన గొర్రెలను, మేకలను కాయడం, కంబళ్ళు నేయడం చేస్తారు. అలాగే కొందరు గొరవయ్యలు వ్యవసాయం కూడా చేస్తారు. 'గొరవ' శబ్దానికి యోగి, సన్యాసి అనే అర్థాలున్నాయి. ఐతే గొరవయ్యలు సన్యాసులు కారు. వీరు వివాహం చేసుకొని సంసార జీవనాన్ని గడుపుతారు. గొరవయ్యలు ప్రధానంగా కురువ కులస్థులకు గురువులు, పూజారులు కూడా. ఇతర కులస్థుల్లో మైలారుస్వామి భక్తులు కూడా గొరవయ్యలను గురువులుగా భావిస్తారు. సాధారణంగా ఒకొక్క ఊరిలో ఒకొక్క గొరవయ్య వుంటాడు. గతంలో ఊరిలో వున్న కురువ కులస్థులు ఇతర కులాల్లో వున్న మైలారు స్వామి భక్తులు గొరవయ్యల పోషణాభారాన్ని వహించేవారు. అంటే ఊర్లో వాళ్ళందరూ కలిసి కొంత ధాన్యాన్ని పోగుచేసి ఆ వూర్లో వున్న గొరవయ్యకు అతని కుటుంబానికి సంవత్సరానికి సరిపడా ధాన్యాన్ని ఇచ్చేవారు. ఐతే ప్రస్తుతం గొరవయ్యల విషయంలో ఈ నియమం కొనసాగడం లేదు. అందువల్ల పంట వచ్చే సమయంలో ఆ వూర్లో వున్న గొరవయ్య ప్రతీ ఇంటికీ వెళ్ళి కొంత ధాన్యాన్ని అడిగి తీసుకుంటూ వుంటాడు. లేకపోతే కొంత మంది గొరవయ్యలు కలిసి పంట కాలంలో కొన్ని ఊర్లు తిరుగుతూ వుంటారు. తమ వూరికి గొరవయ్యలు రాగానే ఆ వూరిలోని భక్తులు "మా గురువులు వచ్చారని" భావించి వారి కాళ్ళు కడిగి పూజించి తమ శక్తికొద్దీ తమకు పండిన ధాన్యాన్ని ఇస్తారు. ఆ ఊర్లో గొరవయ్యలు ఉన్నంత కాలం ఊర్లోని భక్తులు వారికి భోజన వసతిని కల్పిస్తారు. అంతేకాకుండా ఆ వూరిలోని భక్తులందరి ఇళ్ళకూ వెళ్ళి ధాన్యాన్ని పోగుచేసి బస్తాల్లో నింపి వాటిని గొరవయ్యలకు ఇచ్చి సగౌరవంగా వారిని సాగనంపుతారు. ఆ ధాన్యంతో గొరవయ్యలు జీవనం సాగిస్తారు. "ఇలా ఊళ్లకు వెళ్ళినప్పుడు భక్తులే గాకుండా ఇతరులు కూడా గొరవయ్యలను తమ యింటికి పిలిచి వారి చేత నృత్యం చేయించి పాటలు పాడించి కానుకలు ఇస్తారు".[1]

గొరవయ్యల జీవన విధానంలో ముఖ్యమైనది వారు పూజా కార్యక్రమాల్లో



పాల్గొనడం. కురువ కులస్థులు మిగిలిన కులాల్లోని గొరవయ్యల భక్తులు తమ ఇళ్ళలో జరిగే అన్ని శుభకార్యాలకు గొరవయ్యను పిలిచి వారితో తమ ఇంట్లో పూజ చేయించి, నృత్యం చేయించి, పాటలు పాడించి ఆ తరువాత గొరవయ్యను పూజించి కొత్తబట్టలు పెట్టి దక్షిణగా కొంత డబ్బును ఇస్తారు. తమకు పండిన ధాన్యాన్ని కూడా సమర్పించు కుంటారు. గొరవయ్య వేరే ఊరు నుండి వస్తే అతనికి రానుపోను చార్జీలు, ఇతర ఖర్చులు కూడా ఇస్తారు. ఐతే ఈ రోజుల్లో ఇలాంటివి చాలా తక్కువ మంది చేస్తున్నారు. అందువల్ల గొరవయ్యల జీవనం కష్టంగా ఉంటొంది. వ్యవసాయం గొర్రెలు, మేకలు లేని గొరవయ్యలు బిక్షాటన చేస్తూ జీవనం సాగిస్తున్నారు. గొరవయ్య వేషాన్ని ధరించి ఊర్లో బిక్షాటనకు బయలుదేరి ప్రతీ ఇంటి ముందు కొంతసేపు నృత్యం చేసి పాటలు పాడి ఇంటిలోని వారికి "బండారుబొట్టు" పెట్టి వారిచ్చిన డబ్బు, ధాన్యం తీసుకొని దీవించి వెళతారు. కొంతమంది గొరవయ్యలు కూలి పనికి వెళుతూ చిన్న చిన్న వ్యాపారాలు కూడా చేసుకుంటున్నారు. కొంత మంది కేవలం ధార్మిక ప్రచారమే జీవనంగా పెట్టుకొని బిక్షాటనతో జీవించేవాళ్ళు కూడా వున్నారు.

కర్ణాటకలో గొరవయ్యలకు ఇప్పటికీ మంచి ఆదరణ ఉంది. కురవ కులస్థులు, మైలారుస్వామి భక్తులు గొరవయ్యలను తమ పూజారులుగా గురువులుగా భావించి వారి పోషణాభారాన్ని వహిస్తున్నారు. గొరవ దీక్షా సమయంలో గణాచారి ఊర్లోని వాళ్ళను "గొరవయ్యను మీరే పోషించాలి" అని చెప్పగానే భక్తులందరూ 'సరే సరే' అని అంగీకరిస్తారు. గొరవయ్యకు పెళ్ళి చేయడం మొదలుకొని అతని నిత్య జీవితానికి అతని కుటుంబ పోషణకు అవసరమైన ధనధాన్యాలను ఆ వూర్లో వున్న భక్తులే సమకూర్చుతారు. "కర్ణాటకలో కొంత మంది గొరవయ్యలు భిక్షాటనకు వస్తే భక్తులు అతని 'దోణి'లో ఐదు చపాతీలు, ఐదు అరటిపళ్ళు వేస్తారు. ఐదు పైసల నుండి ఐదు రూపాయల వరకూ దక్షిణ కూడా ఇస్తారు".[2]

**గొరవయ్యల వివాహ పద్ధతి :** గొరవయ్యల వివాహ పద్ధతిలో కొంత ప్రత్యేకత కనిపిస్తుంది. ఆంధ్రదేశంలోని గొరవయ్యలు కురువ కులానికి చెందినవారు కాబట్టి వీరు కురువ కులానికి చెందిన అమ్మాయినే పెళ్ళి చేసుకుంటారు. మిగిలిన కులాల వారి లాగానే సగోత్రీకులను గొరవయ్యలు వివాహం చేసుకోరు. గొరవయ్యలు గణాచారిని గురువుగా భావిస్తారు. కాబట్టి అతని కూతుర్ని కూడా చేసుకోరు. వివాహ కార్యక్రమం పెళ్ళి చూపులతో ప్రారంభం అవుతుంది. పెళ్ళిచూపులు అమ్మాయి ఇంట్లోనే జరుగుతాయి. అమ్మాయిని చూసుకోవడానికి గొరవయ్య, అతని తల్లిదండ్రులు, ఇతర బంధువులు వస్తారు. ఇరువైపుల వారికి అన్ని విషయాలూ నచ్చిన తరువాత నిశ్చితార్థం పెట్టుకుంటారు.

ఈ నిశ్చితార్థాన్ని పెద్ద ఉత్సవం లాగా చేస్తారు. తమ స్థోమతనుబట్టి కొంతమంది గౌరవయ్యలను, గణాచారిని పిలిచి వారి సమక్షంలో నిశ్చితార్థ కార్యక్రమం నిర్వహిస్తారు. ఐదుగురు ముత్తైదువల చేత అమ్మాయికి కొత్త బట్టలు పెట్టి ఒడిబియ్యం పోసి అందులో రకరకాల తిను బండారాలను ఉంచుతారు. తరువాత పెళ్ళి ముహూర్తం నిర్ణయించి లగ్నపత్రిక రాసుకుంటారు. గౌరవయ్యల వివాహానికి పౌరోహిత్యం బ్రాహ్మణుడు చేయడు. గణాచారి పురోహితుడుగా కూర్చొని వివాహ తంతు జరిపిస్తాడు. వివాహ తంతులో గూడా ఇతర గౌరవయ్యలు ఉత్సాహంగా పాల్గొంటారు. పెళ్ళి ముహూర్తానికి సుమారు పదిమంది గౌరవయ్యలను, గణాచారినీ పిలుస్తారు. ముహూర్తానికి ఒకరోజు ముందుగానే గౌరవయ్యలు వచ్చి ఇంటికి తోరణాలు కట్టి ఇల్లంతా అలంకరిస్తారు. గణాచారి గౌరవపూజ చేసిన తరువాత మిగిలిన గౌరవయ్యలు మైలారు స్వామికి సంబంధించిన పాటలు పాడి నృత్యం చేసి పాలు తాగుతారు. తరువాత పెళ్ళికొడుకైన గౌరవయ్యకు స్నానం చేయించి కొత్తబట్టలు కట్టిస్తారు. పెళ్ళికొడుకును శివాలయానికి తీసుకొని వెళ్ళి పూజ చేయిస్తారు. కొందరు ఇంట్లో ఉన్న దేవునికి పూజ చేయిస్తారు. కొత్త కడవను తెచ్చి ఇంట్లో దేవుని ముందు పెట్టి అందులో ఆవు పాలను, అవి లేకపోతే మేకపాలను పోస్తారు. పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార కలిపి పంచామృతం తయారుచేస్తారు. గణాచారి పెళ్ళిపెద్దగా, పురోహితునిగా కూర్చొని పెళ్ళి కుమారునితో పెళ్ళి కూతిరికి తాళి కట్టిస్తాడు. తరువాత అందరూ పెళ్ళి భోజనాలు చేసిన తరువాత గౌరవయ్యలకు గణాచారికి దక్షిణలు ఇచ్చి పంపిస్తారు.

**పండుగలు :** గౌరవయ్యలు మిగిలిన హిందువుల లాగానే అన్ని పండుగలు చేసుకుంటారు. ఐతే కొన్ని పండుగలను మిగిలిన వారి కంటే ప్రత్యేకంగా జరుపుకుంటారు. ఇలాంటి వాటిలో శివరాత్రి, ఉగాది, దసరా పండుగలు ప్రధానంగా చెప్పదగినవి. ఈ ఒక్కొక్క పండుగ సమయంలో ఒక్కొక్కచోట గౌరవయ్యలు తమ ఇష్టదైవమైన మైలారు దేవునికి ఉత్సవాలు జరిపిస్తారు. ఈ ఉత్సవాలు జాతర లాగా వుంటాయి. గౌరవయ్యలు ఈ ఉత్సవాలను పరసలు అని అంటారు.

శివరాత్రి పండుగకు ఆంధ్రదేశంలోని గౌరవయ్యలు శైవక్షేత్రాలైన శ్రీశైలం, మహానంది, యాగంటి మొదలైన పుణ్యక్షేత్రాలకు వెళ్ళి శివుని తమ నృత్యగానాలతో భజించి భక్తులను సంతోషపెడతారు. "కర్నూలు జిల్లా పత్తికొండ ప్రాంతంలోని గౌరవయ్యలు శివరాత్రి పండుగకు తమకు దగ్గరగా ఉన్న మహానంది క్షేత్రానికి వెళ్ళి శివుని సేవించి ఆ తరువాత నంధ్యాల పట్టణంలో జరిగే "పక్కీరయ్య తాత" ఉరుసులో పాల్గొంటారు. సాయంత్రం జరిగే ఊరేగింపులో నృత్యం చేస్తూ పోతూ వుంటారు"3.



ఇలా ప్రతి సంవత్సరం చేస్తారు.

ఉగాది పండుగకు కొందరు గౌరవయ్యలు అనంతపురం జిల్లాలోని 'రాచనేపల్లి' గ్రామానికి వెళ్ళి అక్కడ వున్న 'మీనగొంది మల్లయ్య స్వామి' ని సేవిస్తారు. ఇక్కడికి వచ్చే గౌరవయ్యలు పండుగకు ముందే తమ గ్రామాల నుండి గుంపులు గుంపులుగా బయలుదేరి దారిలో ఊరూరా బిక్షాటన చేస్తూ పండుగ నాటికి రాచనేపల్లికి చేరుకుంటారు. పండుగనాడు తమ నృత్యగానాదులతో మల్లయ్యస్వామిని సేవించి వెళతారు. ఉగాది పండుగకు కొంతమంది గౌరవయ్యలు శ్రీశైలం వెళ్ళి మల్లికార్జునస్వామిని దర్శిస్తారు.

గౌరవయ్యలకు అతి ముఖ్యమైన పండుగ దసరా. దసరా పండుగకు ఆంధ్ర దేశంలోని గౌరవయ్యలందరూ కర్నూలు జిల్లా ఆలూరు గ్రామానికి 18 కిలోమీటర్ల దూరంలో ఉన్న 'గట్టు మల్లయ్యకొండ' కు వెళతారు. ఈ పండుగ సందర్భంగా జరిగే ఉత్సవాన్ని గట్టు మల్లయ్య జాతర అంటారు. ఆంధ్ర నుండే కాక కర్ణాటక నుంచి కూడా అధిక సంఖ్యలో గౌరవయ్యలు దసరా పండుగ రోజు రాత్రికి ఈ కొండకు చేరుకుంటారు. గట్టు మల్లయ్యస్వామి ఊరేగింపులో గౌరవయ్యలందరూ ఉత్సాహంగా పాల్గొంటారు. మల్లయ్య స్వామి సన్నిధిలో అనేక పద్ధతుల్లో నాట్యం చేస్తూ పాటలు పాడతారు.

గట్టు మల్లయ్య కొండ క్షేత్రంలో కొంతమంది గౌరవయ్యలు కొన్ని అద్భుత సాహస కార్యాలను చేస్తారు. కాలిపిక్కలో దబ్బణం గుచ్చుకోవడం, ఇనుప గొలుసును లాగి తెంపడం, కొరడాలతో తమను తాము కొట్టుకోవడం మొదలైనవి ఇలాంటివి. దబ్బణానికి చివర తాడు గుచ్చి ఆ దబ్బనాన్ని కాలిపక్కలో గుచ్చి అటువైపు లాగి రక్తాన్ని అక్కడ వున్న రాక్షస గుండ్ల మీద వదులుతారు. ఇలా చేయడానికి గల కారణాన్ని గురించి గౌరవయ్యలు ఒక కథ చెబుతారు. శివుడు 'మణిమల్లాసురులు' అనే రాక్షసులను 'మైలారు లింగడు' అనే రూపంలో సంహరిస్తాడు. ఆ రాక్షసుడు చనిపోయేటప్పుడు ప్రతీ యేటా తనకు నరబలి ఇవ్వాలని శివుని కోరతాడు. శివుడు దానికి అంగీకరించ కుండా కొంత రక్తాన్ని మాత్రమే నరులు ఇస్తారని చెబుతాడు. ఆనాడు శివుడు ఇచ్చిన మాట ప్రకారం గౌరవయ్యలు కాలిలో దబ్బణం గుచ్చుకొని తమ రక్తాన్ని మణిమల్లాసురల ప్రతీకలైన రాక్షస గుళ్ళమీద వదులుతారు. ఇలా చేయడాన్ని కన్నడంలో 'గూటద పవాడ' అని అంటారు. దబ్బనం గుచ్చిన గాయానికి గురవయ్యలు బండారును (పసుపును) పూస్తారు. ఎలాంటి మందులూ వాడరు. రోజూ వారు పూసే పసుపుకే గాయం మానిపోతుంది.

గౌరవరయ్యలు దసరా జాతర చివరి రోజున స్వామి సింహాసనకట్ట ఎదురుగా ఉన్న రాతి స్థంభానికి బొటనవేలంత లావు వున్న ఇనుపగొలుసును కట్టి దాన్ని రెండు చేతులతో పట్టుకొని భక్తి ఆవేశంతో లాగి తెంచుతారు. ఇలా చేయడాన్ని కన్నడంలో

'సర్పణి పవాడ' అంటారు. గొలుసు తెంపడానికి ముందే కొంతమంది గొరవయ్యలు వీరావేశంతో ఎగురుతూ నాట్యం చేస్తూ తమ శరీరం మీద కొరడాతో కొట్టుకుంటారు. ఇలా కొట్టుకోవటం వల్ల ఒక్కొక్కసారి రక్తం వస్తుంది. ఈ గాయానికి కూడా గొరవయ్యలు బండారును పెడతారు.

గొరవయ్యలు చేసే జాతరల్లో ఈ గట్టుమల్లయ్య జాతర ప్రత్యేకమైనది, ముఖ్యమైనది. ఈ గట్టుమల్లయ్యకొండకు 'దేవరగుడ్డం', 'మల్లప్పగట్టు' అనే పేర్లున్నాయి. ఈ పుణ్యక్షేత్రం దట్టమైన కొండల మధ్య వుంది. ఇక్కడ ఈశ్వరుడు మల్లేశ్వరుని పేరుతో కూర్మావతార రూపంలో వున్నాడు. అంటే ఈ క్షేత్రం హరిహర భేదాన్ని తెలుపుతూ వుంది. ఈ క్షేత్రంలో అస్పృశ్యత పాటించరు. అన్ని కులాలవారూ ఈ క్షేత్రాన్ని దర్శిస్తారు. ఈవిధంగా గొరవయ్యలు శివరాత్రి, ఉగాది, దసరా పండుగలకు పైన చెప్పిన శైవ క్షేత్రాలను దర్శించి అక్కడ వున్న శివుణ్ణి తమ నృత్య గానాదులతో సేవించి భక్తులను రంజింపజేస్తారు.

**మరణం :** మరణం సందర్భంగా చేసే క్రియలను ఉత్తర క్రియలు లేక అంత్యక్రియలు అని అంటారు. గొరవయ్యల అంత్యక్రియలు కూడా కొంత ప్రత్యేకంగా వుంటాయి. గొరవయ్య చనిపోతే అతని శవాన్ని దాయాదులు మాత్రమే తాకాలి. ఇతరులు తాకకూడదు. శవానికి స్నానం చేయించి, కొత్తబట్టలు కట్టి పసుపు కుంకుమ పెడతారు. మెడలో పూల దండలు వేస్తారు. శవాన్ని తీసుకొని పోయి స్మశానంలో పూడుస్తారు. ఇంటికి తిరిగి వచ్చాక ఇల్లు కడిగి శుభ్రం చేస్తారు. మూడు రోజుల వరకూ ఇంట్లో ఎలాంటి పూజలూ చెయ్యరు. మూడవ రోజున జరిగే కార్యక్రమానికి గణాచారిని, కొంతమంది గొరవయ్యలను పిలుస్తారు. ఆ రోజు చనిపోయిన చోట గొర్రెను కోసి వండి బంధువులకు, గొరవయ్యలకు పెడతారు. అలసందులు, జొన్నలు కలిపి అన్నంవండి దాన్ని కొత్త చేటలో ఉంచి మాంసం కూర కూడా కొంత చేటలోవేసి దానిమీద కంబళి కప్పి గొరవయ్యను పూడ్చిన దగ్గరకు వెళ్ళి తల వైపున వేస్తారు. ఏదైనా కుక్క వచ్చి తినేంత వరకూ అక్కడే ఉండి తరువాత ఇంటికి వచ్చి అందరూ స్నానంచేసి ఇల్లంతా శుభ్రం చేస్తారు. తరువాత బంధువులతో కలిసి భోజనం చేస్తారు. ఈ తంతు అంతా గణాచారి దగ్గర వుండి జరిపిస్తాడు. 11వ రోజున గణాచారిని పిలిచి 'శుభం' చేయిస్తారు. ఆ రోజు గణాచారి వచ్చి ఇంట్లో పూజచేసి దేవుని దగ్గర పెట్టిన నీటిని ఇంట్లోను, దాయాదుల బంధువుల ఇళ్ళలోనూ చల్లుతారు. ఆ రోజు పాయసం మొదలైన తీపి పదార్థాలతో భోజన పదార్థాలు చేసి బంధువులందరికీ పెడతారు. పై విధంగా గొరవయ్యల జీవన విధానం ఉంటుంది.



## సేవగరిడి కళాకారులు - జీవన విధానం :

వైష్ణవ భక్తి ప్రధానమైన సేవగరిడి కళను ఉత్తరాంధ్ర జిల్లాల్లోని కొన్ని యాదవ కుటుంబాలవారు వంశపారంపర్యంగా అనేక తరాల నుంచి ప్రదర్శిస్తూ ఉన్నారు. ఈ కళాకారులందరూ రెక్కాడితేగాని డొక్కాడని బీదవారు. ఏరోజుకారోజు కూలిపని చేసి డబ్బు సంపాదించి ఆ డబ్బుతో జీవనయాత్ర సాగించే నిరుపేదలు. ఇలాంటివారి జీవితంలో ఖాళీ సమయం తక్కువగా ఉంటుంది. అయినప్పటికీ ఎలాగో ఒకలాగ ఖాళీ సమయాన్ని ఏర్పాటు చేసుకొని గురువు వద్దకు వెళ్ళి దశావతార కథాగేయాలను నేర్చుకుంటారు. సేవగరిడి కళ పట్ల, దశావతారాల కథల పట్ల వీరికున్న భక్తి ప్రపత్తులు, ఆసక్తి అభిమానాలు ఎంతగొప్పవో దీన్ని బట్టి స్పష్టమౌతుంది.

విశాఖపట్నంలోను, చుట్టుపక్కల గ్రామాల్లోనూ చెప్పుకోదగిన సంఖ్యలో యాదవులున్నారు. ఇంచుమించుగా యాదవులున్న ప్రతి గ్రామంలోను కనీసం ఒక్క సేవగరిడి సంఘమైనా ఉంది. కొన్ని గ్రామాల్లో ఒకటి కంటే ఎక్కువగా రెండు, మూడు సేవగరిడి సంఘాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు విశాఖపట్నం దగ్గర ఉన్న శివాజీపాలెంలో ఒమ్మి, దువ్వి, ఆళ్ళి, సారిపిల్లి, బుద్ధల అనే ఇంటిపేరు గల వాళ్లకు వేరువేరుగా సేవగరిడి సంఘాలు ఉన్నాయి. శివాజీపాలెం మరీ పెద్ద గ్రామమేమీకాదు. ఐతే ఈ గ్రామంలో అత్యధిక జనాభా యాదవులే ఉన్నారు. అందువల్లనే ఈ గ్రామంలో ఇంచుమించుగా ప్రతి ఇంటిపేరు గలవారికి ఒక సేవగరిడి సంఘం ఉంది. ఒక్కొక్క సంఘంలో పదిమందికి పైగా సభ్యులు ఉంటారు. కొన్ని పెద్ద సంఘాల్లో ఇరవైమంది కూడా ఉంటారు. సేవగరిడి కళాప్రదర్శనలో పదిమందికి తక్కువగాకుండా పాల్గొంటారు. వీరిలో కొందరు రోజువారీగా కూలి పని చేసుకొనేవారు ఉంటారు. మరికొందరు చిన్న బండిలో ఉప్పు పోసుకొని ఊరంతా తిరుగుతూ ఉప్పు అమ్ముకొనేవారు ఉంటారు. ఇలా ఉప్పు అమ్ముకోవడాన్ని "ఉప్పుబండి వెయ్యడం" అని అంటారు. మరికొందరు చిన్నచిన్న ఉద్యోగాలు అంటే వాచ్‌మాన్‌లాంటి ఉద్యోగాలు చేసేవారు ఉన్నారు. ఈవిధంగా సేవగరిడి కళాకారులందరూ బీదవారే. అంతేగాకుండా చదువు సంధ్యలు లేనివారు. వీరందరూ పగలంతా కష్టపడి పని చేసుకొనేవారే. ఇలాంటి నిరుపేదలైనప్పటికీ సేవగరిడి కళను ప్రదర్శించవలసి వచ్చినప్పుడు తమ పనులను మానుకొని కళాప్రదర్శనలో పాల్గొంటారు. కళాప్రదర్శనలో పాల్గొనడం వలన వీరికి డబ్బు ఏమీ రాదు. ఐనప్పటికీ తమ కళపట్ల వారికున్న భక్తి ఆసక్తుల కారణంగా ఆ కళా ప్రదర్శనలో పాల్గొంటారు. ఎలాంటి ఫలితాన్ని ఆశించకుండా నిస్వార్థంగా కళాప్రదర్శనలో పాల్గొనే కళాకారులు బహుశ వీరు ఒక్కరే ఉంటారు.

నేను విశాఖపట్నం చుట్టుపక్కల ఉన్న కొంతమంది దాసులను కలుసుకొని వారిచేత దశావతార కథలను పాడించి టేపురికార్డరు ద్వారా కేసెట్లలలో రికార్డు చేసుకొని వాటిని రాసుకున్నాను. వీరిలో కొందరి జీవన విధానాన్ని గురించి చెబితే ఈ కళాకారుల జీవన విధానం కొంతవరకు అర్థమౌతుంది. శివాజిపాలెం వాస్తవ్యులైన నమ్మి అప్పలస్వామిగారు గొప్ప దాసుడు. వీరు ఈమధ్యనే తమ ఎనబై సంవత్సరాల వయసులో కాలం చేశారు. వీరి కుటుంబానికి సేవగరిడీ లేదు. ఐనప్పటికీ వీరు చిన్నప్పుడు బండి అప్పలస్వామి అనే గురువు దగ్గర దశావతార కథలను నేర్చుకున్నారు. వీరు తమ ఇంటి పక్కనే ఉన్న "బుద్దలవారి గరిడి" లో పాడుతూ ఉంటారు. వీరు తాను గురువుగా ఉండి అనేక మంది శిష్యులకు దశావతార కథలను నేర్పించారు. ఇలాంటి వీరు పూర్తిగా నిరక్షరాస్యులు. వీరు ఒక ప్రవేటు కంపెనీలో వాచ్‌మేనుగా ఉద్యోగం చేశారు. వాచ్‌మేన్ ఉద్యోగం పగలు పూర్తిగా కానీ లేక రాత్రి పూర్తిగా గానీ చేయవలసి ఉంటుంది. ఇలాంటి ఉద్యోగం చేస్తూ దశావతార కథలను నేర్చుకోవడం, సేవగరిడి కళలో దాసుడుగా పాడటానికి ఎప్పుడుబడితే అప్పుడు వెళ్ళడం ఎంత కష్టమో వేరే చెప్పనవసరం లేదు. అయినప్పటికీ ఎలాగో ఒకలాగా తన వాచ్‌మేన్ ఉద్యోగాన్ని చేస్తూ గరిడి సేవలో ప్రధాన కథకుడుగా దశావతారాలను గానం చేయడమే గాకుండా అనేక మంది శిష్యులకు దశావతార కథలను నేర్పించారు. వీరు తయారు చేసిన శిష్యులలో వీరి అల్లుడు, మేనల్లుడు అయిన గొలగాని సింహాద్రిగారు ప్రస్తుతం దశావతార కథలను పాడుతూ మంచి దాసుడుగా పేరు తెచ్చుకుంటున్నారు.

గొలగాని సింహాద్రిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయం హాస్టల్‌లోని భోజనశాల (మెస్)లో గత పది సంవత్సరాలుగా తాత్కాలిక ఉద్యోగిగా పనిచేసి, ఈ మధ్యనే అటెండరుగా శాశ్వత (పర్మినెంట్) ఉద్యోగిగా మారారు. వీరు చిన్నప్పుడు ఏడవ తరగతి వరకు మాత్రమే చదువుకున్నారు. ఐనప్పటికీ దశావతార కథల పట్ల ఎంతో ఆసక్తి కలిగి వారి మేనమామ, మామ అయిన నమ్మి అప్పలస్వామిగారి ద్వారా దశావతార కథలను నేర్చుకొని శివాజీపాలెంలో ఉన్న బుద్దలవారి గరిడిలోను, ఇతర గరిడీల్లోనూ దాసుడుగా పాడుతూ ఉన్నారు.

విశాఖపట్నానికి దగ్గరలోఉన్న చినగదిలి గ్రామనివాసి అయిన గొలగాని అప్పారావు గారికి తరతరాలుగా సేవగరిడి ఉంది. వీరు దాదాపుగా నిరక్షరాస్యులు. సంతకం మాత్రం చేయగలరు. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాచ్‌మేన్‌గా ఉద్యోగం చేసి 2004 సంవత్సరంలో ఉద్యోగ విరమణ చేశారు. వీరు కూడా దశావతార కథలను అలవోకగా పాడతారు. విశాఖపట్నానికి దగ్గరగా ఉండి ప్రస్తుతం విశాఖపట్నంలో



కలిసిపోయిన పీతలవానిపాలెం నివాసి అయిన ఈపు నరసింగరావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పంపుసెట్ అటెంటర్‌గా ఉద్యోగం చేసి 2001లో ఉద్యోగ విరమణ చేశారు. పంపు ద్వారా నీటి ట్యాంకుకు నీరు నింపడం వీరి పని. వీరు కూడా ఇంచు మించుగా నిరక్షరాస్యులు. సంతకం మాత్రం చేయగలరు. వీరి కుటుంబానికి గరిడిలేదు. అయినప్పటికీ దశావతార కథలను నేర్చుకొని పీతలవానిపాలెంలో ఉన్న "ఆల్చి"వారి గరిడిలో దాసుడుగా పాడేవారు.

విశాఖపట్నానికి సుమారు 20 కిలోమీటర్ల దూరంలో ఉండి ప్రస్తుతం విశాఖపట్నంలో కలిసిపోయిన గాజువాకకు సమీపంలో ఈపువానిపాలెం అనే గ్రామం ఉంది. ఈ గ్రామంలో ఈపు చినఅప్పన్న అనే దాసుడు ఉన్నారు. వీరు పూర్తిగా నిరక్షరాస్యులు. వీరు కూలిపని చేసుకొని జీవనం సాగిస్తున్నారు. వీరికి ఇంచుమించుగా 70 సంవత్సరాల వయసు ఉంటుంది. వీరి వద్ద నుంచి నేను రామావతారకథను సేకరించాను. రామావతారకథను పాడేవారు చాలా తక్కువ మంది ఉంటారు. నేను అనేక రకాలుగా వెదకి వెదకి వీరిని పట్టుకొని రామావతారకథను సేకరించాను. దశావతార కథల్లో రామావతార కథ చాలా పెద్దది. చిన అప్పన్న గారు నిరక్షరాస్యులు అయినప్పటికీ రామావతారకథను ధారాళంగా, అలవోకగా, గొప్పగా పాడగల ధారణా శక్తి ఉన్నవారు. నమ్మి అప్పలస్వామి, గొలగాని సింహాద్రి మొదలైన పైన పేర్కొన్న దాసులందరూ యాదవ కులానికి చెందినవారు.

పైన చెప్పినవారే కాకుండా ఇంచుమించుగా సేవగరిడి కళాప్రదర్శకు లందరూ బీదవారే. నిరక్షరాస్యులే. వీరందరికీ సేవగరిడి కళా ప్రదర్శన వృత్తికాదు. ప్రవృత్తి మాత్రమే. వీరందరూ స్థిరజీవనం ఉన్నవారే. వీరందరూ హిందువులు. హిందువులు చేసుకొనే పండుగలు పబ్బాలు పెళ్ళి పేరంటాలు మొదలైన వాటిని వీరు కూడా హిందువుల లాగానే చేసుకుంటారు. అందువల్ల ఈ సేవగరిడి కళాకారుల జీవనంలో ప్రత్యేకంగా వీరిది అని చెప్పదగిన అంశం కనిపించదు. కాకపోతే సేవగరిడి కళ భక్తి ప్రధానమైనది కావడం వలన వీరు కొన్ని నియమనిష్ఠలను పాటిస్తారు. వాటిని గురించి సేవగరిడి కళ స్వరూప స్వభావాల్లో వివరించాను. అందువల్ల వాటి గురించి మళ్ళా ఇక్కడ వివరించలేదు.

## గంగిరెద్దులవారు - జీవన విధానం :

ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాల్లోనూ గంగిరెద్దుల వారు ఉన్నారు. గంగిరెద్దుల వారందరూ యాదవ కులానికి చెందినవారు. వీరి వృత్తి గంగిరెద్దులను ఆడించి పొట్ట

పోసుకోవడం. ఈ వృత్తినిబట్టి వీరికి గంగిరెద్దులవారు అనే పేరువచ్చింది. వీరు సంచార జీవనాన్ని చేస్తూ దయనీయమైన జీవితాన్ని గడుపుతున్నారు. వీరు నివసించే ప్రాంతంలో విద్యుచ్ఛక్తి గానీ, మంచినీటి సౌకర్యం గానీ, రోడ్లు గానీ మరేటువంటి సౌకర్యాలు గానీ ఉండవు. ఈ సౌకర్యాలన్నీ తమకు కావాలన్న సంగతి గూడా వీరికి తెలియదు. ఏమాత్రం చైతన్యం లేకుండా ఇప్పటికీ వీరు సంచార జీవనం చేస్తూ కాలం వెల్లదీస్తున్నారు. ప్రభుత్వం వారిని గానీ, ప్రజాప్రతినిధులను గానీ తమకు ఫలానా సౌకర్యాలు కావాలని అడగరు. ఉన్నదాంట్లో సంతృప్తి పడటం వీరి నైజం. వీరు చాలా అల్ప సంతోషులు. ప్రజలు పాతచీర గానీ, పాత పంచె గానీ ఇస్తే అదే పదివేలుగా భావించి సంతోషంగా వారి పిల్లా పాపలు సుఖంగా వర్థిల్లాలని మనసారా దీవిస్తారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీరిని వెనుకబడిన తరగతుల్లోని 'ఎ' గ్రూపులో చేర్చింది. వీరిలో ఇప్పటికీ గూడా అక్షరజ్ఞానం ఉన్నవారు లేరంటే అతిశయోక్తి కాదు. అందువల్ల వీరిని షెడ్యూల్డ్ తెగల్లో చేర్చాలి. తమను షెడ్యూల్డ్ తెగల్లో చేర్చాలని ప్రభుత్వం వారిని కోరాలన్న సంగతి కూడా వీరికి తెలియదు. అసలు రిజర్వేషన్లు అనేవి ఉన్నాయని వాటివల్ల తమ పిల్లలు చదువుకోవచ్చునని, ఉద్యోగాలు చేసి బాగుపడవచ్చునన్న సంగతే వీరికి తెలియదు. ఇంత దైన్యమైన స్థితిలో జీవిస్తున్న జాతి గంగిరెద్దులవారు తప్ప మరొకరు ఉండరు.

గంగిరెద్దులవారు ప్రధాన రహదారికి దగ్గరగా ఉన్న ప్రభుత్వం వారి బంజరు భూముల్లో గుడిసెలు వేసుకొని జీవిస్తుంటారు. వీరికి తమది అని చెప్పుకోదగిన ఆస్తి పాస్తులు ఏమీ ఉండదు. వీరి ఆస్తి అంతా ఒక్క గంగిరెద్దు మాత్రమే. ఉదయం లేవగానే గంగిరెద్దును అలంకరించి దాన్ని పట్టుకొని తమకు దగ్గరలో ఉన్న గ్రామాల్లో ఇంటింటికీ వెళ్ళి డోలు, సన్నాయిలతో వినసొంపైన సంగీతాన్ని వాయిస్తూ వినయంగా భిక్షను యాచిస్తారు. ఇలా యాచించడాన్ని వీరు "దండుకోవడం" అంటారు. దండుకోవడంలో వీరిది ప్రత్యేకమైన పద్ధతి. వినయంగా మంచి మాటలతో, అయ్యగారు, అమ్మగారు అంటూ చాలా గౌరవంగా పలుకుతూ తమకు నచ్చిన జానపద గేయాలను, కథా గేయాలను పాడుతూ వాటికి అనుగుణంగా డోలు, సన్నాయిలను వాయిస్తూ యాచన చేస్తారు. తమకు కావలసినదేదైనా అడిగి బ్రతిమలాడి తీసుకుంటారే గానీ దొంగతనం, దౌర్జన్యం మొదలైనవి చేయడం వీరి ఇంటావంటా ఉండదు. వీరు గొప్ప నిజాయితీ పరులు, ధర్మపరులు. వీరిలో ఎవరైనా పొరపాటున దొంగతనం చేసినట్లు తెలిస్తే అలాంటి వారికి ఆ ఊర్లో ఉన్న మిగిలిన గంగిరెద్దుల వారందరూ ఎక్కువ మొత్తంలో జరిమానా వేస్తారు. ఎందుకంటే అలాంటి ఒకరి కారణంగా తమ జాతి మొత్తానికి



చెడ్డపేరు వస్తుందని, తత్కారణంగా గ్రామాల్లో తమకు ఎవరూ భిక్ష వెయ్యరని, అందువల్ల తమ జీవితం పోతుందని వీరు అలా చేస్తారు.

విశాఖపట్నం జిల్లాలో గంగిరెద్దుల వారు పరవాడ మండలం లంకెలపాలెం దగ్గర, సబ్బవరం మండలం గొట్టివాడ, మల్లినాయుడుపాలెం దగ్గర, పెందుర్తి మండలం వేపగుంట దగ్గర, చోడవరం దగ్గర, నర్సీపట్నం మండలం బొడ్డుపల్లి దగ్గర ఉన్నారు. అలాగే విజయనగరం జిల్లాలో వసుతిమ్మిడి, గంట్యాడ, జామి, కొర్లాం, రుద్రపాలెం మొదలైన గ్రామాల దగ్గర ఉన్నారు. శ్రీకాకుళం జిల్లాలో చింతాడ, పిన్నవలస, కొన దానపేట, మొదలైన గ్రామాల దగ్గర ఉన్నారు. ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాల్లోనూ గంగిరెద్దులవారు ఉన్నారు. వీరు ఉన్న అన్ని ప్రాంతాల్లోనూ గంగిరెద్దులవారు ఆయా ఊర్లకు దూరంగా ప్రత్యేకంగా గంగిరెద్దులవారు మాత్రమే గుడిసెలు వేసుకొని జీవిస్తున్నారు. సాధారణంగా వీరు మిగిలిన గ్రామప్రజలతో కలిసి జీవించలేరు. వీరి ఆచారాలు, సంప్రదాయాలు కుల కట్టుబాట్లు మొదలైనవి ప్రత్యేకంగా ఉండడంచేత మొదటి నుంచి భిక్షాటనం చేస్తూ జీవించడం చేత వీరిలో ఆత్మన్యూనతాభావం ఉంటుంది. అంతే గాకుండా వీరు గొప్ప సిగ్గరులు. ఈ కారణాల చేత వీరు గ్రామాలకు దూరంగా ప్రత్యేకంగా గుడిసెలు వేసుకొని జీవిస్తున్నారు.

గంగిరెద్దులవారు దూరంగా ఉన్న ఊర్లకు కూడా గంగిరెద్దును పట్టుకొని అడుక్కోవడానికి వెళ్తారు. నాలుగు లేక ఐదు కుటుంబాల వారు కలిసి గంగిరెద్దులను పట్టుకొని కాలినడకతో వెళ్తారు. ఇలా వెళ్ళడాన్ని వీరు "సేరపోవడం" అని అంటారు. ఇలా వెళ్ళినప్పుడు వీరి ప్రయాణ సరంజామా తక్కువగానే ఉంటుంది. వంటకు రెండు లేక మూడు అల్యూమినియం గిన్నెలు, అన్నం తినడానికి రెండు అల్యూమినియం తట్టలు, గుడారం వేసుకోవడానికి ఉపయోగించే కొన్ని కర్రలు, గుడారం గుడ్డ, రెండు మూడు చాపలు మొదలైనవి మాత్రమే వీరి వెంట తీసుకొని వెళతారు. వీటినన్నిటినీ కట్టి గంగిరెద్దు మీద వేసి, చిన్నపిల్లలను కూడా గంగిరెద్దు మీద కూర్చోబెట్టి దాన్ని తాడుతో కట్టి ఆ తాడును పట్టుకొని కాలినడకతో బయలుదేరతారు. వీరికి కాలినడక కొట్టినపిండి. తెల్లవారుజామున నాలుగైదు గంటలకు బయలుదేరి మధ్యాహ్నం దాకా నడిచి భోజనం సమయంలో ఏదో ఒక ఊరి బైట తాత్కాలికంగా మజిలీచేసి ఊర్లోకి వెళ్ళి అన్నం అడుక్కొని తిని కాసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ బయలుదేరతారు. అవసరమైతే వీరు రోజుకు పది లేక పన్నెండు గంటలు నడుస్తారు. ఈ పది గంటల్లో అరవై డబ్బై కిలోమీటర్లు నడుస్తారు. వీరి వెంట వీరి స్త్రీలు కూడా కాలినడకనే బయలుదేరతారు. ఇంత ఎక్కువగా వీరు నడుస్తారు కాబట్టే గంగిరెద్దుల వారిలో

ఊబకాయం వున్నవారు అసలు ఉండరు. వీరు సన్నగా రివటలాగ చాలా ఆరోగ్యంగా ఉంటారు.

మే నెల దాటిన తరువాత జూన్ నెలలో తొలకరి జల్లులు పడగానే వీరు "సేర"కు బయలుదేరుతారు. నడిచి వెళ్ళేటప్పుడు వారిలో తమ జీవితంలో ఎదురైన అనేక ముఖ్యమైన ఘట్టాలను ముచ్చటించుకుంటూ కథలు, పొడుపుకథలు చెప్పుకుంటూ నడుస్తారు. ఇలా చేయడం వల్ల వీరికి ప్రయాణపు శ్రమ తెలియదు. దారిలో భోజన సమయంలో ఏదైనా ఊరి బయట ఆగి, ఊళ్ళోకి వెళ్ళి అన్నం అడిగి పెట్టించుకొని తింటారు. ఊరు లేకపోతే నీటి వసతి ఉన్న దగ్గర ఆగి మూడు రాళ్ళను పొయ్యిగా పెట్టి చుట్టుపక్కల దొరికే పుల్లలను ఏరి తెచ్చి తమ దగ్గర వున్న బియ్యంతో అన్నం ఉడకబెట్టి అందులోకి "పచ్చి పులుసు" తయారు చేసుకొని తింటారు. సాధారణంగా వీరు సేరకు వెళ్ళినప్పుడు దారిలో ఎదురయ్యే గ్రామాల్లో ఆగుతూ చుట్టుపక్కల గ్రామాల్లో యాచిస్తూ గంగిరెద్దులాటను ప్రదర్శిస్తూ వెళ్తారు. మజిలీ చేసినప్పుడు సాధారణంగా వీరు ఊరి బయట ఏదైనా చెట్టు కింద విడిది చేసి తమ గుడారం వేసుకుంటారు. ఈ సమయంలో తమ దగ్గర ఉన్న సామానును అక్కడ ఉన్న చెట్లకు ఉట్లు కట్టి వాటిమీద పెడతారు. లేదా చెట్టుకు వేలాడదీస్తారు. మగవాళ్ళు పొద్దునే లేచి గంగిరెద్దును అలంకరించి తాము కూడా కొద్దిపాటి వేషాన్ని వేసుకొని గంగిరెద్దుతో చుట్టుపక్కల ఉన్న ఊర్లకు వెళ్ళి యాచన చేసి సాయంత్రానికి తిరిగి వస్తారు. వచ్చేటప్పుడు గంగిరెద్దును మేపుకుంటూ వస్తారు. లేకపోతే గంగిరెద్దుకు ఆహారంగా వరిగడ్డి, చొప్ప మొదలైన వాటిని ఊర్లో ఉన్న రైతుల వద్ద నుంచి అడిగి తెచ్చుకుంటారు. లేకపోతే పచ్చిగడ్డిని కోసి తెస్తారు.

ఒక్కొక్కసారి దండుకోవడానికి వెళ్ళి మధ్యాహ్ననికే వీరు తమ విడిదికి చేరుకుంటారు. అలాంటి సమయంలో మధ్యాహ్నం నుండి వేటకు వెళతారు. వీరు వేటకోసం ప్రత్యేకంగా కుక్కలను పెంచుతారు. అంతేగాకుండా వాటికి తర్ఫీదు కూడా ఇస్తుంటారు. వీరు చుట్టుపక్కల పొలాల్లో గానీ కొండల్లో గానీ తిరిగి బకురుపిల్లలు, మానుపిల్లలు, ఉడుములు, కొంగలు, గులకంకోళ్ళు, కంజుకోళ్ళు, సిలకబాతులు, పావు రాళ్ళు, కుందేళ్ళు, అడవి పందులు మొదలైన జంతువులను, పక్షులను వేటాడి తింటారు.

మగవారు దండుకోవడానికి వెళ్ళిన తరువాత వారి స్త్రీలు ఔషద వస్తువులను తీసుకొని చుట్టుపక్కల గ్రామాల్లో అమ్మి మధ్యాహ్న సమయానికి తమ విడిదికి చేరుకుంటారు. వీరికి పాలుతాగే చిన్న పిల్లలు ఉంటే వారిని గుడ్డతో గానీ, తాము కట్టుకొన్న చీరకొంగుతో వీపున గానీ, చంకలో గానీ కట్టుకొని చుట్టుపక్కల ఊర్లలో



తిరిగి ఔషద వస్తువులను అమ్ముతారు. వీరు వీటిని అమ్మేవిధానం మంచి యాసతో మళ్లీ మళ్లీ వినాలనిపించే విధంగా తమ దగ్గర ఉన్న వస్తువుల పేర్లన్నీ చదువుతూ పాటపాడినట్లుగా మాట్లాడతారు. "అమ్మా ఇందుపిక్కలు, మోదుగ మాడలు, దిష్టిపూసలు, పచ్చిపూసలు, కర్జూరాలు, కరక్కాయలు, నులిపికాయలు, జీడిగింజలు, గారకాయలు, కొరంజివాము, కుంకుం, సూదులు" అని తమ దగ్గర ఉన్న వస్తువుల పేర్లు చెబుతూ గ్రామం అంతా తిరిగి అమ్ముతారు. వీటిలో దిష్టిపూసలను, పచ్చిపూసలను గంగిరెద్దుల వారి స్త్రీలు తయారు చేస్తారు. నల్లరేగడి మట్టితో పూసల లాగ తయారుచేసి వాటిని ఎండబెడతారు. వీటిని దిష్టిపూసలు అంటారు. గ్రామాల్లోని ప్రజలు ఈ దిష్టిపూసలను కొనుక్కొని చిన్న పిల్లల మొలకు కడతారు. పిల్లలకు దిష్టి తగిలితే ఈ దిష్టిపూసలు పగిలిపోతాయని జానపదులు నమ్ముతారు. నల్లరేగడి మట్టితో వీరి స్త్రీలు సీతమ్మ పాదాలను తయారుచేసి అమ్ముతారు. చనిపోయిన గబ్బిలం ఎముకలను శుభ్రం చేసి వాటిని ముక్కలుగా చేసి పూసలుగా గుదిగూర్చి గంగిరెద్దులవారి స్త్రీలు అమ్ముతారు. జానపదులు వీటిని కొనుక్కుంటారు. గర్భవతుల మీద పక్షులు ఎగిరితే వారి కడుపులో ఉన్న శిశువులకు పక్షిదోషం తగులుతుందని గ్రామీణుల నమ్మకం. గబ్బిలం ఎముకలతో చేసిన ఈ పచ్చిపూసలను కట్టుకుంటే గర్భంలో ఉన్న శిశువులకు పక్షిదోషం తగలదని గ్రామీణులు నమ్ముతూ గంగిరెద్దులవారి స్త్రీలనుండి వాటిని కొనుక్కొని కట్టుకుంటారు. మిగిలిన మోదుగమాడలు, కరక్కాయలు మొదలైన ఔషద వస్తువులను గంగిరెద్దుల వారు అడవులకు వెళ్ళి తీసుకొని వస్తారు. గంగిరెద్దులవారి స్త్రీలు అమ్మే ఇలాంటి వస్తువులు గ్రామాల్లో ఉన్న అంగళ్ళలో ఉండవు. ఒకవేళ ఉన్నా వాటి ధర ఎక్కువగా ఉంటుంది. గ్రామాల్లోని స్త్రీలు పైవస్తువులను బియ్యం, వడ్లు, జొన్నలు మొదలైన ధాన్యం ఇచ్చిగాని, లేదా కొంత డబ్బుఇచ్చిగాని కొనుక్కుంటారు. గంగిరెద్దులవారి స్త్రీలు వీటిని అమ్మడంతోపాటు భిక్షాటన కూడా చేస్తారు. వీరి స్త్రీలలో కొంతమంది పైవస్తువులను సంతలో పెట్టి అమ్ముతారు.

ఈనాడు పైన చెప్పిన ఔషద వస్తువులను గ్రామీణులు కూడా వాడటం లేదు. అందువల్ల గంగిరెద్దులవారి స్త్రీలు పై వస్తువులను కాకుండా పౌడరు డబ్బాలు, తిలకం సీసాలు, సబ్బుపెట్టెలు, చిన్న అద్దాలు, దువ్వెనలు మొదలైన వాటిని పట్నాల్లో కొనుక్కొని గ్రామాల్లో అమ్ముతున్నారు.

గంగిరెద్దులవారి పురుషులు, స్త్రీలు ఇలా బయటికి వెళ్లినప్పుడు విడిది దగ్గర పెద్దపిల్లలు తమ వస్తువులకు కాపలాగా ఉంటారు. వీరు చుట్టుపక్కల ప్రాంతాల్లో ఉన్న ఎండు పుల్లలను ఏరితెచ్చి కుప్పపెడతారు. ఈ పుల్లలను స్త్రీలు వంట చెరకుగా

ఉపయోగిస్తారు. చుట్టుపక్కల గ్రామాల్లో అడుక్కోవడం అయిపోయిన తరువాత వారు అక్కడ నుంచి బయలుదేరి మరికొంత దూరం నడిచివెళ్ళి ఇంకొక ఊరి దగ్గర మజిలీ చేసి ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో యాచన చేస్తారు. వీరి స్త్రీలు తమ దగ్గర ఉన్న ఔషద వస్తువులను అమ్ముతూ వుంటారు. ఈ విధంగా గంగిరెద్దులవారు సేరకు వెళ్ళినప్పుడు మజిలీలు చేస్తూ ఇంచుమించుగా వంద కిలోమీటర్ల వరకూ వెళతారు. తిరిగి మళ్ళీ అక్కడ నుంచి బయలుదేరి దారిలో మళ్ళీ మజిలీలు చేస్తూ, యాచిస్తూ, గంగిరెద్దు లాటను ప్రదర్శిస్తూ తమ స్వస్థలానికి చేరుకుంటారు. ఇలా సేరకు ఒక్కసారి వెళ్ళి రావడానికి వీరికి కనీసం నాలుగు మాసాల కాలం పడుతుంది. అంటే వీరు ఒకసారి సేరకు బయలుదేరారంటే మళ్ళీ నాలుగు మాసాల దాకా తమ స్వస్థలానికిరారు. ప్రస్తుతం వీరు సేరకు వెళ్ళడాన్ని "క్యాంప్"కు వెళ్ళడం అంటున్నారు. జూన్ నెలలో సేరకు బయలుదేరిన వీరు అక్టోబరు నెలలో నాగులచవితి పండుగ వారం, పదిరోజులు ఉందనగా తమ స్వస్థలానికి చేరు కుంటారు.

మళ్ళీ జనవరిలో సంక్రాంతికి పదిరోజులు ముందు సేరకు బయలుదేరి జనవరి, ఫిబ్రవరి, మార్చి మూడు నెలలూ పూర్తిగా సేరలో గడిపేసి, ఏప్రిల్ నెలలో తిరిగివస్తారు. అంటే సంవత్సరంలో వీరు రెండు సార్లు సేరకు వెళతారు. మొదటి సారి జూన్, జూలై, ఆగష్టు, సెప్టెంబర్ నెలల్లో పూర్తిగా సేరలోనే గడుపుతారు. అక్టోబర్ నెలలో స్వస్థలానికి వచ్చి అక్టోబర్, నవంబర్, డిసెంబర్ నెలలు అంటే మూడు నెలలు స్వస్థలంలో గడుపుతారు. మళ్ళీ జనవరి మొదటి వారంలో బయలుదేరి జనవరి, ఫిబ్రవరి, మార్చి సేరలో గడిపి ఏప్రిల్ నెలలో తిరిగివస్తారు. ఏప్రిల్, మే రెండు నెలలూ స్వస్థలంలో ఉంటారు. అంటే సంవత్సరంలో ఏడు నెలలకు పైగా వీరు సేరలోనే గడుపుతారు. స్వస్థలంలో వీరు ఉండేది కేవలం ఐదు నెలలు, అంతకు లోపు కాలం మాత్రమే. సంవత్సరంలో వీరు సేరలో ఉండడం వలన పండుగలు పెళ్ళి మొదలైనవన్నీ వీరు సేరలోనే చేసుకుంటారు. ఈ కాలంలో తమలో ఎవరైనా చనిపోతే అక్కడికక్కడే పూడ్చి పెడతారు. ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగలు వీరు చేసుకోరు. ఎందుకంటే వీరు ఆ రోజుల్లోనే సేరలో ఉండి ఊళ్ళు తిరుగుతూ దండుకుంటూ ఉంటారు.

**ఆహారం :** గంగిరెద్దులవారు సాధారణంగా యాచనకు వెళ్ళినప్పుడు ఏ ధాన్యాన్ని అడుక్కొని తెచ్చుకుంటారో ఆ ధాన్యాన్ని ఆహారంగా తీసుకుంటారు. కళింగాంధ్ర ప్రాంతంలోని గంగిరెద్దులవారు గతంలో సోళ్ళు (రాగులు), గంట్లు (సజ్జలు), కొర్ర, జొన్న మొదలైన ధాన్యంతో అన్నం, సంగటి, అంబలి తయారుచేసుకొని తినేవారు. ప్రస్తుతం వీరు వరి అన్నం తింటున్నారు. అన్నంలోకి వీరు పచ్చిపులుసును, చేతి



పచ్చడిని వాడతారు.

**పచ్చిపులుసు :** పచ్చిమిరపకాయలు, చింతపండు, ఉప్పు, ఉల్లిపాయలను కలిపి, దాంట్లో నీళ్ళు పోసి చేతితో గట్టిగా నలిపి పులుసు చేస్తారు. దీన్నే వీరు పచ్చిపులుసు అంటారు. ఈ పచ్చి పులుసు తయారుచేయడానికి పొయ్యి అక్కరలేదు. కొంతమంది వంకాయను కాల్చి పచ్చిపులుసులో కలుపుకుంటారు. పచ్చిపులుసు గంగిరెద్దులవారు సేరలో ఉన్నప్పుడు ఎక్కువగా ఉపయోగిస్తారు.

**చేతిపచ్చడి :** ఎండు మిరపకాయలు, ఉల్లిపాయ, అల్లంముక్క, కొత్తిమీర, చింతపండు కలిపి మట్టి చిప్పలోగాని, రాతిచిప్పలోగాని వేసి కర్రతో నూరి పచ్చడి చేస్తారు. దీన్నే వీరు చేతి పచ్చడి లేదా రాచ్చిప్ప పచ్చడి అంటారు.

**మంసాహారం :** గంగిరెద్దులవారు మాంసాహారులు. వీరికి మాంసం చాలా ఇష్టం. ఐతే మాంసం కొని తినేటంత ఆర్థిక స్థోమత వీరికి ఉండదు. అందువల్ల వీరు ఖాళీ సమయాల్లో తాము వుంటున్న చుట్టుపక్కల ప్రాంతాల్లో వేటకు వెళతారు. వీరు నీటికాకులు, చెముడు కాకులు, (కాకిలాగా నల్లగా ఉండి ఆకారంలో బాతును పోలి ఉంటుంది), చిలకబాతులు, కొంగలు, పావురాలు, గులకంకోళ్ళు, కంజుపిట్టలు మొదలైన పక్షులను వేటాడతారు. ఈ పక్షులన్నీ కొండల్లోను, అడవుల్లోను, పొలాల దగ్గర ఉంటాయి. పై పక్షులే కాకుండా నత్తకొట్టు (కోడికన్నా పెద్దగా ఉండే పక్షి నీరు ఉన్న దగ్గర ఉంటుంది). బండిబులుగు (ఇది గుడ్లగూబ లాగా ఉండి కోడి పెట్టంత పరిమాణంలో ఉంటుంది. ఇది కొండల్లో బండల దగ్గర, గుహల్లోను ఉంటుంది. ఇది రాత్రిపూట మాత్రమే తిరుగుతుంది). మొదలైన పక్షులను కూడా తింటారు. పై పక్షులన్నీ కొండల్లోనూ, అడవుల్లోను ఉంటాయి. అందువల్ల అవి మంచి ఆరోగ్యంగాను, రుచికరంగాను ఉంటాయి. పై పక్షులనే గాకుండా వీరు బకురుపిల్లలు, మానుపిల్లులు, ఉడుములు, ముళ్ళపంది మొదలైన జంతువులను తాము పెంచుకున్న కుక్కల సహాయంతో వేటాడతారు. కుక్కలు ఈ జంతువులున్న పొదలను వాసన చూసి పసిగట్టి జంతువులున్న ప్రాంతంలో గీరడం, పొదచుట్టూ తిరగడం మొదలైన తమ చేష్టలు ద్వారా అక్కడ జంతువు ఉన్నట్లుగా గంగిరెద్ల వారికి తెలియజేస్తాయి. అది గమనించి గంగిరెద్లవారు కర్రలతో ఆయా జంతువులను కొట్టి చంపుతారు. ఉడుములు ఒక్కొక్కసారి పుట్టల్లో ఉంటాయి. ఉడుము ఉన్న పుట్టను కుక్కలు వాసన చూసి పసిగట్టి కాళ్ళుతో గీరతాయి. వారు అది గమనించి పుట్టను తవ్వి గానీ పుట్టలో చెయ్యిపెట్టి గానీ దాన్ని బయటకు తీస్తారు. ఒకవేళ ఉడుము పుట్టలో నుంచి బయటకు వచ్చి పరిగెత్తితే కుక్కలు దాని వెంటపడి నోటితో పట్టుకోవడం గానీ, చంపడం గానీ చేస్తాయి. గంగిరెద్దులవారు కూడా కుక్కల వెంట పరిగెత్తి ఉడుమును

కర్రలతో కొట్టి చంపుతారు. బకురుపిల్లులు పొలాల్లో చెరుకు తోటల్లో ఉంటాయి. ఇది పిల్లి కంటే పెద్దదిగా ఉండి చిన్నపులి లాగా ఉంటుంది. దీని పంజాగూడా పులి లాగా ఉంటుంది. మానుపిల్లి అడవుల్లో చెట్ల మీద ఉంటుంది. ముళ్ళపంది ప్రమాదకరమైంది శత్రువుల వల్ల తనకు అపాయం ఉందనుకున్నప్పుడు ఇది తన శరీరం మీద ఉన్న కొన్ని ముళ్ళను విసర్జిస్తుంది. ఇవి చాలా వేగంగా వచ్చి గుచ్చుకుంటాయి. అవి గుచ్చుకుంటే కత్తితో పొడిచినట్లుగా శరీరంలోకి దిగబడిపోతాయి. దీనివల్ల ఒక్కొక్కసారి కుక్కలు, మనుషులు కూడా చనిపోవడం జరుగుతుంది. జంతువులను వేటాడే సమయంలో వీరు వాటి వెంట పరిగెత్త వలసి ఉంటుంది. ఇలాంటి సమయంలో వీరు ఒంటరిగా కాకుండా ముగ్గురు నలుగురు కలిసి వెళ్ళి జంతువులను వేటాడతారు. పక్షులను వేటాడ్డానికి వీరు వింటిలుబద్ద, కేటిల్‌బారు, పంగలకర్ర మొదలైన సాధనాలను ఉపయోగిస్తారు. పై పక్షులను జంతువులను వేటాడి తెచ్చుకొని తింటారు. ఎట్టి పరిస్థితిల్లోనూ వాటిని అమ్మరు.

**పెళ్ళిళ్ళు** : గంగిరెద్దులవారిలో ఓలి, వరకట్నం మొదలైన ఆచారాలు లేవు. గతంలో వీరి పెళ్ళిళ్ళను కులపెద్దలు చేసేవారు, అంటే కులపెద్దలు పురోహితులుగా ఉండి వీరి పెళ్ళిళ్ళను చేసేవారు. గతంలో ఐదురోజుల పెళ్ళిళ్ళు జరిగేవి. ఐదురోజుల పాటు వచ్చిన బంధువులకు, మిగిలిన గంగిరెద్దులవారికి భోజనాలు పెట్టేవారు. ఈనాడు ఇలాంటి ఆచారాలు లేవు. ప్రస్తుతం గంగిరెద్దులవారు బ్రాహ్మణుల దగ్గరకు వెళ్ళి వధూ వరుల పేర్లను బట్టి ముహూర్తాలు నిర్ణయించుకొని బ్రాహ్మణులను పురోహితులుగా పెట్టుకొని ఒకరోజు వివాహం చేసుకుంటున్నారు. పెళ్ళిరోజు తీపి వస్తువులతో శాకాహారం భోజనాలు పెడతారు. మరుసటి రోజు మాంసాహారంతో భోజనాలు పెడతారు. భోజనాల ఖర్చును పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు వాళ్ళు సగంసగం భరిస్తారు. ప్రస్తుతం వధువు తరుపువారు వరుని ఇంటిలోకి కావలిసిన స్టీలు సామాను, మంచాలు మొదలైన వాటిని కొని ఇస్తున్నారు.

**మరణం** : గంగిరెద్దులవారు చనిపోయిన వారిని పూడ్చిపెడతారు. మూడవరోజు చిన్నదినం, తొమ్మిదవరోజున పెద్దదినం చేస్తారు. పెద్దదినం రోజున చనిపోయిన వారికి బట్టలు పెట్టి బంధువులకు మాంసాహారంతో భోజనాలు పెడతారు. పెళ్ళికాని మగపిల్లలు చనిపోతే వారిని వీరులుగా భావించి సంవత్సరానికి ఒకసారి బట్టలు పెట్టి బంధువులకు భోజనాలు పెడతారు.

**మతం** : గంగిరెద్దులవారందరూ చాలా వరకు హిందూమతానికి చెందినవారే. విశాఖ పట్నానికి దగ్గరలో ఉన్న సబ్బవరంలో కొంతమంది గంగిరెద్దులవారు క్రైస్తవ మతాన్ని తీసుకున్నారు. మిగిలిన గంగిరెద్దులవారు వీరిని అంటే క్రైస్తవ మతం తీసుకున్న



గంగిరెద్దులవారిని తమ కులం నుంచి వెలి వేశారు. గంగిరెద్దులవారు హిందువులయి నప్పటికీ మిగిలిన హిందువుల లాగా శివాలయం, రామాలయం మొదలైన ఆలయాలకు వెళ్ళడం కొబ్బరికాయలు కొట్టడం మొదలైనవి చేయరు. వీరు ప్రధానంగా స్త్రీ దేవతలను పూజిస్తారు. ఉత్తరాంధ్ర జిల్లాల్లోని గంగిరెద్దులవారు నల్లమారెమ్మ, పైడితల్లమ్మ అనే దేవతలను పూజిస్తారు. తమ గ్రామం దగ్గర ఈ దేవతలకు చిన్న గుడులు కూడా కట్టుకున్నారు. సంవత్సరానికి ఒకసారి ఈ దేవతలకు పండుగ చేస్తారు. గంగిరెద్దుల వారందరూ కలిసి ఈ పండుగ రోజున మేకపోతును బలి ఇచ్చి దాని మాంసాన్ని అందరూ పంచుకుంటారు. ఇది కాకుండా ఎవరికివారు ఈ దేవతలకు కోళ్ళను బలి ఇస్తారు. ఈ ఉత్సవం రోజున అమ్మోరు పూనడం, తనకు కావలసిన వాటిని అడగడం జరుగుతుంది.

గంగిరెద్దులవారు ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగలను చేయరు. ఆ పండుగల సమయంలో వీరు "సేర"లో అంటే సంచార జీవనంలో ఉంటారు. వీరు నాగులచవితి పండుగను చేసుకుంటారు. నాగులచవితికి పదిరోజుల ముందు వీరు సేర నుంచి తమ గ్రామానికి తిరిగి వస్తారు. అందువల్ల వీరికి నాగుల చవితి ముఖ్య మైన పండగ. మిగిలిన పండుగలన్నీ వీరు సేరలో ఉన్నప్పుడు వస్తాయి. ఆ పండుగలు సమయంలో వీరు ఊరూరు తిరిగి యాచన చేస్తారు.

గంగిరెద్దులవారు తిరుపతి, అన్నవరం, సింహాచలం మొదలైన దేవుళ్ళకు మొక్కు కోవడం మొక్కుబళ్ళు తీర్చడం మొదలైనవి చేస్తారు.

**కులపంచాయితీలు** : గంగిరెద్దులవారిలో కులపంచాయితీ కట్టుబాటుగా ఉంది. వీరు తమలో వచ్చే చిన్నా, పెద్దా సమస్యలను కులపెద్దల వద్ద తీర్చుకుంటారు. వీరిలో "ముడి ఇవ్వడం" అనే ఆచారం ఉంది. అంటే వీరిలో ఏదైనా తగాదా వచ్చినప్పుడు తనకు అన్యాయం జరిగిందను కున్న వ్యక్తి కులపెద్దల దగ్గరకు వెళ్ళి ఒక చిన్న పుల్లను కులపెద్దల చేతిలో పెట్టి ఫలానా వాడివల్ల తనకు అన్యాయం జరిగిందని చెప్పి వెయ్యి రూపాయలు గానీ పదిహేను వందలు గానీ లేదా తగాదా తీవ్రతను బట్టి కొన్ని వేల రూపాయలను గానీ కులపెద్దల చేతిలో పెట్టి "ముడి" అని చెబుతాడు. కులపెద్ద ఆ డబ్బు తీసుకొని ప్రతివాదిని పిలిపించి అతను మీద వచ్చిన ఆరోపణ గురించి చెప్పి ఫిర్యాదిదారుడు ఎంత డబ్బు "ముడి"గా ఇచ్చాడో అంత డబ్బు ఇవ్వాలని చెబుతాడు. ప్రతివాది తప్పనిసరిగా ఆ డబ్బును తెచ్చి ఇవ్వాలి. ప్రతివాది ఆ డబ్బును తెచ్చి ఇచ్చిన తరువాత న్యాయవిచారణకు కులపెద్దలు ఒక తేదీని నిర్ణయిస్తారు. ఆ రోజున వాది, ప్రతివాదితోబాటు ఆ ఊర్లో ఉన్న గంగిరెద్దుల వారందరూ పంచాయితీకి వస్తారు. కులపెద్దలు అందరి సమక్షంలో వాది ప్రతివాదులను, సాక్షులను విచారించి న్యాయ

నిర్ణయం చేస్తారు. నిర్దోషిగా తేలిన వ్యక్తి ముడిగా ఇచ్చిన డబ్బును తిరిగి అతనికి ఇచ్చి వేస్తారు. దోషిగా తేలిన వ్యక్తి డబ్బును కులపెద్దలు తమ వద్ద ఉంచుకొని ఆ డబ్బును మద్యమాంసాలకు వినియోగిస్తారు. తమ ఊరి కులపెద్దల న్యాయ నిర్ణయం, వాది ప్రతివాదుల్లో ఎవరికైనా నచ్చకపోతే "చెట్టువాయిదా" నాడు జిల్లా కులపెద్దల సమక్షంలో న్యాయ నిర్ణయం చేసుకుంటారు. చెట్టువాయిదా అనేది ఆరు నెలకొకసారి జరుగుతుంది. విశాఖపట్నం జిల్లాలో తుమ్మపాల, పెందుర్తి, గోవాడ దగ్గర ఉన్న వెంకన్నపాలెం మొదలైన చోట్ల ఇది జరుగుతుంది. ఈ చెట్టు పంచాయితీ పైన చెప్పిన ఊర్ల దగ్గర తోటల్లో చెట్ల కింద జరుగుతుంది. అందుకనే దీనికి "చెట్టు పంచాయితీ" లేదా "చెట్టువాయిదా" అంటారు. విశాఖపట్నం జిల్లాలోని గంగిరెద్దులవారిలో పరిష్కారం కాని తగాదాలన్నీ ఈ చెట్టు పంచాయితీల్లో పరిష్కరింపబడతాయి. ఈ పంచాయితీలకు జిల్లాలోని గంగి రెద్దుల వారందరూ ఒక్కొక్క కుటుంబం నుంచి కనీసం ఒక్కొక్కరు హాజరవుతారు. ఎవరైనా రాకపోతే వారికి జరిమానా వేస్తారు. ఈ చెట్టు వాయిదా దగ్గర చేసిన న్యాయ నిర్ణయం తుది తీర్పుగా గంగిరెద్దులవారు భావిస్తారు.

**కట్టుబాటు** : గంగిరెద్దుల వారిలో కట్టుబాటు ఎక్కువగా ఉంటుంది. వీరు అన్ని పనులూ సామూహికంగా చేస్తారు. తమలో ఎవరికైనా చిన్న సమస్య వచ్చినా లేదా తమ వారందరికీ సంబంధించిన విషయమైనా అందరూ తప్పనిసరిగా పాల్గొంటారు. ఆ రోజున వీరు ఎక్కడకీ వెళ్ళకుండా ఆ సమస్యకు సంబంధించిన పనిలో పాల్గొంటారు. ఉదాహరణకు తమ ఊర్లో జరిగే కులపంచాయితీకి అందరూ తప్పనిసరిగా పాల్గొంటారు. పాల్గొనని వారికి జరిమానా విధిస్తారు. అలాగే తమ కులదేవతకు గుడికట్టడం మొదలైన పనుల్లో అందరూ తప్పనిసరిగా పాల్గొంటారు. చివరకు తమ కాలనీలో వేసిన బోరింగు మరమత్తు చేయవలసి వస్తే మరమత్తు చేసేవాడు వచ్చేరోజున గంగిరెద్దులవారందరూ తమ పనులు మానుకొని బోరింగు దగ్గర సమావేశమవుతారు. ఇలాంటి కార్యక్రమాల్లో గంగిరెద్దులవారు చేసేది ఏమీ ఉండదు. అయినప్పటికీ ఆ ఊర్లో ఉన్న గంగిరెద్దుల వారందరూ తప్పనిసరిగా అక్కడ సమావేశమౌతారు. ఈ విధమైన కట్టుబాటు వీళ్ళలో ఎక్కువగా ఉంది.

**పెంపుడు జంతువులు** : గంగిరెద్దులవారు గంగిరెద్దులతోపాటు మరికొన్ని జంతువులు కూడా పెంచుతారు. వీరు కుక్కలను పెంచి వాటికి వేటాడడంలో మంచి తర్ఫీదును ఇస్తారు. కొంతమంది గంగిరెద్దులవారు ఒకటి రెండు మేకలను పెంచుతారు. అలాగే వీరు కోళ్ళను కూడా పెంచుతారు.

**చేతివృత్తులు** : గంగిరెద్దుల వారు ఖాళీ సమయంలో కొన్ని చేతివృత్తులు చేస్తారు. వీరు



చాపలు, బుట్టలు, అన్నం వార్చే సిబ్బీలు, బట్టలు పెట్టుకోవడానికి తాటాకులతో బుంగలు మొదలైనవి చేస్తారు. ఇవన్నీ సాధారణంగా పురుషులే చేస్తారు. అంతే గాకుండా వీరు తాళ్ళను చక్కగా పేనుతారు. పూర్వం పాత నైలాన్ గుడ్డలతో తాళ్ళు పేనేవారు. ప్రస్తుతం ప్లాస్టిక్ సంచులలోని చిన్నచిన్న పోగులను తీసి వాటితో చిన్న, పెద్ద తాళ్ళను పేనుతారు. ఈ తాళ్ళు గంగిరెద్దు, మేక మొదలైన వాటిని కట్టడానికి బట్టలు మొదలైనవి ఆరేసు కోవడానికి ఉపయోగిస్తారు. వీరు చేసే ఇలాంటి వస్తువులను అమ్మరు. తాము ఉపయోగించుకోవడానికి ఇలాంటి వాటిని తయారు చేసుకుంటారు.

**భాష** : గంగిరెద్దులవారు తెలుగు మాతృభాషగా కలిగినవారు. అయినప్పటికీ, వీరిలో వీరు మాట్లాడుకొనేటప్పుడు కొన్ని సంకేత పదాలను వేరే అర్థంలో ఉపయోగించుకుంటారు. వీరు ఉపయోగించే సంకేత పదాలను, వాటి అర్థాలను కింద ఇస్తున్నాను.

| | | |
|---|---|---|
| వర | - | నాలుగు రూపాయలు |
| మాడ | - | రెండు రూపాయలు |
| టంకం | - | పదహారు |
| కట్ట | - | వంద |
| అరకట్ట | - | యాభై |
| ఒడిశం | - | ఎద్దు |
| కైక | - | కుక్క |
| రాసిగాడు | - | పంది |
| సిమ్మాద్రప్పన్న | - | గంగిరెద్దు |
| కాసికం | - | దయ్యం |
| కిచ్చిగాడు | - | ముంగీస |
| ఒలింగాడు | - | ఉడుము |
| బండారు | - | అన్నం |
| పులామద్దు | - | పులుసు |
| అసుకట్టు | - | మాంసంకూర |
| తొడుపం | - | గంజి |
| కెందలు | - | బట్టలు |
| నైనకట్లు | - | కల్లు |
| శివదానం | - | సారా |
| కవట | - | కల్లు |

**పేర్లు :** గంగిరెద్దులవారి పేర్లు సాధారణంగా వారి కులదేవతలకు సంబంధించినవిగా ఉంటాయి. వీరిలో పురుషుల పేర్ల చివర "అయ్య" అనే పదం స్త్రీల పేర్ల చివర "అమ్మ" అనే పదం చేరుతూ ఉంటుంది. ఉదాహరణకు మరిడయ్య, నల్లయ్య, ఓబయ్య, నడిపయ్య, గొల్లయ్య, మల్లయ్య, పుత్రయ్య, పిచ్చయ్య, గీరయ్య, బోడయ్య, పనసయ్య, చంటయ్య, జట్లయ్య మొదలైనవి. ఇవేకాకుండా తగవరి, చిన్నోడు, పెద్దోడు, రాముడు, సొన్నాయి, అప్పన్న మొదలైన పేర్లు కూడా ఉన్నాయి. గంగిరెద్దులవారు ప్రస్తుతం తమ అబ్బాయిలకు శేఖర్, జోగారావు, వెంకటకుమార్, శ్రీనివాసరావు, రాజబాబు మొదలైన ఆధునికమైన పేర్లను పెడుతున్నారు.

వీరి స్త్రీల పేర్లు మరిడమ్మ, చిన్నమ్మలు, పెద్దమ్మలు, సత్తెమ్మ, మల్లమ్మ, అచ్చమ్మ, నర్సమ్మ, పైడమ్మ, సింహాచలం మొదలైన విధంగా ఉంటాయి. ఈ మధ్య కాలంలో తమ అమ్మాయిలకు వీరు కాంతం, లక్ష్మి, జ్యోతి మొదలైన ఆధునికమైన పేర్లను పెడుతున్నారు.

## ఒగ్గుకథాకారులు - జీవన విధానం :

ఒగ్గుకథ తెలంగాణ ప్రాంతంలో బాగా ప్రచారంలో ఉన్న జానపదకళ. దీన్ని ఆ ప్రాంతంలోని గొల్ల, కురుమ కులాలవారు ప్రదర్శిస్తూ ఉన్నారు. ప్రధానంగా కురుమలు ఒగ్గుకథను ప్రాచీన కాలం నుంచి చెబుతున్నారు. కురుమ కులంలో పత్తికంకణం వారు, ఉన్ని కంకణం వారు అని రెండు తెగలున్నాయి. పూర్వం పత్తి కంకణం వాళ్ళు మాత్రమే ఒగ్గువాళ్ళు అయ్యేవాళ్ళు. ఐతే పత్తి కంకణం వాళ్ళందరూ ఒగ్గువాళ్ళు కాదు. మల్లన్న కథను చెప్పడం నేర్చుకొని తమ కులపెద్ద అనుమతితో శ్రీశైలం, కొమరవెల్లి, ఐలేని, వేములవాడ మొదలైన వాటిలో ఏదో ఒక శైవక్షేత్రానికి వెళ్ళి అక్కడ దేవుని దగ్గర ఉన్న విభూతిని నుదుట ధరించి శివనామం జపించి మల్లన్నను పూజించి, మల్లన్న కథను చెప్పడానికి దీక్షను తీసుకున్నవారే మల్లన్న కథను చెప్పేవారు. దీన్నే "ఒగ్గుదీక్ష" అంటారు. ఒగ్గుదీక్ష స్వీకరించిన వారు ఎప్పుడు బడితే అప్పుడు మల్లన్న కథను చెప్పేవారు కాదు. మల్లన్న పండుగ సందర్భంలోను, కురుమల వివాహ సందర్భంలోను, కుటుంబ సభ్యులు చనిపోయినప్పుడు, మొక్కుబడి ఉన్నవారు మొక్కుబడి తీర్చడం కోసం మొదలైన కొన్ని సందర్భాల్లో మాత్రమే ఒగ్గుకథను చెప్పేవారు. ఐతే ఆ తరువాత కాలంలో ఈ నియమాలు సడలిపోయి పత్తి కంకణం వాళ్ళే గాకుండా, ఉన్ని కంకణం వాళ్ళు కూడా ఒగ్గు దీక్షను స్వీకరించి ఒగ్గుకథగా మల్లన్న, బీరప్ప కథలను చెప్పడం ప్రారంభించారు. ఆ తరువాత ఒగ్గుదీక్షను స్వీకరించిన



కురుమలు మల్లన్న బీరప్ప కథలనే గాకుండా ఎల్లమ్మ కథ, నల్ల పోచమ్మ కథ, మైరావణ కథ మొదలైన కథలను చెప్పడం ప్రారంభించారు. ఆ తరువాత కాలాల్లో కురుమలు, గొల్లలు కాని వారు కూడా ఒగ్గుకథగా అనేక కథలను చెప్పడం ప్రారంభించారు. దీనికి కారణం ప్రజల్లో ఒగ్గుకథ మీద గల ప్రీతి, ప్రచారం, అంతే గాకుండా ఒగ్గుకథను చెప్పించే వారు డబ్బులు గూడా బాగానే ఇచ్చేవారు. గతంలో ఒగ్గుదీక్షను స్వీకరించిన కురుమలు ప్రత్యేకించి కొన్ని సందర్భాల్లో మాత్రమే ఒగ్గుకథను చెప్పేవారు. అలాంటి వారికి ఒగ్గుకథను చెప్పడం వృత్తి కాదు. ప్రవృత్తి మాత్రమే ఒగ్గుకథకులు ప్రధానంగా కురుమ కులస్థులు కాబట్టి కురుమల కులవృత్తి అయిన గొర్రెల, మేకల మందను కాయడం, గొర్రె ఉన్నితో కంబల్లు నేయడం వృత్తినే వీరు కూడా చేసేవారు. కొందరు ఒగ్గువారు వ్యవసాయం కూడా చేసేవారు. తరువాత కాలంలో ఒగ్గుకథకు ప్రచారం పెరిగి ప్రజల్లో దాని మీద ప్రీతి పెరగడం వల్ల ఎప్పుడుబడితే అప్పుడు కథను చెప్పడం ప్రారంభించి, కథను చెప్పించే వారి దగ్గర నుంచి కొంత డబ్బును, ధాన్యాన్ని తీసుకోవడం ప్రారంభించారు. ఆ తరువాత ఒగ్గు కథను తరచుగా ప్రజలు చెప్పించడం వల్ల ఒగ్గుకథకులకు మంచి ఆదాయం రావడం ప్రారంభమైంది. ఈ దశలో వీరు ఒగ్గుకథను చెప్పడమే వృత్తిగా చేసుకున్నారు. దీనివల్ల ఒగ్గుకథకులకు మంచి ఆదాయం లభించడమే కాకుండా సంఘంలో గౌరవంకూడా పెరిగింది. దీనితో గొల్ల కురుమ కులాల వారు మాత్రమే గాకుండా మిగిలిన కులాల వారు కూడా ఒగ్గుకథ వైపు దృష్టిని మళ్లించి దాన్ని చెప్పడం నేర్చుకొని అనేక రకాల కథలను చెప్పడం ప్రారంభించి డబ్బును సంపాదించడం మొదలు పెట్టారు. ఈనాడు ఒగ్గుకథను ఆసక్తి ఉన్న అన్ని కులాలవారు చెబుతున్నారు. డబ్బులు కూడా బాగానే సంపాదిస్తున్నారు. ప్రభుత్వంవారు తమ కార్యక్రమాలను అంటే జన్మభూమి, కుటుంబ నియంత్రణ, అక్షరజ్యోతి మొదలైన వాటిని ఒగ్గుకథకుల ద్వారా ఒగ్గుకథా బాణీలో ప్రచారం చేయించి ఒగ్గు కథకులకు బాగానే పారితోషికాన్ని ఇస్తున్నారు. అలాగే అనేక రాజకీయ పక్షాలవారు ఎన్నికల సందర్భంలో తమ పార్టీ ప్రచారానికి ఒగ్గుకథను మాధ్యమంగా ఎంచుకున్నారు. వీరు కూడా ఒగ్గు కథకులకు బాగానే డబ్బు ఇస్తున్నారు. ఆకాశవాణి, దూరదర్శన్ లాంటి ప్రసార సాధనాలు కూడా ఒగ్గుకథలు చెప్పించి ఒగ్గుకథకులకు మంచి పారితోషికాన్ని ఇస్తున్నాయి. ఒగ్గుకథకులకు ఈ విధంగా రాబడి పెరగడం వల్ల తెలంగాణ ప్రాంతంలో సుమారు వందకు పైగా ఒగ్గుకథా బృందాలు ఉన్నట్లుగా తెలుస్తుంది. ఒక్కొక్క బృందంలో ఆరుగురు సభ్యులు ఉంటారు. ఒగ్గుకథను చెప్పడం వల్ల వచ్చిన డబ్బును లేదా ధాన్యాన్ని బృందం సభ్యులందరూ

సమానంగా పంచుకుంటారు.

ఒగ్గుకథకులు మిగిలిన జానపద కళాకారుల లాగ గాయక బిక్షకులు కారు. అంతేగాకుండా సంచార జీవనులు కూడా కాదు. ఒగ్గుకథను చెబుతున్న గొల్ల కురుమ కులాలవారు గానీ మిగిలిన కులాలవారు గానీ పూర్తిగా స్థిర జీవనం ఏర్పాటు చేసుకున్న వారే. అంతేగాకుండా వీరందరూ హిందువులే. మిగిలిన హిందువులు ఎలాంటి ఆచారాలను, సంప్రదాయాలను, పండుగ పబ్బాలను, పెళ్ళి పేరంటాలను చేసుకుంటారో వాటినే ఒగ్గు కథాకారులుకూడా ఆచరిస్తున్నారు. అందువల్ల ఒగ్గుకథాకారుల జీవన విధానంలో ప్రత్యేకించి వారిదే అని చెప్పదగినది ఏదీ లేదు.

## తప్పెటగుళ్ళ కళాకారులు - జీవన విధానం :

తప్పెటగుళ్ళ కళను ఉత్తరాంధ్ర జిల్లాలోను, ఉభయ గోదావరి జిల్లాల్లోనూ యాదవులు ప్రదర్శిస్తూ ఉన్నారు. ఈ కళా ప్రదర్శన వీరి వృత్తికాదు. ప్రవృతి మాత్రమే. ఈ కలాకారులందరూ చాల వరకు నిరక్షరాస్యులు. అంతేకాదు రెక్కాడితేగాని డొక్కాడని నిరుపేదలు. ఐనప్పటికీ తరతరాలుగా తమ యాదవ కులస్థులు ప్రదర్శిస్తున్న తప్పెట గుళ్ళ కళ మీద ఎనలేని ఆసక్తి, అభిమానాలతో గురువును ఏర్పాటు చేసుకొని ప్రదర్శనను అభ్యసించి ఈ కళను ప్రదర్శిస్తూ ఉన్నారు. ఈ కళాప్రదర్శన వల్ల వీరికి ఆర్థికంగా లభించేది పెద్దగా ఏమీ ఉండదు. కూలికి వెళ్ళితే ఎంత గిట్టుబాటు అవుతుందో ఈ కళా ప్రదర్శనకు వెళ్ళినా అంతే గిట్టుబాటు అవుతుంది. అయినప్పటికీ ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చి ఈ కళను అభ్యసించి ప్రదర్శిస్తూ ఉన్నారు.

విశాఖపట్నంలోని శివాజిపాలెంలో ఉన్న రాజీవ్‌నగర్‌లో "శ్రీ యశోదా కృష్ణా తప్పెటగుళ్ళ కళాబృందం" ఒకటి ఉంది. దీనికి నాయకుడు పడగల త్రినాథరావు గారు. ఈ బృందంలో ముప్ఫైమంది వరకు సభ్యులున్నారు. ఈ సభ్యుల జీవన విధానాన్ని తెలుసుకుంటే తప్పెటగుళ్ళ కళాకారుల జీవన విధానాన్ని చాల వరకు గ్రహించినట్లే. ఈ సభ్యుల్లో త్రినాథరావు ఇంకా ఇద్దరు ముగ్గురు సభ్యులు మాత్రమే చిన్నప్పుడు రెండు మూడు తరగతుల వరకు చదువుకున్నారు. మిగిలిన వారందరూ నిరక్షరాస్యులు. వీరిలో కొందరు ఆటో నడుపుకుంటున్నారు. కొందరు చిన్నబండిలో ఉప్పుపోసుకొని ఊర్లో తిరుగుతూ ఉప్పు అమ్ముకుంటున్నారు. కొంత మంది ఇనుపకొట్ల దగ్గర, బియ్యం కొట్ల దగ్గర, ముఠా కార్మికులుగా ఉంటూ తోపుడు బండిని లాగుతూ జీవిస్తున్నారు. వీరిలో చాలా మందికి సొంత ఇళ్ళు లేవు. మురికి వాడల్లోని గుడిసెల్లో అద్దెకు ఉంటున్నారు. ఇంతటి దారిద్ర్యాన్ని అనుభవిస్తూ వీరు తప్పెటగుళ్ళు జానపద



కళను అభ్యసించడమే గొప్ప ఆశ్చర్యకరమైన విషయం. దీన్నిబట్టి ఈ పేద వారికి తమ కులకళ పట్ల ఎంతటి అభిమానం ఉందో తెలుస్తుంది. నగరాల్లో ఉండేవారు ఈ విధంగా జీవిస్తూ ఉంటే గ్రామాల్లో ఉండే తప్పెటగుళ్ళ కళాకారులు తమ కులవృత్తి అయిన గొర్రెల మేకల మందను కాయడం, అవి లేనివారు వ్యవసాయ పనులకు కూలీకి వెళ్ళడం చేస్తున్నారు.

తప్పెటగుళ్ళ వారు తమ కళా ప్రదర్శనకు ఎవరైనా పిలిస్తే మూడు వేల రూపాయల వరకు డబ్బు తీసుకుంటున్నారు. కళా ప్రదర్శనలో కనీసం ఇరవై మంది పాల్గొంటారు. నిర్వాహకులు ఇచ్చిన మూడు వేల రూపాలయలను సభ్యులందరూ సమానంగా పంచుకుంటారు. ఒక్కొక్కరికీ నూట యాభై రూపాయలు మాత్రమే వస్తుంది. వేరే ఊరికి వెళ్ళవలసి వస్తే చార్జీలు కూడా తమకిచ్చిన మూడువేల రూపాయల్లోనే భరించాలి. ఈ నూట యాభై రూపాయలు వారు రోజూ సంపాదించే కూలి మాత్రమే. అంతకంటే ఎక్కువ ఉండదు.

తప్పెటగుళ్ళ కళాకారులందరూ స్థిరజీవనం ఉన్నవారే. వీరు పెళ్ళిపేరంటాలు, పండుగ పబ్బాలు, చావు, పుట్టుకలు మొదలైనవన్నీ మిగిలిన యాదవులు లాగానే చేసుకుంటారు. అందువల్ల తప్పెటగుళ్ళ కళాకారుల జీవన విధానంలో ప్రత్యేకంగా చెప్పదగినవి ఏమీలేదు.

## గొల్లసుద్దులవారు - జీవన విధానం :

గొల్లసుద్దులవారు కాటమరాజు కథలను చెబుతూ యాదవుల నుంచి డబ్బును గానీ, జీవాలను (గొర్రె లేక మేక) గానీ యాచించి తీసుకుంటారు. వీరు యాదవుల గ్రామాలకు మూడు సంవత్సరాల కొకసారి వెళతారు. ఇలా వెళ్ళినప్పుడు ఎనిమిది మంది నుంచి పదిమంది వరకు కలసి వెళతారు. వీరు పురుషులు మాత్రమే వెళతారు. స్త్రీలను తమ వెంట తీసుకొని వెళ్ళరు. ఇలా వెళ్ళినప్పుడు గ్రామంలోని యాదవులు వీరు ఉండడానికి వీలుగా ఒక గదిని ఇస్తారు. అంతేగాకుండా వారి భోజనానికి బత్తెం ఇచ్చి వంట చేయడానికి ఒక మనిషిని కూడా పెడతారు. గొల్లసుద్దుల వారు ఒక్కొక్క ఊరిలో వారం పదిరోజులు వరకు ఉండి ఆ ఊర్లో ఉన్న యాదవులందరినీ యాచించి డబ్బును గానీ, జీవాలను గానీ తీసుకుంటారు. ఇలా తీసుకోవడాన్ని రాయలసీమ ప్రాంతంలో "వర్తన" అంటారు. ఆ ఊర్లో ఉన్న యాదవులందరూ వర్తన ఇచ్చిన తరువాత చివరిరోజు తమకు వచ్చిన కథల్లో ఏదో ఒక కథను చెబుతారు. ఒకరోజు కథ చెప్పడం పూర్తి కాకపోతే రెండవరోజు కథను చెప్పి పూర్తి చేస్తారు. ఆ

తరువాత ఒకటి రెండు రోజులు ఆ ఊరిలో ఉండి ఆ ఊర్లో ఉన్న యాదవుల దగ్గర వర్తన తీసుకుంటారు.

గొల్లసుద్దులవారు స్థిరనివాసులు. వీరు పెళ్ళి పేరంటం, చావుపుట్టుకలు, పండుగ పబ్బాలు మొదలైన అన్ని విషయాల్లోనూ మిగిలిన హిందువుల లాగానే చేసుకుంటారు. అందువల్ల వీరి జీవన విధానంలో ప్రత్యేకంగా చెప్పదగిన అంశాలేవీ లేవు.

## కొమ్ములవారు - జీవన విధానం :

కొమ్ములవారు యాదవకుల ఆశ్రిత గాయకులు. వీరు మాదిగ కులానికి చెందినవారు. వీరు తమ ఇలాకాలో ఉన్న యాదవుల గ్రామాలకు వెళ్ళి వారి గోత్రాలను ప్రశంసించి వారిని యాచించి జీవిస్తారు. యాదవ వంశానికి చెందిన కాటమరాజు కథలను 'విష్ణు భాగవతం' అనే నామాంతరం ఉన్న కంసుని కథను వీరు పాడతారు. ఈ కథలను వీరు యాదవుల కులదేవత అయిన గంగమ్మ గుడి దగ్గర గానీ, యాదవుల ఇళ్ళ దగ్గర గానీ చెబుతారు. వీరు సంవత్సరానికి ఒకసారి యాదవులను దర్శించి వారిని యాచించి ధనం, ధాన్యం లేక గొర్రె లేక మేకను ఇప్పించుకుంటారు. అంతేగాకుండా యాదవుల ఇళ్ళలో జరిగే శుభ, అశుభ కార్యక్రమాలన్నింటిలోను వీరు పాల్గొంటారు. యాదవుల ఇళ్ళలో పెళ్ళిల్లు, పుట్టు వెంట్రుకలు తీయించడం మొదలైనవి చేస్తున్నప్పుడు వీరికి, వాటికి సంబంధించిన ఆహ్వానపత్రికలు ఇచ్చి వేరువేరు గ్రామాల్లో ఉన్న తమ బంధువులకు ఇచ్చి రమ్మని పంపిస్తారు. తాము యాచించే యాదవుల బంధువులు ఏ ఊరిలో ఉన్నారో వీరికి బాగా తెలిసి ఉంటుంది. వీరు పెళ్ళి, పుట్టు వెంట్రుకలకు సంబంధించిన శుభలేఖలు తీసుకొని యాదవుల బంధువులున్న గ్రామాలకు వెళ్ళి ఆ శుభలేఖలను ఇస్తారు. ఈవిధంగా కొమ్ములవారు శుభలేఖలను తమకు తెచ్చి ఇవ్వడాన్ని బంధువులే వచ్చి ఆహ్వాన పత్రికలు ఇచ్చినట్టుగా భావిస్తారు. దీన్నిబట్టి యాదవులు తమ కొమ్ములవారిని తమ కుటుంబ సభ్యుల్లో ఒకరిగా భావిస్తారని స్పష్టమవుతుంది. కొమ్ములవారు తమ ఊరిలో ఉన్నంతకాలం తాము తమకోసం చేసుకున్న ఆహార పదార్థాలను వారికి ఆనందంగా పెడతారు. ఐతే కొమ్ములవారు మాదిగ కులస్థులు కావడంవల్ల యాదవులు అంటరానితనాన్ని పాటిస్తారు.

కొమ్ములవారి వ్యవస్థ వంశపారంపర్యంగా కొనసాగుతూ ఉంది. వీరు చాల వరకు నిరక్షరాస్యులు. అయినప్పటికీ వంశపారంపర్యంగా కథలను మౌఖిక సంప్రదాయంలో నేర్చుకొని చెబుతూ ఉంటారు. ముఖ్యంగా యాదవుల కులదేవత అయిన గంగమ్మకు జాతరలు, కొలుపులు, పండుగలు చేసేటప్పుడు కొమ్ములవారి పాత్ర



ఎక్కువగా ఉంటుంది. ఊరేగింపులో కొమ్ములవారు కొమ్మును వాయిస్తూ ఊరేగింపుకు ముందు ఉంటారు. ఈ ఉత్సవాలు జరిగినన్ని రోజులూ రాత్రిపూట గంగమ్మ కథను గానీ కాటమరాజు కథలను గానీ చెబుతారు.

సాధారణంగా కొమ్ములవారందరూ మద్యాన్ని స్వీకరిస్తారు. వీరు యాదవుల ఊర్లకు వచ్చినప్పుడు యాదవులతో డబ్బు ఇప్పించుకొని సారా లేదా కల్లు తాగుతారు. యాదవుల్లో కొంతమందికి కల్లు లేదా సారా తాగే అలవాటు ఉంటుంది. అలాంటి వారితో కలిసి కొమ్ములవారు మద్యపానాన్ని సేవిస్తారు. వీరు ఎక్కడికి వెళ్ళినా తమతోపాటు కొమ్ము వాద్యాన్ని తీసుకొని వెళతారు. తమను పోషించే యాదవుల విషయంలో వీరు ఎంతో భక్తి గౌరవాలను ప్రదర్శిస్తారు. అలాగే యాదవులు కూడా వీరిని ఎంతో అభిమానంగా చూస్తారు.

కొమ్ములవారు సంచార జీవనులు కారు. వీరికి సొంత ఊరు, ఇల్లు ఉంటాయి. ఇల్లు సాధారణంగా చిన్న గుడిసె అయి ఉంటుంది. వీరు తమ ఊరిలో ఉన్నప్పుడు కూలి నాలి చేసుకుంటారు. వీరు మాదిగ కులస్థులు కావడం వల్ల మాదిగలు ఉంటున్న వెలివాడల్లోనే ఉంటారు. అంతేగాకుండా పెళ్ళి పేరంటాలు, చావుపుట్టుకలు మొదలైన అన్ని విషయాల్లోనూ మిగిలిన మాదిగల్లాగానే ఆచార సంప్రదాయాలను కలిగి ఉంటారు. అందువల్ల ప్రత్యేకించి కొమ్ములవారివే అని చెప్పదగిన ఆచార సంప్రదాయాలు ఏవీ లేవు.

## పొడపోతులవారు - జీవన విధానం :

పొడపోతులవారు జంగం కులంలో చెరుకూరి జంగాలశాఖకు చెందినవారు. వీరు విజయనగరం జిల్లాలో నాలుగు గ్రామాల్లో ఉన్నారు. వీరి ప్రధాన వృత్తి యాదవ రాజైన కాటమరాజుకు సంబంధించిన కథలను యాదవుల ఇళ్ళ దగ్గర చెప్పి యాదవుల నుంచి చందాలు వసూలు చేసుకోవడం. వీరిలో కొందరు మూడేళ్ళకొకసారి, మరికొందరు ఐదేళ్ళకొకసారి తమకు హక్కుగా వున్న యాదవుల గ్రామాలకు యాచనకు వెళతారు. వీరు తాము యాదవులకు గురువులమని చెప్పుకుంటారు. అందువల్ల వీరు యాదవులను యాచించటం వినయంగా కాకుండా కొంత అధికారంగా అడుక్కుంటారు. తాము తర తరాలుగా యాదవుల కథలైన కాటమరాజు కథలను చెబుతూ ఆ కథలను సంరక్షిస్తూ వస్తున్నాము కాబట్టి తమను పోషించవలసిన భారం యాదవుల మీద ఉందని, అందువల్ల యాదవులందరూ తమకు తప్పనిసరిగా దక్షిణగా డబ్బు ఇవ్వాలని చెబుతారు.

పొడపోతులవారు ఒక కుటుంబంలోని వ్యక్తులు ముగ్గురు కలిసి యాదవుల గ్రామాలను సందర్శిస్తారు. మొదట గ్రామంలోని యాదవుల అందరి ఇళ్ళకూ వెళ్ళి

వారి గురువులమైన పొడపోతులవారము వచ్చామని తెలియజేస్తారు. వారు ఉండడానికి ఏదైనా బస లేక వసతి గృహాన్ని ఏర్పాటు చెయ్యమని యాదవులను అడుగుతారు. యాదవులు కూడా ఆ ముగ్గురూ ఉండడానికి ఒక గదిని చూపిస్తారు. తరువాత భోజనం మధ్యాహ్నం ఒకరింటిలో రాత్రిపూట మరొకరింట్లో చేస్తారు. భోజనానికి వస్తున్నట్లుగా ముందుగానే యాదవులకు తెలియజేస్తారు. భోజనంలో వారికి ఏమైనా లోటు కలిగితే కోపగిస్తారు. వారి గురువులమైన తమకు ఇలాగేనా భోజనం పెట్టేది అని విమర్శిస్తారు. సరిగా భోజనం పెట్టకపోతే వారి గురించి ఊరూరా చెడ్డగా చెబుతామని బెదిరిస్తారు. అందువల్ల పొడపోతులవారు భోజనానికి వస్తే యాదవులు తమకు ఉన్నంతలో మంచి భోజనమే పెడతారు. భోజనం చేసిన తరువాత దక్షిణ ఇమ్మని అడుగుతారు. యాదవులు తమ ఆర్థిక స్తోమతనుబట్టి 50 రూపాయల నుంచి మొదలుకొని 100, 150 ఇలా ఎంతో కొంత ఇస్తారు. దక్షిణ తీసుకొని ఆ ఇంటివారిని దీవించి వెళ్ళిపోతారు. ఒక్కసారి భోజనానికి వెళ్ళిన ఇంటికి వారు దక్షిణ ఇస్తే మళ్ళీ వారింటికి భోజనానికి వెళ్ళరు. దక్షిణ ఇవ్వకపోతే మళ్ళీ మళ్ళీ వారింటికి భోజనానికి వస్తామని చెబుతారు. అందువల్ల యాదవులు కొంత విసుక్కుంటూనే భోజనమైన తరువాత వారికి దక్షిణ ఇచ్చి పంపిస్తారు. ఆ విధంగా తాము వెళ్ళిన గ్రామంలోని యాదవుల అందరి ఇళ్ళలో భోజనం చేసి అందరి దగ్గరా దక్షిణ తీసుకున్న తరువాత మరొక గ్రామానికి వెళతారు. వీరు యాదవ కుటుంబాల సంఖ్యను బట్టి గ్రామంలో తిష్ట వేస్తారు. అంటే యాదవులు ఎక్కువగా ఉన్న గ్రామంలో ఎక్కువ రోజులు, తక్కువ ఉన్న గ్రామంలో తక్కువ రోజులు ఉంటారు.

పొడపోతులవారికి ఒక్కొక్క కుటుంబానికి ఇంచుమించుగా 100 గ్రామాలు హక్కుగా వస్తున్నాయి. ఒక్కొక్క గ్రామంలో 15 రోజుల నుంచి నెలరోజుల వరకు తిష్టవేస్తారు. నెల రోజుల తరువాత వీరు మరొక గ్రామానికైనా వెళతారు.లేదా తిరిగి స్వగ్రామానికి వచ్చి కొద్దిరోజులు సొంత ఊరిలో తమ సొంత పనులు చూసుకొని తిరిగి మళ్ళీ వేరే ఊరికి యాచనకు బయలుదేరతారు. మొత్తానికి వీరు సంవత్సరంలో 6 నెలల పాటు యాదవులున్న గ్రామాల్లో ఉంటారు. 6 నెలలు తమ ఊరిలో ఉంటారు. వీరు తాము యాదవులున్న గ్రామాలకు వెళ్ళడాన్ని "క్యాంపుకు వెళ్ళడం" అని అంటారు. ఒక్కొక్కసారి వీరు ఒకసారి క్యాంప్‌కు వెళితే సుమారు 3 లేక 4నెలలు క్యాంప్‌లోనే గడుపుతారు. అంటే ఇంచుమించుగా 4 నుంచి 6 గ్రామాలు సందర్శిస్తారు. ఇలా క్యాంప్‌కు వెళ్ళినప్పుడు వీరుపెట్టే ఖర్చు చాలా తక్కువగా ఉంటుంది. భోజనానికి గానీ, వసతికి గానీ వీరు పైసా ఖర్చు చేయరు. వీరి ఖర్చంతా కేవలం బస్సు చార్జీలు



మాత్రమే. మిగిలిన అన్ని విషయాలు వీరికి యాదవులే చూసుకుంటారు. అందువల్ల వీరు ఒకసారి క్యాంప్‌కు వెళ్ళితే కొన్ని వేల రూపాయలు సంపాదించుకొని వస్తారు. పొడపోతులవారికి ఎలాంటి దురలవాట్లూ ఉండవు. జానపద గాయక భిక్షుకుల్లో మిగిలిన వారికి మద్యపాన వ్యసనం ఎక్కువగా ఉంటుంది. వీరు మిగుల్చుకునేది ఏమీ ఉండదు. కానీ పొడపోతుల వారు మాత్రం మిగిలిన గాయక భిక్షుకుల వంటివారు కాదు. వీరు డబ్బును చాలా జాగ్రత్తగా పైసా పైసా కూడబెడతారు. కల్లు సారా లాంటి మద్యపానాల జోలికి వీరు పోరు. అందువల్ల వీరు యాదవుల దగ్గర దక్షిణగా తీసుకొన్న డబ్బును జాగ్రత్తగా దాచుకొని తమ సొంత ఊర్లలో పొలాలను కొనుక్కున్నారు. మంచి డాబాఇళ్ళు కట్టించుకున్నారు. అంతేకాక వీరు తాము యాదవుల వల్లనే బాగా బతుకుతున్నామని చెప్పుకుంటారు. ప్రస్తుతం వీరు గ్రామాల్లో ఉన్నప్పటికీ పొడపోతులవారందరి వద్దా సెల్‌ఫోన్‌లు ఉన్నాయి. ఊర్లో రైతుల వద్ద సెల్‌ఫోన్‌లు ఉండకపోవచ్చు గానీ వీరివద్ద మాత్రం సెల్‌ఫోన్లు ఉంటాయి. వీరికి ఒక్కొక్క కుటుంబానికి 5 ఎకరాల నుంచి 10 ఎకరాల వరకూ పొలం ఉంది. ఐతే వీరు సొంతంగా వ్యవసాయం చెయ్యరు. తమ భూమిని ఊర్లో రైతులకు కౌలుకు ఇస్తారు.

పొడపోతులవారు జంగం కులస్థులు కావడం చేత వీరు శైవమతానికి చెందినవారు. అయినప్పటికి మిగిలిన హిందువుల లాగా వీరు అన్ని పండగలూ చేసుకుంటారు. గ్రామ దేవతల్లో ఎల్లమ్మతల్లి పండుగ ప్రతి సంవత్సరం చేస్తారు. వీరు ఎల్లమ్మను తమ కుల దేవతగా కొలుస్తారు.

పొడపోతులవారిలో గతంలో కుల పంచాయితీలు ఉండేవి. కుల పంచాయితీల్లో కులపెద్దలు చేసే మోసాలు గమనించిన తరువాత వీరు కుల పంచాయితీల జోలికి ప్రస్తుతం వెళ్లడంలేదు. మిగిలిన కులాలవారి లాగానే తమలో ఏవైనా తగవులు వస్తే పోలీస్ స్టేషన్‌లో కేసులు పెట్టడం, కోర్టుల్లో తేల్చుకోవడం చేస్తున్నారు. మిగిలిన ఆచార వ్యవహారాల్లో పొడపోతుల వారికి ప్రత్యేకించి చెప్పదగినవి ఏవీలేవు.

ఐతే పెళ్ళి విషయంలో మాత్రం వీరు ఇప్పటికీ కొన్ని ప్రత్యేకమైన ఆచారాలను పాటిస్తున్నారు. ఇప్పటికీ వీరు పెళ్ళిని ఐదురోజుల పాటు చేస్తున్నారు. ఈ ఐదు రోజుల పాటు తమ కులస్థులకు, బయటి నుంచి వచ్చిన బంధువులకు మూడు పూటలా భోజనాలు పెడతారు. మొదటి రోజును "ప్రదానం" అంటారు. రెండవ రోజును "పెళ్ళికూతురు ఆమెతి" అంటారు. రెండవరోజు భోజనాలకు అయ్యే ఖర్చంతా పెళ్ళికూతురు వాళ్ళు భరించవలిసి ఉంటుంది. మొదటిరోజైన ప్రదానం రోజు ఎవరి ఖర్చు వారు పెట్టుకుంటారు. "మూడవ రోజును పెళ్ళికొడుకు ఆమెతి" అంటారు. ఈ

రోజున పెళ్ళి ఖర్చంతా పెళ్ళికొడుకువాళ్ళు పెట్టుకోవలసి వుంటుంది. నాల్గవరోజు, ఐదవరోజు పెళ్ళికొడుకువారు పెళ్ళికూతురువారు ఇద్దరూ కలిసి భోజనాలు పెడతారు. ఈ రెండు రోజులూ మాంసాహారాన్ని మాత్రమే వాడతారు. మొదటి మూడు రోజులూ శాఖాహారం పెడతారు. పప్పు, కూరగాయలు, పాయశం లాంటి భోజన పదార్థాలు ఉంటాయి. పప్పుకు కందిపప్పు వాడరు. పెసరపప్పు మాత్రమే వాడతారు. ప్రత్యేకించి పెసలు కొనుక్కొని వచ్చి వాటిని పగులగొట్టి శుభ్రం చేసిన మంచి పెసరపప్పునే పెళ్ళి సమయంలో వాడతారు. అలా మంచి పెసరపప్పు వాడకపోతే చుట్టాలు ఆక్షేపణ చేస్తారు. ఈ విధంగా ఐదురోజులు పెళ్ళి కావడంవల్ల పొడపోతులవారి పెళ్ళిఖర్చు తడిసిమోపెడు అవుతుంది. ఖర్చు పెట్టలేని బీదవారు లోపాయికారిగా పెళ్ళికొడుకు, పెళ్ళికూతుర్ని వేరే ఊరికి వెళ్ళి ఏగుళ్ళోనో పెళ్ళి చేసుకొని రమ్మని చెబుతారు. తిరిగి వచ్చిన తరువాత మామూలుగా దంపతులుగా సంసారం చేస్తారు. వీరిలో కట్నాలు, కానుకలు, ఓలి మొదలైన దురాచారాలు లేవు.

పొడపోతులవారిలో ఒక తండ్రికి ఇద్దరు లేక ముగ్గురు కొడుకులు ఉంటే తండ్రి తదనంతరం అతని అధీనంలో ఉన్న గ్రామాలను అతని కొడుకులందరూ సమానంగా పంచుకుంటారు. అంతేగాకుండా ఆ కొడుకులందరూ కలిసి యాదవుల గ్రామాలకు వెళ్ళి పలానా ఊరును తమ అన్నదమ్ములం పంచుకున్నామని ఆ గ్రామంలోని యాదవు లందరికీ చెప్పి ఇకనుంచి పంచుకున్న వ్యక్తి మాత్రమే ఆ గ్రామానికి యాచనకు వస్తామని చెబుతారు. దీనివల్ల యాదవులకు కూడా తమ దగ్గరికి ఎవరు వచ్చేదీ స్పష్టంగా తెలుస్తుంది. వారికి మాత్రమే ఆ ఊరి యాదవులు దక్షిణ ఇస్తారు. పొడపోతులవారి కుటుంబంలో ఎవరికైనా కొడుకులు లేకపోతే తండ్రి ఆధీనంలో ఉన్న గ్రామాలు కూతుళ్ళు సమంగా పంచుకుంటారు. కూతుళ్ళ భర్తలు ఆయా గ్రామాలకు వెళ్ళి కాటమరాజు కథలను చెప్పి యాదవుల దగ్గర నుంచి దక్షిణను తీసుకుంటారు. అన్నదమ్ముల్లో కొందరి అబ్బాయిలకు కథలు చెప్పడం పట్టువడవు. ఇలాంటి వారు తమ భాగానికి వచ్చిన యాదవ గ్రామాలను తమ అన్నదమ్ములకు గానీ మిగిలిన పొడపోతులవారికి గానీ అమ్ముకుంటారు. పొడపోతుల వారిలో చదువుకొని ఉద్యోగాలు చేసుకుంటున్నవారు కూడా కొందరున్నారు. ఇలాంటివారు తమ భాగానికి వచ్చిన గ్రామాలను మిగిలిన తమ సోదరులకు ఇచ్చి వేస్తారు లేదా డబ్బుకు అమ్ముకుంటారు. ఇలా అమ్మేటప్పుడు ఒక్కొక్క యాదవుల ఇంటికి 50 రూపాయల చొప్పున లెక్కవేస్తారు. అంటే 100 యాదవుల ఇళ్ళను అమ్మితే 5000 రూపాయలు అమ్మినవారికి వస్తుంది. ఇలా అమ్మినట్లుగా వీరు కాగితాలు రాసుకుంటారు. అంతేగాకుండా అమ్మినవారు



కొన్నవారు ఆయా యాదవుల ఇళ్ళకు వెళ్ళి తమ మధ్య జరిగిన అమ్మకపు ఒప్పందన్ని ఆ యాదవులకు చెప్పి ఇక నుంచి కొన్న వ్యక్తి యాదవుల ఇళ్ళకు దక్షిణ తీసుకోవడానికి వస్తాడని చెబుతారు. ఆ తరువాత నుంచి కొన్నవ్యక్తి ఆయా గ్రామాలకు వెళ్ళి దక్షిణ వసూలు చేసుకుంటాడు.

## తెరచీరలవారు- జీవనవిధానం :

తెరచీరలవారు విశాఖపట్నం జిల్లా నర్సీపట్నానికి ఆనుకొని ఉన్న పెదబొడ్డేపల్లి గ్రామంలో కొల్లి రమణ, కొల్లి గంగరాజు, కొల్లి శీనుబాబు, చెల్లిబోయిన కళ్యాణం, చెల్లిబోయిన గంగరాజు, బర్ల సత్తిబాబు, బర్ల గంగరాజు, గొంప జోగరాజు అనే ఎనిమిది కుటుంబాల వారు మాత్రమే ఉన్నారు. వీరి పూర్వులు 40 సంవత్సరాల కిందట తూర్పుగోదావరి జిల్లా బీమవరం దగ్గర ఉన్న బీమవరపుకోట అనే గ్రామం నుంచి పెదబొడ్డేపల్లికి వలస వచ్చినట్లుగా తెరచీరకళాకారుడైన కొల్లి రమణ గారు చెప్పారు. రమణ గారికి 50 సంవత్సరాల వయసు ఉంటుంది. ఇతను అలవోకగా ధారాళంగా కాటమరాజు కథలను చెప్పగల సమర్థులు. తెరచీరల వారికి సంబంధించిన విషయాలను నేను వీరి నుంచి సేకరించాను.

తెరచీరలవారి ప్రధాన వృత్తి వంశపారంపర్యంగా తమకు సంక్రమించిన యాదవులున్న గ్రామాలకువెళ్ళి యాదవులను దర్శించి వారి ఇళ్ళ వద్ద కాటమరాజు కథలను చెప్పి వారి వద్ద నుంచి తాగంగా జీవం పిల్లను (గొర్రెపిల్లను గానీ మేకపిల్లను గానీ) తీసుకొని వాటిని కొన్నాళ్ళు పెంచి ఆతర్వాత అమ్ముకొని జీవించడం. తెరచీరల వారిలోని ఎనిమిది కుటుంబాల్లో ఒక్కొక్క కుటుంబానికి వంద గ్రామాల్లో యాచించే అధికారం ఉంది. వీరు మూడు సంవత్సరాలకొకసారి తమ ఇలాకాలో ఉన్న గ్రామాలకు ఇద్దరు లేక ముగ్గురు వ్యక్తులు కలిసి వెళ్తారు. ఇలా వెళ్ళేటప్పుడు పురుషులు మాత్రమే వెళ్తారు. స్త్రీలను తమ వెంట తీసుకొని వెళ్ళరు. తమ స్వగ్రామమైన పెదబొడ్డేపల్లికి దగ్గరగా ఉన్న గ్రామాలకు యాచనకు వెళ్తే ఉదయం వెళ్ళి రాత్రికి తిరిగి తమ ఇంటికి చేరుకుంటారు. దూరంగా ఉన్న గ్రామాలకు వెళ్ళినప్పుడు ఏదైనా ఒక ఊర్లో మకాం వేసి ఉదయమే చుట్టుపక్కల ఉన్న గ్రామాలకు వెళ్ళి యాచించి రాత్రికి మకాంకు చేరుకుంటారు. ఇలా వెళ్ళినప్పుడు వీరు మూడు పూటలా యాదవుల ఇళ్ళలోనే భోజనం చేస్తారు. యాదవులు వీరిని యాచకులుగా గాకుండా తమ కుటుంబంలోని వ్యక్తులుగా ప్రేమతో ఆదరించి తాము తినే ఆహారన్నే వీరికి పెడతారు. తెరచీరల వారు గూడా తమను పోషించే యాదవుల పట్ల గొప్ప గౌరవభావాన్ని కృతజ్ఞతను కలిగి ఉంటారు.

తెరచీరల వారు యాచనకు వెళ్ళినప్పుడు గొర్రెలమంద ఉన్న యాదవుల దగ్గర నుంచి డబ్బు తీసుకోరు. తప్పనిసరిగా వారి నుంచి జీవం పిల్లనే తీసుకుంటారు. గ్రామంలో ఒక ఇంటిపేరు గల యాదవులందరు కలిసి ఒక జీవం పిల్లను వీరికి ఇస్తారు. జీవాలమంద లేని యాదవులు మాత్రం వంద, రెండువందలు - ఇలా వారివారి ఆర్థికస్తోమతను బట్టి ఎంతోకొంత డబ్బు వీరికి ఇస్తారు. వీరు ఒకటికి నాలుగు సార్లు యాదవుల ఇళ్ళకు వెళ్ళి తాము యాదవుల అర్తివారమని, యాదవుల కులకథలైన కాటమరాజు కథలను చెబుతూ వాటిని కాపాడుకుంటూ వస్తున్నామని, వారు ఇచ్చినదానితోనే తరతరాలుగా తాము జీవిస్తున్నామని, వారు తాగం ఇవ్వకపోతే తామెలా జీవించాలని చెబుతూ బ్రతిమాలే ధోరణిలో మాట్లాడి వారినుంచి తాగం ఇప్పించుకుంటారు. గ్రామంలోని యాదవులందరూ తాగం ఇచ్చిన తర్వాత వీరు మరొక ఊరికి వెళ్ళిపోతారు. ఇలా వీరు యాచనకు వెళ్ళినప్పుడు 15, 20 రోజుల పాటు గ్రామాల్లో తిరుగుతూ ఉంటారు. 15, 20 రోజుల తర్వాత మళ్ళీ ఇంటికి వచ్చి ఊర్లో తమ పనులు చూసుకొని మళ్ళీ యాచనకు వెళ్తారు. ఇలా వీరు సంవత్సరంలో ఇంచుమించుగా ఎనిమిది నెలలు యాచనలోనే గడుపుతారు. యాచనకు వెళ్ళని రోజుల్లో వీరు తమ ఊర్లో రోజు కూలికి వెళ్తారు. వీరి సంతానంలో మగపిల్లలు కొందరు ఈనాడు పౌడరు డబ్బాలు, దువ్వెన్లు, చిన్నఅద్దాలు మొదలైన ఫాన్సీవస్తువులను సైకిల్ మీద పెట్టుకొని చుట్టుపక్కల ఊర్లలో అమ్ముతున్నారు.

తెరచీరల వారు పెదబొడ్డేపల్లిలో కొల్లి, బర్ల, చెల్లిబోయిన, గొంప అనే నాలుగు ఇంటిపేర్లు గల వారు మాత్రమే ఉన్నారు. వీరు యాదవకులానికి చెందిన వారైనప్పటికీ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్న వారు కావడం చేత చిన్న పెద్ద తేడా లేకుండా యాదవకులంలోని స్త్రీలనందరనీ తల్లులుగానూ, పురుషులందరినీ తండ్రులు గాను భావిస్తారు. అందువల్ల వీరు యాదవులతో వియ్యమందరు. తమలో తాము ఇచ్చిపుచ్చుకుంటారు. చెల్లిబోయినవారు గొంపవారు పరస్పరం వియ్యమందుతారు. కొల్లివారు బర్లవారు ఇచ్చిపుచ్చుకుంటారు. చెల్లిబోయినవారు కొల్లివారు అన్నదమ్ముల వరుస అవుతారు. అలాగే గొంపవారు బర్లవారు అన్నదమ్ములవుతారు. అందువల్ల వీరు వియ్యమందరు. ఈకారణం చేత తెరచీరల వారిలో పురుషులకు భార్యలు దొరకడం కష్టంగా ఉందని కొల్లి రమణ గారు చెప్పారు. అందువల్ల వీరు కాపు, శెట్టిబలిజ మొదలైన కులాల్లో తమ ఆర్థికస్థోమతకు తగిన అమ్మాయిలను పెళ్ళి చేసుకుంటున్నారు. ఇలా కులాంతర వివాహం చేసుకున్నప్పుడు తమ కులసంఘానికి జరిమానా చెల్లించి వధువును తమ కులంలో కలుపుకుంటారు. పెద్దలు కుదిర్చి ఇలా కులాంతర వివాహం



చేసుకోవడమూ ఉంది. వధూవరులు తాము ప్రేమించుకొని ఆతర్వాత వధువును లేవదీసుకొని వచ్చి పెళ్ళి చేసుకోవడమూ ఉంది. ఎలా చేసుకున్నా కులాంతర వివాహం చేసుకున్న యువకునికి కులపెద్దలు జరిమానా విధించి వధువును తమ కులంలో కలుపుకుంటారు. ఐతే తమ అమ్మాయిని ఇతర కులస్థులకు ఇచ్చిన సందర్భాలు లేవని రమణ గారు చెప్పారు.

తెరచీరలవారు తమ అమ్మాయిలకు 8 సంవత్సరాల వయసులోనే అంటే బాల్యంలోనే పెళ్ళి చేస్తారు. ఐతే అబ్బాయిలకు మాత్రం బాల్యవివాహం చేయరు. బాలురకు 18 సంవత్సరాల వయసులో పెళ్ళి చేస్తారు. వీరిలో కులపంచాయితీ పద్ధతి ఉంది. కులసంఘం కూడా ఉంది. ఎవరైనా తప్పు చేస్తే కులసంఘం అధ్యక్షుడు పెద్దలతో కలిసి విచారించి జరిమానా వేస్తాడు. జరిమానాలో సగం డబ్బును కుల సంఘానికి కేటాయించి మిగిలిన సగం డబ్బుతో అందరూ కలిసి భోజనం చేయడం, టిపిన్లు, టీ, కాఫీలు తాగడం చేస్తారు.

తెరచీరలవారు పెళ్ళిపేరంటాలు, పండుగలు, పబ్బాలు మొదలైన విషయాల్లో మిగిలిన హిందువుల ఆచారలనే పాటిస్తారు. వీటిలో ఎలాంటి ప్రత్యేకతా లేదు. అందువల్ల వీటిని గురించి ప్రస్తావించడం లేదు.

## మందెచ్చులవారు - జీవన విధానం :

మందెచ్చులవారు బుడగ జంగం కులస్థులు. వీరు తెలంగాణా ప్రాంతంలో మాత్రమే ఉన్నారు. మిగిలిన ప్రాంతాల్లో మందెచ్చులవారు లేరు. వీరు తెలంగాణా ప్రాంతంలోని అన్ని శాఖలకు చెందిన యాదవులను యాచించి జీవిస్తున్నారు. వీరు తమకు హక్కుగా వస్తున్న యాదవులున్న గ్రామాలకు వెళ్లి యాదవుల ఇళ్ల దగ్గర యాదవులు చెప్పమన్న కాటమరాజు కథలను చెప్పి వారిని యాచిస్తూ జీవిస్తారు. వీరి ప్రధాన వృత్తి కాటమరాజు కథలను చెప్పడమే. ప్రతిఫలంగా యాదవులు వీరిని తమ "అర్థివారు" గా గౌరవిస్తూ వీరికి కొంత డబ్బును గానీ, గొర్రెపిల్లను గానీ ఇస్తారు. వీరు కొన్ని కుటుంబాల వారు కలిసి ఒక గుంపుగా ఏర్పడి యాదవులున్న గ్రామాల్లో కొంత కాలం నివసిస్తూ, ఆ ఊరిలో తమకు వచ్చిన కథలు చెబుతూ, ఊర్లో ఉన్న యాదవులందరూ 'తాగం' ఇచ్చేవరకు ఉండి మరొక ఊరికి వెళ్తారు. యాదవులు మందెచ్చుల వారికి ఇచ్చే ధన, ధాన్య, వస్తు, జంతు సముదాయాన్ని 'తాగం' అంటారు. ఒక్కొక్క గుంపు ఇరవై నుంచి ముప్పై గ్రామాల మీద మిరాసీ హక్కు కలిగి ఉంటారు. యాదవులు తక్కువగా ఉన్న గ్రామంలో నెల రోజు లుంటారు. ఎక్కువ ఉన్న గ్రామంలో

మూడు, నాలుగు నెలలు ఉంటారు. వీరు మూడు సంవత్సరాలకొకసారి యాదవులను దర్శిస్తారు. అంటే ప్రతి సంవత్సరం అయిదు లేక ఆరు గ్రామాలను దర్శించి యాదవులను యాచిస్తూ జీవిస్తున్నారు. మందెచ్చుల వారు యాదవులను మాత్రమే యాచిస్తారు. ఇతర కులస్తులను యాచించరు.

మందెచ్చులవారు యాచనకు వెళ్ళినప్పుడు ఊరి బైట ఖాళీస్థలంలో గానీ, లేక యాదవులు చూపించిన ఖాళీ స్థలంలో గానీ, లేదా ఎవరి ఇంటి దగ్గరనైనా ఖాళీ స్థలం ఉంటే వారిని అభ్యర్థించి అక్కడ గానీ అర్ధచంద్రాకారంలో చిన్న గుడారు వేసుకొని అందులో ఉంటూ తాము వచ్చిన పని చేసుకుంటూ పోతారు. గ్రామానికి వచ్చినప్పుడు మొదట ఆ ఊళ్లోని పెద్దగొల్ల ఇంటికి, ఆ తర్వాత మిగిలిన యాదవుల ఇళ్ళకు వెళ్లి తాము వచ్చినట్లుగా వారిని తెలియజేస్తారు. ఈ సందర్భంలో యాదవుల ఇళ్లను దర్శించినప్పుడు వారిని "బొలియావు దీవెనలు బొలియావు దీవెనలు, ఇప్పటికి మీయిల్లు ఇలకమ్మటాలు, పాలు బోసిన మీ యిల్లు పర్వతాలబోలు, ఎన్నబోసిన మీ యిల్లు ఎచ్చుతా ఉంది. కాటమరాజంత కలిగిన బాగ్యాలు, మీ కొడుకులు సల్లన, మీబిడ్డలు సల్లన, బొల్లియావంత బోగాలు ఉండాల, బసవదేవునంత బాగ్యాలుండాల, ఆడబిడ్డ దీవెన గలిగి, అర్తివాని దేవెన గలిగి" అని దీవిస్తారు. ఆ రోజు నుంచి ఊరు విడిచి వెళ్లేవరకు ప్రతీ రోజు ఉదయం పూట మందెచ్చుల స్త్రీలు యాదవుల ఇళ్లకు వెళ్ళి అన్నం పప్పు, కూర, మజ్జిగ మొదలైన వాటిని అడుక్కుని తెచ్చుకుంటారు. యాదవులు వీరికి అన్నం పెట్టడం తమ కర్తవ్యంగా భావించి ప్రతి రోజు వీరికి అన్నం పెట్టడానికి ఎక్కువగా వండుతారు. ఈ విధంగా అడుక్కొని తెచ్చిన ఆహార పదార్థాలను మందెచ్చులవారు ఉదయం, మధ్యాహ్నం తింటారు. రాత్రిపూట మాత్రం వీరు వంట చేసుకుంటారు. మందెచ్చులవారు రాత్రిపూట మాత్రమే కథ చెబుతారు. అందువల్ల పగటిపూట వీరు ఖాళీగానే ఉంటారు. పగటిపూట చుట్టుపక్క ప్రాంతాలకు వేటకు వెళ్ళి ఉడుతలు, ఉడుములు, చేపలు, రకరకాల పిట్టలు మొదలైన వాటిని వేటాడి తెచ్చుకొని రాత్రి తింటారు.

మందెచ్చులవారు ఇలా గ్రామాలకు యాచనకు వెళ్లినప్పుడు కథను చెప్పడానికి తాము ఉపయోగించే సామాగ్రి అయిన డోలు, జగ్గు, సపీర, గజ్జలు, తాళాలు, బొమ్మ ఉంచిన బుట్టలు మొదలైన వాటిని తమ దగ్గర ఉంచుకోరు. తాము ఉంటున్న గుడారు చిన్నదిగా ఉండడం చేత వాటిని తమ దగ్గర పెట్టుకోరు. పెద్దగొల్ల ఇంటి దగ్గర గానీ లేక మరొక యాదవుల ఇంటి దగ్గర గానీ ఉంచి కథ చెప్పేచోటికి వాటిని తీసుకొని వెళ్ళి, కథ అయిపోయిన తర్వాత తెచ్చి మళ్లీ అక్కడే పెడుతూ ఉంటారు. వీరు గ్రామాల్లో ఉన్నప్పుడు ప్రతిరోజు కథ చెప్పరు. ఆ ఊర్లో ఉన్న యాదవ కుటుంబాలవారు కథ



చెప్పమన్నప్పుడు చెబుతారు. కథ చెప్పిన రోజున, చెప్పించిన వారి ఇంటిలోనే వీరందరూ భోజనం చేస్తారు. తమ ఇంటి దగ్గర కథను చెప్పించినవారు అయిదు వందల రూపాయల దాకా 'తాగం' ఇస్తారు. గ్రామంలో ఉన్న యాదవులందరూ 'తాగం' ఇస్తారు. గతంలో వడ్లు, జొన్నలు, గొర్రెపిల్ల, మేకపిల్ల మొదలైన వాటిని తాగంగా ఇచ్చేవారు. ఇప్పుడు డబ్బు ఇస్తున్నారు. యాదవులు గొర్రెల మంద ఉన్నవారు మందెచ్చులవారితో కథ చెప్పిస్తే తమకు, తమ మందకు మంచిదన్న నమ్మకంతో కాటమరాజు కథలను చెప్పిస్తారు. మంద లేనివారు గూడ కొందరు వీరితో కథలు చెప్పిస్తారు. కథ చెప్పించినవారు కథకు ఇంత అని ప్రత్యేకంగా డబ్బు ఇస్తారు. కథ చెప్పించలేని వారు తమ ఆర్థిక స్థోమతనుబట్టి ఇంటికి 50, 60, 100, 150 ఇలా తమ తోచినంత, తమ తాహాతుకు తగినంత ధనాన్ని ఇస్తారు. ఊర్లో ఉన్న యాదవ కుటుంబాల వారందరూ తప్పనిసరిగా తాగం ఇస్తారు. ఇవ్వనివారి ఇంటికి పదేపదే వెళ్లి వారిని విసిగించి తాగం తీసుకుంటారు. తాగం ఇచ్చిన వారి ఇంటికి వీరి స్త్రీలు ఉదయం పూట అన్నం అడుక్కోవడానికి వెళ్ళరు. ఊర్లో ఉన్న యాదవులందరూ కలిసి తమ గొర్రెల మందకు మందెచ్చులవారి చేత ఒకరోజు 'గావుపట్టి బలిచల్లి'స్తారు. ఇలా చేసిన దానికి ప్రత్యేకంగా డబ్బు తీసుకుంటారు. కొంత మంది యాదవులు తమ ఇంటిలో ఎవరైనా చనిపోయి ఉంటే వారి ఆత్మశాంతికోసం మందెచ్చులవారితో పగలు బొమ్మల ప్రదర్శన చేయించి, అదే రోజు రాత్రి కథను చెప్పిస్తారు.

మందెచ్చులవారు తమ కళాప్రదర్శనకు నాలుగు, అయిదు కుటుంబాలవారు ఆడ, మగ, పిల్లలతో కలిసి వెళ్తూ ఉంటారు. కథ చెప్పేటప్పుడు ఏడు నుంచి తొమ్మిది మందివరకు పాల్గొంటారు. తమకు యాదవులు తాగంగా ఇచ్చిన డబ్బును వీరు అందరూ సమానంగా పంచుకుంటారు. పంచుకునేటప్పుడు మగ వారికి భాగం, ఆడవారికి సగభాగం పిల్లలు ప్రదర్శనలో పాల్గొంటే వారికి పాతికభాగం చొప్పున పంచుకుంటారు.

ఈ విధంగా మందెచ్చులవారు యాదవులున్న గ్రామానికి వెళ్లి కథ చెప్పడం, యాదవుల మంద హెచ్చడానికి బలి చల్లడం వ్యక్తులు చనిపోయిన యాదవుల ఇళ్ళలో వారి కోరిక మేరకు బొమ్మల ప్రదర్శన చేయడం, అనే మూడు పనులు చేస్తారు. ఊర్లో ఉన్న యాదవులందరి దగ్గర 'తాగం' తీసుకున్న తర్వాత ఆ ఊరి నుంచి మరొక ఊరికి వెళ్తారు. తర్వాత మూడేళ్ళ వరకు ఆ గ్రామానికిరారు. మూడేళ్ళ తర్వాత మళ్లీ వస్తారు.

మందెచ్చులవారు యాదవుల గ్రామాలకు యాచనకు వెళ్లకుండా తమ ఊర్లో ఉన్నప్పుడు పాత ఇనుప సామాను కొనడం, అమ్మడం, చిత్తు కాయితాలు ఏరి అమ్మడం

మొదలైన పనులు చేస్తారు. వీరి స్త్రీలు ఈతచాపలు అల్లి అమ్ముతారు.

**ఇల్లు :** మందెచ్చులవారు తమ స్వంత ఊర్లో చిన్నచిన్న పూరిగుడిసెలలో నివసిస్తున్నారు. కొంతమంది పెంకుటిళ్లలో, రేకులను పైకప్పుగా వేసుకున్న ఇళ్లలో నివసిస్తున్నారు. కొంతమంది అర్ధచంద్రాకారంలో వంచిన గుడారాల వంటి వాటిలో నివసిస్తున్నారు. యాచన కోసం ఇతర గ్రామాలకు వెళ్లినప్పుడు ఊరి బైట గుడారాలు వేసుకొని వాటిలో నివసిస్తారు. పచ్చివాయిలి కర్రలను, ఇతర పొడవైన కర్రలను అర్ధచంద్రాకారంలో వంచి వాటి రెండు చివరలను భూమిలో పాతుతారు. వాటిపైన గుడ్డలు, గోనె సంచులు పాలితిన్ కవర్లు, తాటికమ్ములు లేదా మోదుగ ఆకులను పైకప్పులుగా కప్పి అవి ఎగిరి పోకుండా తాళ్ళతో కడతారు. కొందరు కొన్నిసార్లు యాదవ కులపెద్ద గొల్ల పాకల్లో నివాసం ఉంటారు. వీరి నివాసాలు చాలా వరకు దయనీయమైనవి. అయితే వారు తమ దయనీయమైన స్థితిని తలుచుకోరు. ఉన్నంతలో సుఖంగా, సంతోషంగా జీవిస్తారు. సీసామూతకు రంధ్రం చేసి గుడ్డపేలికను వత్తిగా చేసిన కిరసనాయిలు బుడ్డీని ఉపయోగిస్తారు. ఇంట్లో వీరు ఉపయోగించే వస్తువులు చాలా తక్కువగా ఉంటాయి. చెట్ల కొమ్మలను కొట్టడానికి ఒక గొడ్డలి, కోడి, గొర్రె మొదలైన వాటిని కోయడానికి ఒక కత్తి ఉంటాయి. స్త్రీలు ఈత చాపలు అల్లడానికి చిన్న కొడవలి ఉంటుంది.

**వంటావార్పు, ఆహార పానీయాలు :** మందెచ్చులవారు తమ ఇంటి ముందు మూడు రాళ్లను గానీ, మూడు ఇటుకలను గానీ పెట్టి పొయ్యిని తయారుచేస్తారు. చుట్టపక్కల ఏరుకొని వచ్చిన పుల్లలను వంట చెరుకుగా ఉపయోగిస్తారు. అన్నం చేయడానికి ఒకటి, పులుసు లేక కూర చేయడానికి ఒకటి కలిపి రెండు మూడు అల్యూమినియం గిన్నెలు, ఒక తెడ్డు, ఒక గరిటె వీరి వంట సామగ్రి. కొందరు పొయ్యికి రెండు పక్కల మాత్రమే రాళ్లను పెట్టి ఒక పక్క పొంతను పెడతారు. పొంతలో నీళ్లు పోసి, వేడి అయిన తర్వాత ఆ నీటిని స్నానానికి ఉపయోగిస్తారు.

ఇతర గ్రామాలకు ప్రదర్శనకు వెళ్లినప్పుడు మందెచ్చుల వారి స్త్రీలు ఉదయం పూట యాదవుల ఇళ్లకు వెళ్లి అన్నం, పప్పు, కూర, మజ్జిగ మొదలైన ఆహార పదార్థాలను అడుక్కొని తెస్తారు. ఈ ఆహారాన్ని ఉదయం, మధ్యాహ్నం తింటారు. రాత్రిపూట మొక్కజొన్న, గోధుమ, జొన్న మొదలైన ధాన్యాల పిండితో రొట్టెలను చేసుకొని తింటారు. పగటిపూట వేటకు వెళ్ళి ఉడుతలు, ఎంద్రకాయలు, చేపలు, అనేక రకాల పిట్టలు, ఉడుములు మొదలైన వాటిని వేటాడి తెచ్చి కూరగా చేసి తింటారు.

మందెచ్చులవారు కథ చెప్పేరోజు కథను చెప్పించే యాదవుల ఇంటిలో భోజనం చేస్తారు. యాదవులు తాము తినే ఆహారాన్నే వీరికి పెడతారు. బొమ్మల



ప్రదర్శన రోజు, మందకు బలి చల్లే రోజు గూడా యాదవులే వీరికి భోజనాలు పెడతారు. బలిచల్లే రోజు మద్య మాంసాలతో వీరికి భోజనాలు పెడతారు.

తమ స్వంత ఊర్లో ఉన్నప్పుడు మొక్కజొన్నలను నూకగా (గడుక) చేసి వండుకొని తింటారు. జొన్నలు, బియ్యం మొదలైన వాటిని గూడా ఆహారంగా ఉపయోగిస్తున్నారు. పప్పు, వంకాయ మొదలైన వాటిని అన్నంతో అనుపానంగా వాడతారు. చింతపండు చారు చేసుకుంటారు. వీరిలో కొందరు ఉదయం 11-00 గంటల ప్రాంతంలో అన్నం తిని, మళ్లీ రాత్రిపూట మాత్రమే తింటారు. మధ్యాహ్నం తినరు. దీనికి కారణం మధ్యాహ్నం తినడానికి లేకపోవడమే.

మందెచ్చులవారికి మద్యమాంసాలు చాలా ఇష్టం. స్త్రీ పురుషులందరూ మద్యమాంసాలు తీసుకుంటారు. ప్రతిరోజు సాయంకాలం అయ్యేటప్పటికి తప్పనిసరిగా కల్లు లేదా సారా తాగుతారు. స్త్రీలు గూడ పురుషులతో కలిసి తాగుతారు. చిన్నప్పటి నుంచి వీరికి మద్యపానం అలవాటు ఉంటుంది. ఇప్పుడిప్పుడు పిల్లలు తాగకుండా పెద్దవాళ్లు జాగ్రత్త పడుతున్నారు. ఇంటికి చుట్టాలు వస్తే వారితో కలిసి తాగుతారు. వీరు సంపాదించినదంతా తినడానికి తాగడానకి సరిపోతుంది. మిగిలేదేమీ ఉండదు. అందువల్ల వీరు ఎదురూ బొదుగూ లేకుండా గొర్రెతోక బెత్తెడు లాగా తరతరాలుగా ఎలాంటి మార్పు లేకుండా గర్భదరిద్రులుగా జీవిస్తున్నారు. తమ చుట్టూ ఉన్న సమాజం హైటెక్ వేగంతో దూసుకుపోతుంటే, వీరు వీరి పిల్లలు చదువుసందెలు లేకుండా మూఢనమ్మకాలతో, మూఢాచారాలతో పూరి గుడిసెల్లో, గుడారాల్లో కాలం గడుపుతున్నారు. అయితే వీరు తమ చుట్టూ ఉన్న సమాజంతో తమ జీవితాలను పోల్చుకోరు. తమకు ఇల్లు వాకిలి, కరెంటు దీపాలూ, చదువులు, ఉద్యోగాలు మొదలై నవి లేవని బాధపడరు. ఉంటే తింటారు, లేకపోతే లేదు. ఉన్న దాంతోనే సంతోషంగా జీవిస్తారు.

**వేట :** మందెచ్చులవారికి వేట చాలా ఇష్టమైన ప్రవృత్తి. దానికి కారణం వీరికి మాంసాహారం మీద ఎక్కువ ఇష్టం ఉండడమే. ఇంచుమించుగా ప్రతిరోజు మాంసాహారం తీసుకుంటారు. ప్రతీరోజు కోడి, మేక, గొర్రె మాంసాన్ని కొనగల ఆర్థిక స్థోమత వీరికి ఉండదు. అందువల్ల వీరు తాము ఉంటున్న చుట్టుపక్కల ప్రాంతాల్లో వేటకు వెళ్ళి చేపలు, ఎంద్రకాయలు (పీతలు) ఉడుములు, ఉడుతలు, కుందేళ్ళు, భూతపిట్టలు, పావురాలు, గోరింకలు మొదలైన అనేక రకాల ప్రాణులను వేటాడి తింటారు.

ఉడుతలను పట్టడానికి వీరి వద్ద ఉడుతల వల ఉంటుంది. ఈ వలను ఉడుతలున్న ప్రాంతంలో భూమి మీద పరిచి చెట్టు మీద, భూమి మీద ఉన్న ఉడుతలను వలవైపుకు తోలుతారు. ఉడుతలు అటుఇటు పరుగెడుతూ చివరకు వలలోపడి చిక్కు

కుంటాయి. వాటిని కాల్చి కోసి వండుకొని తింటారు. నీళ్లు ఉన్న దగ్గర చేపలను ఎండ్ర కాయలను పట్టుకుంటారు. వాగుల వద్దకు వెళ్లి ఎండ్రకాయలను వెదికి పట్టుకొని వాటి కాళ్లు పీకివేసి, మిగిలిన భాగాన్ని ఉడకబెట్టి పై టెంక తీసివేసి, వేయించి అందులో చింతపులుసు లేదా చింతచిగురు వేసి పులుసు చేసుకొని అన్నంతో తింటారు. గాలంతో చేపలు పట్టి తింటారు. మిగిలిన ప్రాణులను గూడ వేటాడి తింటారు.

**వేషభూషణాలు :** మందెచ్చులవారు ఎక్కువగా యాదవులు ఇచ్చిన బట్టలను ధరిస్తారు. బొమ్మల ప్రదర్శన చేసిన రోజున చనిపోయిన వారి బట్టలను అడిగి తీసుకుంటారు. సాధారణంగా పురుషులు తెల్లధోవతిని, తెల్లటి అంగీని ధరిస్తారు. పదిమూరలు పొడవున్న రుమాలు గుడ్డను తలకు చుట్టుకొని దాని చివరి భాగాన్ని వీపు మీద తోకలాగా వదులుతారు. ధోవతిని సెంగులు బోసి అందంగా కడతారు. కాళ్లకు బలమైన కిర్రు చెప్పులను వేసుకుంటారు. కొందరు పురుషులు జులపాలు పెంచుకుంటారు. మరి కొందరు స్త్రీవేషం వేయడానికి వీలుగా స్త్రీల లాగా జుట్టు పెంచుకుంటారు. వీరు ముక్కు చెవులు కూడా కుట్టించుకుంటారు.

పురుషులు వెండితో చేసిన సన్నని కడియాలను చేతులకు ధరిస్తారు. వీటిని వీరు బేడీలు అంటారు. బంగారు చెవిపోగులను, చెవిపై భాగంలో కొనకపోగు అనే దాన్ని ధరిస్తారు. చేతివేళ్లకు రాళ్లు పొదగని ఉంగరాలను, చేతులకు బోలుకడియం, దండ కడియాలను ధరిస్తారు. కాలికి 'కాకరకాయబేడి' అనే కడియాన్ని ధరిస్తారు.

మందెచ్చులవారి స్త్రీలు యాదవ స్త్రీలు ఇచ్చిన బట్టలను ధరిస్తారు. వీరు పైట యాదవ స్త్రీలలాగా కుడిభుజం మీద వేయరు. ఎడమ వైపు వేస్తారు. ముసలి వారు చీరెను ధోవతిలాగా గోచి చెక్కుతారు.

స్త్రీలు చెవులకు గంటెలు, పువ్వు ఆకారంలో ఉన్న 'పల్లేరు పువ్వులు' అనే ఆభరణాలను ధరిస్తారు. చేతులకు మణికట్టు కడియాలు, దండకడియాలు, కాళ్లకు కడియాలు ధరిస్తారు. నడుముకు వెండి వడ్డాణం ధరిస్తారు. మెడలో నల్లపూసలు, గంటెపుస్తెలు ధరిస్తారు. కాళ్లకు మట్టెలు పెట్టుకుంటారు. ముక్కుపుల్లలు, ముక్కు పోగులు ధరిస్తారు. చేతులకు ఎరుపు పసుపురంగు గాజులు వేసుకుంటారు.

**సాంఘికాచారాలు :** పుట్టుక, పెళ్లి, మారుమనువు, చావు మొదలైన వాటికి సంబంధించిన ఆచారాలు మతం, దేవతారాధన, నమ్మకాలు, వైద్యం, మందులు, మాయలు, ప్రయోగాలు మొదలైనవి సాంఘికాచారాల కిందకి వస్తాయి.

**పుట్టుక :** మందెచ్చులవారు శిశువు పుట్టిన మూడవ రోజు గానీ, ఇరవైఒకటవ రోజు గానీ పురుషుడు చేస్తారు. పురుడు చేసే రోజు బంధువులు శిశువుకు శిశువు తల్లి



దండ్రులకు బట్టలు తెస్తారు. శిశువుకు స్నానం చేయించే ముందు ఇంటిలో తూర్పు వైపున ఒక గుంటను తీస్తారు. దీన్ని కొల్లుగుంట అంటారు. ఈ గుంటలో శిశువుకు స్నానం చేయించి, ఆ తర్వాత మూడవ రోజు గానీ, ఇరవై ఒకటవ రోజు గానీ పెరుగన్నం, కోడిగుడ్డు, గుడాలు (మొక్కజొన్నలు, చిక్కుడుగింజలు, బబ్బెర్లు, కందులు మొదలైన వాటిని కలిపి ఉడకబెట్టిన గుగ్గిళ్లకు కారం, పోపు పెడితే గుడాలు అంటారు) మొదలైనవి గుంటలో వేసి పూడుస్తారు. పురుడు స్నానం చేయించినాక శిశువుకు చొక్కా తొడిగి దిష్టి తగలకుండా దిష్టిపూసలు కడతారు. పేరు పెడతారు. గుడాలు, మాంసం కూరతో కల్లు లేదా సారా తాగుతూ బంధువులతో భోజనం చేస్తారు.

**వివాహం :** మందెచ్చులవారి వివాహం విషయంలో కులపెద్దలకు చాలా ప్రాధాన్యం ఉంది. కులపెద్దలు లేకుండా, వారి సమ్మతి లేకుండా వీరి పెళ్ళిళ్లు జరుగవు. వివాహం ప్రారంభంలో జరిగే పెళ్లిచూపుల దగ్గర నుంచి పెళ్లి అయిపోయిన తర్వాత గూడ కులపెద్దల పాత్ర చెప్పుకోదగిన విధంగా ఉంటుంది. అంతేగాకుండా ఈ పెళ్లి తంతులో కల్లు లేదా సారాయి ప్రాధాన్యత గూడ ఎక్కువగా ఉంటుంది. మందెచ్చుల వారి పెళ్లి విషయంలో జరిగే మొదటి తంతును "ఇడెం" అంటారు. "విడెం" అనే పదాన్ని వీరు 'ఇడెం' అంటారు. 'విడెం' అంటే తాంబూలం అని అర్థం. మందెచ్చుల పెళ్లిలో 'ఇడెం' అనేది పెళ్లిచూపులు + తాంబూలాలు పుచ్చుకోవడం లాంటిది. ఆ రోజు వరుడు, అతని తల్లిదండ్రులు, కుల పెద్దలను తీసుకొని వధువు ఇంటికి వెళ్లి, వారి ఇంటి ముందు కూర్చున్న తర్వాత కులపెద్ద వధువు తండ్రిని 'అయ్యా పిల్లనిస్తావా' అని అడుగుతాడు. వధువు తల్లిదండ్రులు వరుని గురించి, అతని తల్లిదండ్రుల గురించి, వారి మంచి చెడ్డల గురించి తెలుసుకొని సమ్మతమైతే 'ఇస్తానయ్యా' అంటాడు. అన్ని విషయాలు మాట్లాడుకున్న తర్వాత కులపెద్దలు 'ముంతకల్లు తాగుదాంరా' అని అందరూ కలసి కల్లు తాగుతారు. తర్వాత వరుని తండ్రి కులపెద్దకు ఒక పుల్లను ఇస్తాడు. పెళ్లి పోయిపోయేవరకు ఈ పుల్ల కులపెద్ద దగ్గరే ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఈ పుల్లను వరుని తండ్రి తీసుకొని విరిచివేస్తే ఆ సంబంధం తెగిపోయి నట్లుగా భావిస్తారు. వరుని తండ్రి కులపెద్దకు పుల్లను ఇచ్చిన తర్వాత 'చెయ్యిసాక్షి' చేసుకుంటారు. చెయ్యిసాక్షి అంటే ఫలానా వాళ్ల పిల్లకు ఫలానా వాళ్ల పిల్లగానికి మనువు అని కులపెద్దలు, లేదా పెళ్లి పెద్దలు ముగ్గురు చెప్పిన తర్వాత ఆ ముగ్గురి చేతులమీద వరుడు, వధువు తండ్రి పెళ్లి ఖాయం అన్నట్లుగా చేతులు వేస్తారు. తర్వాత వధువు తరుపు వారు నూటొక్క రూపాయి, వరుని తరుపువారు

నుటొక్క రూపాయిని కులపెద్దకు ఇస్తారు. ఇది నిశ్చితార్థం లాంటిది.

పెళ్ళిరోజున వరుడు అతని బంధువులు కుల పెద్దలతో కలిసి వధువు ఇంటివద్దకు వెళ్ళి, ఇంటి ముందు చాపలు వేసుకొని కూర్చుని ఇచ్చిపుచ్చుకోవడానికి సంబంధించిన అన్ని విషయాలు అంటే ఓలి, పెళ్లికూతురుకు పెట్టవలసిన సొమ్ములు మొదలైనవి మాట్లాడుకున్న తర్వాత, వరుని తల్లిదండ్రులు వధువు చీరకొంగులో పసుపు, బియ్యం, తొమ్మిది తమలపాకులు, తొమ్మిది పోకలు, తొమ్మిది రూపాయలు కడతారు. తర్వాత పెళ్లికూతురు ఇంటిముందు పందిరి వేసి పందిట్లో వధూవరులను ఇద్దరిని కూర్చోబెట్టి కులపెద్దలు వరునితో వధువు మెడలో తాళి కట్టిస్తారు. బంధువులు బిందెలు, పళ్లాలు, బట్టలు, గొర్రెపిల్లలు, డబ్బులు మొదలైన వాటిని వధూవరులకు చదివిస్తారు. తర్వాత పెళ్లికొడుకు ఆరు నెలల పాటు అత్తమామల ఇంటిదగ్గర ఉండి వారికి సేవ చేస్తూ తాను మంచి వాణ్ణని, వారి అమ్మాయిని బాగా చూసుకుంటానని వారికి నమ్మకం కలిగించాలి. వరుడు ఇలా సేవ చేయడాన్ని 'మ్యార' అంటారు. లేక పోతే కులపెద్ద వెంట ఉండి జీవనం సాగిస్తూ భార్యను బాగా చూసుకుంటున్నాడని నిరూపించుకోవాలి. ఈ పద్ధతిని 'పూట' అంటారు. ఇలా 'మ్యార' పద్ధతిలో గానీ 'పూట' పద్ధతిలో గానీ వరుడు తన భార్యను బాగా చూసుకుంటున్నట్లు నమ్మకం కలిగిస్తే అప్పుడు ఆ దంపతలు వేరుగా బతకవచ్చు, వారికి ఇష్టమున్నచోట నివసించవచ్చు. దీనితో మందెచ్చులవారి పెళ్లి తంతు ముగుస్తుంది.

మ్యార, పూట పద్ధతులను మొదట వధువు మంచిని కోరి మందెచ్చులవారు ప్రవేశపెట్టారు. ఏ పద్ధతి అయినా మొదట మంచిని కోరే ప్రవేశపెడతారు. అయితే స్వార్థపరుల స్వార్థం వల్ల ఆ పద్ధతులు దుర్వినియోగమవుతూ ఉంటాయి. అలాగే మ్యార, పూట పద్ధతుల వల్ల వరుడు కొన్ని సందర్భాల్లో కష్టాలు పడవలసివస్తుంది. "ఈ పద్ధతులు ఏర్పడిన కాలంలో అందరికీ బాగానే ఉండవచ్చు. కానీ రానురాను అవి వరునికి బాధల్ని తెచ్చిపెట్టాయి. అత్తమామల వేదింపుకు గురి కావలసివచ్చింది. కొన్ని సందర్భాల్లో భార్యాభర్తలు ఇష్టపడుతున్నా వాళ్ల తల్లిదండ్రుల పట్టింపువల్ల పిల్లల దాంపత్యాలు విడాకులకు దారితీస్తాయి. మ్యార, పూట పద్ధతులు నేడు వెర్రితలలు వేస్తున్నాయి".[4]

**మరణం :** మందెచ్చులవారిలో చనిపోతే ఇంటి ముందు ఒక కర్ర పాతుతారు. పాతిన కర్రను వీరు ఉక్కుకంబం లేక ఈరకంబం' అంటారు. చనిపోయిన వ్యక్తి ముఖాన్ని తూర్పు వైపుకు ఉండేలాగా కూర్చోబెట్టి పాతిన కర్రకు తాడుతో కడతారు. శవం ముందు అగరుబత్తీలు వెలిగించి, ఇంటి ముందు చిన్న మంట వేస్తారు. బంధువులు శవం చుట్టూ కూర్చొని ఏడుస్తారు. ఆ ఇంటిలో వ్యక్తి చనిపోయాడని పదిమందికి తెలియడానికి



పై విధంగా చేస్తారు. తరువాత శవాన్ని గంపలో కూర్చోబెట్టి ఒక బలమైన కర్రకు మధ్యలో గంపను కట్టి కర్రకు అటువైపు ఒకరు, ఇటువైపు ఒకరు పట్టుకొని శ్మశానానికి తీసుకొనివెళ్తారు. మందెచ్చులవారు పాడెకట్టడం, చితిమీద పెట్టి శవాన్ని దహనం చేయడం చేయరు. గొయ్యిని గుండ్రంగా తవ్వి శవం ముఖం ఉత్తరం వైపు ఉండేలాగా కూర్చోబెట్టి మొదట కొంచెం ఉప్పుపోసి తర్వాత మట్టితో పూడుస్తారు. చనిపోయిన మూడవ రోజునగానీ, అయిదవ రోజున గానీ, తొమ్మిదవ రోజున గానీ శవాన్ని పూడ్చిన దగ్గర పిండం పెడతారు. పిండం పెట్టడాన్ని వీరు "పిట్టకు పెట్టడం" అంటారు. పిట్ట అంటే పక్షి. పిట్టకు పెట్టడానికి కోడి, పంది మొదలైన చనిపోయిన వ్యక్తికి ఇష్టమైన మాంసాహారాలు, అన్నం వండి, ఆ ఆహారాలను శవం పాతిపెట్టిన దగ్గరికి తీసుకొని పోయి విస్తరిలో పెడతారు. చేతితో చిన్నగొయ్యి తీసి అందులో కల్లు పోస్తారు. దీన్ని కల్లుగుంట అంటారు. బట్టలు, చుట్ట, చేతికర్ర మొదలైన చనిపోయిన వ్యక్తికి సంబంధించిన వస్తువులు పెట్టి మొక్కుతారు. అక్కడే పెట్టిన వస్తువుల్లో పనికివచ్చే వస్తువులు ఉంటే తిరిగి తీసుకుంటారు. శవం దగ్గర పెట్టిన ఆహారాన్ని మొదట కాకి తింటే మంచిది గాను, గద్ద తింటే ఇంకా మంచిదిగానూ భావిస్తారు. కుక్క తిన్నా మంచిదిగానే భావిస్తారు. తొమ్మిదవ రోజు గానీ, పదకొండవ రోజు గానీ దినం చేసి బంధువులకు మద్య మాంసాలతో భోజనం పెడతారు. సమాధి కట్టి నెల మాసికం, ఏడాది మాసికం చేస్తారు. కథలు చెబుతారు. డబ్బులు లేనివారు సమాధి కట్టడం, మాసికాలు చేయడం చేయరు.

**మతం, దేవతారాధన :** మందెచ్చుల వారందరూ హిందువులే. వీరిలో ఎవ్వరూ క్రైస్తవ మతం గానీ, మరొక మతం గానీ పుచ్చుకున్న వారు లేరు. అయితే వీరు మిగిలిన హిందువుల లాగా దేవాలయాలకు వెళ్లడం, పూజ చేయడం, కొబ్బరికాయలు కొట్టడం మొదలైనవి చేయరు. వీరిలో ప్రధానంగా కులదేవతారాధన, గ్రామదేవతారాధన, పితృదేవతారాధన కనిపిస్తుంది.

యాదవుల కులదేవత అయిన గంగను వీరు తమ కులదేవతగా భావించి కొలుస్తారు. దానికి కారణం వీరు యాదవులను ఆశ్రయించి జీవించడమే. ప్రతి సంవత్సరం సంక్రాంతి ముందు గానీ లేదా తర్వాత గానీ వీరు గంగాదేవిని కొలుస్తారు. ఆ రోజున మందెచ్చుల వారందరూ స్నానం చేసి పచ్చని ఆకులతో పందిరివేసి, పందిరి కింది బల్లలను అరుగులాగా వేసి ఆ అరుగుల మీద పసుపు, కుంకుమ, తెల్లపిండి, నల్లపిండి, పచ్చపిండి అనే అయిదింటితో గంగపట్నం వేస్తారు. తమ దగ్గర బుట్టలో ఉన్న గంగబొమ్మను బయటికి తీసి గంగపట్నం దగ్గరపెట్టి ఆ బొమ్మకు పసుపు కుంకుమలతో బొట్లు పెట్టి పూజిస్తారు. పెద్ద చిప్పలో వత్తివేసి నూనె పోసి

వెలిగిస్తారు. దీన్ని గండదీపం అంటారు. ఇదంతా పొద్దుపొడుపుకు ముందుగానే చేస్తారు. పొద్దుపొడిచేటప్పుడు గంగబొమ్మ ముందు గొర్రెను గావుపట్టి గంగకు మొక్కుతారు. గావు పట్టేముందు -

"శరణు శరణు మాయమ్మా రాణి శాంభవా రాణి శాంభవా రాణి
శరణు జూడు మాకన్నా తల్లీ గంగాభవానీ దేవీ భవానీ"

అని గంగాదేవి పాటపాడుతారు. తర్వాత కల్లు ఆరబోసి గంగకు హారతి ఇచ్చి మొక్కుతారు. ఆ తర్వాత గావు పట్టిన గొర్రెను కోసి వండుకొని కల్లుతాగి తింటారు.

మందెచ్చులవారు ఎల్లమ్మ, పోశమ్మలను ఆరాధిస్తారు. ఈ ఇద్దరు గ్రామదేవతలకు సంవత్సరానికి ఒకసారి పూజ చేస్తారు. వీరు ఒక మేకపోతును ఎల్లమ్మ పేరుతో వదులుతారు. దీన్ని ఎల్లమ్మ పోతు అంటారు. తెలంగాణా ప్రాంతంలో ప్రజలు ప్రతి సంవత్సరం మే నెల మొదటి వారంలో వచ్చే బుద్ధపూర్ణమి రోజు నుంచి మూడు రోజుల వరకు బైండ్ల వారి చేత ఎల్లమ్మ పూజలు చేయిస్తూ ఆరాదిస్తారు. దీన్నే 'ఎల్లమ్మ పున్నమి' అంటారు. ఇదే రోజుల్లోనే మందెచ్చులవారు గూడా ఎల్లమ్మ పూజ చేస్తారు. పూజ చేసే రోజు బియ్యంపిండి, పచ్చపిండి, నల్లపిండి, పసుపు, కుంకుమలతో ఎల్లమ్మ పట్నం వేస్తారు. ఎల్లమ్మ కథను చెబుతారు. ఎల్లమ్మ మేకపోతును వేపాకులో పడుకోబెట్టి అది మత్తుగా నిద్రించేలాగా చేస్తారు. ఇలా చేయడాన్ని 'మత్తగొలుపుట' అంటారు. అలా మత్తులో ఉన్న మేకపోతును ఎల్లమ్మకు బలి ఇచ్చి మొక్కుతారు. తర్వాత దాని మాంసాన్ని వండుకొని కల్లు తెచ్చుకొని తిని తాగుతారు. తాగి తింటారు.

మందెచ్చులవారు శ్రావణమాసంలో పోశమ్మ పండుగ చేస్తారు. పూజచేసే రోజు చాలా రంధ్రాలుండేటట్లుగా ప్రత్యేకంగా తయారుచేసిన కుండను (వెయ్యికండ్లకుండ) తెచ్చి అందులో నూనె పోసి దీపం వెలిగిస్తారు. దీన్ని ఒకరు తలమీద పెట్టుకుంటారు. పసుపు కలిపిన బియ్యంతో వండిన అన్నం కుండ (బోనం)ను మరొకరు నెత్తి మీద పెట్టు కుంటారు. డప్పు శబ్దాల మధ్య కొందరు వేపకొమ్మలు పట్టుకొని లయబద్ధంగా ఎగురుతూ అందరూ కలిసి పోశమ్మ గుడికి వెళ్లి గుడి చుట్టూ మూడు చుట్లు తిరుగుతారు. తర్వాత వెయ్యికండ్ల కుండను, బోనాలను పోశమ్మ విగ్రహం ముందు పెట్టి విగ్రహానికి పసుపు కుంకుమలు పెట్టి అగరువత్తులు వెలిగించి కొబ్బరికాయలు కొడతారు. రెండు చిన్నకుండ (గురిగెలు)ల్లో కల్లు పోసి ఒక కర్రను రెండు వైపులా కట్టి (కావడి) తెచ్చిన కల్లును పోశమ్మ విగ్రహం ముందు ఆరబోసి ఆమె దాహాన్ని తీరుస్తారు. మోదుగాకులో బోనంలోని పసుపుఅన్నం కొంచెం పెట్టి దానిలో కొద్దిగా పెరుగు పోసి అక్కడ నైవేద్యంగా పెడతారు. తర్వాత కోడిని గానీ, గొర్రెను గానీ పోశమ్మకు బలి ఇచ్చి మొక్కుతారు.



పిల్లలను పోశమ్మ ముందు పడుకోబెట్టి మూడుసార్లు పొర్లిస్తారు. తర్వాత బలి ఇచ్చిన ప్రాణిని ఇంటికి తీసుకొనిపోయి కోసి తిని కల్లుతాగుతారు. తాగి తింటారు.

**పితృదేవతారాధన :** గోసాయి అంటే సన్యాసిలాంటివాడు అని అర్థం. గోసాయినే మందెచ్చులవారు గుసాయి అని పలుకుతారు. మందెచ్చులవారిలో గతంలో 'పెద్దగుసాయి' అనే అతను బ్రతికినంతకాలం నీతీనిజాయితీగా ధర్మబద్ధంగా బ్రతికి చనిపోయాడట. అతనికి సమాధి కట్టారు. వీరిలో ఎవరైనా ఏదైన పనిమీద వెళ్లేటప్పుడు పెద్దగుసాయికి మొక్కి వెళ్ళితే అతను వెళ్ళిన పని జరుగుతుందని మందెచ్చులవారు నమ్ముతారు. అందువల్ల వీరు పెద్ద గుసాయికి మొక్కి ఊరు బయలుదేరుతారు. వీరి కుటుంబంలో ఎవరైనా గుసాయి లాగానే ధర్మబద్ధంగా జీవించిన వారికి మొక్కితే తమకు 'పొట్టకు, బట్టకు, ధనం' దొరుకుతుందని వీరి నమ్మకం. అలాంటివారు చనిపోతే వారికి సమాధి కట్టి సమాధి దగ్గర సంవత్సరానికి ఒకసారి పండుగ చేస్తారు.

మందెచ్చులవారు ఈ పండుగను ప్రతి సంవత్సరం శ్రావణమాసంలో చేస్తారు. ఈ పండుగ రోజున వీరందరు స్నానంచేసి మద్యమాంసాలతో సమాధి వద్దకు వెళ్లి సమాధి దగ్గర చాపలు పరుస్తారు. మర్రిఆకులతో చేసిన మూడు విస్తర్లను పెట్టి మెత్తటి మాంసాన్ని ఆ విస్తర్లలో పెడతారు. ఒక ముత్తైదువ కాళ్లకు పసుపు రాసి ఆమెను. మరొక ఇద్దరు పురుషులను విస్తర్ల ముందు కూర్చోబెట్టి కొబ్బరికాయలు కొట్టి కల్లు ఆరబోసి మొక్కుతారు. తర్వాత కూర్చున్న ముగ్గురికి కల్లు పోసి తాగిస్తూ, కూర తినబెడతారు. ఇలా ఈ ముగ్గురికి తృప్తిదీరేలాగా తాగి తినబెట్టి తృప్తిగా ఉందా అని వారిని అడుగుతారు. వారు తృప్తి అయింది అని చెప్పిన తర్వాత మిగిలిన వారందరూ కల్లు తాగుతూ మాంసాహారం తింటారు. తాము వాడుకునే వస్తువులన్నీ సమాధి దగ్గర పెట్టి మొక్కుతారు. తర్వాత 'పెద్ద గుసాయికి సెలవేనా? అని కొందరు అడిగితే 'సెలవే' అని మరికొందరు పలికి ఇళ్లకు వెళ్లిపోతారు.

మందెచ్చులవారి పైపండుగలను గమనిస్తే వీరి పండుగల్లో మద్యమాంసాలను స్వీకరించడమే ముఖ్యమైనదిగా కనిపిస్తుంది. అందువల్లనే తమ పండుగలన్నీ "తినుడుతాగుడు పూజే" అని వీరు చెబుతారు.

**ప్రమాణాలు :** మందెచ్చులవారికి ప్రమాణాలమీద నమ్మకం ఎక్కువ. వీరి భార్యలు పరాయి పురుషులతో అక్రమ సంబంధం పెట్టుకున్నారని భర్తలకు అనుమానం వచ్చి వారి మీద నింద మోపుతారు. అది నిజం కాకపోతే వారి స్త్రీలు ప్రమాణాలు చేస్తారు. అలాగే వీరిలో ఎవరిమీదనైనా దొంగతనం నేరం గానీ మరొకనేరం గానీ ఆరోపింప బడినపుడు ఆరోపింపబడిన వ్యక్తి నేరం చేయనప్పుడు ఆ వ్యక్తి తన నిర్దోషిత్వాన్ని

రుజువు చేసుకోవడానికి ఇలాంటి ప్రమాణాలు చేస్తారు. వీరు చేసే ప్రమాణాలు మూడు రకాలుగా ఉన్నాయి. 1. గడ్డపార ప్రమాణం, 2. సల్లటి ప్రమాణం, 3. నూనెకలాయి ప్రమాణం.

**గడ్డపార ప్రమాణం :** మందెచ్చులవారిలోని స్త్రీపురుషుల్లో ఎవరిమీదనైనా నేరం ఆరోపించబడినప్పుడు వారు తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికి గడ్డపార ప్రమాణం చేస్తానని చెబుతారు. అప్పుడు కులపెద్దలు కొత్తగడ్డపార (గడ్డపలుగు) కొని తెప్పించి పదునుగా ఉన్న వైపు నుగ్గులతో గానీ, బొగ్గులతో గానీ బాగా వేడి చేస్తారు. ప్రమాణం చేసే వ్యక్తి సచేలస్నానం చేసి తడిబట్టలతో వస్తాడు. అప్పుడు గడ్డపారను నిప్పుల్లో నుంచి బైటకు తీస్తారు. ప్రమాణం చేసే వ్యక్తి గడ్డపారను కాల్చిన వైపు రెండు చేతులతో పట్టుకుని మూడుసార్లు దూయాలి. అలా దూసినప్పుడు ఆ వ్యక్తి చేతులు కాలకుండా ఉంటే అతణ్ణి నిర్దోషిగా పరిగణిస్తారు. కాలితే దోసిగా నిర్ణయించి కులపెద్దలు దండుగ విదిస్తారు.

**సల్లటి ప్రమాణం :** ఈ ప్రమాణంలో భూమి మీద ఏడు గిర్రలు గీస్తారు. గిర్ర అంటే గుండ్రం గుండ్రంగా [ ◎ ] బ్రాకెట్టులో చూపించినట్లుగా గీత గీయడం. ఒక్కొక్క గిర్ర మీద కొంత వేపాకు దాని మీద ఆవుపేడతో చేసిన ముద్ద పెడతారు. ప్రమాణం చేసే వ్యక్తి ఆ గిర్రల మధ్యలోకి వచ్చి వేపాకు ఆవుపేడ తలమీద పెట్టుకొని తన మీద ఆరోపించబడిన నేరం తాను చేయలేదని తన మీద తన పిల్లలమీద ప్రమాణం చేస్తాడు. అలా ప్రమాణం చేసిన వ్యక్తి తాను నేరం చేసీ చేయలేదని దొంగప్రమాణం చేస్తే వారం పది రోజుల్లో ఆ వ్యక్తికి గానీ, ఆతని పిల్లలకు గానీ, ఏదైనా రోగం రావడం గానీ, ప్రమాదం కలగడం గానీ జరుగుతుందని వీరు నమ్ముతారు.

**నూనెకలాయి ప్రమాణం :** కులపెద్దలు రెండు కిలోగ్రాముల నూనె తెప్పించి కలాయి పాత్రలో పోసి బాగా మరిగే వరకు వేడి చేయిస్తారు. ప్రమాణం చేసే వ్యక్తి సచేలస్నానం చేసి తడిబట్టలతో వచ్చి తన రెండు హస్తాలను మరిగే నూనెలో ముంచి తీయాలి. అలా తీసినప్పుడు ఆ వ్యక్తి చేతులు కాలకపోతే ఆ వ్యక్తి తప్పు చేయనట్లు లెక్క. కాలితే తప్పు చేసినట్లు. తప్పు చేసిన వారు ఇలాంటి ప్రమాణం చేస్తే వారి చేతులు కాలి పనికిరాకుండా పోతాయని మందెచ్చుల వారు నమ్ముతారు. తప్పు చేయని వాళ్ళే ఇలాంటి ప్రమాణాలకు పూనుకుంటారని, తప్పు చేయనివారు ఇలాంటి ప్రమాణాలు చేసినా వారికి ఎలాంటి గాయం కాదని వీరు గట్టిగా నమ్ముతారు.

**కులపంచాయితీలు :** సంచార జీవనం చేసే గాయకభిక్షుకులందరిలోనూ కుల పంచాయితీలు ఒక కట్టుబాటుగా ఉంటాయి. గాయక భిక్షుకులు ఒకచోట స్థిరనివాసం



ఉండకుండా సంవత్సరంలో ఎక్కువకాలం సంచార జీవనం చేస్తూ ఉంటారు. ఇలా సంచార జీవనం చేసేటప్పుడు తమలో వచ్చిన తగాదాలను న్యాయస్థానాల్లో తీర్చుకొనే సమయం, ఆర్థిక స్థోమత వీరికి ఉండదు. అంతేగాకుండా వారు ప్రధానంగా సిగ్గరులు, ఆత్మన్యూనతాభావం కలిగినవారు. ఇలాంటి వారు మిగిలిన ప్రజలతో కలువలేరు. వీరు వీరి జాతి వారితోనే కలిసి ఉంటారు. అందువల్ల గాయకభిక్షుకులు తమ తగాదాలను తమ కులపెద్దల ద్వారానే తీర్చుకోవాలనే కట్టుబాటు పెట్టుకున్నారు. కులపెద్దలు తగవు వచ్చినప్పుడు అందరి ముందు ఇరువర్గాలవారిని విచారించి తప్పు చేసిన వారికి జరిమానా విధిస్తారు. దీని వల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. విచారణ కులస్థులందరి ముందు జరుగుతుంది కాబట్టి న్యాయనిర్ణయం పక్షపాతంగా ఉండడానికి అవకాశం ఉండదు. ఆలశ్యం లేకుండా తప్పు చేసిన వారికి వెంటనే శిక్షపడుతుంది. అన్యాయం జరిగిన వ్యక్తికి సత్వర న్యాయం జరుగుతుంది. అయితే తప్పు చేసిన వాని దగ్గర నుంచి కులపెద్దలు జరిమానాగా వసూలు చేసిన డబ్బును తప్పు చేయని వారికి గానీ, లేక తమ కులస్థుల సంక్షేమానికి గానీ ఉపయోగిస్తే బాగుండేది. అలా కాకుండా కులపెద్దలు జరిమాన ధనంతో తిని తాగి జల్సా చేస్తారు. ఈ కులపంచాయితీ పద్ధతిలో ఉండే పెద్దలోపం ఇదే.

మిగిలిన గాయకభిక్షుల్లో ఉన్నట్లుగానే మందెచ్చులవారిలో గూడా కుల పంచాయితీ పద్ధతి కట్టుబాటుగా ఉంది. వీరు తమలో వచ్చిన చిన్న, పెద్ద తగాదాలు, అక్రమ సంబంధ వివాదాలు, విడాకులు, అన్నదమ్ముల మధ్య, బంధువుల మధ్య వచ్చే సమస్యలు మొదలైన వాటినన్నింటినీ కులపెద్దల దగ్గర పరిష్కరించుకుంటారు. ప్రతి ఊర్లోనూ కులపెద్దలుంటారు. కులపెద్దలను న్యాయగాళ్ళు అంటారు. ఇద్దరు వ్యక్తుల మధ్య తగాదా వచ్చినప్పుడు ఇద్దరిలో ఒకరు కులపెద్ద వద్దకు వెళ్ళి అగ్గిపుల్ల లాంటి పుల్లను అతని చేతిలో పెట్టి, తమ మధ్య వచ్చిన తగాదాను కులపెద్దకు వివరించి కొంతడబ్బు (వెయ్యిగానీ, రెండు వేలుగానీ) అతని చేతిలో పెట్టి తనకు న్యాయం చేయమని కోరతాడు. కులపెద్ద దానికి అంగీకరించి అవతలి వ్యక్తిని పిలిచి, అతని మీద వచ్చిన నేరారోపణ గురించి చెప్పి, ఫిర్యాదు చేసిన వ్యక్తి ఎంత డబ్బు ఇచ్చాడో అంత డబ్బు ఇమ్మని అడుగుతాడు. నేరం ఆరోపించబడిన వ్యక్తి తలతాకట్టుపెట్టి అయినా ఆ డబ్బు వెంటనే గానీ, లేదా నిర్ణీత గడువులోగానీ తప్పనిసరిగా ఇవ్వాలి. ఇవ్వకపోతే కుల బహిష్కరణ చేస్తారు. కులబహిష్కరణ చేస్తే అతనితో మిగిలిన వారు ఎవరూ మాట్లాడరు. అందువల్ల నేరం ఆరోపించబడిన వ్యక్తి తన తప్పు ఉన్నా, లేకపోయినా తప్పనిసరిగా డబ్బు కులపెద్దకు ఇస్తాడు. కులపెద్ద మిగిలిన పెద్దలతో

సంప్రదించి పంచాయితీ రోజును నిర్ణయించి ఇరువర్గాలవారికి తెలియజేస్తాడు. పంచాయితీ రోజున న్యాయగాళ్లు ఒక చెట్టు కిందగానీ, పంచాయితీ కోసం ఏర్పాటు చేసిన పంచాయితీగద్ద మీద గానీ సమావేశమై వాదిప్రతివాదులను, మిగిలిన కులస్థు లందరినీ పిలిపించి అందరి ముందు విచారణ జరిపి న్యాయ నిర్ణయం చేస్తారు. దోషిగా నిర్ణయింపబడిన వ్యక్తికి అతను చేసిన తప్పును బట్టి దండగ (జరిమానా) విధిస్తారు. లేకపోతే అతను అంతకుముందు కులపెద్దకు ఇచ్చిన డబ్బును జరిమానాగా నిర్ణయిస్తారు. అది తప్పు చేసిన వ్యక్తికి శిక్షగా భావించి అలా చేస్తారు. నిర్దోషిగా తేలిన వ్యక్తి డబ్బును అతనికి తిరిగి ఇచ్చివేస్తారు. కులపెద్దలు నిర్దోషి డబ్బును పూర్తిగా ఇవ్వరు. ఫిర్యాదు చేసినప్పటి నుంచి విచారణ చేసే రోజు వరకు రెండు రోజులుగానీ, వారంరోజులుగానీ సమయం పడుతుంది. ఈ రోజుల్లో కులపెద్దలు తిని, తాగడానికి కొంత డబ్బు ఖర్చు చేస్తారు. ఖర్చు అయిపోగా మిగిలిన డబ్బును నిర్దోషిగా తేలినవ్యక్తికి ఇస్తారు. దోషిగా తేలిన వ్యక్తి జరిమానాగా ఇచ్చిన డబ్బుతో కులపెద్దలు మద్యమాంసాలతో జల్సా చేస్తారు. ఒకవేళ నేరస్థుడుగా నిర్ణయించబడిన వ్యక్తికి కులపెద్దల తీర్పు నచ్చకపోతే, అతను ఆ విషయాన్ని కులపెద్దలకు చెప్పి వేరే ఊర్లో ఉన్న మందెచ్చుల కులపెద్దలను పిలిపించి న్యాయ విచారణ చేయించమని కోరవచ్చు. దానికి కులపెద్దలు అంగీకరిస్తారు. అయితే ఆ వేరే ఊరి కులపెద్దలు అక్కడికి రావడానికి, వారు తిని తాగడానికి అయ్యే ఖర్చును అతనే భరించ వలసి ఉంటుంది.

ఇలా మందెచ్చులవారిలో చాలామంది తాము సంపాదించుకున్న ధనాన్ని కుల పంచాయితీలో కులపెద్దల పరంచేసి నష్టపోతున్నారు. పోనీ ఆ ధనంతో కుల పెద్దలైనా బాగుపడతారా అంటే అదీ లేదు. కులపెద్దలు కులపంచాయితీల్లో జరిమానాగా వచ్చిన డబ్బును పూర్తిగా మద్యమాంసాలకే ఖర్చు చేస్తారు. సంచారజీవనులైన బుడగ జంగం వారి జీవితాలను గుల్ల చేస్తున్న ఈ కులపంచాయితీ పద్ధతిని బుడగజంగాల వారు మానుకోవాలని కోరుతూ ఒక పాట ఉంది. ఈ పాట డా॥ ఎన్.ఆర్. వెంకటేశంగారు రాసిన 'బుడ్గజంగం దర్శిని' అనే గ్రంథంలోని మందెచ్చులవారు గూడా బుడగజంగం కులస్థులే కాబట్టి ఆ పాటను ఇక్కడ ఇవ్వడం అవసరమని భావిస్తున్నాను. ఆ పాట పేరు పంచాయితీ పాట. ఆ పాట ఇది.[5]

పల్లవి : నాయాలు నీకొద్దురా నాదిగా
మాయల్లో పడబోకురా జారిగా ॥నా॥
అనుపల్లవి : మాయదారి నాయగాల్లు – మేయవత్రి పైసలన్నీ
చెప్పిన వినకుంటే – చెడిపోతవ్ కొడ్కా ॥నా॥



చరణం–1 : పిల్లా నిచ్చిన కాడ తప్పుదాయె నాయాము
పిల్లాను పట్టినంక తప్పుదాయె నాయాము
మరిచిపోయి నాయాము – చేసుకోండి సాయము ॥నా॥
చరణం–2 : చిన్నచిన్న మాటకాడ – ఎందుకయ్య కయ్యాము
కొట్లాడిన ప్రతిసారి – ఎందుకయ్య నాయాము
కలిసుండీ మీరంత – చెయ్యండీ నెయ్యాము ॥నా॥
చరణం–3 : ముచ్లీక ఇచ్చుకోని – ముంచుకోకు నీకొంప
కొళ్ళు పట్టి కొళ్ళు పట్టి – కూలిపోకు నీవింక
శరణార్తి అన్నవంటె – తప్పు లేదు నీవంక ॥నా॥

ప్రతి చిన్న తగాదానూ కులపంచాయితీలో పెట్టి ఆర్థికంగా నష్టపోవద్దని బుడగ జంగాలను ఈ గేయం చైతన్యపరుస్తూ ఉంది. ఇందులో నాయాలు అంటే కుల పంచాయితీలు. నాయగాల్లు అంటే కులపమచాయితీల్లో తీర్పు చెప్పే కులపెద్దలు. ముచ్లీక అంటె వాది తనకు న్యాయంచేయమని కులపెద్దను కోరుతూ ఇచ్చే పుల్ల. కొళ్ళు అంటే తప్పులు పట్టడం. ఈ అర్థాలను ఎన్.ఆర్. వెంకటేశంగారే ఇచ్చారు.

అలపెద్దలు తొందరపడి తీర్పు చెప్పరు. తగాదా పడిన భార్యాభర్తలను కలిపి ఉంచే ప్రయత్నం చేస్తారు. భర్త తాగి వచ్చి భార్యను తిడుతూ కొడుతూ ఉంటే అతని ప్రవర్తనతో విసిగిపోయిన భార్య కులపెద్దల వద్దకు వెళ్లి 'అయ్యా నామొగుడు తిట్టరాని తిట్లు తిడుతుండు, కొట్టరాని కొట్లుకొడుతుండు' అని ఫిర్యాదు చేస్తుంది. కులపెద్దలు ఆమె భర్తను పిలిపించి. అతనితో మాట్లాడి విషయం తెలుసుకొని ఇద్దరికి సర్ది చెప్పి సంసారం చేసుకోమని పంపిస్తారు. ఇలా రెండు మూడు సార్లు సర్దిచెప్పి పంపిస్తారు. అయినా వారు సర్దుకొని పోకుండా దెబ్బలాడుకుంటూ కులపెద్దల దగ్గరికి పంచాయితీకి వస్తే ఇద్దరినీ విచారించి తప్పుచేసిన వారికి దండుగ (జరిమానా) విధిస్తారు. ఇద్దరిలోనూ తప్పులుంటె ఇద్దరికీ దండగ విధిస్తారు. స్త్రీకి అయిదు వేలకు తక్కువ కాకుండా పురుషనితో డబ్బులు ఇప్పించి 'పుల్ల విరిచి' విడాకులు ఇప్పిస్తారు. అప్పుడు వారు మరొక పెళ్లి చేసుకోవచ్చు. ఇద్దరి దగ్గర వసూలు చేసిన దండుగ డబ్బుతో కులపెద్దలు తిని తాగుతారు.

మందెచ్చులవారు ఒకరికి హక్కుగా ఉన్న గ్రామాలకు మరొకరు వెళ్లి కథలు చెప్పి యాదవుల దగ్గర 'తాగం' తీసుకుంటే, హక్కుదారులు పంచాయితీ పెడతారు. కులపెద్దలు తప్పు చేసిన వారికి అయిదు వందలకు తక్కువ గాకుండా దండుగ వేసి ఆ డబ్బును హక్కుదార్లకు ఇప్పిస్తారు. అంతేగాకుండా నిందితులు ఆ గ్రామంలో

సంపాదించిన మొత్తంలో సగం డబ్బు హక్కుదార్లకు ఇప్పిస్తారు.

మందెచ్చులవారు తమ స్త్రీపురుషుల మధ్య ఉన్న అక్రమ సంబంధం బైటికి తెలిస్తే పంచాయితీ చేసి ఇద్దరికీ దండగ విధిస్తారు. తమ స్త్రీ ఇతర కులస్థునితో అక్రమ సంబంధం పెట్టుకుంటే దాన్ని తీవ్రంగా పరిగణించి ఆమెకు దండుగ విధించడమే కాకుండా కొన్ని ఆంక్షలు విధించి ఆ తర్వాత ఆమెను తిరిగి కులంలో కలుపుకుంటారు.

**మందెచ్చులవారి భాష :** మందెచ్చులవారి మాతృభాష తెలుగే. ఐనప్పటికీ వీరు తమలో తాము మాట్లాడు కొనేటప్పుడు కొన్ని పదాలను సంకేత పదాల్లాగ మధ్యమధ్యలో మాట్లాడు తుంటారు. అలాగే కొన్ని తెలుగు పదాలను కూడా వేరే అర్థంలో ఉపయోగిస్తారు. ఉదాహరణకు :- వీరు భార్యను 'మనుమరాలా' అని పిలుస్తారు. అలాగే భార్య కూడా భర్తను 'తాత' అని పిలుస్తుంది. పూర్వకాలంలో ఎక్కువ వయస్సు ఉన్న పురుషులు తమ మనమరాలు వయస్సున్న అమ్మాయిలను పెళ్ళిచేసుకొనేవారు. అలాంటి కాలంలో ముసలిభర్త చిన్న వయస్సు ఉన్న అమ్మాయిని మనుమరాలా అని పిలిచి ఉండవచ్చు. అదేవిధంగా తక్కువ వయసు ఉన్న అమ్మాయిలు ముసలి భర్తను తాత అని పిలుస్తుంటారు. ఆ పిలుపులే తరువాత కూడా కొనసాగి ఉంటాయి. అలాగే మందెచ్చులవారు కొన్ని పదాలను వేరే అర్థంలో తమలోతామే మాట్లాడుకుంటారు. కింద ఆ పదాలను, ఆ పదాల అర్థాలను ఇస్తున్నాను.

| పదం | | అర్థం |
|---|---|---|
| బండారు | - | అన్నం |
| కోటి | - | కూర |
| మెసకడం | - | తినడం |

ఉదాహరణకు 'బచ్చావాడా బండారు మెసకురా' అంటే 'పిల్లోడా అన్నం తినరా' అని అర్థం.

| | | |
|---|---|---|
| తోర్సిగాడు | - | ఉడుత |
| గరింగాడు | - | ఎలుక |
| నర్సిగాడు | - | నక్క |
| ఊరగాసికం | - | జంగుపిల్లి |
| ఉన్నాసిగాడు | - | ఎలుక |
| వలెంగాడు | - | ఉడుము |
| మండిగాడు | - | పంది |
| కురుంగాడు | - | తాబేలు |
| కొక్కిడిగాడు | - | కోడి |



మొదలైనవి జంతువులకు సంబంధించిన మాటలు.

| | | |
|---|---|---|
| తాటగాడు | - | బ్రాహ్మణుడు |
| గొంటగాడు | - | వైశ్యుడు |
| నెట్టగాడు | - | దొర |
| ఎల్కోడు | - | రెడ్డి |
| జిడ్డెగాడు | - | యాదవుడు |
| కీనెగాడు | - | మాదిగవాడు |

మొదలైనవి ఆయా కులాలకు సంబంధించిన పురుషులను సూచించే పదాలు.

| | | |
|---|---|---|
| క్యావకోటి | - | సొంతకొడుకు |
| బచ్చకోటి | - | కూతురు |
| నెట్లోడు | - | తండ్రి |

మొదలైనవి బంధుత్వాలకు సంబంధించిన కొన్ని పదాలు. ఈ విధంగా మందెచ్చుల వారు తెలుగుభాషలో కొన్ని తమ పదాలను ఇంకొక అర్థంలో ఉపయోగిస్తారు.

## బైకానివారు - జీవనవిధానం :

బైకానివారు వరంగల్, నల్గొండ జిల్లాల్లో ఉన్నారు. వీరి ప్రధానవృత్తి వంశపారంపర్యంగా తమకు హక్కుగా వస్తూ ఉన్న యాదవులున్న గ్రామాలకు వెళ్ళి కాటమరాజు కథలను చెప్పి వారి వద్ద నుంచి తాగంగా జీవంపిల్లను గానీ డబ్బు గానీ ధాన్యం గానీ తీసుకోవడం. వీరు ఫిబ్రవరి నెల నుంచి జూన్ నెల వరకు ఇలా గ్రామాలకు వెళ్తారు. ఇలా వెళ్ళినప్పుడు వీరు 8 మంది వెళ్తారు. గ్రామంలో ఉన్న యాదవులు ఒక ఇంటి పేరు గల వాళ్ళందరు కలిసి వీరికి ఒక జీవం పిల్లను ఇస్తారు. డబ్బులైతే ఊర్లో ఉన్న యాదవులందరూ కలిసి కొంత డబ్బు ఇస్తారు. ఇది ఊర్లో ఉన్న యాదవుల ఇళ్ళ సంఖ్యను బట్టి ఉంటుంది. గ్రామంలో 50 యాదవుల ఇళ్ళుంటే వారందరూ కలిసి ఇంటికింత అని డబ్బులు వసూలు చేసి 8 వేల నుంచి 10 వేల వరకు బైకానివారికి ఇస్తారు. ధాన్యమైతే పుట్టెడు (8 బస్తాలు) ఇస్తారు. బైకానివారికి యాదవులు ఇచ్చే డబ్బు మొదలైన వాటిని "తాగం" అంటారు. ఈ తాగాన్ని బైకానివారు 8 భాగాలుగా చేసి తలా ఒక భాగం తీసుకుంటారు. పాలివాళ్ళు అంటే తాము వెళ్ళిన ఊరు మీద హక్కు ఉన్నవారు కథ చెప్పడానికి తమ తోటి బైకానివారిని తీసుకొని వెళ్ళినప్పుడు హక్కు ఉన్నవారు ఒక భాగం ఎక్కువ తీసుకుంటారు.

బైకాని వారు మూడేళ్ళకొకసారి ఇలా వెళ్ళినప్పుడు కొన్ని గ్రామాల్లో ఉన్న

యాదవులు ముఖ్యంగా సద్దనపుగొల్లలు వీరి చేత తమ కులదైవమైన గంగమ్మకు పండుగ చేయిస్తారు. దీన్నే లింగమంతుల పండుగ అని కూడా అంటారు. ఈపండుగను రెండు విడతలుగా చేస్తారు. మొదటి విడతగా పండుగ చేయదలిచిన గ్రామానికి ఆదివారం ఉదయం వెళ్తారు. ఆదివారం సాయంత్రం గంగమ్మకు బలి ఇవ్వడానికి ఒక పొట్టేలును, ఒకమేకపోతును, వాటి మాంసాన్ని వండడానికి అవసరమైన సరుకులను తీసుకొని ఆఊర్లో ఉన్న యాదవులతో కలిసి గంగమ్మ గుడి వద్దకు వెళ్తారు. ఆరోజు రాత్రి గుడి దగ్గరే పడుకుంటారు. సోమవారం తెల్లవారుజామున రెండు యాటలను (పొట్టేలు,మేకపోతు) గంగమ్మకు బలి ఇస్తారు. ఐదు సోలల వరిఅన్నం, ఐదు సోలల జొన్న అన్నం వండి ఆఅన్నాన్ని రాసులుగా పోసి దాని మీద గొర్రెపాలతో చేసిన పెరుగు పోస్తారు. రెండు కుంభాల మీద జ్యోతులు వెలిగిస్తారు. బలి ఇచ్చిన జీవాల రక్తాన్ని ఒక చిప్పలో పట్టి ఆరక్తంలో వరిఅన్నం జొన్నఅన్నం కలిపి గుడి పైన మూడు చుట్లు బలిబలి అనుకుంటూ రక్తం కలిపిన అన్నాన్ని చల్లుతారు. యాదవుల్లో ప్రధానంగా రాజులు, పూజారులు అని రెండు రకాల వారుంటారు. రాజులు వైష్ణవులు. పూజారులు శైవులు. రాజులు రాజులు ఇచ్చిపుచ్చుకోరు. అలాగే పూజారులు పూజారులు ఇచ్చి పుచ్చుకోరు. రాజులు పూజారులు ఇచ్చిపుచ్చుకుంటారు. బైకాని వారు రాజులను దక్షిణం వైపు పూజారులను ఉత్తరం వైపు కూర్చోబెట్టి రాజులకు నిలువుబొట్లు పూజారులకు అడ్డబొట్లు పెడతారు. బొట్లు పెట్టేటప్పుడు దీవిస్తారు. జొన్నఅన్నాన్ని పూజారులకు, వరిఅన్నాన్ని రాజులకు ముద్దలు చేసి వారి చేతుల్లో బైకాని వారు పెడతారు. ఆతర్వాత ఊర్లోని యాదవులు పొట్టేలును కోసి దాని మాంసాన్ని గుడి దగ్గరే వండుకొని తింటారు. మేకపోతు మాంసాన్ని బైకానివారు తమ ఇంటికి తెచ్చుకొని అందరూ సమానంగా పంచుకొని వండుకొని తింటారు. ఇది మొదటి విడత. ఈతంతును దిష్టి తీయడం అంటారు.

ఆతర్వాత ఒక ఆదివారం పోనిచ్చి మరుసటి ఆదివారం బైకానివారు మళ్ళీ ఆగ్రామానికి వెళ్తారు. ఆది, సోమ, మంగళవారాల్లో గంగమ్మ పండుగకు సంబందించిన అనేక పూజా కార్యక్రమాలను చేసి రాత్రి పూట వరుసగా మూడు రోజులు కాటమరాజు కథలను చెబుతారు. ఆదివారం రాత్రి గంగతరకవాదం కథను, సోమవారం రాత్రి పోలు రాజు కథను, మంగళవారం రాత్రి మాణిక్యమ్మ కథను చెబుతారు. మంగళవారం రాత్రితో పండుగ పూర్తి అవుతుంది. ఆమరుసటి రోజు అంటే బుధవారం యాదవుల దగ్గర వీరు తాగం తీసుకుంటారు. పండుగ చేయించిన గొల్లలందరూ కలిసి 10 వేల రూపాయల దాకా తాగం ఇస్తారు.

అన్ని గ్రామాల్లోని యాదవులు తప్పనిసరిగా గంగమ్మ పండుగ చేయాలని



ఏమీ లేదు. ప్రధానంగా సద్దనపు గొల్లలు మాత్రం తప్పనిసరిగా చేస్తారని తండు భిక్షం గారు చెప్పారు. ఎర్రగొల్లలు, పూజగొల్లలు మొదలైన వారు మూడేళ్ళకొకసారి పండుగ చేస్తే చేస్తారు. లేకపోతే లేదు. పండుగ చేయకపోయినా వీరు బైకానివారికి తాగం మాత్రం ఇస్తారు.

యాదవుల ఇళ్ళలో ఎవరైనా చనిపోతే బైకానివారికి కబురు పంపిస్తారు. బైకానివారు పెద్దదినం రోజు చనిపోయిన వారింటికి వెళ్ళి కొన్ని పూజాకార్యక్రమాలు చేసి పిండం పెట్టిస్తారు. పిండం పెట్టడాన్ని పిట్టకు పెట్టడం అంటారు. పిండం పెట్టేటప్పుడు కాటమరాజు కథల్లో ఒకటైన "చనిపోయిన యాదవులకు బత్తుడు కాశీలో పిండం పెట్టిన కథను" పాడతారు. ఆరోజు రాత్రి పెద్దిరాజు కథను చెబుతారు. చనిపోయిన వారి ఆత్మకు శాంతి కలగాలని అనేక రకాల పాటలు పాడతారు. ఈకార్యక్రమం అయిపోయిన తర్వాత చనిపోయిన ఇంటియాదవులు 2 వేల రూపాయల దాకా బైకాని వారికి దక్షిణ ఇస్తారు. కొంత మంది యాదవులు ఈసమయంలో బైకానివారికి గోదానం, భూదానం, సువర్ణదానం, వెండిదానం, గొర్రె, మేక దానం మొదలైనవి కూడా చేస్తారు. వెండి అయితే 10 తులాల కడియం, 20 తులాల వెండి మొలతాడు, రెండు దండెలకు పదేసి తులాల కడియాలు రెండు, మొత్తం 50 తులాల వెండిని బైకానివారికి ఇస్తారట. యాదవులు బైకానివారిని తమ కులగురువులగా భావించడం వల్లనే వీరికి ఈవిధమైన దానాలు చేస్తున్నారు.

కొన్ని గ్రామాల్లోని యాదవులు తమ మధ్య ఏవైనా తగాదాలు వచ్చినప్పుడు బైకానివారిని పిలిచి న్యాయనిర్ణయం చేయమని కోరతారు. బైకానివారు ఆవూర్లో ఉన్న యాదవకుల పెద్దలతో కలిసి న్యాయనిర్ణయం చేసి తప్పు చేసిన వారికి జరిమానా విధిస్తారు. ఈజరిమానాలో 10వ వంతు న్యాయనిర్ణేతలుగా వచ్చిన బైకానివారికి గురుకట్నం కింద ఇస్తారు.

బైకానివారు ఉత్తరాంధ్ర జిల్లాల్లోని పొడపోతులవారి లాగా యాదవులను ఆశ్రయించి బాగా ధనం సంపాదించి తమ ఊర్లో భూములు కొని సుఖంగా జీవిస్తున్నారు. వీరు యాదవులను యాచించడానికి వెళ్ళినప్పుడు తమ స్వంత డబ్బు పైసా గూడా ఖర్చు పెట్టరు. వీరు యాదవుల గ్రామాలకు వెళ్ళడానికి ప్రయాణం ఖర్చుల దగ్గరనుంచి తిండి నివాసం తాగుడు మొదలైనవన్నీ ఆవూరి యాదవులే భరిస్తారు. అందువల్ల యాదవులు వీరికి తాగంగా ఇచ్చిన దాన్ని మిగుల్చుకొని దానితో తమ ఊర్లలో భూములు కొనుక్కొని వాటిని పండించుకొని బాగుపడుతున్నారు. ఉదాహరణకు వరంగల్ జిల్లా తొర్రూరు మండలం పోలేపల్లి గ్రామంలో ఉన్న తండు భిక్షం గారికి 5 ఎకరాల

మాగాణి, 20 ఎకరాల మెట్టభూమి ఉంది. ఈభూమంతటినీ బైకాని వృత్తి ద్వారానే సంపాదించానని భిక్షుం గారు చెప్పారు. మాగాణిలో వరి, మెట్టభూమిలో మొదటి పంటగా పెసర, నువ్వులు, కంది, పసుపు, పత్తి, మిరప మొదలైన పంటలను, రెండవ పంటగా వేరుశెనగను వేస్తారు. కాటమరాజు కథలను చెప్పే గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, మందెచ్చులవారు, పొడపోతులవారు, తెరచీరలవారు, బైకానివారిలో పొడపోతులవారు, బైకానివారు మిగిలిన వారి కంటె బాగా డబ్బు సంపాదించి బాగుపడి సుఖజీవనం చేస్తున్నారు. యాదవుల నుంచి తాగంగా సంపాదించిన ధనాన్ని తాగుడుకు ఖర్చుపెట్టి ఏమాత్రం బాగుపడకుండా దరిద్రాన్ని అనుభవిస్తున్నవారు కొమ్ములవారు, మందెచ్చులవారు. మిగిలిన నాలుగు కళలవారు అంతో ఇంతో సంపాదించి బాగుపడ్డారు.

బైకానివారి మాతృభాష తెలుగే. ఐనప్పటికీ వీరు కొన్ని పదాలను తమకు మాత్రమే తెలిసిన అర్థంలో ఉపయోగిస్తారు. ఆ పదాలను వాటి అర్థాలను కింద ఇస్తున్నాను.

| పదం | | అర్థం |
|---|---|---|
| వడిశె | - | అన్నం |
| లాకు | - | కూర |
| మెసకడం | - | తాగడం |
| నాశం | - | మాంసం |
| సిరోడు | - | మనిషి |
| శామ | - | ఆడమనిషి |
| దుపుకశామ | - | గర్భవతి |
| శామలాపి | - | ఆడపిల్ల |
| కడమలాపి | - | మగపిల్లావాడు |
| గిర్రలాపి | - | ఎర్రపిల్ల |
| నలుపులాపి | - | నల్లపిల్ల |
| లాపిగాళ్ళు | - | పిల్లలు |
| వం | - | దేవుడు |
| మెర్పు | - | కారం |
| ఎంబి | - | బియ్యం |
| సుల్పు | - | బట్టలు |
| దుదుకల | - | ఎండుకొబ్బరి |
| జేకరా | - | తీసుకురా |



| | | |
|---|---|---|
| లూకా | - | కల్లు |
| రాస | - | సారా |
| ఎర్రలూకా | - | బీరు |
| నడుమ | - | పొట్టేలు |
| జీలుగలు | - | గజ్జలు |
| లమ్త | - | తాళాలు |
| టూకపోతు | - | మంత్రాలోడు |
| గీసోడు | - | గౌండ్లవాడు |
| దూజోడు | - | గొల్లవాడు |
| దాపెకడెం | - | పెద్దగొల్ల |
| కల్సోడు | - | చాకలివాడు |
| కల్పోడు | - | మంగలివాడు |
| మంగోడు | - | మాదిగ |
| గుంటోడు | - | కోమటి |
| ముర్దగాడు | - | పొట్టివాడు |
| సెంబిగాడు | - | భిక్షగాడు |
| సుండుకో | - | కూర్చో |
| మలుక్కో | - | పండుకో |
| పాయర్లు | - | రూపాయలు |
| కంచికలు | - | చిల్లరపైసలు |
| దీపా | - | పది |
| విశాయగం | - | ఇరవై |
| దూందీపాలు | - | ముప్పై |
| అరౌంటు | - | యాభై |
| ఒంటు | - | వంద |
| దీపొంట్లు | - | వెయ్యి |
| సాబా | - | భాష |

ఈవిధంగా బైకాని వారు మందెచ్చుల వారి లాగా కొన్ని పదాలను ప్రత్యేకమైన అర్థంలో ఉపయోగిస్తారు.

బైకానివారు పుట్టుక, చావు, పెళ్ళి, పండుగలు, పబ్బాలు మొదలైన అన్ని

విషయాల్లోనూ మిగిలిన హిందువుల ఆచారాలనే పాటిస్తారు. వీటిలో ఎలాంటి ప్రత్యేకత లేదు. అందువల్ల వీటిని గురించి వివరించలేదు.

ఈవిధంగా యాదవజానపద కళాకారులు దయనీయమైన జీవితాన్ని గడుపుతున్నారు. ఈ సిద్ధాంత వ్యాసంలో చెప్పిన పదకొండు జానపద కళల్లో గొరవయ్యలు, సేవగరిడి భక్తి ప్రధానమైన జానపద కళలు. గంగిరెద్దులాట, తప్పెటగుళ్ళు, ఒగ్గుకథ భక్తి వినోదం రెండూ ఉన్న ఉభయ ప్రధానమైన జానపద కళలు. గొల్లసుద్దులవారు, కొమ్ములవారు, పొడపోతులవారు, మందెచ్చులవారు తెరచీరలవారు, బైకానివారు- ఈఆరు కుల కథాఖ్యాన కళలు. ఈ పదకొండు యాదవ జానపద కళలు తెలుగు జానపదవిజ్ఞానికి గొప్ప సేవ చేస్తున్నాయి.

## పాదసూచికలు

1. జానపద నృత్యకళ గొరవసంప్రదాయము, డా. బి. రామాచార్యులు, పుట 93
2. జానపద నృత్యకళ గొరవసంప్రదాయము, డా. బి. రామాచార్యులు, పుట 94
3. జానపద నృత్యకళ గొరవసంప్రదాయము, డా. బి. రామాచార్యులు, పుట129
4. బుడగజంగం దర్శిని, డా. ఎన్. ఆర్. వెంకటేశం, పుటలు 31, 32
5. బుడగజంగం దర్శిని, డా. ఎన్. ఆర్. వెంకటేశం, పుటలు 38, 39



# అనుబంధం

## పాపనూక వలపోత కథ :

తంగిరాల సుబ్బారావు గారు తమ కాటమరాజుకథల గ్రంథంలో కాటమరాజు కథల్లో ఒకటైన పాపనూక వలపోతకథ లభించలేదని రాశారు. పాపనూకవలపోత కథను విజయనగరం జిల్లా గజపతినగరం మండలంలో ఉన్న పొడపోతులవారు పాడుతారు. వీరు కాటమరాజు కథలను చెబుతూ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు. వారు పాడే పాపనూక వలపోతకథ ఇది.

శ్రీవిశ్వనాదుండు శిసువుల గాంచిన - బావించి తల్లియున్నవారు
పట్నము అర్దించి ఏతెంచి అమ్మతో కలిసె - పందుముల ఎరినప్ప అందరూ
గురువును పొడగనిరి గుణవంతులెల్ల - తివాసు వేసిరి త్రిపురాంతకునకు
తివాసు వొల్లక త్రిపురాంతకుడు - శివుడు గూర్చుండేటి పులిచర్మము మీద గూర్చుండే
గురువు ఎడగల కూర్చుండిరి యాదవాస్త్రీలు - మరుగున దాగిరి చిన్న మరదళ్ళు
బావను కనులెత్తి బావించి చూడక - వయ్యారితో కొంత వదిగుండీరంత
కొండంత బలగంబు కన్నవారిని జూస్తి- వంచినాతని బట్టి వదినల జూస్తి
అప్పలు చెల్లెల్లు ఆందరనీ జూస్తి - తీరైన చెల్లెలు మన దివానములో లేదు
పందుముల ఎరినప్పను బాగుగా జూస్తి - ఎందును కనబడదు ఏదమ్మ పాప
అంతా నాకు మొక్కె అప్పలను జూస్తి - ఇంతి ఏదమ్మా పాప
చేరి నాకు మొక్కె చెల్లెళ్ళను జూస్తి - గర్బపు చెల్లెలు కానరాదమ్మ
మర్లవారిని జూస్తి మగువలను జూస్తి - నేతివారిని జూస్తి నాతులను జూస్తి
వత్తైన చెల్లెలు పరికింప నాతోను- ముచ్చటాయెను పాప ముచ్చటాయెనమ్మా
చెల్లెలును దలుతు నేనెపుడు - పసినికాళ్ళ పాప మనబలగమున లేదు
దవ్వున కాశిలోను దలుతు నిత్యంబును - ఎప్పుదు మనసు బాయదు చెల్లెలు నాకు
తల్లీ దండ్రీ లేని చెల్లెలి మీద - మనసులో బక్తి యున్నాది నాకు
వల్లబుల బత్తుడు వాంచతో అడగంగ- తల వాలవేసెను తల్లి సిరిదేవి
వెరగంది వెలవెలాబోయెను - పందుముల ఎరినప్ప అంతట తెర గట్టించి
తెర చాటున గురువుకు అస్తమెత్తి మొక్కి- వల్లబుల పుణ్యగురువా వలపోత నీకేల
నీచెల్లెలు పాప కతలు చెబుతాను వినుమా- నీపెదబావ రగుపతి పెద్దలందరూనూ
ఓరుగంటికి పెద్దవాడు వద్నాల బావిరెడ్డి - చెరుకూరి కామిరెడ్డి సింగముల బీమిరెడ్డి

అరికాయల కుపిరెడ్డి అముతుముల మాదిరెడ్డి- నూజాల పోతురెడ్డి నూగి గంగిరెడ్డి
నాసుగుల్ల నాయుడుకు అడిగిరి పాపను - వెండిపుస్తాకాల బ్రాహ్మనులు
వెయినూరు వచ్చినారు - పైడిపుస్తాకాల బ్రాహ్మనులు
పదినూర్లు వచ్చినారు - అంత పురోహితులు పాప అస్తములు జూసిరి
ఇంతిరో వినుమ ఈపాప పూర్వజననంబు- పుట్టుబుదవారము పట్టపగలు
జ్యేష్ట నచ్చత్రాన జన్మించె పాప - ఆపాప పుట్టిన ఐదు దినంబుల నాడు
ఐదుగురు తండ్రులు చిత్తుబిత్తుగాను - కత్తులు నరుకులు తగిలి
చిత్రబాను సంవత్సరమున చెల్లిపోయిరి - తల్లిగండమున పాప తండ్రి గండమున
వల్లబుల తిరుమందుల వారి వంశగండమున - పాప గండపు పాప కల్యాణమిస్తేను
కొండంత బలగంబు గోత్రానికి లేదు - కల్యనంపు చెల్లెలుని కల్యాన మిస్తేను
తల్లి సిరిదేవికి తగులునే కీడు - దోరానాలు దూరేటి దొలలకు కొరగాదు
ఆరూడి పుట్నింటికి అచ్చిరాదు పెళ్ళి - ఇచ్చిన వారిల్లు ఇలమీద కుంగు
పుచ్చుకున్న వారిల్లు బూమి మీద వెలయు- దనము గండమున పాప
దాన్యగండమున పాప - కన్య మన ఇంట దిరిగిన పాపకర్మము సంబవించును
అతివను ఇల్లరికము ఇచ్చిన - హాని వచ్చును పుట్నింటికిని
మదిలోన వారి అన్నివాక్యములకు - మనువియ్యరాదు మనువిస్తే కాపురము
మరి తప్పు గలదు జననాదుండు - ఐతమరాజుతోను చెప్పిరి బ్రాహ్మనులు
మనువియ్యకుంటేను మరివొకటి కలదని- ఏడు అంతారాల మేడ కట్టించి
కడమేడ పెట్టవలెను కల్యానపు చెల్లెలును - మేడ పెట్టిన గానీ కీడు పోదనిరి
బత్తుడన్న మీతల్లి పలికెను ఒకమాట - అత్త కొమరగిరిని పిలిచి ఆమ్మ ఇట్లనిరి
వింటివె కొమరగిరి విన్నపంబు ఒకటి - వల్లబుల గోత్రమునకు వంశతిలకము నేను
పాపను ఇల్లరికముంచేను - పట్టబద్రుండు ఐతమారాజుతో
దనదాన్యసంపదలు చెరి సగముగా - పంచిపెడుదును సురసు దివానంబున
కొమరగిరి కోపించి లెగసి - వదిన ఎందుకాడితివి ఏలనాడితివి
కలిమి బలిమిచే కానకాడితివా - పాపను ఇల్లరికముంచిన ఇలు వరస కాదు
పాపపు బసవన్న పంపాద్రిలోన - అప్పలు చెల్లెల్లు అందరూ గూడి
అల్ల బసవన్న నోములు నోచిననాడు - నలుగురు చేతి పాలు ఆరగించి
ఆతల్లి పెద్దమ్మ చేతి పాలు ఆరకపోయే- ఒల్లకపోయే అలిగెను అయిదు తానాలకు
అన్నదమ్ములను వదిలి సింహాద్రిరాజు - సింహాద్రిరాజు శ్రీకూర్మము పోయి వరిగెను
కన్నవారిని బాసి కళ్యాణము పోయి - పెద్దన్న కుంబీల్లు మీద హతమై పోయె
ఎర్రబెజవాడను ఎరనూకరాజును - పోట్లుపడి చెల్లెను రణమందు



నల్లబెజవాడను నలనూకరాజును - పోట్లుపడి చెల్లెను రణమందు
అన్నలకు తమ్ముడు ఆపోలురాజు - పన్నుగా చెరుకూరు పయనమైపోయె
చెరుకూరి జంగాలను క్షనములో తెమ్మంటే- పోయిరి జంగాలు పోలురాజు కడకు
మరుగు జొచ్చిన వారిని మల్లి పట్టివ్వలేక-చోడీ చక్రవర్తిరాజు అంతట
మూకలదొడ్డి మీదకు దండును ముందుగా పంపించే- మూడు కన్నుల మీద
ముక్కంటి మీద
వడియ బక్తుల కొరకు ఒరిగె పోలురాజు-ఆశ పడనేటికి అడిగె కొమరమ్మ
కోడలా ఇది అంత కొదవిరిగి ననుచు - గోడుగోడున అడివి కొలువెల్ల పోయె
అది విని ఐతమరాజు ఆవులన్నకు రాసె ఉత్తరము-పంపిన ఉత్తరాలు చదివించుకొనుచు
అన్నకు మొక్కి అమ్మకు మొక్కి - కొమరగిరి అత్తకు మొక్కి తమ్ముని కీర్తించి
దండమని ఎరినప్పకు తమరు ఎరుగని బుద్ది- నేను ఎరుగుదునా యనుచు
తిరిగి జాబులు పంపె అయితమరాజు - చక్కగా ఉత్తరాలు చదివించుకొని
నగరికి పడమట నాతియుండేటి మేడ- తగ సల్లచెరువుకు దచ్చినాది మేడ
పాలగెడ్డ బయలు పాపయుండేటి మేడ - ఒంటిస్తంబము మేడలో
ఒంటిదాననుంచితిని అప్ప చెప్పగ గురువు ఆందోళనొంది - గోడుగోడున
బక్తుడన్న శోకింపసాగె
వాలకన్నుల నీరు గురువుకు వదలై పారె-పులితోలు చెర్మము మీద జొటజొటామని
వాన కురిసిన లాగు
వద్దనున్న శెంకు గంట వానుకొని మోగె- బుజము నున్న కక్షపాల బూమి మీద వరిగె
యేసిన గజాశూలము గజకగజ వణికె- శివలింగాలు గురువుకు చిక్కులు పడెను
తాల్లపు రుద్రాక్షలు తల్లటింపసాగె- పరచిన పులితోలు చెర్మము మీద
కారిన కన్నీరు పాములై వరసె- అరచేతిని కప్పిరి అవనిపై వొరిగె
శోకించె గురువు తమ చెల్లెలును తలచె - తాటికొమ్మ మంట దరికొనిసాగినట్లు
నమ్మించి తెస్తిని నాతోటి పాపను- అమ్మ నిన్ను పగవారికి అప్పగిస్తిని
ఓయమ్మ పాలు ఇరగని కాటమరాజును- ఆవులపాలు జేస్తిని
కడమేడ పెట్టి కాశీయాత్ర పోతిని-బలగమున కలిపితే పాపకు బ్రతుకు తెరువనుచు
బ్రతికిస్తినే తల్లి గతి నేల గలిపితిని- పులిని గొట్టి బోనులో వేసినట్లు
పాపను నేను తెస్తిని దాయాదులు నీకు- కనపడకుండా పాప కడ మేడ పాలాయెనమ్మ
నాతల్లి గుండము తిరిగి అగ్నిబాసలు చేసి- నిలువెల్ల సోదించి నిను తెస్తినె పాప
తల్లి సిరిదేవిని దాయంగా పిలిచినాడు- పిలగానే సిరిదేవి త్వరగా వచ్చింది
ఏదమ్మ సిరిదేవి ఎక్కడున్నాది చెల్లెలు- మేడ పెట్టుట నీకు మేలాయెనటమ్మ

మేడ పెట్టితివి కటకటా సిరిదేవి కఠినాత్మురాల- మేడ పెట్టినావు పాప ఏమనేను నిన్ను
ఆడిబిడ్డ ఉసురు అది నీకు మేలా -ఏడు తరాల వరకు తల్లి ఆడిబిడ్డ ఉసురు
ఆడిబిడ్డ వుసురు అంబులై తగులు- ఏమి జేస్తివే తల్లి ఎరవ జూపిస్తివే
బావ బిడ్డలనుచు బత్తించవైతివి - బావ బిడ్డలను కత్తుల బోనులో కట్టివేసితివి
ఆపాప నీకెంత పగదాయెనటమ్మ- అడలంగ చెల్లెలును అంతరువుల మేడ కట్టించితీవు
కోడళ్ళు నీవు కొదవ లేకుండా - మేరువ బోలినట్లు మేడలోపలాను
తిరుమందుల వారిలోను దిగుడాయె చెల్లెలు- నీగర్భమున పుట్టదాయె ఆపాప
పాపను చూడక నీవు మేడ పెట్టితివి- పాప శోకము కొంత పగ దీరెనటమ్మా
వరులు గాక పాపను వల్లక నీవు - చెర బెట్టితివి యుల్లంబులో నీవు
ఒంటి స్తంబపు మేడలో ఒంటినే తాను- కంటి నీరు పెట్టిన కానకైతివి తల్లి
ఒక్కన్న చెల్లెలకు ఒలపోతలాయె - తరగని దుక్కంబు తాగట్టుకుంటివే
గురువని చెల్లెలు గుండు కొట్టుకొనునేమో-బ్రమ్మదేవుండు తల్లి కొండవుండి
ఇన్ని తెరుల జేసినాడు బావకు పాప - పాప ఉసురు అంబులై తగులు
తానుండి ఐతన్న కడమేడ పెట్టుమనెనా- ఐతన్నకు పాప ఉసురు అంబులై తగులు
కాటమరాజుకి మందలోనికి కబురు పంపించితేన- అందుకేమనడాయె ఆకాటమారాజు
కాటమారాజుకి పాప ఉసురు సూరకత్తులై తగులును-తల్లిదండ్రులు లేరు దయ అన్నది లేదు
తల్లి లేని బిడ్డల మీద దయ లేదటమ్మా-పెద్దమాదేవి కూతురని పెద్దరకముంచవైతివి
పరస్తనముతో కాటమారాజుకి - ఆవులలోను పట్నం కట్టించితివమ్మ
చెల్లెలును కన్నుల చూడంగ నాకు ప్రాప్తంబు లేదు - బాలను కడమేడ పాలు చేసితివి
వజ్రపురాయ ఆయెనా వనిత నీగుండె - గాజుస్తంబపు మేడ గట్టించి వుంచితివి
తిరుమందులు వల్లబులు తీర్తంబు బాపి-చెరపాలు చేస్తివి యుల్లంబులోన తల్లి
ఆవునె కొమరగిరి తండ్రితోడ బుట్టితివి- దయ నీకు లేదా కొండ ఏనుగు వంటి
కొమరగిరి అత్త
కోడలను మేడ బెట్టి అన్నంబు నీకెట్లు వెళ్ళునోయత్త- పెద్దిరాజు కుమార్తెపై
పెద్దరికముంచవైతివి
పల్లికొండ బార్య పందుముల ఎరినప్పా- మాతల్లి వినవె ఏమి చేసేను పాప నీకు
నీలాగు పుష్పముల పూజ చేసిన గాని -మరి పుట్టదోయమ్మ మన ఇంట పాప
ఒక మాట ఐతన్న గానీ వద్దనడాయే- అతివలకు రాజు అగుమంచి నీవు
ఐదు తరంబుల వరకు పాప - ఉసురు తగిలి అగ్నిపాలు అవుతారు
పగలు రేయిని పాప శోకింపగాను - శోకింప వద్దని చెప్పువారు లేరు
శివశివా నేనెంత పాపాత్ముడను - నమ్మించి పాపను నేతెచ్చినాను



పాపను కనుల చూడక - ప్రసాదం పుచ్చుకోను అంటాడు
కాశికి పోయినప్పుడు పాపను కన్నుల చూస్తిని- ఆశించి యుంటిని నేను
అడిగెను సిరిదేవి అడిగెను ఎరినప్ప - అడిగెను కొమరప్ప అత్త తానపుడు
శెంబుని గంగ గుడికి చెయ్యెత్తి మొక్కిరి అందరూను-వల్లబుల బత్తుడన్న వలపోత నీకేల
చెల్లెలును మేడ దింపుదుము ఈక్షణములోన-కల్లమాటలు కావు కరకంటమూర్తి
పల్లజడలగు నాపాప తెస్తాము - ఆలకించుము నీవు అతివను తెస్తాము
అన్న వచ్చినాడని అతివను తెస్తాము- సత్యము గల గురువా శోకము మానుమా
అత్త కొమరగిరిని పిలిచి ఇట్లనియె - పందుముల ఎరినప్ప పైడివారి ఎల్లప్ప
అందరూ పోయి కాశి నుండి అన్న వచ్చినాడని- నేరంబులు ఎన్ని చెప్పిన గానీ
గరబపు చెల్లెలు కడమేడ దిగదు - అన్న బత్తుడన్న మము పంపినాడని
నమ్మించి తెస్తాము పాపను నీవద్దకు -అలిగి రాకుంటేను గయా విబూతి కాశీ తీర్తము
దయచేయు మాకు తరుణి కొని తెచ్చెదము- రాకుంటె తీర్తంబు రమని కిచ్చెదము
నీకడకు వేగమొచ్చెదము నీలకంటుండ- అప్పలాడిన మాటలు గురువుకు నిప్పులై తగిలె
కల్యానము లోనున్న వారిని కడమేడ పెట్టితిని- వల్లబుల చెల్లెలుకు ఉండె దుక్కంబు
పందుముల ఎరినప్ప కొచ్చెర్ల కొమరప్ప - తోడ తను వెల్లి తోడ్కొని రండి
వెంట నెందుకు తీర్తంబు వెర్రి అప్పలారా- పట్టపురాజు చెల్లెలు పట్టక పోవును
ఎదురుగా వచ్చి చింతించెను యాదవరాజు చెల్లెలు-అది వరస గాదని అత్తలను బంపె
యాదవ పుణ్యగురువు పంపించె నప్పుడు -పదమని అప్పలు చెల్లెళ్ళు పయనంబులైరి
పందుముల ఎరినప్ప పైడివారి ఎల్లప్ప- అంసల పల్లకీలు పట్టించిరంత
అప్పల కనుగొని ఆబక్తుడన్న - తనచేతి గజాశూలంబు బూమిపై వేసె
నాకళ్ల ఎదుట మీరు నడిచి పోతిరి- నామనసు పట్టక నామాట వినక
శుభోశుభో యనుచు చోద్యమొందేను- ఆనవాలు మీకు ఆపాప బ్రతుకు
పెళ్ళిపేరంటాలు పెద్దలు మీరు - మీరు కన్నుల గానక నన్నుక్కడ జేసితిరి
చాలును మీరు చాలించరమ్మ - పదపదమని అప్పలు చెల్లెల్యూ పయనంబులైరి
చెలికత్తెలు లేనిది చెల్లెలు మేడ దిగదమ్మ- చెలికత్తెలు ఎవరెవరు చెప్పమంటేను
బలిజవారి బద్రమ్మ పాంచిరెడ్డివారి పార్వతమ్మ - రాచవారి రంగమ్మ కోమటివారిగొంతమ్మ
ఎంచంగ కోమటి ఎలనాలుగు మొదాలు- కమ్మవారి కాంతలందరు కిలకిలా నప్పుడు
మేడలకు పయనాలు అయినారు వాలముగ- శంబుని గంగగుడికి మొక్కిరి వనిత
లందరూను
మేడకు నిచ్చెనలు మేలుగా వేసిరి - పందుముల ఎరినప్ప పైడివారి ఎల్లప్ప
గందవతులెల్ల మేడెక్కిరి - ఒక్కో అంతరువు ఎక్కిరి ఒహో అని మెచ్చిరిబామలు

దనుముకొండ బజారులు జూచిరి- రెండో అంతరువు ఎక్కిరి ఆదవా స్త్రీలు
రెండో అంతరువున పసిడి కుండలు జూచిరి- గండాబేరుండాలు గనకమృగాలు జూచిరి
ముత్యాల పోత ఆయిన మూడో అంతరువు ఎక్కిరి - చిత్తారు ప్రతిమలు చిలుకలు జూచిరి
పగడంపు స్తంబాలు దొవారాలు జూచిరి- నిగనిగ మెరిసేటి నీలదొవారాలు చూచి
బాగుగా యున్నాదని పందుముల ఎరినప్ప- ఆగడియలోను అందరు నల్ల చెరువు నీళ్లకు
మేడ నడుమకు నీళ్లకు రాగా జూచి - అచట నిలబడి అతిసోద్యమొంది
సూస్తిరి అప్పలు చెల్లెల్లు యిది కొంత సూత్రమనంగ-ఆస్త్రీలు మొకివార్జనలు అచ్చోట జేసిరి
బామరో దనుముకొండ బజారులు జూచితిమి- సోమవీదులు జూస్తి సోద్యమొందగను
అయిదో అంతరువు ఎక్కిరి ఆదవా స్త్రీలు - ఆపాప పేరెట్టి కొనియాడ పిలిసిరి
చిలుకలు రొదలు కొట్టి గోరొంకలు చెదరి కూసె- అలికిడి విని పాప అదిరిపడి లెగిసె
పైడి ఎల్లప్పను జూచి చోద్యమొందుచూను- కనుసుదుప్పులు కలిసి వున్నావి
పోతుజింకలు మంచి కొమ్ముపందులూను- కొండగొర్రులు మంచి కారు మృగములాను
ఆరో అంతరువు ఎక్కిరి ఆదవా స్త్రీలు - ఆరో అంతరువున ఆపురూపుమైన
తిరుమందుల పార్వతమ్మకు దీటైనమేడ- శంబుని గంగగుడికి చెయ్యెత్తి మొక్కిరి
అబ్బురంబున ఈపాప తీరు అనుచు- ఆపాప పేరెత్తి కొనియాడి పిలిచిరి
గుబగుబ బెదిరేటి గూల్ల పక్షులూను - పరమనిషి అలికిరి విని పావురాలు బెదరసాగే
గొలుసులతో చిలుకలు కొట్టుకొనుచు - లెగిసిన గోరొంకలు పిలిసెను పాపను
పెంచిన మృగములు పెనుయాడసాగే- మేడ మీద పక్షులు అడలంగసాగే
పసిన ఆకుల మర్రిపక్షులు ఆడిన రీతి- సిగవతిని జూచి వెగసిన రీతి
ఎరినప్పను జూచి లెగిసెను పక్షులు - అరుదుగా మేడవారిని జూచి
పసిడి కుండల మీద పాపంబు - పక్షి వృక్షము విరిగినట్లు
ఎరినప్పకు విరిగెను తన నడుము- అనగతు వేసంబు అంతయు జెప్పుమీ
గౌతుముల మర్రికందేతుండమనచూ - శివశివా యనుచు పక్షులు కూసే
పక్షులు పాపలు పసిబడ్డ తల్లులు- మత్సరంబున మడచెను పాపకు తోడున్న పక్షులు
మృగములు పోయి రేపుట వలన - మంటలు పాలాయేను చినచిన్న పావురాలు
చెదిరి పోలేక
కాలి నేల గూల కారణమున్నాది - కాముని రూపమై కడమేడలోన దూర్రబంహ్మామె
పోవుదుము
కొండైన చిచ్చులు తగులునని పక్షులు తాబల్కె- వెరసేమనుకుంటేను పకపక నవ్వెను
పాపంబు పక్షి తానపుడు - వృక్షము విరిగినట్లు ఎరినప్ప నడుము విరిగె
పైడి ఎల్లప్ప అడిగెను - పందుముల ఎరినప్ప చెప్పెను



నాతోన జెప్పుము నాముద్దుబాల - ఆడవారికి గురువు అప్ప ఎరినప్ప
కడమేడ సికరము కడతేర జెప్పుమీ - తలవంచి ఎరినప్ప తల్లటింపసాగె
చెల్లులా ఇకనేమి చెప్పుదును నేను - కామురము దనుముకొండ కడముట్టలేము
మీబావ పల్లికొండ పాలేటి వద్దను - పట్టాబి అయితమారాజుకి పైనిండ అలుగులు
బల్లెములు బల్యాలు నాటె - నవరత్నాలు పతకము నడుముకు వరిగె
నీపెనిమిటి పద్మరాగవునకు - రొమ్ముపోట్లు తగిలి రోషంబుతోను
గాజువిల్లు విరిగి కత్తులు నాటి రనములో వరిగె - అని చెప్పె పాపంబు పక్షి
ఎర్రయ్య ఉత్తమారాజులు యాదవులెల్ల - బొల్యావుకు పోట్లు తగిలెనని
వల్లబులు తిరుమందుల వారెల్ల వరిగెనని చెప్పెనే - పాపంబు పక్షి
బిరుదుమన్నీలు వీరన్న చెల్లె గాబోలు- కంటసిరి బాలులు కోట్లుగా చెల్లిరి
పోట్లు పడిపడి వచ్చు బసవన్న - ఎలమంచి పట్నములోకి
ఎరినప్ప కల్లగాదు మనకేమి తెరువనుచు - ఏడో అంతరువు ఎక్కిరి ఆదవా స్త్రీలు
ఆపాప పేరెట్టి కొనియాడ పిలిచిరి - చిలుకలు రొదకొట్టె గోరింకలు చెదరి కూసె
అలికిరి విని పాప అదిరిపడి లెగిసె - నేటికి ఆరు మాసములాయె
ఎక్కితిని మేడ మాట వినికిరి లేదు - పరమనిసి అలికిరి వినలేదు
అప్పల అలికిరి ఆపాప ఆలించి - అప్పలుగా జూచి గుప్పిటిల్లె గుండె
పాపను ఎత్తుకొని పైడివారి ఎల్లప్ప- ముచ్చటతోను యుదకము దెచ్చి
అప్పలకు పాదములు కడిగి - పట్టుచీర కొంగుతో పాదములు వత్తె
అప్పలకు దండములు అతివ మొక్కింది - జంబుకానాలు జాడుగా పరిచింది
చటాపట్లు పట్టి చెల్లెలు తాను - గప్పున జంబుకానా మీద గూర్చుండిరి
కలుపన్న తీసిన గందము దెచ్చి - చెల్లెలు పాపకు మేనుకు అలది
కర్పూర విడియములు కాటుకాపట్టు - అప్పలు పాపకు అలగంద వచ్చినారు
అంటకే ఎరినప్ప అన్నికారిని నేను- కటకటా నాకేల గందవిడియములు
పున్యము గల స్త్రీలకు గాక ఈపూలపుష్పములు- అంటకే ఎరినప్ప అన్నెకారిని నేను
సంతోసముగా ఉన్నవారికి సకలబోగములు- చింతయున్న వారికి శ్రీగందమేల
బోటికి ఎందుకీ బ్రతుకు - మీరు వచ్చుట నాకు మిగుల బోగంబు
అప్ప మీరు వచ్చినది నాకు ఆచ్చర్యము -ఏమి అపాయము వచ్చెనో అంతరువుల
మేడ కొచ్చితిరి
ఒంటిస్తంబపు మేడలో ఒంటిదాననుంచితిరి- నేటికి ఆరు మాసములాయె నేడు మీరు వస్తిరి
ఆనాడు నామీద దయలేదా మీకు- తల్లి సిరిదేవి చూడకుండా వస్తిరా
పందుముల ఎరినప్ప చెప్పవే నీవు - పాప మాటలకు ఎరినప్ప ఏమి చెప్పేనంటె

చెల్లెలా వినుమా చెపుతాము మాట- మేలుగా వస్తినమ్మా నీమేడ కడకు
వినవమ్మా ఈమాట వినిపించుదూను- అనిన నన్నేమని ఆడిపోదువనుచు
ఒక మాట చెప్పెదను వున్నట్లుగాను - ముకము వాడి యున్నాది నాముద్దుబాల
దూరము నుండి వస్తినని దూరంపు మాట కాదు- నేరంబు లెంచక నేను వచ్చినాను
అప్ప ఆడిన మాటలకు ఏమనెను పాప - మీరు చెప్పితె వినక నేనెంత దానను
ఎవల దానను ఎరినప్ప నేను - పొందుముల ఎరినప్ప చెప్పవే నీవు
ఆమాటలకు ఎరినప్ప ఏమనెను - వినవమ్మ నీవొక్క వృత్తాంతమంత
వల్లబుల వారి చెల్లెలా - నేను వచ్చిన పని చిన్నబుచ్చకుమీ
కాశియాత్ర పోయిన కరకంటమూర్తి - దినకరుడు ఉదయించిన వేలకు
మన దివానమునకు వచ్చినాడు - గయాయాత్ర నుండి వచ్చినాడు మీయన్న బత్తుడన్న
అమ్మా పాప ఏదని అడిగినాడు నన్ను - కన్యను కడ మేడ ఉంచితిమని చెప్పినాము
అన్నకు ఈమాట అన్నియును చెప్పితిమి - కాశీ తీర్థంబు గయావిబూది
నీకు ముందు ఇచ్చి పరులకు వెనుక ఇస్తునని - గర్భపు చెల్లెలిని కదిలి రమ్మన్నాడు
నిన్ను మేడ దింపమని నను పంపినాడు- అన్నా చెల్లెలు మీద ఆసలుంటాయి
అన్నా అనగా చెల్లెలుకు కోపము కొట్టుమిట్టాయె- కోపమే సోకము గోరసోకము
అగ్గిలోపల నెయ్యి జల్లినట్టయ్యె - ఎండి మొగలిమాను ఎరగట్టినట్లు
కుమ్మరి ఆము లెస్సగా కూలినట్లు - ఏరున్ను గెడ్డన్ను ఎగపొంగినట్లు
గర్భపు చెల్లెలు కన్నీరు తుడుచుకొని - అన్నలనకె ఎరినప్ప ఆరదు మంట
నన్ను కిన్నడ జేసిన అన్నలింకెవరు తమ్ములింకెవరు - నమ్మించి తెచ్చిన నాకేటి అన్నలు
అన్నలు నాకెవరు ఆసపడనేటికి - కన్నవారికి నేను కడు ద్రోహినైతి
చిలుకలు నాతోడు జింకలు నాతోడు - పావురములు నాతోడు బత్తుడన్న ఎవరు
జీవిలేని ప్రతిమను నేను అయితిని - వేటగాని పక్షి వెగసిన రీతి
గూట వేసిన పున్యగురువు వారెవరు నాకు - తమ్ములకు చెల్లెలు అగుమంచి గాక
నన్ను సొద జేసిన నాకేటి అన్నలు - పున్యము గల వారికి అన్నలు గానీ
అన్నికారిని నేను అన్నలింకెవరు - అగుపడ్డ పులికి ఆవు వెగసిన రీతి
పరవాని బాలలకు బత్తుడన్న ఎవరు - చెర ఉంచిన చెల్లెలుకు అన్నలింకెవరు
బత్తుడన్నకు నామీద బక్తి యున్నాదో లేదో- ఆకాసమే తండ్రి బూకాంతయే తల్లి
ఎక్కడ కన్నవారు ఎరినప్ప నీవు - కడమేడ పుట్నిల్లు స్తంబమె అన్నలు
కడమేడ పుట్నిల్లు స్తంబమె నాతోడు - కర్రలే చుట్టాలు నిప్పులే బందువులు
మేడమీద దూలాలు మేనత్తలు నాకు - నేనెట్లు వస్తునే అప్ప ఎరినప్ప
అన్నదమ్ములు లేక ఆత్మబందువులు లేక - బావమరుదులు లేక బందువులు లేక



శివుడు నాబతుకు ఒంటి జేసెనోయమ్మ -కటకటాయనుచు కన్నీరు కార్చె
ఏడ్వకు చెల్లెలా అని ఎరినప్ప చెప్పెను-పట్టుచీర కొంగుతో ఎరినప్ప పాప కన్నీరు తుడిచెను
ఎంత ఏడ్చుతావు ఎర్రినాపాప - ఎంత దుక్కిస్తివో ఎర్రినాపాప
గురువేమి చేశాడు కోదువేమి తల్లి - బత్తుడన్నకు నీమీద బక్తి యున్నాది గానీ
పగ లేదు చెల్లెలా బక్తి యున్నది గానీ - బత్తుడన్నను నీవు సాదింపగరాదు
బలగము ఒక ఎత్తు అన్నకు నీవు ఒక ఎత్తు - నీమీద గల ప్రేమ నామీద లేదు
ఎరినప్ప మాటలకు ఏమనెను పాప - నిజమేని ఎరినప్ప నీవాడిన మాట
మాయమ్మ ఏమి చేసెనో మాయన్న ఏమి చేసెనో -నాపూర్వ పన్నెము గాబోలుగాక
అప్పుడు ఎరినప్ప ఇట్లని పలికె - చెల్లెలా నేను వచ్చిన పనిచెల్లించుమనగా
ఆమాటలకు పాప ఏమని పలికె- హరిగురువంటారు అప్ప ఎరినప్ప
మరచినావటె అప్ప ముందు వృత్తాంతమంతా - కన్నవారి కతలు చెపుతాను వినుమీ
తల్లులైదుగురున్ను తండ్రులైదుగురున్ను - పంపాద్రి వెళ్ళిరి ఆనందముగను
మూప్రమైన జడలు ముద్దుల బసవన్న నోములు నోసిరి- నలుగురు చేతి పాలు ఆరగించి
తల్లి పెద్దమాదేవి చేతి పాలు వల్లకపోయె -అలిగెను బసవన్న అయిదు తానాలుకు
సంతానము లేని స్త్రీచేతి పాలు వల్లకపోయిన - పెద్దమ్మ చింతించి మారుమూల
నులకమంచము మీద అలిగి పడుకొని చింతించుచుండె - కల్యానములో స్వామి
కలలోకి వచ్చి
కలలోన చెప్పెను పెద్దమాదేవికి- వేగముగా కల్యానమొస్తేను
కల్యానములో మాపూజ గనముగా జేస్తేను - ఏడు తరాల పగను సాదించిన
కొడుకును నీకిచ్చేను కులముద్దరించేను - ఏడు గోత్రాములు ఎంచి పాడే నాతిని ఇస్తాను
కల గని పెద్దమ్మ గ్రక్కున లెగిసి - కాంత సంతోషపడి తన విబుని కలుసుకొని
విచారించి తన కల చెప్పెను - అన్నదమ్ములతో పాలు పంపకాలు అనెను
అన్నదమ్ములు పంపాద్రమ్మ గుల్ల దగ్గర - పంపకాలు పంచదమైనది
తల్లులు బిడ్డలు అన్నలు తమ్ములు - పలములై కొంత పాయి గాలేక
ఎలమంచిలి సంపద ఏడగలగా జేసి - దేసములు గాని దేసములు జెప్పి
పెద్దమాదేవి మాతల్లిదండ్రి - పసినేగలు బాపిన పాపము తగిలి
పసిబిడ్డ తల్లులు పలు తెరువులాయే - ఆనాడు గోకులము ఎడబాసినందులకు
తల్లిముకము బిడ్డలము గానమైతిమి - బూములు గాని బూములు
పుట్టలు గాని పుట్టలు వెల్లిపోవచ్చిరి - విన్నావా ఓఎరినప్ప ఇది ఎల్ల
పట్టబద్రుడు ఏడేండ్ల నాటివాడు కాటమరాజు - నాతండ్రి పెద్దిరాజు యుద్దమునకు నడిచి
విజయకొమ్మును బొడిచి వీరకొమ్మును బొడిచి-రాయకుంబును బొడిచి రత్నకుంబిని పొడిచి

అరవైయ్యారు కుంబినీలు అతము జేసి - మది వీరకుంబనీ మీదకు మళ్లిరాగాను
వాయుకేతువుడు చేత వరిగెనే రాజు - నాగకేతువుడు చేత నేల కూలేను తండ్రి
రాజులను తెగటార్చి పెద్దిరాజు వరిగె - రాజు ఆయుదరక్తపు బట్టలు జూచి
గంగన్ను పోతరాజు కటకటాయనుచు - రనముకు కావలి యుండె
పావురాల చేత పంపించె కల్యానముకు ఉత్తరాలు - పంపిన ఉత్తరాలు కాటమరాజు
చదివి అప్పుడిట్లనియె
అన్నదమ్ముల బాసి యాదవారాజు కల్యానమొచ్చె - మమ్మలను కని రనమునకు
వెల్లి చెల్లిపోయెనుగా
పుత్రుని ఐతేను పుట్టగానేమి నేను గల్గిన పలము- నాతండ్రిని పంపితిని
బ్రహ్మపట్నమునకు
రనములోనికి వెల్లి నాతండ్రిని చంపిన పగ - తీర్చుకొందును పయనమై కాటమరాజు
ఎదురుగా వచ్చిన కొడుకును తల్లి ఎత్తుకొని- వద్దు పోకు కుమారా వల్లబుడ సుతుడా
తల్లి నీకు తండ్రి నీకు ఎవరు ఆరనములోనూ - ఆరనముకు ఎట్లు పంపుదును
బాలుడు కన్నతండ్రి ప్రలయకాలుడును- కులముద్దరించిన కొడుకునై పుట్టితిని
ఎన్నాళ్ళకైనను కన్నతండ్రిని తెచ్చి - కన్నుల జూపుదును అని తల్లికి జెప్పి
పని బూని రనముకు పయనమైపోయె- రనము సాదింతు రేయిపగలనుచు
కాటమరాజు తల్లికి జెప్పి - యుద్దమునకు యుద్దబూమికి వెళ్ళెను
కలిపోతరాజు పొలితిరగగాను - ఎవ్వడవురోరి ఇచ్చటకు వచ్చినావు
ఏడు మనుగుల గద ఎగరేసి కొట్టబోయె- గనముగా గంగకు చెప్పె
అప్పుడు ఆగంగ అతివేగమున వచ్చి- ఎవ్వడవురోరి ఇచ్చటకు వచ్చినావు
నీవు ఎవర్తివే ఇక్కడకు వస్తున్నావు - నీపేరు చెప్పవే ఓకాంతకాన
నాపేరు కొండరా ఓబలకాన - నీపేరు చెప్పరోరి ఓబలకాన
కొండవు నీవైతే కొండను దొలిచేటి బండ నాపేరు - రాయిరా నాపేరు ఓబలకానా
రాయివి నీవైతే రాయిని తరిగేటి రంపము నేను - నీపేరు చెప్పరా ఓబలకానా
నీపేరు చెప్పవే ఓకాంతకానా- నాపేరు గంగరా ఓబలకాన
గంగవు నీవైతే కాటమరాజును నేను - మేనమామ కుమారుడవు ఓమేన మరిది
నన్ను పెండ్లాడుమీ ఈక్షణములోన - చెల్లిపోయిన మాతండ్రి మూడు మాటలు ఆడితేను
నిన్ను పెండ్లాడుదును ఈక్షణములోన - అప్పుడు జనని జోడుతుమ్మెదలాయె
నాసిగములో జొరబడి మూడు మాటలు ఆడించెను - బయటకు రాగాను అంతట
పెద్దిరాజు మాట్లాడలేదు
నన్ను పెండ్లాడుమీ ఈక్షణములోన - మెలతో పెండ్లాడుట మంచిదా నీకు



మాతండ్రిని పట్నమునకు మళ్లించితేను - నిన్ను పెండ్లాడెదను నిక్కంబుగానూ
అప్పుడు గంగ పెద్దిరాజును - పల్లకిలోన వేయించి వెనుక పోతురాజును
ముందల తాను మోసెనట్లె కాని - మోసేది కాదు పరుగున ఆగంగ పట్నముకు తెచ్చి
పెండ్లాడవోయి రాజు పెండ్లాడవయ్యా- మర్లవారింటను గంగనై పుడితేను
వల్లబుల వారింటను వరుస పెళ్ళికొడుకును నేను-గంగను పుట్టుక్కు పంపెను కాటమరాజు
తెలతెల్లవారంగ తండ్రిని తెచ్చి తల్లికి చూపెను- ముచ్చటాయెనయ్యా నాముద్దుకుమారా
నందుల చెరువెనుక నాగవీర బయల - పొందైన సురపొన్నల కింద
తండ్రిని దించి తల్లికి ఎరిగించే - అప్పుడు పెద్దమాదేవి పైడిపల్లెములో నివ్వాలి
దెచ్చి కల్యానములో ఉన్న కాంతలతోను -వాయిద్యములతోను దరని కంపింప
ఎదురుగా పెండ్లికి ఏతెంచినట్లు - తన విబుని దగ్గరకు వచ్చి నవ్వుచు సతి
రాజుకు ముసుగు తీసి పన్నీరు ముకము నిండ అలది - తన చీరకొంగుతో ముకము తుడిచి
పైనిండ జవ్వాది పచ్చని కస్తూరి - మెడను శ్రీగందము పూసి కుంకుమ బొట్టును
ఉంచి కురులు నున్నగ దువ్వి కురుచంగ ముడి వేసి- పకపక నవ్వెను తన
ప్రానేశ్వరుని గూడి పాన్పుపై నిద్రించేవు నాప్రాణనాదా - జంబుకానా మీద నిద్రించేవు
సకల సంబ్రమముతో స్వామీ నాతో ముచ్చట ఆడవా - అన్నదమ్ముల బాసి ముద్దు
తమ్ముల బాసి
యన్నలను బాసిన పగ తీరునా నీకు పలుకు నాతోను - సాలటే ఎరినప్ప తల్లిసాటి ముచ్చట
ఇచ్చోట చెల్లెల నువు వస్తివే మీరు- మన వంక వారెవరు లేరు
చక్కని ఎరనూకరాజు సాగి మొక్కినాను- నలనూకరాజుకు కూతురును నేను
పోలిరాజు తలపోతలాయెనే నాకు- బావలు మరదులు బందుసహోదరులు
మరదళ్ళు కొమరమ్మను అందరును- చాల మనుముకు చెప్పితే సమ్మత పడక
కల్యానమొస్తేను తగులునే కీడు - ఇంక చరిత్ర చెప్పెదను వినవె ఎరినప్ప
మరదళ్ళ విడిచి కాల్యనమొచ్చితి సంతానము కొరకు -సంతానము కలిగిన
సంతోషమాయెను
పంతమా నీకొడుకు పలకవేమి రాజా - గర్బమున పుట్టిన కాటరాజును
ఎవరికిస్తివి ఏమి చేస్తివి
బలగమున కలిపిన బ్రతుకు తెరువు లేదు - చెక్కిళ్ళు తీసి చేరి ముద్దాడి
పకపక నవ్వెను ప్రానేస్వర తాను - కర్పూర విడియములు పుత్రిని ఏమి ఎరుగుదువు
బూములు కొని పెద్దమాదేవి బూసురుల కిచ్చెను- నాగలోకమున గుండము నాడు
ఏర్పరచెను
తవ్వించిన గుండములో కలప ఏర్పరచి - మల్లెతోట చిగురు మామిడి కింద

మాతల్లి తబుకు వేయించి - జనులంత వెరుగంగ అది యంత ఎరుగంగ
అదియంత ఎరిగి పాందుముల ఎరినప్ప - పైడివారి ఎల్లప్ప చెల్లెల తల్లి గురుతులేమి ఎరుగుదువు
తండ్రి గురుతులేమి ఎరుగుదువు - వారు చెల్లిపోయి ఏడు ఏండ్లు అయిపోయె
ఎన్నాల్ల బాలవు ఏమి ఎరుగుదువు - కన్నవాల్ల పూర్వకతలు కవిలకట్టలాయె తలపోతలాయె
ఎలమంచిరాజులు ఎందుకీమాట - ఎలమంచిలివారు నిన్ను ఎదురు చూసెదరు
తరలి రావమ్మ ఇటకు తడవు లేదమ్మ - పందుముల ఎరినప్ప పైడివారి ఎల్లప్ప
ఇద్దరాడిన మాటలకు ఏమనెను పాప - నేను ఏమని చెప్పెదను మీకు
చుట్టములు బందువులు లేక - సహోదరులు లేక పుట్ట తోడు లేక
పుట్టితిని నేను కంచంత బలగంబు - మాతల్లి కన్నవారు తాతముత్తాతలు
తండ్రులు మీతో చెప్పితే మరిచేనా నేను - ఏడు తరాల గోత్రాలు పాడుటకు
వరమడిగెనా తల్లి ఉత్తమాదేవి - తండ్రిరాజులు మొదలైనవారు
కన్నవారును మరచుటకును కర్మమే అక్క - విన్న మరపులు రావు విశ్వేశ్వరునకు
ఆడ ముచ్చట గానీ అనరాదు మీతో - ఎరనప్ప నేటికి ఆరుమాసములాయె ఎడబాసి మిమ్ము
అన్నలెవరే తల్లి అన్నబత్తుడన్న చేసినది - వినుడి తరులాక్షి మాతల్లి
రామ శ్రీరామాయని పలికి - దశరధరామా యని పలికి
బగవంతుని దలచి సోడసమ దానంబులను - నవనందుల పెద్దమాదేవి
పైనిండా పుష్పాలు బాతి సేత బట్టి - ఆడుచు పాడుచు బలగమున కెల్లి
బళ్ళతో కుంకుమ పంచిపెట్టేను - కాటమరాజును ఎత్తుకొని ఎర్రకన్నుల పాపను ఎత్తుకొని
పేరుపేరున వర్నించి పెద్దలను పిలిచి - కల్యానములో నున్న అప్పలారా
పాపను ఇచ్చెదను బ్రతికించుకోరె - ఇరుపార్శ్వవారు ఇద్దరిని ఇచ్చెదను పెంచుకోరె మీరు
ఒక్క కుమారుని మీరు కాటమరాజును - ఇచ్చెదను అందుకోరమ్మ
పక్షి నెత్తురులోన గన్న పాపను - రాచబాలను ఇచ్చెదను రక్షించుకోరె
పట్టబద్రుడు నాకు ప్రాణప్రదము నాకు - పుట్టుబోగి నిచ్చెదను పుచ్చుకోరమ్మ
చందమామ వంటి చక్కని పాపను - ఇచ్చెదను అందుకోరమ్మ
సూర్యుని ఇచ్చెదను చేకొనరె మీరు - అదుపు మంచి గోవులను నిచ్చెదను
పట్టాపురాజు చెల్లెలను ఇచ్చెదను పట్టుకోరమ్మ - బంగారు పట్టుదట్టీలు కాటమరాజు ఇచ్చుదును కరుణించరమ్మ
నవరత్న సంపదలు సకల బాగ్యములు ఇచ్చెదను పుచ్చుకోరమ్మ - తమకంబు పైనున్న తల్లి అన్న మాట విని



గోపికాంతలు యాదవేశ్వరులు - ఎన్నముద్దలవారు పున్నపెన్నలవారు
చిన్నకృష్ణవారు చిన్నెలవారు - పొన్నపువ్వులవారు జన్నెలవారు
అల్లబోయినవారు ఆవాలవారు - పన్నగేంద్రునివారు కరిమావులవారు
ఎన్నబోయినవారు పూజారువారు - కన్నిబోయినవారు కవులావులవారు
సోమనీలవారు రామచంద్రునివారు - రాజులవారు కామదేనువువారు
గంగావులవారు కొమనాలవారు - గుంటుబోయినవారు గురుమూర్తివారు
చల్లావారు పందుములవారు - లక్షబలగము వచ్చెను ఎరనప్ప
ఎలమంచిలి పెద్దమాదేవి ఏలనాడితివి - కులము వారు గల్గి గోత్రములు గల్గి
దాయాదులు గల్గి నిండేగురు బలము గల్గి - సింహబూములు గల్గి చాలమంది గల్గి
అమ్మ బాలలను పరులకు అప్పగించె - కించి నీళ్ళ మీద వీరగినవి కాటమరాజును
అతి ప్రీతితోను కాటమరాజును - మేమే పెంచుదుము బూములు ఏలింతుము
తండ్రి వరిగిన తండ్రి పగ దీర్చిన - కొండదాపు యాదవాకులమనిరి
యాదవులు మమ్ము ఎవరు తీసికొనలేదు - మాతల్లి ఏమి సేతునని విచారించి
తన విబునితో గుండమున పడక తప్పనని- కలబోతుల వారికి మమ్మలను ఇచ్చివేసెనుగా
కాశీయాత్ర పోతున్న బక్తుడు తోవ తప్పి - కల్యానములోనికి వచ్చి నాపాట ఆలకించి
వచ్చి మమ్ములడిగెను వాళ్ళు ఇవ్వక - ఆరిపోయిన గుండమున మంటలు చెలగించి
మమ్ముల తీసుకవచ్చెను ఈదనుముకొండకు- నన్ను సాదము జేసిన కన్న వారు ఇంకెక్కడ ఉన్నారు
అంతలో బత్తుడన్న పాప రాదని ఆలోచించి - దివ్యదృష్టిని జూసి ఎరగడ్డయుద్దములో
అన్నదమ్ములు ఆందరు చెల్లిరని తెలిసికొని - కాశీ విబూతి మంతరించి దనముకొండ
అగ్ని ముట్టుకోవలెనన్ని అని సాప్యముంచి - ఎరగడ్డకు పోయెను పాప ఎరనప్పతో మాట్లాడుచుండగ మేడకు అగ్ని ముట్టుకుంది.

# ఉపయుక్త గ్రంథ సూచిక

## ముద్రిత గ్రంథాలు :

1. అఖిల భారత యాదవ మహాసభ సావనీర్, అఖిల భారత యాదవ మహాసభ, ఆంధ్రప్రదేశ్‌శాఖ, హైదరాబాదు.
2. ఆంధ్ర మహాభాగవతం, బమ్మెర పోతన, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1986.
3. ఆంధ్రుల జానపద విజ్ఞానం, ఆర్వీయస్ సుందరం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సెఫాబాదు, హైదరాబాదు, ప్రథమ ముద్రణ,1983.
4. ఆరుద్ర రచనలు, ఆరుద్ర, న్యూస్టూడెంట్సు బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ, 1985.
5. ఉత్తరాంధ్ర జానపదకళలు, బద్రి కూర్మారావు, గిడుగు రామ్మూర్తి తెలుగుభాష మరియు జానపద కళాపీఠం మరియు బద్రి అప్పన్న స్మారకకళా పీఠం, ఎమ్.ఐ.జి. - 278, బాబామెట్ట, విజయనగరం, ప్రథమ ముద్రణ, అక్టోబర్, 2005.
6. ఒక ఊరికథ, ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, వి.జి.యస్. పబ్లిషర్స్, విజయవాడ, 1995
7. కాటమరాజు కథలు (రెండు సంపుటాలు), డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు, ప్రథమ ముద్రణ, 1978.
8. క్రీడాభిరామం, వినుకొండ వల్లభరాయడు, కాకతి పబ్లికేషన్స్, హైదరాబాదు, 1917.
9. చిత్తూరుజిల్లా జానపదగేయాలు, సాంఘిక సాంస్కృతిక పరిశీలన, డా॥ కె. మునిరత్నం, సాహితీ ప్రచురణలు, తిరుపతి, 1992.
10. జానపద కళాసంపద, తూమాటి దొణప్ప, నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్నం, 1975
11. జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, నేదునూరి గంగాధరం, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2006.
12. జానపద గేయాలు - సాంఘిక చరిత్ర, బి. రామరాజు, నాయని కృష్ణకుమారి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాదు.



13. జానపద నృత్యకళ, డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డి, జానపద యువ కళాకారుల సంఘం ప్రచురణ, సుబ్బారావు పేట (పోస్టు), ధర్మవరం (మండలం), అనంతపురం (జిల్లా), ప్రథమ ముద్రణ, 1989.
14. జానపద నృత్యకళ గౌరవ సంప్రదాయం, డా॥ బి.రామాచార్యులు, స్వీయ ప్రచురణ, సి - 166 వెంగళరావు నగర్, హైదరాబాద్, ప్రథమ ముద్రణ, 1993.
15. జానపద విజ్ఞాన వ్యాసావళి, జి.యస్. మోహన్, శ్రీనివాస పబ్లికేషన్స్, మలయనూరు, అనంతపురం జిల్లా.
16. జానపద సాహిత్యం, ఎల్లోరా, దీప్తి పబ్లికేషన్స్, 1-8-150/4 చిక్కడపల్లి, హైదరాబాదు-20.
17. జానపద సాహిత్య స్వరూపం, ఆర్వీయస్ సుందరం, జానపద విజ్ఞాన సమితి, బెంగుళూరు, 1976.
18. తప్పెటగుళ్ళు జానపదకళ, పల్లి తిరుపతిరావు, జనవిజ్ఞాన వేదిక ప్రచురణ, గజపతి నగరం, విజయనగరం (జిల్లా), ప్రథమ ముద్రణ, డిసెంబరు,2005.
19. త్రివేణి, సంపాదకులు, బి. రామరాజు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, నేదునూరి గంగాధరం, తుమాటి దొణప్ప, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాదు, 2006.
20. తెలంగాణ శ్రామిక గేయాలు, గోపు లింగారెడ్డి, షుషమా పబ్లికేషన్స్, కరీంనగర్, 1982.
21. తెలుగు జానపద గేయగాథలు, నాయని కృష్ణకుమారి, 8-3-892/2, నాగార్జున నగర్, హైదరాబాదు, ప్రథమ ముద్రణ, 1977.
22. తెలుగు జానపద గేయ సాహిత్యం, బిరుదురాజు రామరాజు, జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు, ద్వితీయ ముద్రణ, 1978.
23. తెలుగు జానపద సాహిత్యం - పురాగాథలు, రావి ప్రేమలత, అవేరా ప్రింటింగ్ ప్రెస్, కవాడీ గూడ, సికింద్రాబాదు, 1983.
24. తెలుగు నాటక వికాసం, డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు, నీమ్‌కర్ బ్లాక్స్, చిక్కడపల్లి, హైదరాబాదు, ప్రథమ ముద్రణ, 1967.
25. తెలుగు పొడుపు కథలు, డా॥ కసిరెడ్డి , జానపద సాహిత్య పరిషత్ ప్రచురణ, భాగ్యనగర్, హైదరాబాదు, ప్రథమ ముద్రణ, 1990.
26. తెలుగులో కుల పురాణాలు ఆశ్రిత వ్యవస్థ, పులికొండ సుబ్బాచారి, స్వీయప్రచురణ, హైదరాబాదు, 2000.
27. తెలుగువారి జానపద కళారూపాలు, డా॥మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1992.

28. దాక్షిణాత్య జానపద కళారూపాలు, సంపాదకుడు - ఆచార్య జి. నాగయ్య, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి, 1991.
29. నాట్యవేదం, జమ్మలమడక మాధవరామశర్మ, అభినవ భారతి ప్రచురణ, గుంటూరు, 1957.
30. పండితారాధ్య చరిత్రం, పాల్కురికి సోమనాథుడు, ఆంధ్రపత్రిక ముద్రశాల, మద్రాసు, 1939.
31. పల్లె పదాల్లో ప్రజాజీవనం, యల్లంద రఘుమారెడ్డి, విద్యాపీఠ ప్రచురణలు, హైదరాబాదు, 1983.
32. ప్రజాకళారూపాలు, జయధీర్ తిరుమలరావు, మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు, 1987.
33. ప్రజా సాహితి - ప్రజాకళారూపాల ప్రత్యేక సంచిక, సంపాదకులు - జయధీర్ తిరుమలరావు, వాసిరెడ్డి నవీన్, సంచిక 71,జూన్, 1985.
34. బుడ్గ జంగం దర్శిని, డా॥ ఎన్.ఆర్. వెంకటేశం, బుడ్గజంగం కులవిజ్ఞాన పరిశోధనావేదిక దివ్యదీప్తి ప్రచురణలు, హైదరాబాదు, 2002.
35. బసవపురాణం, పాల్కురికి సోమనాథుడు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,1969.
36. భారతీయ జానపద నృత్యాలు, ఊట్ల కొండయ్య, హంస పబ్లికేషన్స్, విజయవాడ,1960.
37. మున్నీరు, నేదునూరి గంగాధరం, ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి, 1973.
38. మిన్నేరు, నేదునూరి గంగాధరం, ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి, 1968.
39. మైలారుదేవ, జి.ఆర్. వర్మ, వర్మన్ పబ్లికేషన్స్, తాడేపల్లి గూడెం, 1973.
40. యాదవ దర్శిని - వ్యాస సంపుటి, సంపాదకుడు - చేగూరి వెంకటేష్ యాదవ్, 2-67 అమరావతిపేట, హయత్‌నగర్, రంగారెడ్డి జిల్లా.
41. యాదవులు - చరిత్ర - సంస్కృతి - కులసంస్కరణ, సంపాదకులు - ఆచార్య సోమన బోయిన సింహాద్రి, డా॥ దండెబోయిన రవీందర్, షెపర్డ్ రిసెర్చ్ సెంటర్, హైదరాబాదు, 2005.
42. రాయలసీమ రాగాలు, కె. మునయ్య, జానపద కళా సమితి, ప్రొద్దుటూరు,1992.
43. రాష్ట్రస్థాయి జానపద కళోత్సవాలు, తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాదు, 1990.
44. సమగ్ర ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి (మొదటి రెండు భాగాలు), ముప్పాళ్ళ హనుమంతరావు, ఎ.బి.ఎస్. పబ్లిషర్స్, రాజమండ్రి, 1997.



45. సమాజంలో గొల్లకురుమలు, డా॥కంచ ఐలయ్య, డా॥ఎస్. సింహాద్రి, డా॥డి. రవీందర్, యాదవ ప్రచురణలు, హైదరాబాదు, 1999.
46. సామెతల్లో సాంఘిక జీవితం, డా॥ జి.యస్. మోహన్, శ్రీనివాసా పబ్లికేషన్స్, మలయనూరు, అనంతపురం (జిల్లా).
47. సింహాచలం దేవళం కట్టుబడి కథాగేయం, డా॥ ఎమ్. జయదేవ్, రమణవాణి ప్రచురణ, విశాఖపట్నం, 1996.

## అముద్రిత పరిశోధన గ్రంథాలు :

1. ఆంధ్రప్రదేశ్ జానపద భిక్షుక గాయకులు, ఎన్. యాదగిరిశర్మ, పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1986.
2. ఉభయగోదావరి జిల్లాల జానపద ప్రదర్శన కళారూపాలు, తరపట్ల సత్యనారాయణ, పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం, ఆంధ్రవిశ్వకళా పరిషత్, విశాఖపట్నం, 2000.
3. ఒగ్గుకథ - ఒక పరిశీలన, ఎమ్. సునీత, ఎమ్.ఫిల్. సిద్ధాంత వ్యాసం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1999.
4. ఒగ్గుడోళ్ళ నృత్యం - ఒక పరిశీలన, దూదిమెట్ల శ్రీనివాస్, ఎమ్.ఫిల్. సిద్ధాంత వ్యాసం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, డిసెంబరు, 2001.
5. నెల్లూరు జిల్లా గంగజాతరలు - కళారూపాలు - ఒక పరిశీలన, దేరంగుల శ్రీనివాసరావు, ఎమ్.ఫిల్. సిద్ధాంత వ్యాసం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2000.
6. ప్రకాశం జిల్లా జానపద కళారూపాలు - ప్రదర్శన - సాహిత్యంశాలు - పరిశీలన, విస్తాలి శంకరరావు, పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం, హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 2003.
7. మందెచ్చులవారు - జీవన విధానం, రంగు రాజపాపయ్య, ఎమ్.ఫిల్. సిద్ధాంత వ్యాసం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్, 1996.

## ఆంగ్ల గ్రంథాలు :

1. Castes and tribes of Southern India, Edgar Thurston, Cosmo Publications, Delhi.

2. Folk lore and Folk life, Richard M. Dorson, The University of Chicago Press Chicago and London, 1972.

3. Folk lore of Andhra Pradesh, B. Rama Raju, National book trust, New Delhi,1972.

4. Meet my People, Devendra Sytyanthy, Chetna Prakashan Ltd. Hyderabad.

5. Primitive Song, C.M. Bowra, George Weiden feld & Nicolson Ltd. England, 1963.

6. Standard Dictionary of Folk lore Mythology and Legend, Maria Leach, Funk and Wagnallas Company, New York, 1950.

7. The Study of Folk lore, Alan Dundes, Prentice Hali Ine, New Jersy, 1965.